శ్రీమతే రామానుజాయ నమః



కులశేఖరాళ్వార్లు అనుగ్రహించిన

# పెరుమాళ్ తిరుమొழி

(పెరియవాచ్చాన్‌పిళ్ళై మణిప్రవాళవ్యాఖ్య, అరుంబదములతో)

'భావప్రకాశికా' ఆంధ్రవివరణము

"పండితరత్న", వేదాంతవాచస్పతి

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీమాన్ నాగులకొండ వెంకటశింగరయ్య

పవిత్రస్మృతి జ్ఞాపిక - 2010

# పెరుమాళ్ తిరుమొழி - సవ్యాఖ్యానము

'భావప్రకాశికా' ఆంధ్రవివరణము-పండిరత్న, డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు


ప్రథమముద్రణము - ఫిబ్రవరి 2010

ఆవిష్కరణము - 25-2-2010 (విరోధి-కుంభం-పునర్వసు)

సందర్భము - కులశేఖరాழ்వార్ల అవతారమహోత్సవం

వేదిక - త్రైవర్ణికరామానుజకూటమ్, విజయనగరం

ప్రతులు - 700

వెల - అమూల్యము.




ముఖచిత్రం - నమ్బెరుమాళ్ - శ్రీరంగనాచ్చియార్ (శ్రీరంగం)

ఈ గ్రంథం కీర్తిమూర్తులు

**శ్రీమాన్ నాగులకొండ వెంకట శింగరయ్య** గారి స్మృత్యర్థం.

వారి కుటుంబ సభ్యులు భక్తి శ్రద్ధలతో సమర్పించిన

పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడింది.


**ప్రతులకు**

**1. శ్రీ సూర్య కంపెనీ**

**ప్రొప్రైటర్ ఎన్.వి. శింగరయ్యగారు**

8-1-55/ఎ, ఎం.జి. వీధి, విజయనగరం-535 001

ఫోన్ 08922-222947,

**2. శ్రీమతి కె.వి. జానకి**

**18-3-38(ఎ), గుండాలవారివీధి, విజయనగరం-535 001**

**ఫోన్ - 08922-225070 సెల్ - 09989893954**

డి.టి.పి : 1. యస్.చంద్రశేఖర్, తిరుపతి.
2. శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, బైరాగిపట్టెడ, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

న్యాయవేదాంత విద్వాన్
**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**
**భారద్వాజ భవనం, నరసాపురం.**



# సాధువాదం

**యచ్చిత్తం రఘుశేఖరాంఘ్రికమలద్వంద్వైకవందీకృతం**
**తస్య శ్రీకులశేఖరస్య పదయోః సూక్తౌ చ సక్తాశయమ్ ।**
**తద్వద్రంగభుజంగపుంగవగిరిప్రేమానువిద్ధాశయం**
**చేతః! కాంతవరం విభావయ సదా యోగీశ్వరం సాదరమ్ ॥**

**(ప్రతివాది భయంకరమ్ అణ్ణన్- వరవరముని శతకమ్ - 48)**

భగవానుడైన శ్రీమన్నారాయణుని నిర్హేతుకకృపవల్ల భ్రమవిప్రలంభాది దోషరహితమై, భక్తిరూపంగా పరిణమించిన విశుద్ధజ్ఞానాన్ని పొందినవారు దివ్యసూరులు. వీరు భగవానుని స్వరూపరూపగుణవిభూతి లీలలలో పరిపూర్ణంగా నిమగ్నులై, ఆనందాన్ని అనుభవించారు. అందువల్ల వారికి ద్రావిడ భాషలో "ఆళ్వార్లు" (అవగాహించేవారు) అనే పేరు ప్రసిద్ధంగా కల్గింది. ఆళ్వార్లు అందఱూ తాము అనుభ వించిన, అలౌకికమైన భగవద్విషయాను భవాన్ని, తమవలె లోకంలో అందఱూ అందుకొని ఆనందించాలనే ఉదారమైన హృదయంతో తమ అనుభవపరీవాహాన్ని భక్తిరసపుంజాలైన దివ్యప్రబంధాల రూపంలో వ్యక్తీకరించారు. ఈ ప్రబంధాలన్నీ కేవలం భక్తిరసాత్మకాలైన సత్కావ్యాలే కాకుండా వేదాలలో ప్రతిపాదింపబడ్డ, అవశ్యం జ్ఞాతవ్యాలైన, శాస్త్రీయాలైన రహస్యార్థాలను మధురఫణితిలో అందించిన భక్తలోక జీవాతువులు. అందువల్లనే ఆళ్వార్ల ప్రబంధాలు. ద్రావిడవేదాలుగా అభిజ్ఞులచేత ప్రశంసింపబడుతున్నాయి.

ఆళ్వార్ల పరంపరలో ఆఱవవారు, క్షత్రియకులంలో అవతరించినవారైన కులశేఖరులు పెరుమాళ్ తిరుమొళ్ళి అనే 105 పాశురాలతో కూడిన ప్రబంధాన్ని అనుగ్రహించారు. **"పెరుమాళ్"** అనే పదం ప్రసిద్ధంగా శ్రీరంగనాథుని విషయంలో, శ్రీరామ చంద్రమూర్తి విషయంలో వ్యవహరింపబడుతున్నది. వీరిద్దరి పట్ల అంతులేని ప్రావణ్యాన్ని కల ఈ ఆళ్వార్లు కూడా **కులశేఖరప్పెరుమాళ్** అని పిలువబడుతున్నారు. శ్రీరంగనాథుని విషయంలోని వీరి ప్రావణ్యం వీరి ఈ ప్రబంధంలోని ప్రథమ, ద్వితీయ, తృతీయ దశకాలలో, శ్రీరామచంద్రుని విషయంలో వీరికి గల భక్తి ఎనిమిది, తొమ్మిది, పది దశకాలలో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. వీరి వాళ్ళిత్తిరునామంలో కూడా- **"అణియరజ్గర్ మణత్తూణై అడైన్దుయ్న్దోన్ వాళ్ళియే"** అని, **"అనవరతమ్ ఇరామకతై అరుళుమవన్ వాళ్ళియే"** అని కీర్తింపబడుతున్నది కదా! అందువల్లనే కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన ఈ ప్రబంధం **పెరుమాళ్ తిరుమొళ్ళి** అనే పేరుతో ప్రసిద్ధమైనది.

**"త్వద్భృత్యభృత్యపరిచారక భృత్యభృత్యభృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ"** అనిఅంటూ భగవద్భాగవతసేవలోని చరమావధిని అపేక్షించినవారు ఈ ఆ*ళ్వా*ర్లు. **"అరజ్గన్ మెయ్యడియార్‌కళ్‌తమ్ ఎల్లైయిల్ అడిమైతిఅత్తినిల్ ఎన్డు మేవు మనత్తనామ్"** అనికదా వీరు ఆశించారు. ఆత్మదాస్యం భాగవతపర్యంతపర్యవసాయి అయినపుడుకదా పూర్తి అవుతుంది. **"ఊనేఱు శెల్వత్తు ఉడల్ పిఅవి యాన్ వేణ్డేన్"** అని అంటూ అహంకార– మమకారాలకు హేతువైన ఈ రాచపుట్టుక వద్దని పల్కిన కులశేఖరులే అది తదీయశేషత్వాన్ని కల్గించిన జన్మ అయినది కనుక **"కో*ళి*క్కోన్ కులశేఖరన్"** అని ఆ జన్మను ప్రశంసిస్తూ పలికారు. ఈవిధంగా తాము ప్రపన్నకులానికి శేఖరులమని సూచించారు. కనుక **"కులశేఖరులు"** అనే పేరు వీరికి కల్గింది.

పెరుమాళ్ తిరుమొ*ళి*లోని పది దశకాలు భగవానుని విషయంలో కులశేఖరుల కుండే అద్భుతభక్తిభావబంధాన్ని ఆవిష్కరిస్తాయి. ఇవి అన్నీ వారి ఉదారమైన వాగ్విలాసానికి నిదర్శనాలు. సనాతనాలైన వేదాలలో ప్రతిపాదింపబడ్డ తత్త్వాలు ఈ ప్రబంధంలో అడుగడుగునా ఆవిష్కరింపబడ్డాయి. వాటినన్నిటినీ ప్రస్తావించడం సాధ్యం కాదు. కనుక, విస్తరభీతిచేత రెండు దశకాలనుమాత్రం ప్రస్తావించి, అందులోని విశేషాలను సంగ్రహంగా నివేదిస్తాను.

నాలాయిర దివ్యప్రబంధవాఙ్మయంలో మొదటి సహస్రానికి ముదలాయిరం అని, రెండవ వేయికి పెరియతిరుమొ*ళి* అని, తృతీయ సహస్రానికి ఇయఱ్పా అని, చతుర్థ సహస్రానికి తిరువాయ్‌మొ*ళి* అని పేరు. మొదటి మూడు ఆయిరాలు (సహస్రాలు) అష్టాక్షరీమంత్రార్థ ప్రతిపాదకాలు కాగా, చివరిది అయిన తిరువాయ్‌మొ*ళి* ద్వయార్థ ప్రతిపాదకం. మొదటి మూడు వేలు ఏవిధంగా అష్టాక్షరిలోని అర్థాన్ని తెలుపుతున్నవి? అనే విషయాన్ని విశదీకరిస్తూ శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ ఉపదేశరత్తినమాలైవ్యాఖ్యలో – **"తిరుప్పల్లాణ్డు తొడఙ్గి కణ్ణినుణ్ శిఱుత్తామ్బు అఱుతియాక ఉణ్డాన ప్రబంధఙ్గళ్ ప్రణవార్థ మాయుమ్, కణ్ణినుణ్ శిఱుత్తామ్బు నమస్సినుడైయ అర్థమాయుమ్, మేలే "నారాయణా ఎన్నుమ్ నామమ్" ఎన్డు తొడఙ్గి ఉపపాదిక్కిఱ తిరుమొ*ళి* తొడఙ్గి "నారాయణా! ఓ మణివణ్ణా! నాకణైయాయ్! వారాయ్ ఎన్నారిడరై నీక్కాయ్" ఎన్గిఱ తిరుమడల్ ఈఱాక ఉణ్డాన ప్రబన్ధఙ్గళ్ నారాయణశబ్దార్థమాయుమ్, కైంకర్యత్వరాతిశయసూచకమాన చతుర్థ్యర్థమాయితే యిరుప్పతు"** అని అన్నారు. (ఇంచుమించు ఇదే వివరణం పెరియ తిరుమొ*ళి* పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానావతారిక అరుంబదంలోకూడా తెలుపబడింది). దీనిని బట్టి తిరుప్పల్లాణ్డులో సంగ్రహంగా అనుసంధింపబడ్డ ప్రణవార్థం కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ముందువరకుగల మిగిలిన ప్రబంధాలలో ఉపబృంహణం చేయబడిందని తెలుస్తున్నది. ఈ క్రమాన్నిబట్టి చూస్తే, ప్రణవంలోని ఉకారంచేత ప్రతిపాదింపబడే అనన్యార్హశేషత్వ రూపమైన భర్తృ – భార్యా సంబంధం నాచ్చియార్ తిరుమొ*ళి*లో ప్రధానంగా ప్రతిపాదింపబడగా, ప్రణవంలో తరువాతగల మకారంచేత చెప్పబడే

జీవాత్మస్వరూపం యొక్క నిష్కర్ష పెరుమాళ్ తిరుమొழிలో చేయబడిందని అనవచ్చు. అదికూడా ఈ ప్రబంధం **"ఊనేఱు శెల్వత్తు"** అనే నాల్గవ దశకంలో గల **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అనే సూక్తిద్వారా నిష్కర్షింపబడింది. మకారం జ్ఞానవాచి కనుక ఇది జీవుని జ్ఞాతృత్వభోక్తృత్వాలను తెలుపుతుంది. జీవునికుండే ఈ జ్ఞాతృత్వ-భోక్తృత్వాలు రెండూ పరార్థాలు కావాలి. భగవదానందాన్ని ప్రధాన ప్రయోజనంగా కల్గి ఉండాలి తప్ప స్వార్థానుభవంతో కూడినవి కారాదు. జీవుడు చిత్తుకంటే విలక్షణుడు కనుక చైతన్య ప్రయుక్తమైన జ్ఞాతృత్వం, భోక్తృత్వం- అనే రెండింటిని కల్గి ఉంటాడు. అయితే, ఇవి రెండు భగవదానందాన్ని ప్రధాన ప్రయోజనంగా కల్గినవి కావాలి. భగవానుని ఆనందాన్ని చూచి తాను ఆనందించాలి. ఈ విషయాన్ని కులశేఖరులు **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అనే సూక్తిద్వారా తెలిపారు. ఈ సూక్తిలో **"పడియాయ్ కిడన్దు"** అనే ప్రయోగం జీవుడు అచిద్వత్ అత్యంతపారతంత్ర్యాన్ని కల్గి ఉండడాన్ని, **"ఉన్ పవళ వాయ్ కాణ్బేనే"** అనే ప్రయోగం అచిత్తుకంటే జీవునకుండే విలక్షణధర్మాలైన జ్ఞాతృత్వ భోక్తృత్వాలు భగవదానందాధీనాలని తెలియజేస్తున్నది. పెరియవాచ్చాన్ పిళ్ళై ఈ ఆழ்వార్ల సూక్తిని **"పారతంత్ర్యత్తుక్కు అచేతనసమాధియాకవుమ్ వేణుమ్, అతు పురుషార్థమాకైక్కు జ్ఞానవుమ్ వేణుమ్"** అని వివరించడం గమనార్హం. ఈ దశకంలో అనుసంధించవలసిన ఇంకొక అంశంకూడా ఉన్నది. భగవద్భాగవత శేషత్వానుకూలమైన జన్మ లౌకికదృష్టిలో ఎంత నీచమైనది అయినా అది తమకు అత్యంతోపాదేయమనే విషయాన్ని ఆழ்వార్లు ఈ దశకంలో పలు నీచజన్మలను ఆశించడంద్వారా తెలిపారు. దీనిని అణ్ణావప్పజ్గార్ శ్రీవచనభూషణ అరుంబదంలో **"మూలత్తిల్ ఉత్తరోత్తరమ్ అపకర్షాతిశయవివక్షయా తిర్యక్ - స్థావరమ్ ఇతి క్రమమ్ ఎన్నుమభిప్రాయత్తాలే పూర్వమ్ కురుకుమ్, అనంతరమ్ తద్బాధ్యతయా తత్యోஉ పృపకృష్టమాన మీనుమ్, అనంతరమ్ అవ్వళవుమ్ అల్లాత వృక్షముమ్, అనంతరమ్ తద్వత్ భగ్నక్షతరోహణమ్ ఇల్లాత స్తమ్భముమ్ ఉపాత్తమ్ - ఎన్ను కణ్డుకొళ్వతు"** అని కులశేఖరులు ఆశించిన జన్మల నైచ్యంలోని ఉత్తరోత్తరాతిశయాన్ని వివరించారు. ఇక్కడ ఇంకో విశేషం కూడా అనుసంధేయం. మకారార్థాన్ని వివరించే పెరుమాళ్ తిరుమొ( )తో ముదలాయిరంలో ప్రణవార్థానుసంధానం పూర్తిఅయినా, తరువాత ఉండే తిరుచ్చన్ద విరుత్తాది ప్రబంధాలలో ప్రణవార్థం పునపునరభ్యాసం, ఉపసంహారం చేయబడ్డాయని చెప్పవచ్చు. ఉదాహరణకు, అమలనాదిపిరాన్ అనేప్రబంధంలో అకారంతో ప్రారంభమయ్యే **"అమలనాదిపిరాన్"** అనే మొదటి పాశురంతో, **"మన్దిపాయ్"** అనే రెండవ పాశురంతో, **"ఉవన్ద"** అనే మూడవపాశురంతో ప్రణవార్థం వ్యుత్క్రమంగా అనుసంధింపబడడాన్ని చెప్పవచ్చు.

ఇక **"తరు తుయరమ్"** అనే అయిదవ దశకంలో ఆழ்వార్లు జీవునకు, భగవానునకు మధ్య ఉండే నవవిధ సంబంధాలను ప్రస్తావించడంద్వారా **"పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేన్"** అనే సూక్తిలో జీవుని భగవదనన్యార్హశేషత్వాన్ని పల్కి నిష్కర్షించారు.

అనన్యార్హశేషత్వబుద్ధికి విరోధులైన అహంకార – మమకారాలు తొలగితే తప్ప స్వరూపసిద్ధి పూర్తిగా కలుగదు. స్వరూపజ్ఞానం ఏర్పడితే చాలదు. స్వరూపయాథాత్మ్యజ్ఞానం కలగాలి. దీనికోసం ఆళ్వార్లు పలు దృష్టాంతాలను ఈ దశకంలో అనుగ్రహించారు. వీటిలో **"కణ్డార్ ఇకళ్ వనవే"** అనే 4వ పాశురంలో ప్రస్తావించిన భర్తృభార్యాసంబంధం, **"శెన్దళలే వెన్దళలై"** అనే పాశురంలో ప్రస్తావించిన జ్ఞాతృ– జ్ఞేయసంబంధం చాలా విశిష్టమైనది. ఈ భర్తృభార్యాసంబంధమే ఆళ్వార్లకు మఱింత ఉద్బుద్ధమై, నాయకీ భావాన్ని పొందించగా, తరువాతి దశకంలో **('ఏర్ మలర్ పూమ్ కుళల్')** గోపికా భావనతో పలికారు. **"తరు తుయరమ్"** అనే దశకంలో సూచింపబడ్డ, భగవానునకు, జీవునకు మధ్యగల నవవిధసంబంధాలు ముఖబంధంలో ప్రస్తావింపబడినందువల్ల వాటిని గూర్చి ప్రస్తావించడంలేదు. కులశేఖరుల మాతృభావన, పితృభావనకూడా విలక్షణాలు. ఇవి వీరి వాత్సల్య భక్తికి నిదర్శనాలు. వీరి యశోదాదేవి రూపంలోని మాతృభావనను మాత్రం వీరి తరువాత అవతరించిన పెరియాళ్వార్లు అనుసరించి తమ ప్రబంధంలో శ్రీకృష్ణుని పలువిధాలైన బాల్యలీలలను అనుభవించారు.

ఇన్ని విశేషాలతో అలరారే పెరుమాళ్ తిరుమొళిని వ్యాఖ్యాతృ చక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై నాతి విస్తృతమైన, గంభీరమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఆచార్య సన్నిధానంలో గ్రహించవలసిన ఎన్నో రహస్యాలు ఇందులో ఇమిడిఉన్నాయి. పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానంతోకూడిన పెరుమాళ్ తిరుమొళి తెలుగు లిపిలో ఇప్పటికి సుమారు 96 స॥లకు పూర్వం కాంచీపురంలోని శ్రీనివాసముద్రాక్షరశాల ద్వారా ముద్రింపబడింది. ఆప్రతులిపుడు దుర్లభాలు**;** దొరికినా త్రుటితాలు, జీర్ణాలు. అందువల్ల ఈప్రబంధాన్ని సవ్యాఖ్యానంగా ముద్రించవలసిన ఆవశ్యకతను గుర్తించి విదుషీమణి **శ్రీమతి కె.జానకమ్మగారి** ప్రోత్సాహం తోడు కాగా, **నాగులకొండ వెంకట సత్తెయ్యబాబు శ్రీమతి నాగులకొండ రుక్మిణమ్మ,** వారి కుటుంబసభ్యులు పరమ పదవాసులు **శ్రీమాన్ నాగులకొండ వేంకట శింగరయ్యగారి** జ్ఞాపకార్థం ప్రచురించడానికి సిద్ధపడడం, అందుకు ఆవశ్యకమైన ఆర్థికవ్యయాన్ని భరించడం చాలా అభినందించదగిన విషయం. వీరికి అందఱికి ఉత్తరోత్తరం అభివృద్ధి అన్నివిధాలుగా కలగాలని, వీరి భగవద్భాగవతకైంకర్యం బహుగుణీకృతం కావాలని మనసార మంగళాశాసనాలను చేస్తున్నాను. సంప్రదాయ ప్రచారాన్ని అద్వితీయంగా చేస్తున్న **శ్రీమతి జానకమ్మగారిని** అభినందిస్తున్నాను. వ్యాఖ్యానసహితంగా ఈ ప్రబంధాన్ని ఆంధ్రీకరించిన కుమారుడు **చి.ఈ.ఏ. శింగరాచార్యులకు** మంగళాశాసనాలను చేస్తున్నాను. సంప్రదాయజ్ఞులు అందఱు ఈ సద్గ్రంథాన్ని ఉపయోగించుకొని ఆనందిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి.

ఇట్లు
భాగవత విధేయుడు
**ఈ. రంగాచార్యులు**

తిరుపతి,
7–2–2010.

పండితరత్న, ఉభయవేదాంతవాచస్పతి
**ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు**
స్థానాచార్యులు, ఆదికేశవ - ఎంబెరుమానార్‌స్వామివార్ల కోవెల
నరసాపురం - 534 275



స్వస్తి శ్రీ ర్దిశతాత్
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీకులశేఖరప్పెరుమాళ్-పెరుమాళ్ తిరుమొழி

**కుంభే పునర్వసౌ జాతం కేరలే చోళపత్తనే ।**
**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥**

పెరుమాళ్- పెరియపెరుమాళ్ - కులశేఖరప్పెరుమాళ్ - పై తిరునామాలకు సంప్రదాయంలో నొక విశిష్టమైన స్థానం కలదు. పెరుమాళ్ - ఉత్తమ వ్యక్తి. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరామచంద్రస్వామి పెరుమాళ్ అనే తిరునామం తెలుపుతుంది. పెరుమాళ్‌చే (శ్రీరామచంద్రస్వామి) నారాధింపబడినవాడు గావున శ్రీరంగనాథుని (మూలమూర్తి) పెరియపెరుమాళ్ అనే తిరునామం కల్గింది. శ్రీరామచంద్రస్వామి వైభవాన్ని, శ్రీరంగనాథుని భోగ్యతను ప్రధానంగా భావన చేయుటచే కులశేఖరులకు **"కులశేఖర ప్పెరుమాళ్"** అనే వ్యవహారం ఏర్పడినది. శ్రీరామచంద్రుని జన్మనక్షత్రమైన పునర్వసు నక్షత్రంలోనే కులశేఖరులు అవతరించినారు. ఆ కారణంచేతకూడ పెరుమాళ్ నామం వీరికి కల్గినదనుట మననీయమైన విషయం.

తాము మూర్ధాభిషిక్తులైన మహారాజులైనా, (కేవల) పదవులను - ఐశ్వర్యాన్ని ప్రాకృతిక భోగాల్ని తృణప్రాయాలుగా భావించినారు వీరు. జీవునకు ప్రధానలక్షణమైన శేషత్వసిద్ధికై శ్రీవేంకటాచలక్షేత్రంలో తిర్యక్ స్థావరజన్మలను సైతం అపేక్షించారు. చివరకు **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** (నీ) గర్భాలయంలో గడపగానుండి నీ పగడము వంటి ఎఱ్ఱని క్రింది పెదవిని సేవింతును. (ముఖసౌందర్యాన్ని)- అని తమ అధ్యవసాయాన్ని తెలిపినారు.

ఒక్క తిరుమలైలోనే గాక అర్చామూర్తులు వేంచేసియున్న సమస్తసన్నిధులలోను గర్భాలయముల క్రింది గడపకు **"కులశేఖరప్పడి"** పని వ్యవహారము ప్రసిద్ధము. పై సూక్తి పారతంత్ర్యంతోగూడిన శేషత్వమే జీవుని లక్షణం- అని తెలుపుచున్నది.

ఇట్లు భగవత్ శేషత్వాన్ని అపేక్షించిన వీరు శ్రీరంగనాథుని శేషపర్యంకనిద్రాముద్రాభి రాముడైనవానిని ఎన్నడు సేవింతునో గదా! శ్రీరంగని భక్తులను వీక్షించుటచేతగదా ఈ నేత్రాలకు సార్థక్యం ఏర్పడుతుంది – అని తమ భగవత్‌భాగవతసేవలలోని త్వరాతి శయాన్ని ఆవిష్కరించినారు. సంసారులతో సహవాసం తమకు సహింపరాదనియు, భగవద్భావనకై వారినుండి దూరమగుటయే తమ ధ్యేయమని భావించారు. పిమ్మట భగవానునికి జీవునకు గల సంబంధాల్ని పలు ఉదాహరణములతో తెల్పి తమ అనన్యార్థత్వాన్ని చాటినారు.

అటు పిమ్మట శ్రీకృష్ణావతారవిషయంగా గోపీ దేవకీభావనలతో రెండు దశకాల్ని అనుగ్రహించారు. అనంతరం కౌసల్యాభావనతో శ్రీరామునికి తాలాట్టు పాడినారు. (ఊయలలో పరుండబెట్టి జోలపాడుట) వీరి ననుసరించియే పెరియాౘ్వార్లు శ్రీకృష్ణునికి యశోదాభావనతో జోలపాట పాడినారు. పై రెండు దశకాలు అర్చామూర్తుల శయినసమయంలో ననుసంధింపబడుట వీని భోగ్యతను దెల్పును. అనంతరం వనవాసానికై వెళ్ళిన శ్రీరామునిగూర్చి దశరథుడు చేసిన విలాపాన్ని అనుసరిస్తూ దశరథభావనతో కులశేఖరుల చేసిన ఆక్రందనం కరుణరసానికి పరాకాష్ఠ చివరగా శ్రీరామాయణము లోని అవతారంమొదలుగా ప్రధానఘట్టాల్ని అనుభవించారు. ముగింపుగా ఉత్తర రామాయణకథాభాగంలోని అశ్వమేధయాగాన్ని– లవకుశల జననాన్ని భావించి – **"స్నేహో మే పరమో రాజన్"** అను హనుమద్భక్తికి వివరణంగా తిల్లై తిరుచిత్తిర కూటంలో స్వామి శ్రీరామచంద్రుడు) అర్చారూపంలో హనుమంతుని (ఎదురుగానున్నదానిని) కటాక్షించుచు తన భక్తప్రియత్వాన్ని చాటుచున్నాడని తెలిపినారు. ఇట్లు కులశేఖరప్పెరుమాళ్ దివ్యప్రబంధము భక్తజనజీవాతువుగా విలసిల్లుచున్నది.

వ్యాఖ్యాతృచక్రవర్తులైన పెరియవాచ్చాన్ పిళ్ళైగారు పెరుమాళ్ తిరుమొౘికి నాతి సంగ్రహవిస్తృతమైన వ్యాఖ్యానాన్ని కృపజేసినారు. తెలుగువారలందరికిని ఉపయోగ పడునట్లు వ్యాఖ్యలోని భావాల్ని అనువదించుటయే గాక సర్వార్థ సంగ్రహమైన భూమికను అనుగ్రహించినవారు – వ్యాఖ్యారచనా మర్మజ్ఞులైన ఉ.వే.శ్రీమాన్ **ఈ.ఏ. శింగరాచార్య స్వామి** – స్పెషల్ ఆఫీసర్ – ఆళ్వార్ దివ్యప్రబన్ధ ప్రాజెక్టు, టి.టి. దేవస్థానాలు, తిరుపతి వారు. పెరియవాచ్చాన్‌పిళ్ళైగారి లోకోజ్జీవనకృషిని, శ్రీమాన్ శింగరాచార్యస్వామివారి సంప్రదాయసేవను గ్రంథముద్రణద్వారా సార్థకం చేసినవారు విజయనగరంలోని త్రైవర్ణిక శ్రీవైష్ణవరామానుజకూటం గోష్ఠివారు.

కీర్తిమూర్తి, ఉభయవేదాన్తవిద్వత్తల్లజులైన **శ్రీమాన్ కందాళవేంకటాచార్య స్వామివారి** దివ్యకృపకు పాత్రమై శ్రీవారిప్రవచరసాన్ని ఆస్వాదించి తన్మయత్వాన్ని పొందినదీ గోష్ఠి. శ్రీవారి అనంతరం – సంప్రదాయ విదుషీమణి **శ్రీమతి జానకమ్మగారి** కాలక్షే పాదులతో ఉత్తేజితమైనదీ గోష్ఠి. తమ సంప్రదాయసేవకు తగినట్లు ఆ*ళ్వా*రుల– ఆచార్యుల శ్రీసూక్తులతో నలరారు గ్రంథరాజాల్ని అనువాదసహితంగా ముద్రించి భక్తుల కందించుచున్నదీ గోష్ఠి.

సంప్రదాయసేవానిరతులు, ఆచార్యనిష్ఠాగరిష్ఠులు, **కీర్తిమూర్తి శ్రీమాన్ నాగులకొండ శింగరయ్యగారి** స్మృత్యంకనంగా నీ గ్రంథమును శ్రీ శింగరయ్యగారి ధర్మపత్ని సంప్రదాయనిష్ఠ గల **శ్రీవరలక్ష్మమ్మ,** వారి కుటుంబ సభ్యులు ముద్రింప జేసినారనుట ముదావహం. ముఖ్యంగా **శ్రీమతి రుక్మిణమ్మగారు** ఈ గ్రంథప్రచురణలో అగ్రేసరురాలగుట అభినందనీయం. త్రికరణములతో సంప్రదాయాన్నే అనుసరించే నీమె నిష్ఠకు తగునట్లు భగవత్ భాగవతనిష్ఠను తెలిపే **"పెరుమాళ్ తిరుమొ*ళి*"** అనువాదంతో వెలువడుట విశేషం. ఈ విశిష్టగ్రంథముద్రణంద్వారా తమ పవిత్రద్రవ్యానికి సార్థకతను జేకూర్చిపెట్టిన నాగులకొండ కుటుంబసభ్యులు సర్వథా అభినందనీయులు.

నాగులకొండ కుటుంబమువారి సత్సంబంధాలు **"ఎన్దై యతిరాశర్ ఇన్నరుళుక్కు ఎన్రు మిలక్కాగి"** అని వరవరమునీంద్రులు అనుగ్రహించినట్లు భగవద్రామానుజుల విశేషకృపకు పాత్రమై ఇతోఽధికఆయురారోగ్య సంపదులతో, భగవత్భాగవతసేవతో సుఖింతురుగాక!– అని ఆశించుచున్నాను – **నిత్య శ్రీః నిత్యమంగళమ్.**

ఇట్లు

నరసాపురం, — భాగవత విధేయుడు

1–2–2010 — **కె. వేంకటాచార్యులు**



# హార్ద నివేదనము

మేము మా వేంకటాచార్యస్వామివారి శిష్యులమైనందుకు ఎంతో పుణ్యం చేసుకున్నాము. వారి పాదపద్మములకు సహస్రాభివందనములు. శ్రీరామచంద్రుడు ఎలా ధర్మాన్ని ఆచరించి చూపించేడో, మాస్వామికూడ ఆయన ఆచరించి మేము ఆచరించేటట్లు చేసేరు. తిరుప్పావై కాలక్షేపంద్వారా మా అందరిని తీర్చిదిద్దేరు. మాస్వామి ఇంట్లో అందరు చాల శాంతస్వరూపులు. అది మా అమ్మగారు చేసుకొన్న భాగ్యం. మా స్వామి భక్తకోటిలో ప్రహ్లాదాళ్వాన్, శిష్యకోటిలో కూరత్తాళ్వాన్. భక్తకోటిలో శిష్యకోటిలో మేటి. మా స్వామివారు పరాంకుశులవంటివారు. వారిని ఎలా పొగడాలో తెలియదు. ధనుర్మాసంలో మాస్వామి, మా అమ్మగారు తెల్లవారుజామున రెండు గంటలకే లేచి తిరుప్పావై వ్రతం చేసుకొనేవారు. మా అందరిని వారి ఇంటికి రమ్మని అమ్మగారితో ప్రసాదాలు చేయించి ఇచ్చేవారు. అందరికీ రోజుకి 30, 40 మందికి తక్కువ లేకుండా వెళ్ళే వాళ్ళము. కడుపు నిండా ప్రసాదాలు అందరికి పెట్టి పంపేవారు. ఇలా నెలరోజులు కొనసాగించేవారు. ఆ తరువాత ఆదర, బాదరగ కాలేజీకి వెళ్లేవారు. మళ్లీ సాయంకాలము కాలేజీనుంచి వచ్చి మువ్వాయిరప్పడి కాలక్షేపం చెప్పేవారు. **"అఱివు ఒన్ఱు మిల్లాద ఆయర్కులమ్"** అని గోపికలు అన్నట్లు ఏమి తెలియని మాకు మా స్వామి తిరుమంత్రార్థము, ఈడుముప్పత్తు ఆఱాయిరప్పడి, శ్రీవచనభూషణం, ఆచార్య హృదయం, నాచ్చియార్ తిరుమొళి, ఇరామానుశ నూఱ్ఱన్దాది, ఉపదేశరత్తినమాలై, శ్రీగుణరత్నకోశం, ఆళవందార్ స్తోత్రం అన్నింటిని వ్యాఖ్యానాలతోటే కాలక్షేపం సాయించేరు. ఒక తీపి వస్తువును తిన్నామంటే దాని తీపి ఇలావుంది అని చెప్పగలమా! చెప్పలేము కదా! అలాంటిదే మా స్వామివైభవంకూడ. కాలక్షేపం చెప్పినంతసేపు మా మనస్సులకి బోధపడిందా లేదా అని స్వామి గమనించేవారు. తెలియనట్లుంటే మళ్లీ మాకు బోధపడే రీతిలో చెప్పేవారు. తిరువాయ్మొళి 10వ పత్తు 5వ తిరువాయ్ మొళిలో **"కణ్ణన్ కళలిణై. నణ్ణుమ్ మనముడైయీర్, ఎణ్ణుమ్ తిరునామమ్ తిణ్ణమ్ నారణమే"** అనే తిరువాయ్మొళిలో ఆళ్వార్ల తహతహని మా స్వామి సాయిస్తూ ఉంటే టి.వి.ని ప్రత్యక్షంగా చూస్తున్నట్లే ఉండేది. కాలక్షేపంలో దాశరథి శతకం, భాగవత శ్లోకాలు వస్తే వారికి తెలియకుండానే కళ్ళ వెంట ఆనందబాష్పాలు కారిపోయేవి. అంత తన్మయత్వం పొందేవారు. మా రామానుజ కూటం గోల్డెన్ జూబ్లీ చేసుకుంది. అప్పుడు గోపాలాచార్యస్వామివంటి పెద్దలు చాలమంది వేంచేసేరు. అప్పుడు తిరువీథి పురప్పాట్టు జరిగింది. కారుకి బాగా అలంకరణలు చేసి వారిని ఊరేగింపుగా తీసుకొనివచ్చారు.

కారులో గోపాలచార్యస్వామి వారి దగ్గఱ మా వేంకటాచార్యస్వామిని చూచి తీరవలసిందే. రామానుజులు దగ్గఱ కూరత్తాழ్వాన్‌లాగ అనిపించింది. వారి ఆచార్యనిష్ఠకి పండితసభలు మచ్చుతునకవంటివి. 3 రోజులు చాల వైభవంగా జరిపించేవారు. ఇంత అంత వైభవం కాదు. అంత వైభవంగా జరిపేవారు. పెద్ద జియ్యరుస్వామి సంకల్పించిన యజ్ఞం చిన్నజియ్యరుస్వామి పరిపూర్తి చేసినట్లు, నిలిచిపోయిన సభలను మా జానకమ్మగారు మళ్లీ పునరుద్ధరించేరు. మా స్వామి మమ్ములను విడిచి వెళ్లిపోయినారు. మేము అంధకారంలో ఉండి పోకుండా ఒక జ్యోతి అందించి వెళ్ళారు. ఆ జ్యోతియే మా జానకమ్మగారు. తండ్రిని మించిన తనయ. ఆమె క్రమశిక్షణ, వాక్ చాతుర్యం విన్నవాళ్లదే భాగ్యం. **"ఈన్ఱ ముదల్ తాయ్ శఠకోపన్ మొయ్మ్బాల్ వళర్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** అనినట్లుగ మమ్ములను కనినది మా తల్లిదండ్రులు అయినా, ఆధ్యాత్మిక విషయాలలో పెంచినది మా వేంకటాచార్య స్వామియే. పితృఋణం, దేవఋణం తీర్చుకోలేము. అలాగే మేము మా ఆచార్యుల ఋణం తీర్చుకోలేము. వారి విశేషకటాక్షంవలన వారు చెప్పినవే మేము అనుసంధానం చేసుకుంటున్నాము.

**"ఆచార్యలాభమ్ భగవానాలే; భగవల్లాభమ్ ఆచార్యనాలే"** అనినట్లు భగవంతుని నిర్హేతుకమైన కటాక్షంవలన మా విజయనగరంవాళ్ళం పుణ్యం చేసుకున్నాము. అటువంటి సదాచార్యుల అభిమానమునకు పాత్రులైనవారు మా అత్తమామలు. వారి సుకృతముచేత మేమందరముకూడా. మా అత్తమామలు భగవద్భాగవత ఆచార్యసేవయందు ఆసక్తి కలవారు. మా మామగారి ఇష్టదైవం శ్రీనివాసుడు. ఆయన ఆచార్య తిరువడి చేరిన రోజువరకు అనునిత్యం తిరువారాధన చేసుకొనేవారు. రోజూ శ్రీనివాసుని కోవెలకి వెళ్ళేవారు. ఎంత వర్షం వచ్చినా, ఎంత ఎండ అయినా కోవెలకి నడుచుకొని వెళ్ళేవారు. మా అత్తమామలకి అయిదుగురు సంతానం.

ఇద్దరు కొడుకులు ముగ్గురు కూతుళ్ళు, కోడళ్ళు, మనవలు మనవరాళ్ళు, ముని మనవలు. ఇంతమంది మనవలతో సహా పెద్దకుటుంబము. మా అత్తగారు భర్తని అనుసరించి నడుచుకొనేవారు. కులంలో పెద్ద ముత్తైదువ. ఎవరి ఇంట్లో శుభకార్యం జరిగినా ఆమెని తీసుకు వెళ్ళేవారు. మా అత్తగారికి భాగవతసేవలన్నా, ఆచార్యసేవలన్నా చాల ప్రేమ. ఆమె నడిపించిన బాటలోనే మేము అందరము నడుస్తున్నాము. మా మామగారి జ్ఞాపికగ ఏదైన శాశ్వతమైన కైంకర్యం చేయాలని మా అత్తగారి కోరిక.

అది తెలుసుకొని మా జానకమ్మగారు **పెరుమాళ్ తిరుమొழి** అనే గ్రంథాన్ని వేయించుకోండి- అని చెప్పేరు. ఆమె ప్రోత్సాహంతోనే ఈ గ్రంథముద్రణకు

సిద్ధపడినాము. నాలాయిరదివ్యప్రబంధానికి పెద్దలు అందించిన ద్రావిడవ్యాఖ్యానములు గల శ్రీకోశములు ప్రస్తుతము దొరకడం లేదు. ద్రావిడవ్యాఖ్యానంతో పాటుగ ఆంధ్రవివరణకూడ చేర్చి ఈ గ్రంథాన్ని అందంగా ముద్రింపజేయడానికి సహృదయంతో సహకరించిన **శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారికి** అనేక దాసోహములు సమర్పిస్తున్నాను. తామే ఆంధ్రవ్యాఖ్యానాన్ని కూర్చడంతో పాటు ముద్రణబాధ్యతనుకూడా స్వీకరించారు. వారికి మేము ఎప్పటికీ కృతజ్ఞులము. భాగవతోత్తముల అభిమానమే మాకు ఉజ్జీవనము కలిగిస్తుంది. మా మామగారి పేరున, మా అత్తగారు మాచేత చేయిస్తున్న ఈ గ్రంథ ముద్రణము చిరస్మరణీయము. ఇది మా మామగారికి, మా ఆచార్యులకు మేము సమర్పించుకుంటున్న చిన్నపుష్పము. ప్రేమతో మాకు మంగళాశాసనములను అందజేసి, ఈ గ్రంథమును అమూల్య మొనరించిన పెద్దలు **శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారికి, శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారికి** కృతజ్ఞతా పూర్వకముగ దాసోహములు సమర్పిస్తున్నాము. ఈ గ్రంథము సంప్రదాయాభి మానులకు ఆనందమును కలిగిస్తుందని ఆశిస్తూ-

భాగవతవిధేయులు

**నాగులకొండ వెంకట సత్తెయ్య(బాబు)**

**నాగులకొండ రుక్మిణమ్మ**

**(పెద్దకుమారుదు, కోడలు)**



**శ్రీమాన్ నాగులకొండ వెంకట సత్తెయ్య(బాబు)**
**శ్రీమతి నాగులకొండ రుక్మిణమ్మ**
**(పెద్దకుమారుడు, కోడలు)**






**శ్రీమాన్ నాగులకొండ వెంకట సత్తెయ్య (రాము)**
**శ్రీమతి నాగులకొండ ఆండాళమ్మ**
**(చిన్నకుమారుడు, కోడలు)**



**శ్రీమాన్ డి.వి.ఆర్. గోపాలస్వామి**
**(చీఫ్ మేనేజర్, ఎస్.బి.ఐ.)**
**శ్రీమతి డి. చంద్ర (పెద్దకుమార్తె అల్లుడు)**



**శ్రీమాన్ మంచుకొండ జగన్నాథం**
**శ్రీమతి మంచుకొండ కన్యాకుమారి**
**(రెండవ కుమార్తె అల్లుడు)**



**శ్రీమాన్ మంచుకొండ శ్రీమన్నారాయణ**
**శ్రీమతి మంచుకొండ రంగనాయకమ్మ**
**(మూడవ కుమార్తె అల్లుడు)**

# కులశేఖరాழ்வార్ వైభవం

**కుంభే పునర్వసౌ జాతం కేరలే చోళపత్తనే ।**
**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥**

(కేరళదేశంలో **"కొల్లినకర్" (తిరువఞ్జిక్కళమ్)** అనే రాజధానినగరంలో మాశిమాసం పునర్వసు నక్షత్రంలో భగవానుని వక్షఃస్థలంలో ఉండే కౌస్తుభం అనే రత్నంయొక్క అంశతో, చేరదేశానికి ప్రభువై అవతరించిన కులశేఖరులను ఆశ్రయిస్తున్నాను.)

**ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే ।**
**తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్ ॥**

(ఎవరి రాజధానినగరంలో ప్రతిదినం రంగయాత్ర ఘోషింపబడుతున్నదో, అటువంటి కులశేఖరాழ்வార్లను నేను శిరసా నమస్కరిస్తున్నాను)

**కల్యబ్దే సుఖసంఖ్యయా వ్యపగతే మాసే చ మాఘాభిధే**
**వర్షే చాపి పరాభవే సురగురో ర్వారే చ పక్షౌ శుచౌ ।**
**ద్వాదశ్యాఖ్యతిథౌ పునర్వసుదినే ప్రీత్యాఖ్యయోగాన్వితే**
**త్రాతుం నః కులశేఖరః క్షితిపతిః శ్రీకౌస్తుభాత్మా౽భవత్ ॥**

(కలియుగంలో **"సుఖ"** అనే పదంచేత (సకారంచేత 7, ఖ కారంచేత 2– "అంకానాం వామతో గతిః అనే న్యాయంవల్ల ఈ అంకెలను మార్చి వ్రాస్తే 27– అనే క్రమంలో) నిర్దేశింపబడే 27 సంవత్సరాలు గడచిన తరువాత, ప్రభవనామసంవత్సరంలోని మాశిమాసంలో శుక్లపక్షంలో ద్వాదశితిథిలో గురువారంనాడు పునర్వసు నక్షత్రంలో ప్రీతి అనే యోగంలో శ్రీకౌస్తుభం అంశతో కులశేఖరాழ்వార్లు అనే ప్రభువు ఆవిర్భవించారు)

**తస్యా మభూ చ్చేరకులప్రదీపః శ్రీకౌస్తుభాత్మా కులశేఖరాఖ్యః ।**
**మహీపతి ర్మాఘపునర్వసూద్యద్దినే హరేః పూర్ణకటాక్షలక్ష్యమ్ ॥**

**(దివ్యసూరిచరితమ్)**

(శ్రీకౌస్తుభంయొక్క అంశతో పరమపురుషుని పూర్ణకటాక్షానికి లక్ష్యభూతులై, ప్రభువైన కులశేఖరులు మాశిమాసం పునర్వసుతో కూడిన గొప్ప దినంలో చేరకులానికి గొప్ప దీపంగా ఆవిర్భవించారు)

పైన తెలుపబడ్డ తనియన్ శ్లోకాలలో, వైభవశ్లోకంలో పూర్వాచార్యులు అనుసంధించిన రీతిలో చేరదేశంలో కొల్లినకర్ అనే నగరంలో, పరిపాలనచేసే దృఢవ్రతులనే రాజుకు

కుమారుడై కులశేఖరులు జన్మించారు. కలియుగం ఆరంభమై 27 సంవత్సరాలు గడచిన తరువాత, 28వ సంవత్సరం అయిన పరాభవవర్షంలో మాశిమాసం శుక్లపక్ష ద్వాదశి తిథిలో గురువారంతో కూడిన శుభదినంలో పునర్వసు నక్షత్రంలో **"తిరువఞ్జిక్కళమ్"** అనే పర్యాయనామాన్ని కల ఆ నగరంలో రాజకుమారుడుగా ఈ ఆ**ழ్వా**ర్లు అవతరించారు. పుట్టగానే వీరితండ్రి వీరి తేజస్సును చూచి, తన కులానికి శిరోమణి కాగలరని తలచి వీరికి కులశేఖరులనే నామాన్ని పెట్టారు.

శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానుడైన ఈ రాజకుమారునకు క్రమంగా చౌళ, ఉపనయనసంస్కారాలు తగిన సమయంలో తండ్రిచేత చేయబడ్డాయి. కులశేఖరులు సదాచార్యసన్నిధిలో నాల్గు వేదాలను, షడంగాలను, ఇంకా క్షత్రియకులోచితాలైన శస్త్రాస్త్ర విద్యలను, అశ్వగజరథచోదనవిద్యలను చిన్నవయస్సులోనే అభ్యసించారు. కుమారుని యోగ్యతను చూచిన తండ్రి యువరాజపట్టాభిషేకాన్ని చేశాడు. తదనతరం కులశేఖరులు జైత్రయాత్ర చేసి నలుదిక్కులలో ఉండే రాజ్యాలను లోబరచుకొని చోళ,పాండ్యదేశాది ప్రభువులను తమ సామంతులుగా చేసికొన్నారు. చోళ, చేర, పాండ్యదేశాలను మూడింటిని **"కొల్లికావలన్ కూడల్ నాయకన్ కోழிక్కోన్ కులశేకరన్"** అనే తాము పల్కిన రీతిలో తమ వశంలోకి తెచ్చుకొన్నారు. కుమారుని శౌర్యపరాక్రమాలను చూచి ఆనందించిన దృఢవ్రతుడు కులశేఖరులకు పట్టాభిషేకం చేసి, రాజ్యపాలనభారాన్ని అంతటిని అప్పగించి, వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి అరణ్యాలకు వెళ్ళిపోయాడు.

తండ్రి విశ్లేషానికి చాలా బాధపడిన కులశేఖరులు మంత్రుల ఆశ్వాసనవల్ల క్రమంగా తేరుకొని, **"ఊనం న సత్త్వేష్వధికో బబాధే"** అన్న కాళిదాసు సూక్తి ప్రకారంగా తన రాజ్యంలో బలహీనులను బలవంతులు అక్రమంగా బాధించని రీతిలో రామరాజ్యంతో సమానంగా రాజ్యపాలనను చేశారు. క్రమంగా తగిన రాజకన్యను వివాహమాడిన కులశేఖరులకు ఒక కుమారుడు జన్మించాడు. తన తండ్రి పేరు అయిన దృఢవ్రతుడనే నామాన్ని అతనికి పెట్టారు. **"శేరకులవల్లి"** అని, **"ఇళై"** అని పిలువబడే కుమార్తెను నీళాదేవి అంశగా పొందారు.

ఇహలోకం, స్వర్గం, మోక్షం అనే మూడింటిని ఇవ్వగలవాడు, ముమ్మూర్తులలో ముఖ్యుడు అయిన పరదేవత ఎవరు? అనే పరతత్త్వవిచారాన్ని చేయడం ఆరంభించి, పలువురు పండితులను ఆశ్రయించి, కులశేఖరులు తత్త్వజ్ఞానంకోసం ప్రయత్నం చేసే సమయంలో. అదే మంచి అదనుగా భావించిన భగవానుడు వీరిని కటాక్షించి, **"మయర్వఱ మదినలమ్"**ను (భక్తిరూపంగా పరిణమించిన విశుద్ధమైన జ్ఞానాన్ని) అనుగ్రహించాడు. తన స్వరూపరూపగుణవిభూత్యాదులను దర్శింపజేశాడు. క్రమంగా

ఆళ్వార్లకు **"ఞానమ్ కనిన్ద నలమ్"** అన్నట్లు భక్తిపారవశ్యాన్ని పొంది, తత్కారణంగా "భగవానునకు ఏం ఆపద కలుగుతుందో ఏమో?" అని ఆస్థానే భయశంకను పొంది, మంగళాశాసనం చేసే భక్తిపరాకాష్ఠ దశను చేరుకొన్నారు. భగవానుని నిస్సీమనిస్సంఖ్యాకాలైన గుణాలనే మహాసముద్రంలో అవగాహించి, వీరు మనస్సులో భగవానునిపట్ల అంతులేని ఆర్తిని పొందాడు. భగవానుని విభవావతారాలలో శ్రీరామావతార, శ్రీకృష్ణావతారాలపట్ల, అర్చావతారాలలో శ్రీరంగం, శ్రీవేంకటాచలం, తిరుక్కణ్ణపురం, తిరుచ్చిత్రకూడమ్, తిరువిత్తువక్కోడు మొదలైన దివ్యతిరుపతులలోని మూర్తులపట్ల అధికమైన అభినివేశాన్ని పొందారు. శ్రీరామాయణ గ్రంథకాలక్షేపంలోనే సదా కాలాన్ని గడుపుతూ, శ్రీవైష్ణవుడు ఎవరు కనబడినా వారికి స్వాగతాన్ని పల్కి ఇంటికి ఆహ్వానించి, విశేషమైన అతిథిమర్యాదలను చేసే భాగవత నిష్ఠను కలవారై, ఐహిక భోగభాగ్యాలపైన, అధికారాలపైన ఆసక్తిలేకుండా ఉన్నారు.

కులశేఖరులు ఒకనాడు శ్రీరామాయణ కాలక్షేపాన్ని ఆలకించే సమయంలో, అరణ్యకాండలో "ముక్కు, చెవులు ఖండింపబడ్డ శూర్పణఖచేత ప్రేరేపింపబడిన పదునాల్గువేలమంది రాక్షసులు ఒకవైపు, నిస్సహాయుడైన, అద్వితీయుడైన శ్రీరామ చంద్రుడు ఒక వైపున ఉండగా వారిమధ్య యుద్ధం జరిగింది- అనే సంగతిని శ్రీరామాయణాన్ని ఉపన్యసించేవారివల్ల వినగానే, శ్రీరామాయణంలో తమకుండే అభినివేశాతిశయంచేత, అప్పటికి చాలా కాలానికి ముందు ఎపుడో జరిగినది ఈ వృత్తాంతం అనే విషయాన్ని మఱచి, అపుడే జరుగుతున్నదని భావించి, "ఈ విధంగా శ్రీరాముడు పెద్ద ఆపదలో చిక్కుకొని ఉన్నపుడు మనం మనకు చేతనైనంత సహాయాన్ని చేయాలి" అని నిశ్చయించుకొని, తమ సేనలను అన్నిటినీ యుద్ధానికి సన్నద్ధం చేయమని అధికారులను నియమించి, తానుకూడ శస్త్రపాణియై బయలుదేరారు. దానిని చూచిన అందఱు "ఇపుడేమి చేయాలి" అని తెలియక దిగ్భ్రమ చెందారు. నిపుణుడైన శ్రీరామాయణ కాలక్షేపాన్ని నిర్వహించే పండితుడు వెంటనే "శ్రీరాముడు అసహాయ శూరుడై యుద్ధంలో పదునాల్గువేలమంది రాక్షసులను వధించి, పర్ణశాలకు తిరిగి వచ్చాడు. అతనిని చూచి సీతాదేవి ఆనందంతో ఆలింగనం చేసికొని అతని శ్రమను తీర్చింది" అనే వృత్తాంతాన్ని ప్రవచించాడు. కులశేఖరులు ఆ మాటలను విని ఆశ్వాసాన్ని పొంది తమ సేనను వెనుకకు మరలించి, తాము కూడా ప్రయాణాన్ని మానివేశారు.

అప్పటినుండి శ్రీరామాయణగాథను వివరించే పండితుడు శ్రీరాముని విజయ వృత్తాంతాలను మాత్రమే వివరించి పల్కుతూ, అతనికి ఆపద వచ్చిన సందర్భాలను సంగ్రహించి పలికేవారు. ఒకనాడు ఆ పండితునకు ఏదో ఒక పనికోసం వేఱొక చోటికి పోవలసివచ్చింది. ఆనాడు శ్రీరామాయణ కాలక్షేపాన్ని నిర్వహించడంకోసం తన

కుమారుణ్ణి పంపించారు. అతడు కులశేఖరాళ్వార్ల స్వభావాన్ని సరిగా గుర్తించనందున, రావణుడు సీతను అపహరించిన వృత్తాంతాన్ని వివరంగా తెలిపాడు. దానిని విన్న వెంటనే కులశేఖరుల మనస్సు పరితాపాన్ని పొందింది. "నేనిపుడే వెంటనే బయలుదేరి సముద్రాన్ని దాటి రావణుని సబాంధవంగా వధించి, అమ్మను తిరిగి తీసికొనివస్తాను" అని అంటూ ఆసనం నుండి పైకి లేచి, సేనతోపాటు లంకకు ప్రయాణం అయ్యారు. అపుడు అక్కడ ఉండే వారికి ఏం చేయాలో తోచలేదు. ఆళ్వార్లు సముద్రతీరం చేరి, సముద్రాన్ని ఈది ఆవలి తీరాన్ని చేరడంకోసం నీటిలోపలికి దిగారు. ఆళ్వార్ల ఈ పరమభక్తిని చూచిన భగవానుడు శ్రీరాముని రూపంలో లక్ష్మణ, సీతా సహితుడై సాక్షాత్కరించి, తాను రావణుని వధించి, సీతను తిరిగి తీసికొనివచ్చినట్లు పల్కి, వారిని సమాధానపఱచి నగరానికి తిరిగి పోయేటట్లు చేసి, అదృశ్యమయ్యాడు.

ఈ రీతిలో ఇతిహాస పురాణాలను శ్రవణం చేయడంలోనే ఎక్కువ ఆసక్తిని కలవారైన కులశేఖరులు శ్రీరంగక్షేత్రంయొక్క మహిమను వాటివల్ల గ్రహించి, అక్కడకు పోయి శ్రీరంగనాథుని దర్శించాలని ఒకనాడు బయలు దేరాలని నిశ్చయించుకున్నారు. అపుడు మంత్రులు మొదలైనవారు "వీరు శ్రీరంగానికి పోయి, శ్రీరంగనాథుని సేవించడం తటస్థిస్తే, మళ్ళీ తిరిగి రాజధానికి రారు" అని గ్రహించి, వీరి శ్రీరంగయాత్రను అడ్డుకోవడంకోసం ఒక ఉపాయాన్ని ఆలోచించారు. అది ఏమంటే– కులశేఖరులు భాగవతతదీయారాధన విషయంలో చాలా అభినివేశాన్ని కలవారు కనుక, వారు శ్రీరంగయాత్రకు బయలుదేరేనాటికి పలువురు భక్తులను రాజువద్దకు అతిథులుగా రప్పించారు. కులశేఖరులు ఆ భగవద్భక్తులను చూచి, తమ శ్రీరంగనగర ప్రయాణాన్ని ఆనాటికి నిలుపుకొని, వారికి తగిన అతిథిమర్యాదలను చేయడంలో నిమగ్నులయ్యారు. ఆ విధంగా ఆనాటి శ్రీరంగయాత్ర నిలచిపోయింది. ఇదే రీతిలో కులశేఖరులు శ్రీరంగయాత్రకై ముహూర్తాన్ని పెట్టుకొన్న అన్ని దినాలలో మంత్రులు యథాపూర్వం భగవద్భక్తులను ఆహ్వానిస్తూ కులశేఖరుల శ్రీరంగయాత్ర నిలిచేటట్లు చేసేవారు. ఈ విషయం వీరి తనియన్‌శ్లోకంలోని **"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే"** అనే సూక్తిద్వారా తెలుస్తున్నది.

కులశేఖరుల అంతఃపురంలోను, సభామండపంలోను, ఇంకా పలు అంతరంగ ప్రదేశాలలోను భాగవతులు అన్ని సమయాలలోను వారి రాకపోకలకు ఏ ఆటంకం లేని రీతిలో రాజువల్ల అనుజ్ఞను పొందారు. దీనిని చూచి కొందఱు మంత్రులు వారిపట్ల అసూయను పొంది, వారి విషయంలో వ్యతిరేకభావం కులశేఖరాళ్వార్లకు కలిగేటట్లు చేయాలని ఒక పన్నాగం పన్నారు. ఒకసారి శ్రీరామనవమి ఉత్సవంనాడు భగవానునకు అభిషేకం నిర్వహించే సమయంలో, ఉత్సవంలో అందఱు నిమగ్నులై ఉండగా, తీసి

ఉంచిన ఆభరణాలలో చాలా విలువైన ఒక హారాన్ని ఎవరికీ తెలియకుండా మంత్రులు తీసి దాచి పెట్టారు. అభిషేకం ముగిసిన తరువాత, అమూల్యమైన ఆ హారం కన్పించడంలేదని అర్చకులు కులశేఖరులకు తెలియజేశారు. ఆ*ళ్వా*ర్లు వెంటనే మంత్రులను పిలిచి "దొంగను వెంటనే వెదకి పట్టుకోండి" అని ఆజ్ఞాపించారు. అదే తగిన అదను అని మంత్రులు భావించి, "ఈ అంతఃపురంలో ఏ ఆటంకం అడ్డు అదుపూ లేకుండా సంచరించే శ్రీవైష్ణవులలోనే ఎవరో ఒకరు ఈ హారాన్ని దొంగిలించి ఉంటారు." అని వారిపై అపనిందను మోపారు. ఆ మాటను విన్న ఆ*ళ్వా*ర్లు రెండు చెవులను మూసికొని, మంత్రులను చూచి – "భగవానుని భక్తులు ఏనాడూ ఈ తగని పనిని చేయకపోవడమే కాదు; కనీసం భావించరుకూడా. ఈ విషయాన్ని నేను ప్రమాణపూర్వకంగా ఋజువు చేస్తాను" అని అంటూ విషసర్పాన్ని ఒక కుండలో పెట్టి, ఆ కుండ లోపల తన చేతిని పెట్టి, "శ్రీవైష్ణవులలో ఎవరైనా ఈ నేరాన్ని చేసి ఉంటే ఈ కుండలో ఉండే పాము నన్ను కఱచి చంపాలి. ఆ విధంగా కాకపోతే, వారు త్రికరణశుద్ధిని కల్గిఉంటే ఈ పాము నన్ను కఱవదు" అనే శపథాన్ని చేశారు. అపుడు వారి సత్యమైన ప్రమాణానికి కట్టుబడ్డ సర్పం వారిని కఱవలేదు. దీనిని అంతా గమనించిన మంత్రులు తమ తప్పును ఒప్పుకొంటే తప్ప తాము బతికి బయటపడలేమని గుర్తించి, తాము దాచి ఉంచిన హారాన్ని తిరిగి తీసికొనివచ్చి కులశేఖరులకు సమర్పించి, తాము అజ్ఞానంవల్ల చేసిన తప్పును క్షమించవలసినదని వేడుతూ ఆ*ళ్వా*ర్లను శరణువేడారు. ఆ*ళ్వా*ర్లు తాము క్షమించినంతమాత్రంతో చాలదని తలచి "మీరు ఈ శ్రీవైష్ణవుల విషయంలో చేసిన అపరాధానికి ప్రాయశ్చిత్తం ఏమంటే – ఇకపై ప్రతిదినం వారికి కైంకర్యాన్ని చేయడమే. దానినే మీరు దేహయాత్రగా కల్గి ఉండండి" అని ఆజ్ఞాపించగా, మంత్రులు కూడా ఆ రీతిలోనే భాగవత కైంకర్యపరులుగా పేరుపొందారు. ఈ వృత్తాంతాన్ని –**"ఆరజ్కెద ప్పరనన్బర్ కొళ్ళారెన్డు అవర్‌కళుక్కే వారజ్కొదు కుడప్పాప్పిల్ కైయిట్టవన్"** అనే వీరి తనియన్‌లోని సూక్తి తెలుపుతున్నది.

అనంతరం కులశేఖరులు రాజ్యపాలనలో విసిగి రోసి, ఆ భారాన్ని తన కుమారుడు దృఢవ్రతునకు అప్పజెప్పి, తాను చిరకాలంగా ఆశపడుతున్న శ్రీరంగనాథుని దర్శన భాగ్యాన్ని పొందడంకోసం శ్రీరంగాన్ని చేరారు. అక్కడ శ్రీరంగనాథుని దివ్యరూపాన్ని మనసార, కళ్ళారదర్శించి, మహానందాబ్ధి మగ్నులయ్యారు. చాలాకాలం ఆ క్షేత్రంలోనే ఉండి, ఆ శ్రీరంగనాథుడే తనకు తగిన వరుడని భావించిన తన కుమార్తె చేరకుల వల్లిని ఆస్వామికే ఇచ్చి పరిణయంచేసి, ఈ నాటికీ **"కులశేకరన్ పడి"** అని వ్యవహరింప బడే మూడవ ప్రాకారాన్ని నిర్మించారు. ఈ విధంగా పలు భగవద్భాగవత కైంకర్యాలను చేస్తూ కాలం గడిపారు.

మిగిలిన దివ్యదేశాలనుకూడా దర్శించాలని తలచిన కులశేఖరులు తిరువేఙ్గడమ్, తిరువయోధ్య, తిల్లైత్తిరుచ్చిత్తిరకూడమ్, తిరుక్కణ్ణపురం, తిరుమాలిరుమ్ శోలై, తిరువిత్తువక్కోడు మొదలైన దివ్యక్షేత్రాలను సేవించి, ఆయా క్షేత్రాలను అధివసించి ఉండే భగవన్మూర్తులను దర్శించి, తిరుక్కురుకూర్‌ను చేరి నమ్మాళ్వార్లను సేవించి ఆనందించేటపుడు, ఆ అనుభవాన్ని అందతికీ పంచిపెట్టాలనే ఔదార్యంతో పెరుమాళ్ తిరుమొళి అనే ద్రావిడ ప్రబంధాన్ని, ముకుందమాల అనే సంస్కృతశ్లోకరూపస్తోత్రాన్ని అనుగ్రహించారు. ఏకారణంచేతనో కాని, నాలాయిరదివ్యప్రబంధాన్ని, స్తోత్రరత్నాన్ని వ్యాఖ్యానించిన పెరియవాచ్చాన్‌పిళ్ళై ముకుందమాలను వ్యాఖ్యానించనందువల్ల, మణవాళమహామునులతో పాటుగా ఇంచుమించుగా పూర్వాచార్యులందఱు ఈ స్తుతిలోని శ్లోకాలను ఎక్కడా తమ గ్రంథాలలో కాని, వ్యాఖ్యలలో కాని ప్రమాణాలుగా ఎక్కువగా పరిగ్రహించనందువల్ల ఈ స్తుతిని కులశేఖరాళ్వార్లు రచించలేదని, వారి వంశంలో తరువాతి కాలంలో అవతరించినవారు, కులశేఖరులనే పేరునే కల్గిన ఒక పరమభక్తునిచేత రచింపబడి ఉండవచ్చునని కొందఱు భావిస్తున్నారు. ఈ విషయంలో యథార్థం ఏమయినా, ముకుందమాల మాత్రం అత్యద్భుతమైన, హార్దమైన భావసంపుటితో పాఠకుల హృదయాలను కఱగించి తన్మయులను చేసే మధురాతి మధురమైన స్తుతి అని అనడంలో అడ్డులేదు.

ఇక, కులశేఖరాళ్వార్లు అనుగ్రహించిన పెరుమాళ్ తిరుమొళి ప్రబంధ ప్రమేయ సంగ్రహం విన్నవింపబడుతున్నది. కారుణికుడైన భగవానుడు తమకు **"మయర్వఱ మదినలమ్"** అని అన్నట్లు భ్రమవిప్రలంభాది దోషరహితమైన భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించగా, ఆ జ్ఞానంతో కులశేఖరులకు అప్పటికప్పుడే భగవానుని దర్శించాలనే ఆర్తి కల్గింది. పరమపదాన్ని చేరి దర్శించి ఆనందించే సమయంవరకు వేచి ఉండలేక, ఆ పరమపదంలోని పరరూపంలో పరత్వాది కల్యాణగుణాలతోపాటు, సౌలభ్యానికి తగిన శీలాదిగుణాలు కూడా పూర్ణంగా ఉండే శ్రీరంగనాథుని దర్శించి ఆనందించాలని ఆశపడి, రాజ్యపరిపాలనాభారంవల్ల, భాగవతకైంకర్య భారంవల్ల ఆ ఆశకు అంతరాయం కల్గిన కారణంచేత **"అణియరఙ్గత్తిల్ పళ్ళికొళ్ళుమ్ కరుమణియై ... కణ్డుకొణ్డు ఎన్నుకొలో కళిక్కునాళే"** అనే తమ ఆర్తిని పెరుమాళ్ తిరుమొళిలోని మొదటి దశకంలో వ్యక్తం చేశారు. భగవానునివద్ద అభినివేశాన్ని కలవారికి క్రమక్రమంగా కలుగదగిన ఆనుకూల్యసంకల్పం, ప్రాతికూల్యవర్జనం, రక్షిస్తాడనే విశ్వాసం, అతడే రక్షకుడనే నమ్మిక, భగవానుని సన్నిధిలో ఆత్మభారసమర్పణం, ఆకించన్య నివేదనం– అనే ప్రపన్నుని ఆఱు స్వభావాలలో మొదటిది అయిన ఆనుకూల్యసంకల్పాన్ని కల్గి ఉండడమనే స్వభావాన్ని **"ఇరుళిరియ"** అనే మొదటి దశకంలో వ్యక్తంచేశారు. భగవద్భక్తుల విషయంలో తమకు గల ఆనుకూల్య సంకల్పాన్ని **"తేట్టరుమ్"** అనే రెండవ దశకంలో తెలిపారు. ఈ విధంగా

ఆనుకూల్యం భగవద్భక్తుల పర్యంతం కల్గిన తరువాత దేహాత్మాభిమానం మొదలైన ప్రాతికూల్యవర్జనం అనే రెండవ దశ ఏర్పడినది అని **"మెయ్యిల్"** అనే మూడవదశకంలో పలికారు. ఈ విధంగా భగవద్భాగవత విషయంలో ఆనుకూల్యం, ప్రాతికూల్యా వర్జనం ఏర్పడిన తరువాతకూడా భగవానుని తాము చేరలేకపోయినందువల్ల, "నేను ఈ రాచరికంలో ఆశను, సంబంధాన్ని కల్గి ఉన్నాను- అనే భావనతో నన్ను స్వామి అనుగ్రహించడంలో ఆలస్యంచేస్తున్నాడు కాబోలు". అని భావించి మొదటి మూడు దశకాలలో అనుభవింపబడ్డ శ్రీరంగనాథుడు నిలచి ఉండే చోటు అయిన వేంకటాద్రిలోని శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో తమకు ఈ లౌకికైశ్వర్యంలోను, రాజ్యాధికారంలోను ఎంత మాత్రం సంగం లేదని విన్నపించి, "ఆ స్వామి వేంచేసి ఉండే తిరుమలలో ఏదయినా ఒక వస్తువుగా రూపాన్ని ధరించి, అతని పగడవు మోవిని సదా సేవించాలి" అనే తమ ఆశను **"ఊనేఱు"** అనే నాల్గవ దశకంలో ఆవిష్కరించారు. ఇంతగా అభినివేశాన్ని పొందినా అది ఫలపర్యవసాయి కానందువల్ల, ఆకించన్యం (భగవత్కృపతప్ప తన వద్ద రక్షణకోసం ఏదీ లేకపోవడం), అనన్యగతిత్వం. (భగవానుడు తప్ప వేఱు ఉపాయం ఏదీ లేకపోవడం) అనే స్వభావాలను తమకు కల్గిన రీతిని పలు దృష్టాంతాలను చూపడంద్వారా తిరువిత్తువక్కోడు అనే క్షేత్రంలో వేంచేసి ఉండే స్వామి శ్రీచరణసన్నిధిలో విన్నపించారు- అయిదవ తిరుమొ*ழி* అయిన **"తరు తుయరుమ్"**- అనే దశకంలో. అయినా, తాము భగవత్సన్నిధానాన్ని పొందలేకపోవడంచేత, వారి ఆర్తి మరింత అతిశయించి, ఒక నాయికాభావాన్ని పొందారు. భగవానునితో ఏర్పడిన సంశ్లేష-విశ్లేష-ప్రణయ కలహాలలోని అనుభవాలను, **"మిన్నిడై మడవార్"** అనే దశకంలో (తిరువాయ్మొ*ழி* ప్రబంధంలో) నమ్మా*ழ*్వార్లు ప్రకటించిన రీతిలో **"కాదిల్ కడిప్పు"** అనే దశకంలో (పెరియతిరుమొ*ழி* ప్రబంధంలో) తిరుమజ్గై ఆ*ழ*్వార్లు ఆవిష్కరించిన రీతిలో, **"ఏర్‌మలర్"** అనే ఆఱవ దశకంలో వ్యక్తం చేశారు. "భగవదనుభవాన్ని అనాదికాలంగా కోల్పోతున్నామే!" అనే బాధ ఉద్బుద్ధం అయినందువల్ల, భగవానుడు శ్రీకృష్ణుడై అవతరించినపుడు, ఆస్వామి బాల్యలీలానుభవాన్ని కోల్పోయిన దేవకీదేవి, కంసవధకు ముందు శ్రీకృష్ణుని చూడగానే తాను కోల్పోయినవానిని అన్నిటినీ ప్రస్తావించి దుఃఖపడే మాటలలో, తాము అనాదికాలంగా భగవదనుభవాన్ని కోల్పోయినందువల్ల కల్గిన దుః ఖాన్ని అంతటినీ **"ఆలైనీళ్"** అనే ఏడవ దశకంలో ప్రస్తావించారు. దేవకీ భావనను ఈ విధంగా పొందిన తరువాత కౌసల్యాదేవి భావనను పొంది, తిరుక్కణ్ణపురం అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే శ్రీరామునకు తాలాట్టు (జోలపాట) పాడారు- **"మన్నుపుక*ழ*్"** అనే ఎనిమిదవ దశకంలో. కౌసల్యాభావనను ఈ విధంగా పొందిన తరువాత, దశరథుని భావనను కూడా పొందిన వారై "చిన్నతనంలో అనుభవించిన శ్రీరాముని యౌవన- వీరచరిత్రాలను అనుభవించలేనట్లుగా నేనే స్వయంగా అతనిని అరణ్యానికి పంపి వేశానే!"

అని, అంటూ దశరథుడు ప్రలాపించే రీతిలో తమ దుఃఖాతిరేకాన్ని తొమ్మిదవ దశకం **"వన్ తాళినిణై"**లో వ్యక్తపరచారు. గత దశకాలలో తాము ప్రకటించిన ఆర్తి అంతా తీరేటట్లుగా చక్రవర్తి త్తిరుమకన్ నిత్యవాసం చేసే తిరుచ్చిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలోని అర్చామూర్తివిషయంగా, శ్రీరామజననం మొదలు **"తన్నడిచ్చోది"**అయిన పరమపదానికి చేరేవరకుగల వృత్తాంతాలను తాము అనుభవించిన, శ్రీవాల్మీకిభగవానునిచేత అనుభవింపబడినట్లే, తమకు కూడా తమ జ్ఞానవైశద్యంవల్ల సమకాలంలోవలె తాము అనిభవించిన రీతిని **"అఙ్గణెడుమదిళ్"** అనే చివరి దశకంలో పాడి ప్రబంధాన్ని నిగమించారు. ఈ విధంగా చక్రవర్తి త్తిరుమకన్ విషయంలోనే తమ జీవితంలోను, ప్రబంధంలోను అభినివేశాన్ని పొంది ప్రదర్శించడం చేత **"కులశేఖరప్పెరుమాళ్"** అనే తిరునామంతో వీరు కీర్తింపబడుతున్నారు. **"పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అని అంటూ భగవానుని దర్శించి, కైంకర్యం చేసేటపుడు తమకు ప్రధాన భోగంలో అన్వయంలేదనే విషయాన్ని **"పడియాయ్ కిడన్దు"** అని అనడంద్వారా భగవానునకే ఆ ఆనందంలో ప్రధానమైన అన్వయం ఉన్నదనే విషయాన్ని **"ఉన్ పవళవాయ్"** అని అనడంద్వారా, భగవానుని ఆనందానికి అతిశయం కలుగజేయడానికి తగిన, అప్రధానమైన ఆనందంలోనే జీవునకు (తమకు) ఉన్నదనే విషయాన్ని **"కాణ్బేనే"** అని అనడం ద్వారా ప్రాప్యాన్ని నిష్కరించి, శ్రీవేంకటేశ్వరుని వద్ద ప్రార్థించడంచేత భగవత్సన్నిధులు అన్నిటిలోను భగవానుని మూర్తికి ఎదురుగా ఉండే గడప **"కులశేఖరప్పడి"** అనే పేరుతో సంప్రదాయంలో వ్యవహరింపబడుతున్నది.

## వాழిత్తిరునామం

**అఞ్జనమామలై ప్పిఱవి ఆదరిప్పోన్ వాழியే**
**అణియరఙ్గర్ మణత్తూణై అడైన్దుయ్న్దోన్ వాழியే**
**వఞ్జినకరన్దన్నిల్ వాழ వన్దోన్ వాழியే**
**మాశితన్నిల్ పునర్పూశమ్ వన్దుదిత్తాన్ వాழியే**
**అఞ్జలెన క్కుడప్పామ్బిల్ అఙ్గైయిట్టాన్ వాழியే**
**అనవరతమ్ ఇరామకతై అరుళుమవన్ వాழியే**
**శెఞ్జొల్ మొழి నూற்றఞ్జుమ్ శెప్పినాన్ వాழியே**
**శేరలర్కోన్ శెఙ్గమల త్తిరువడికళ్ వాழியే**

# కులశేఖర ప్పెరుమాళ్ సూక్తులతో మిగిలిన ఆழ்వార్ల సూక్తుల సామ్యాలు

## 1) కులశేఖరప్పెరుమాళ్–పెరియాழ்వార్లు

కులశేఖరాழ்వార్లు **"ఊనేఱు శెల్వమ్"** (4–9) దశకంలో భగవానుని **"తిరుమాలే నెడియానే"** అని అంటూ ఆశ్రితుల విషయంలో స్వామియొక్క అవధి లేని పక్షపాతిత్వాన్ని తెలిపారు. ఈ సంబోధనలోని ఆழ்వార్ల ఆంతర్యాన్ని వివరిస్తూ పరమకారుణికులైన పెరియవాచ్చాన్ పిళ్ళై **"అవళ్ తానుమ్ ఎన్నాలుమ్ పొఱుక్కప్పోకాతు ఎన్నపోతు 'ఎన్నడియార్ అతు శెయ్యార్'** (పెరియా–తిరు–4–8–2) **ఎన్ఱు ఆశ్రితవిషయత్తిల్ ఓరమ్ ఎల్లై కాణవొణ్ణాతవన్"** (లక్ష్మీదేవిసైతం "నావల్లకూడా ఇతని దుష్కర్మలను సహించడానికి సాధ్యం కాదు" అని అన్నపుడు "నా దాసులు ఆ దోషాన్ని చేయరు" అని పల్కి ఆశ్రితులపట్ల పక్షపాతం అంతు లేకుండా ఉండేవాడు) అనే పెరియాழ்వార్ల శ్రీసూక్తిని ఉదాహరించడం వల్ల ఈరెండు సూక్తులలోని భావసామ్యం స్పష్టం. కులశేఖరుల సూక్తిలో ఈ విశేషభావం **"తిరుమాలే! నెడియానే!"** అనే సంబోధనల సమాహారంవల్ల స్ఫురిస్తున్నది. ఇపుడు వీరిద్దరి సూక్తుల మధ్యగల ఇంకొక అద్భుతమైన భావసామ్యం నివేదింపబడుతున్నది.

పెరియాழ்వార్లు **"పరుకు నీరుమ్ ఉడుక్కుమ్ కూఱైయామ్ పావమ్ శెయ్‌దన"** (4–4–4) అని అంటూ "భగవన్నామానుసంధానాన్ని చేయని మానవులు తాగే నీరు, ధరించే వస్త్రం పాపాన్ని చేశాయి" అని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే పెరియ వాచ్చాన్ పిళ్ళై– వారు తాగే నీరు, ధరించే వస్త్రం పాపాన్ని చేశాయి కదా– అని అంటున్నారు. **"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"** – ఈ జీవునిద్వారా చేతనాచేతనాల్లో అనుప్రవేశించి వాటి నామరూపాలను వ్యాకరిస్తాను – అని వ్యష్టిసృష్టికి ఉన్ముఖుడైన భగవానుని సంకల్పం కనుక, నామరూపాలను కల సకలవస్తువులలో ఒక్కొక్క జీవుడు అధిష్ఠించి ఉన్నాడని గ్రహించాలి. ఘటపటాదిపదార్థాలలో ఒక్కొక్క జీవుడు అధిష్ఠించి ఉన్నాడని ఎందుకు తోచడం లేదు? అని అంటే, ఆయా జీవుల కర్మానుగుణమైన జ్ఞానసంకోచకారణంచేత తోచడం లేదు. **"తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా, సర్వభూతేషు భూపాల! తారతమ్యేన వర్తతే, అప్రాణిమత్సు స్వల్పా సా స్థావరేతు తతోఽధికా"**అని అనబడుతున్నది కదా! అందువల్లనే **'పావమ్ శెయ్‌దాన్‌కొలో'** అని అనడం. అంటే – ఇది చేసిన పాపంవల్లకదా వీరికి ఇవి శేషం అయినవి – అని భావం. విలక్షణులైనవారికి శేషమైన పదార్థాలకు ఆ విధంగా శేషం కావడంద్వారా వాటికి ఒక సత్కర్మ ఉన్నదని, హీనులైనవారికి శేషం అయినవాటికి ఏ సత్కర్మ లేనందువల్ల, పూర్వపాప ఫలమే ఈవిధంగా అయిందని చెప్పబడుతున్నదికదా! **"వేదవిద్యావ్రతస్నాతే శ్రోత్రియే**

**గృహ మాగతే, క్రీడంన్త్యోషధయ స్సర్వాః యాస్యామః పరమాం గతిమ్"** (వేదవిద్యను పూర్తిగా అభ్యసించి, స్నాతకవ్రతాన్ని పూర్తి చేసికొన్న విద్వాంసుడు ఇంటికి వస్తే, ఆ ఇంటిలో ఉండే పదార్థాలన్నీ- మనం ఇతనికి శేషం కావడంద్వారా పరమపదాన్ని పొందగలం కదా- అని సంతోషిస్తాయి) అని, **"నష్టశౌచే వ్రతభ్రష్టే విప్రే వేదవివర్జితే, దీయమానం రుదత్యన్నం కిం మయా దుష్కృతం కృతమ్"** (శౌచం లేనివాడు, వ్రతభ్రష్టుడు, వేదాన్ని విడచినవాడైన బ్రాహ్మణునికి పెట్టబడ్డ అన్నం "అయ్యో! నేను ఏం పాపం చేశానో కదా!" అని ఏడుస్తుంది) అని శ్రీవిష్ణుధర్మంలో చెప్పబడింది- అని వివరించారు. పాశురంలో నీరు, వస్త్రం చెప్పబడడం మిగిలిన అన్ని వస్తువులకు ఉపలక్షణం. ఇటువంటి భావాన్నే కులశేఖరులు **"తన ముదైత్తు త్తరణితానే"** (10-5) శ్రీవైష్ణవుల సంచారానికి విషయమైన భూమి ఎంతో పుణ్యం చేసింది- అని అంటూ అనుసంధించారు. దీనివల్ల వీరి సూక్తులలోని సామ్యం విశదమవుతున్నది.

## 2. కులశేఖరులు - ఆణ్డాళ్

ఆణ్డాళ్ శ్రీవేంకటేశ్వరుని - **"వెయ్యదోర్ త*ళ్లు*లుమి*ళ్* శక్కరత్తై వేజ్గడవఱ్కు"** అని అంటూ నిప్పులు కక్కే శ్రీసుదర్శనాన్ని ఆయుధంగా కల్గి ఉండడాన్ని వేంకటేశ్వరునకు నిరూపకంగా పల్కిన భావాన్ని కులశేఖరులు కూడా **"మిన్‌వట్ట చ్చుడరా*ళ్*} వేజ్గడక్కోన్"** అని అంటూ అనుసంధించారు.

శ్రీరాముడు అరణ్యానికి వెళ్ళినపుడు అతని వియోగాన్ని సహించలేక దశరథుడు దుఃఖించే ప్రకారాన్ని తద్భావనతో పల్కుతూ కులశేఖరులు **"కాకుత్తా! కరియకోవే"** అని అన్నారు. ఈ రెండు సంబోధనలలో మొదటి సంబోధనవల్ల "ఇది నీ అభిజాత్యానికి- అంటే- కకుత్థుని వంశంలో జన్మించినందుకు తగదు" అని, రెండవ సంబోధనలో- నీ రూపసౌందర్యానికి తగదు" అని సూచించారని పూర్వాచార్యవ్యాఖ్య. ఆణ్డాళ్ గోపికాభావనతో తిరుప్పావై ప్రబంధంలో 19వ పాశురంలో పల్కుతూ నీళాదేవినిగూర్చి **"తత్తువమన్రు త్తకవన్రు"** అని అనడంకూడా ఇటువంటిదే. **"మైత్తడమ్ కణ్ణినాయ్"** అని ఆమెను సంబోధించిన ఆణ్డాళ్ ఈ రెండు పదాలతో నీవు శ్రీకృష్ణుని నిరోధించడం నీ స్వరూపానికి తగినది కాదు; నీ పురుషకారరూప స్వభావానికి తగినది కాదు- అని అన్నారు- అని పూర్వాచార్యవ్యాఖ్య.

## 3. కులశేఖరులు - తొణ్డరడిప్పొడికళ్

కులశేఖరులు తమ ప్రబంధంలోని 4వ దశకం 9వ పాశురంలో- **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అని అన్నారు. ఆ*ళ్వా*ర్లు ముందు అచిద్వత్ పారతంత్ర్యాన్ని ఆశపడి **"పడియాయ్ కిడన్దు"** (గడపగా పడి ఉండి) అని అనగానే, శ్రీవేంకటేశ్వరుని మనస్సు ప్రసన్నమై తన నోరు తెరచి మందహాసం చేశాడు. అది

స్ఫురించేటట్లు ఆళ్వార్లు వెంటనే **"ఉన్ పవళవాయ్"** అని అన్నారు. ఈ విధంగా ఈ పదం భగవానుని ఆశ్రితవ్యామోహసూచకం.

తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలోని 35వ పాశురంలో **"శెజ్జణ్ మాలే!"** అని భగవానుని సంబోధించారు. ఇది స్వభావ కథనంకాదు. తత్కాలీనవిశేషణం. ఆళ్వార్లు దీనికిముందు **"శిక్కెన"** అని అనగానే భగవానుని మనస్సు వారిపట్ల ప్రసన్నమయినది. స్వామికి వీరిపట్ల కల్గిన వ్యామోహం లోపల ఇముడక పోవడంతో అతని కళ్ళు అనురాగంవల రంజితాలయ్యాయి. ఈ అంశాన్ని ఈ సంబోధన సూచిస్తున్నది– అని పూర్వాచార్యవ్యాఖ్య.

## 4. కులశేఖరులు - తిరుమఙ్గైమన్నన్

కులశేఖరులు శ్రీకృష్ణావతారంలోని ఉలూఖలదామబంధన సన్నివేశాన్ని అనుభవిస్తూ, **"ఎఱ్ఱిల్ కొళ్ తామ్బు"** (7–8) అని అన్నారు. ఈ సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్ళై **"స్పర్శిక్కైక్కు ఆశైప్పట్టిరుక్కుమ్ తిరుమేనియై స్పర్శిత్తతితే యెన్ఱు "ఎఱ్ఱిల్ కొళ్ తామ్బు" "ఎన్గిఱార్. రాజజన్మమ్ వేణ్డా, అచేతనమాక అమైయుమ్; అఙ్గుత్తై స్పర్శమ్ పెఱతిల్ ఎన్ఱిరుక్కుమవరితే"** అని వ్యాఖ్యానించారు.

తిరుమఙ్గైమన్నన్‌కూడా ఈ వృత్తాంతాన్ని అనుసంధిస్తూ– **"ఆయ్చ్చి ఒణ్ కయిఱ్ఱినాల్ ఆర్క్క"** (6–7–4) అని అన్నారు. దీనిని పెరియవాచ్చాన్‌పిళ్ళై **"తిరుమేనియై స్పర్శిక్కప్పెఱ్ఱతు ఎన్ఱు "ఒణ్ కయిఱు" ఎన్గిఱారాకవుమామ్"** అని వ్యాఖ్యానించారు. దీనినిబట్టి ఈ రెండు సూక్తుల సామ్యం సుస్పష్టం. **"కణ్డవర్ తమ్ మనమ్ వఴ్హఙ్గుమ్"** (పెరియతిరు–8–1–9), **"కణ్డవర్‌తమ్ మనమ్ వఴ్హఙ్గుమ్"** (8–2), **"అఙ్గోర్ ఆయ్చ్చి ఎల్లిప్పొఴ్హుతాడి"** (పెరియతిరు 10–8–10), **"ఆయ్చ్చిమార్‌కళ్ ఎల్లిప్పొఴ్హుదినిల్ ఏమత్తూదు"** (6–10), **"తేవరైయుమ్ అశురయైయుమ్ తిశైకళైయుమ్"** (పెరియతిరు–11–6–10), **"తేవరైయుమ్ అశురరైయుమ్ తిశైకళైయుమ్"** (8–10) ఇత్యాదిశబ్దప్రయోగసామ్యాలున్నాయి. ఇటువంటి సామ్యాలు వీరిద్దరి సూక్తులలో పదుల కొద్దీ ఉన్నాయి.

## 5. కులశేఖరులు– నమ్మాళ్వార్లు

ప్రణయకలహసన్నివేశాన్ని నాయికీభావనతో అత్యంతమధురంగా అనుగ్రహించిన వారు వీరిద్దరు. నమ్మాళ్వార్లు **"మిన్నిడై మడవార్"** (6–2–0) దశకంలోను, కులశేఖరులు **"ఏర్‌మలర్ పూమ్ కుఴ్హల్"** (6వ దశకం) లోను ఈ అనుభవాన్ని వ్యక్తంచేశారు. ఈ దశకంలో పలు సూక్తిసామ్యాలున్నా ఒక్కటి మాత్రం ఇక్కడ ఉదాహరణగా తెలుపబడు తున్నది.

నమ్మా*ళ్వా*ర్లు ప్రయణకుపిత అయిన నాయిక భావనతో పల్కుతూ **"పోకు నమ్బీ"**– అని శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి అన్నారు. ఈ సూక్తి తాత్పర్యాన్ని నమ్బిళ్ళై – **"పోకు నమ్బీ! ఎన్ఱు మున్బే శొల్లిచ్చెయదే, తిరియవుమ్ శొల్లుమ్బోదు ఒన్ఱిరణ్డడి వరవిట్టు క్కిట్ట నిన్ఱానాక వేణుమితే. వారీర్! ఎత్తనై పేరై త్తీణ్డి వన్దీరెన్ఱు తెరియాతు. పుడైవైపడామే కడక్కనిల్లు మెన్ఱాళ్. "పో" ఎన్న, వర నిఱ్కక్కడవన్ "తీణ్డాతే కొళ్ళుమ్" ఎన్ఱాల్ ఎన్బదుమో!** –అని వ్యాఖ్యానించారు.

కులశేఖరులు ప్రణయరోషాన్ని పొందిన గోపికాభావాన్ని ఆరోపించుకొని, **"ఎ*న్ఱై*క్కు నీ ఎన్ మరుఙ్గిల్ వన్దాయ్?"** (6–6) అని పల్కడంకూడా ఇటువంటిదే. దీనిని పెరియవాచ్చాన్ పిళ్ళై– **"ఆరై త్తీణ్డి వన్దాయ్ ఎన్ఱు తెరియాతు. ఎన్నై తీణ్డాతే కడక్క నిల్లు"** అని వివరించడం దీనికి ప్రమాణం. **"తిణ్ క*ళ*ల్"** (1–2–10) అని నమ్మా*ళ్వా*ర్లు అంటే, **"వన్తాళ్"** (9–1) అను కులశేఖరులన్నారు. ఇటువంటి సామ్యాలు ఇంకా చాలా ఉన్నాయి.

## 6. కులశేఖరులు–మధురకవులు

కులశేఖరులు **"తేట్టరుమ్"** అనే దశకంలో భాగవతశేషత్వాన్ని వ్యక్తం చేయగా, మధురకవులు తమ ప్రబంధం అంతటా భాగవతశేషత్వాన్ని అనుసంధించారు.

## 7. కులశేఖరులు – పొయ్కై ఆ*ళ్వా*ర్లు

భగవత్సంబంధంవల్ల గర్వించిన సముద్రాన్నిగూర్చి **"మాలైయు*ఱ్ఱ* క్కడల్"** అని కులశేఖరులు పలికారు. పొయ్కై ఆ*ళ్వా*ర్లు ఈ అంశాన్ని **"మాలుమ్ కరుమ్ కడలే"**(19) అని అనుగ్రహించారు. వీరిద్దరి సూక్తులలో ఇటువంటి భావసామ్యాలు వ్యాఖ్యానాలలో చాలా ఉన్నాయి.

## 8. కులశేఖరులు – పేయా*ళ్వా*ర్లు

భగవానుని వక్షఃస్థలానికి, తులసీమాలకు కల చేరికలోని అందాన్ని ఈ ఆ*ళ్వా*ర్లు ఇద్దరు అనుభవించిన తీరు అత్యంతం రసఘనం. పేయా*ళ్వా*ర్లు. **"నెడువరై వాయ్ త్తా*ళు*మ్ అరువిపోల్ తార్"** అని అంటూ ఉపమాలంకారప్రయోగ పూర్వకంగా ఈ చేరికను కీర్తించారు. కులశేఖరులు **"తు*ళా*య్మాలై యు*ఱ్ఱ* వరై ప్పెరున్దిరుమార్బు"** (2–8) అని ఈ చేరికను పొగడారు. ఈ సూక్తిని వివరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై **"వణ్డుకళ్ నెరుఙ్గి యిరుక్కిఱ శెవ్వి త్తిరుత్తు*ళా*య్ మాలై శేర్న్దు, మలైపోలే ఇరుక్కిఱ పెరున్దిరుమార్వై ఉడైయవరై. 'మైపోల్ నెడువరై వాయ్ త్తా*ళు* మరువిపోల్ తార్ కిడప్ప' ఎన్నక్కడవతితే"** అని పల్కడం వీరిద్దరి సూక్తిసామ్యానికి తార్కాణం.



# ముఖబంధం

**కతిక్కు ప్పుతతి నమ్ కానముమ్ కల్లుమ్ కడలు మెల్లామ్**
**కొతిక్క త్తవమ్ శెయ్యుమ్ కొళ్గై యఱ్ఱేన్ కొల్లికావలన్**
**శొల్‌పతిక్కుమ్ కలైక్కవి ప్పాడుమ్ పెరియవర్ పాదఙ్గళే**
**తుతిక్కుమ్ పరమన్ ఇరామానుశన్ ఎన్నై చ్చోర్విలనే.** **(ఇరామానుశ-14)**

(కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన సూక్తులచే పొదగబడ్డ పాశురాలను అనుసంధానంచేసే గొప్పతనాన్ని కలవారి శ్రీపాదాలనే స్తుతించే మహనీయులు, తమకంటే గొప్పవారు వేఱొకరు లేని శ్రీరామానుజులు నన్ను చేయి విడువరు. అందువల్ల ప్రాప్యం విషయంలో ఆతురత పడి చాలా వేడిమిని కల అరణ్యంలో, పర్వతాలపై, సముద్రంలో అంతటా అన్నిచోట్ల శ్రమపడేటట్లు తపస్సుచేసే ఉద్దేశ్యం లేనివాడనై ఉన్నాను).

పై పాశురాన్ని తిరువరఙ్గత్తముదనార్ ఇరామానుశనూఱ్ఱన్దాది అనే భగవద్రామానుజ స్తుతివిషయకం అయిన తమ ప్రబంధంలో కులశేఖరులసూక్తి వైభవాన్ని కీర్తిస్తూ అనుగ్రహించారు. ఈ పాశురంలోని **"కొల్లికావలన్ శొల్‌పదిక్కుమ్ కలైక్కవి"** అనే ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ **"కొల్లినకరెన్ఱు శొల్లప్పదుకిఱ తిరువఞ్జిక్కళత్తుక్కు రక్షకరాన శ్రీకులశేఖరప్పెరుమాళ్ శాస్త్రచ్చొల్లుక్కళినుడైయ తాత్పర్య విషయభూతఙ్గళాయిరుక్కిఱ భగవత్స్వరూపరూపగుణవిభూతికళైయుమ్, తత్త్వహిత పురుషార్థఙ్గళైయుమ్, ముత్తుక్కళైయుమ్, రత్నఙ్గళైయుమ్ ముకమతిన్దు కోక్కుమ్ విరకరైప్పోలే, విశదమాక తత్తత్‌స్థానఙ్గళిలే శేర్‌త్తు, "ఇరుళిరియ చ్చుదర్‌మణికళ్" ఎన్ఱు తొడఙ్గి "నలన్తికழ் నారణనడిక్కీழ் నణ్ణువారే" ఎన్ఱు మళవాక దివ్యప్రబంధరూపేణ అరుళిచ్చెయ్‌త శ్లాఘ్యమాన కవికళై"** (**"కొల్లినకర్"** అని చెప్పబడే తిరువఞ్జిక్కళమ్ అనే దివ్యదేశానికి రక్షకులైన శ్రీకులశేఖరప్పెరుమాళ్ శాస్త్రవచనాల తాత్పర్యరూపాలై ఉండే, భగవానుని స్వరూపరూపగుణవిభూతులను, తత్త్వహితపురుషార్థాలను, ముత్యాలను, రత్నాలను వాటి ముఖాలను తెలిసి కూర్చే సమర్థునివలె, విశదంగా ఆయా స్థానాలలో చేర్చి, **"ఇరుళిరియ చ్చుదర్‌మణికళ్"** అని ప్రారంభించి, **"నలన్తికழ் నారణన్ అడిక్కీழ் నణ్ణువారే"** అనే పర్యంతం దివ్యప్రబంధరూపంలో అనుగ్రహించిన భోగ్యాలైన పాశురాలను) అని వచించారు. శ్రీమద్వరవరమునులుకూడా తమ లఘుటీకలో - **"కొల్లికావలన్ శొల్ పతిక్కుమ్ కలైక్కవి"** అనే ప్రయోగాన్ని- **"శ్రీ కులశేఖరప్పెరుమాళ్ రత్నఙ్గళై పదిత్తాఱ్పోలే శాస్త్రచ్చొల్లుక్కళై ప్పదిత్త కవికళై"** అని, **"శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుభవపరీవాహ రూపమాన స్సోక్తికళై రత్నఙ్గళై ప్పదిత్తువైత్తాఱ్పోలే నిరైత్తువైత్తతాయ్, శాస్త్రరూపమాయిరున్దుళ్ళ కవికళ్- ఎన్నవుమామ్"** అని వివరించారు. ఈ రెండు వివరణలవల్ల శ్రీకులశేఖరాழ்వార్ల సూక్తులు వేదార్థతత్త్వప్రతిపాదకాలని, పరమభోగ్యాలని తెలుస్తున్నది.

ఈరెండు అర్థాలు పై పాశురంలోని **"కలైక్కవి", "శొల్‌పతిక్కుమ్"** అనే ప్రయోగాల స్వారస్యం వల్ల ధ్వనిస్తున్నవి. కులశేఖరులు అన్నీ గుడజిహ్వికాన్యాయంతో వైదిక తత్త్వార్థాలను మధురభక్తితో మేళవించి అందించారనే విషయాన్నికూడా ఈ ప్రయోగం సూచిస్తుంది (**ఇన్** – భోగ్యం, **అముదమ్** – ఆత్మోజ్జీవకం). ఇంతటి పరమగంభీరాలు, మధురమధురాలు కాబట్టే శ్రీరామానుజులు **"ఇన్నముత మూట్టుకేన్"** అని అంటూ వాటిని పరమభోగ్యాలుగా, ఆత్మోజ్జీవకాలుగా వచించారు. ఈ విషయాన్ని పెరియ వాచ్చాన్‌పిళ్ళై తమ వ్యాఖ్యలో సూచించారు కూడా. తమిళభాషలో **"పెరుమాళై అరియా తార్ పెరుమాళై అరియాతారే"** (కులశేఖరప్పెరుమాళ్‌ను తెలియనివారు పెరుమాళ్ అనబడే శ్రీరాముని తెలియనివారే) అనే ప్రసిద్ధమైన నానుడి కూడా ఇందువల్లనే ఏర్పడింది.

**"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః, ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ, వదంతి సకలా వేదా సేతిహాసపురాణకాః, మునయ శ్చ మహాత్మానో వేదవేదార్థవేదినః"** (ప్రాప్యుని – అనగా – పొందదగినవాడైన పరమాత్మయొక్క స్వరూపం, పొందేవాడైన జీవుని స్వరూపం, ఫలాన్ని పొందడానికి తగిన ఉపాయంయొక్క స్వరూపం, పొందే ఫలంయొక్క – పురుషార్థంయొక్క స్వరూపం, ఈ ఫలాన్ని పొందడంలో మధ్యలో ఎదురయ్యే విరోధుల స్వరూపం – ఈవిధంగా ఉండే అర్థపంచకాన్నే సకలవేదాలు, వేదాంతాలు, ఇతిహాసాలు, పురాణాలు, వేదవేదార్థాలను తెలిసిన మహనీయులైన మహర్షులు తెలియజేస్తున్నారు) అనే ప్రసిద్ధమైన హారీతసంహితా ప్రమాణం సకలవేదవేదాంతేతిహాసపురాణాల సారమైన అర్థం తత్త్వహితపురుషార్థాలేనని తెలుపుతున్నది. ఈ మూడు అష్టాక్షరీ మహామంత్రార్థాంతర్గతాలని పూర్వాచార్యుల సుద్ది. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుపడి అనే రహస్యగ్రంథంలో అష్టాక్షరీమంత్రంచేత బోధింపబడే అర్థాలనుగూర్చి ప్రస్తావిస్తూ– **"స్వరూపముమ్, ఉపాయముమ్, ఫలము మెన్నవుమామ్"** అని అనుగ్రహించారు. దీనిని శ్రీమణవాళ మహామునులు **"ప్రణవత్తాలే శేషత్వముమ్, నమస్సాలే ఉపాయముమ్, నారాయణ పదత్తాలే ఫలముమ్ శొల్లుకిఅతు"** అని వివరించారు. దీనినిబట్టి అష్టాక్షరిలో అనన్యార్హశేషత్వ– అనన్యశరణత్వ– అనన్యభోగ్యత్వాలనే తత్త్వహిత పురుషార్థాలు తెలుపబడ్డాయని తెలుస్తున్నది.

కులశేఖరులు తమ దివ్యప్రబంధంలో పలుచోట్ల ఈ తత్త్వహితపురుషార్థాల స్వరూపాన్ని ఆయా ప్రయోగాలద్వారా తెలియజేశారు. ముఖ్యంగా, ఆ*ழ్వార్లు* **"ఊనేఱు శెల్వత్తు"** అనే దశకంలోని **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అనే సూక్తి ద్వారా జీవుని భగవదనన్యార్హశేషత్వ, పారతంత్ర్యాలను బోధించారు. ఈ శేషత్వ, పారతంత్ర్యాలు భాగవతపర్యంతం కావాలనే సారతమమైన శాస్త్రతాత్పర్యాన్ని **"నెఱియాయ్ క్కిడక్కుమ్ విదియుడైయే నావేనే"** అనే ప్రయోగంతో సూచించారు. ఈసూక్తిని వ్యాఖ్యాతృ

సంచరించి మేసే ఎద్దులవలె ఉండే అయిదు ఇంద్రియాలను యథేష్టంగా సంచరించ కుండా ఉండేటట్లు కట్టిపడవేసి. **(ఇడర్ ప్పార త్తున్బమ్ తుఱన్దు) –"పారమాయ పழవినై పఱ్ఱఱుత్తు"** (అమలనాది-5) (భారంగా ఉండే ప్రాచీనకర్మలను సమూలంగా నశింపచేసికొని) అనే రీతిలో చాలా దుఃఖాన్ని కల్గించే ప్రాక్తనకర్మలనబడే పుణ్యపాపాల రూపంలోని గొప్ప భారాన్ని తీర్చుకొని. భగవానుని అనుగ్రహంచేత ఈ దుర్గుణాలను పోగొట్టుకొని– అని భావం.

**(ఇరు ముప్పొழుతు ఏత్తి)** – ఉపాదానం, అభిగమనం, ఇజ్య, స్వాధ్యాయం, యోగం– అనే పేరుతో ప్రతిదినంలోని కాలాన్ని అయిదు భాగాలుగా విభాగించుకొని, వీటిని భగవత్పరంగానే గడిపే పంచకాలపరాయణులై స్వామిని స్తుతించి. **"ఇరు ముప్పొழుదు"** అనేది ఈ అయిదు కాలాలను తెలుపుతుంది. లేక, ప్రాతఃకాలం, పగలు, సాయం– అనే వాటిని **"ముప్పొழుదు"** అనేది తెల్పితే, **"ఇరు ముప్పొழుదు"** అనే దానికి **"పెరియ ముక్కాలఙ్గళ్"** అనే అర్థాన్ని గ్రహించవచ్చు. (**"ఇరు"**– అనేది విశేషణం) అంటే, అన్ని కాలాలలోను భగవానుని స్తుతించేవారని తాత్పర్యం.

**(ఎల్లై ఇల్లా తొన్నెఱి క్కణ్ నిలై నిన్ఱ తొణ్డరాన)** – అంతులేని, ప్రాచీనమైన ఆరాధన క్రమంలో ఎవరివల్ల కలత కల్గించడానికి వీలులేని రీతిలో స్థిరంగా నిలచి ఉండే శ్రీవైష్ణవులైన.

**(అఱమ్ తికழుమ్ మనత్తవర్తమ్ కతియై)** – ఇతరులపట్ల కరుణను చూపడమే స్వభావంగా కల వీరిచే పొందదగిన, గొప్ప ప్రాప్యంగా ఉండే వానిని. **(పొన్ని అరఙ్గత్తు అరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్) "పొన్ని శూழ் అరఙ్గమ్"** (తిరుచ్చన్ద-55) (కావేరీ నదిచేత పరివేష్ఠితమైన శ్రీరంగం) అని చెప్పబడ్డ కావేరిచేత నాల్గుదిశలలో పరివేష్ఠింపబడ్డ శ్రీరంగంలో ఆదిశేషుడనే పడుకపై పరుండి ఉండే,

**(అణి యరఙ్గమ్)** – లీలావిభూతి అనే ఈ సంసారమండలానికి ఆభరణంవలె ప్రకాశించే శ్రీరంగం – అని అర్థం. **(నిఱమ్ తికழుమ్ మాయోనై క్కణ్డు)** అందంతో వెలిగే ఆశ్చర్యభూతుని దర్శించి, **"నిఱమ్ తికழుమ్"** అనేదానికి "అందంకూడా ఇతనిని ఆశ్రయించడంవల్ల గొప్పతనాన్ని పొందుతున్నది" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"మాయోన్"** అనే పదం ఆచార్యుడైనవాడనే అర్థాన్ని ఇస్తుంది. **(ఎన్ కణ్గళ్ నీర్ మల్క ఎన్ఱుకొలో నిఱ్కుమ్ నాళే)** – ఇతని రూపాన్ని చూచి ఆనందాన్ని పొంది, ఆనందబాష్పాలు స్రవిస్తూ ఉండగా నిలచే నాడు ఎపుడో!

**కోలార్న్ద నెడుమ్ శార్ఙ్గమ్ కూనల్ శఙ్గమ్**
**కొలై యాழி కొడున్దణ్డు కొఱ్ఱ వొళ్ వాళ్,**

కాలార్న్ద కతిక్కరుడ నెన్నుమ్ వెన్ఱి
కృడుమ్ పఱవై ఇవై యనైత్తుమ్ పుఱమ్శూ్ఴ్ కాప్ప,
శేలార్న్ద నెడుఙ్గ్ఴని శోలై శూ్ఴ్న్ద
తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,
మాలోనై క్కణ్డు ఇన్బ క్కలవి ఎయ్తి
వల్వినైయేన్ ఎన్ఱుకొలో వా్ఴు నాళే. 8

కోల్ ఆర్న్ద = బాణాలతో సంధింపబడ్డ, నెడుమ్ శార్ఙ్గమ్ = పెద్దదిగా (దీర్ఘంగా) ఉండే శ్రీశార్ఙ్గమనే వింటిని, కూన్ నల్ శఙ్గమ్ = భగవదనుభవంచేత గర్వాన్ని పొంది, దానివల్ల వంగి, విలక్షణం అయిన శ్రీపాంచజన్యం, కొలై ఆ్ఴి = విరోధులను నిరసించే శ్రీసుదర్శనం, కొడుమ్ తణ్డు = విరోధులకు భయాన్ని కల్గించే శ్రీకౌమోదకి అనే గద, కొ్ఱ్ఱమ్ ఒళ్ వాళ్ = విజయంతో ప్రకాశించే నందకమనే ఖడ్గం, కాల్ ఆర్న్ద కడుమ్ కతి = వాయువేగంవంటి గొప్ప వేగాన్ని కల, కరుడన్ ఎన్నుమ్ = గరుడుడు అన్నీ, వెన్ఱి పఱవై = జయశీలుడైన పక్షిరాజు గరుత్మంతుడు, ఇవై అనైత్తుమ్ = అనే వీటిని అన్నీ, పుఱమ్ శూ్ఴ్ కాప్ప = చుట్టూ పరివేష్ఠించి రక్షిస్తూ ఉండగా, శేల్ ఆర్న్ద నెడుమ్ క్ఴని = మత్స్యాలు నిండి సస్యక్షేత్రాలతోను, శోలై శూ్ఴ్న్ద = తోటలతోను చుట్టబడి ఉండే, తిరు అరఙ్గత్తు అరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ = శ్రీరంగక్షేత్రంలోని దివ్యాలయంలో ఆదిశేషుడనే పర్యంకంపై పరుండి ఉండే, మాలోనై = సర్వాధికుడైన భగవానుని, వల్ వినైయేన్ = మహాపాపి అయిన నేను, కణ్డు ఇన్బమ్ కలవి ఎయ్ది = సేవించి, నిస్సమాభ్యధికం అయిన ఆనందాన్ని అనుభవించి, వా్ఴుమ్ నాళ్ ఎన్ఱుకొలో = ఉజ్జీవించే దినం ఏనాడో!

వ్యా - ఎట్టామ్బాట్టు. (కోలార్న్ద నెడుమ్ శార్ఙ్గమ్) తిరచ్చరఙ్గళోదే కూడిన శ్రీశార్ఙ్గమ్. "ఎప్పోతుమ్ కైక్ఴలా నేమియాన్" ఎన్నుమాపోలే, ఎప్పోతు వినై ఉణ్డామ్ ఎన్ఱతియా మైయాలే తిరుచ్చరఙ్గళై తొ్డుత్తపడియేయాయ్త్తు శ్రీశార్ఙ్గ మిరుప్పతు. (కూన్ నల్ శఙ్గమ్) భగవదనుభనజనితత్తాల్ వన్ద శెరుక్కాలే కూనియాయ్త్తు శ్రీపాఞ్చజన్య మిరుప్పతు. (కొలై యా్ఴి) ఇవర్కళనుభవత్తిల్ ఇ్ఴియప్పోతిన్ఱియే ప్రతిపక్షత్తై ఇరు తుణ్డమాక విడుకై పణిపోరుమాయ్త్తు త్తిరువా్ఴియా్ఴ్వానుక్కు. (కొడుమ్ తణ్డు) పిడిత్త పిడియిలే ఉకవాతార్ మణ్ణుణ్ణమ్బడియా యిరుక్కిఱ గదై. (కొ్ఱ్ఱ వొళ్వాళ్) ఐశ్వర్యప్రకాశమాన తిరుక్కొ్ఱ్ఱ వాళ్. కొ్ఱ్ఱమ్ - వె్ఱ్ఱి.

(కాలార్న్ద కతి క్కరుడనెన్నుమ్ వెన్ఱి క్కడుమ్ పఱవై) కా్ఱ్ఱినుడైయ మిక్క వేగమ్బోలే యిరుక్కిఱ గతియై యుడైయనాయ్, పెరియతిరువడి ఎన్గిఱ పేరైయుముడైయ నాయిరుక్కిఱ కడుమ్ పఱవై. (ఇవై యనైత్తుమ్ పుఱమ్ శూ్ఴ్ కాప్ప) "రామలక్ష్మణగుప్తా

**సా" ఎన్నుమాపోలే కడఙ్గరై వెళియిల్ శ్రీసేనై ఎల్లామ్ కుழుచ్చురక్కాయ్, త్తాముమ్ తమ్బియారుమ్ కాక్కుమాపోలే, పెరియపెరుమాళ్ కణ్వాళర్న్దరుళుక్కైయాలే పెరియతిరువడి ముతలాక శ్రీపఞ్చాయుధాழ్వార్కళ్ శుఱ్ఱుమ్ కాత్తుక్కొణ్డాయ్త్తు నిఱ్పతు.**

**(శేలార్న్ద నెడుమ్ కழని శోలై శూழ్న్ద తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ మాలోనై) శేలాలే నిరమ్బిన కழనికళుమ్, శోలైకళుమ్ శూழ్న్ద కోయిలిలే తిరువన్దాழ్వాన్ మేలే కణ్వళర్ న్దరుళుకిఱ సర్వాధికనై. (కణ్డు ఇన్బక్కలవి యెయ్తి) కణ్డు నిరతిశయానన్ద యుక్తనామ్బడి సంశ్లేషిత్తు. (వల్వినైయేన్ ఎన్ఱుకొలో వాழునాళే) లోకాన్తరత్తిలే పోయ్ క్కాణవేణ్డుమ్ వస్తు ఇఙ్గే సన్నిహితమాయిరుక్కచ్చెయ్తే అనుభవిక్కవొణ్ణాత మహాపాపత్తై పుణ్ణిన నాన్ అనుభవిత్తు వాழప్పెఱువతు ఎన్నో? భగవదనుభవత్తుక్కు విరోధియాయుళ్ళవై ఎల్లామ్ పాపమాయిరుక్కుమిఱే.**

***అరు :- ఎట్టామ్బాట్టు. (కోలార్న్ద ఇత్యాది) (ఇవర్కళిత్యాది) తిరువాழி ముతలాన దివ్యాయుధఙ్గళుక్కు విరోధినిరసనత్తుక్కొழிయ శ్రీపాఞ్చజన్యమ్బోలే అనుభవత్తి లిழிయ ప్పోతిల్లై- ఎన్గపడి.***

***రాజత్వత్తాలే యన్వో వరక్కూడిఱ్ఱిల్లై, అతు పాపఫలమో? ఎన్న అరుళిచ్చెయ్కిఱార్ (భగవదనుభవత్తుక్కిత్యాది).***

**భావదీపిక :- అవ :-** ఈ పాశురంలో భగవానుని దర్శించి మహానందాన్ని పొంది ఉజ్జీవించాలని ఆழ్వార్లు ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (కోలార్న్ద నెడుమ్ శార్ఙ్గమ్) - "కోల్"** అనే పదం బాణాలను నిర్దేశిస్తుంది. బాణాలతో కూడిన, దీర్ఘంగా ఉండే శ్రీశార్ఙ్గమనే విల్లు. బాణాలతో కూడిన విల్లు అని అన్నందువల్ల, ఎపుడు శత్రువులను వధించవలసి వస్తుందో తెలియనందువల్ల బాణాలను తొడిగిన స్థితిలోనే ఉండే శ్రీశార్ఙ్గాన్ని ధరించి ఉండేవాడని భావం. **"ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్"** (పెరియతిరు-87) (ఎల్లప్పుడే శ్రీహస్తంలో సుదర్శనాన్ని కలవాడు) అనే రీతిలో శ్రీసుదర్శనాన్ని ప్రయోగానికి సిద్ధంగా ఉండే స్థితిలో శ్రీహస్తంలో ధరించి ఉండేటట్లే ఇదికూడా.

**(కూన్ నల్ శఙ్గమ్)** - భగవానుని అధరామృతాన్ని ఆస్వాదించి, అనుభవించడంవల్ల కల్గిన గాంభీర్యంచేత భవ్యమై, కొంచెం వంగినట్లుగా కన్పించే శ్రీపాంచజన్యం. **"నల్ శఙ్గమ్"** అనే పదం భగవదనుభవం సంపూర్ణంగా పొందడాన్ని తెల్పుతుంది. **"కొలై యాழி"-** అని ప్రారంభించి మిగిలిన నాల్గు ఆయుధాలను తెలుపుతున్నారు. ఈ మిగిలిన ఆయుధాలు పాంచజన్యంవలె సదా భగవదనుభవంలో మగ్నం కావడానికి అవకాశం లేకుండా, శత్రుసంహారం చేయడంలోనే కాలక్షేపాన్ని చేస్తున్నందువల్ల, **"నల్"** అనే విశేషణాన్ని ప్రయోగించలేదు.

**(కొలై యాఴి)** - శత్రువులను రెండు ఖండాలుగా చేసే పనిలోనే శ్రీసుదర్శన భగవానుడు కాలాన్ని గడుపుతున్నాడని భావం.

**(కొఴున్దణ్డు)** - భగవానుడు తనను పట్టుకొని ఉండే సన్నివేశాన్ని దర్శిస్తేనే శత్రువులు భయపడి గడగడ వణికి పడేటట్లు చేసే **"కౌమోదకీ"** అనే గద. **(కొ౯్ఱవాళ్ వాళ్)** సర్వలోకచక్రవర్తి అనే సంపదను చూపేటట్లుగా జయాన్నే ఇచ్చే నందకమనే కత్తి. **"కొ౯్ఱమ్"** అంటే విజయం. **"కొ౯్ఱవన్"** అంటే విజయాన్ని పొందే రాజు.

**(కాలార్న్ద కతి క్కరుడన్ ఎన్నుమ్ వెన్ఱి క్కడుమ్ పఱవై)** - ఝంఝామారుతం యొక్క గొప్ప లేశంవలె ఎగరడంలోని సామర్థ్యాన్ని కలవాడై, **"గరుడు"**డనే తిరునామాన్ని కలవాడై, శత్రువుల విషయంలో కాఠిన్యాన్ని చూపించేవాడైన పక్షిరాజు. **"పాఱి ప్పాఱి యశురర్తమ్ పల్ కుఴాఙ్గళ్ నీఱెఴ పాయ్ పఱవై యొన్ఱేఱి"** (తిరువాయ్-2-6-8) (అసురుల పలు సమూహాలను ఖండఖండాలుగా, బూడిద అయ్యేటట్లుగా చేసి శత్రుసైన్యంలో చొచ్చుకొనిపోయే గరుత్మంతుని అధిరోహించి) అని నమ్మాఴ్వార్లు ఈ గరుడుని ఎగరడంలోని క్రూరత్వాన్నిగూర్చి అనుగ్రహించారుకదా!

**(ఇవై యనైత్తుమ్ పుఱఙ్గాఴ్ కాప్ప)** - **"రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ, బభూవ దుర్ధర్షతరా సేంద్రై రపి సురాసురైః"** (రామా. యుద్ధ-25-33) (రామలక్ష్మణుల చేత, సుగ్రీవునిచేత కాపాడబడ్డ ఆ వానరసేన, ఇంద్రునితో కూడిన దేవాసురులచేతకూడ ఎదిరించడానికి సాధ్యం కానిది అయింది) అని శ్రీరాముడు సముద్రతీరం బయట ఉండే వానరసేనను రక్ష్యవర్గంగా కల్గినవాడై తాను, లక్ష్మణుడు రక్షించినట్లే, ఆ శ్రీరాముడు ఆరాధించిన శ్రీరంగనాథుడు పరుండి ఉన్నందువల్ల, గరుడుడు, పంచాయుధాలు- అన్నీ ఆ శ్రీరంగనాథుని చుట్టూ ఉండి రక్షిస్తున్నారు- అని భావం.

**(శేలార్న్ద నెడుఙ్గఴని శోలై శూఴ్న్ద తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ మాలోనై)** - శఫరాలు నిండిన విశాలమైన సస్యక్షేత్రాలచే పరివేష్టితం అయిన శ్రీరంగక్షేత్రంలోని దివ్యాలయంలో ఆదిశేషునిపైన పరుండి ఉండేవాడై, అందఱికంటే గొప్పవాడై ఉండేవానిని- అని భావం. **"మాల్"**- పెద్దవాడు, గొప్పవాడు.

**(కణ్డు ఇన్బక్కలవి యెయ్ది)**- శ్రీరంగనాథుని దర్శించి, సాటి లేని మహానందాన్ని పొందేటట్లుగా శ్రీరంగనాథునితో కూడి,

**(వల్ వినైయేన్ ఎన్ఱుకొలో వాఴుమ్ నాళే)**- లీలావిభూతి అనే ఈ సంసారమండలాన్ని వదలి, దీనికంటే చాలా విలక్షణం అయిన నిత్యవిభూతి అనే ఇంకొక దేశానికి పోయి, దర్శించవలసిన పరతత్త్వం ఇక్కడే దగ్గరలో ఉన్నా, అనుభవించలేని రీతిలో మహాపాపాన్ని చేసిన నేను ఈ అనుభవాన్ని పొంది ఉజ్జీవించగల్గడం ఎపుడో ! వీరు

(కులశేఖరులు) రాజ్యపాలన చేస్తూ ఉన్నందుననే శ్రీరంగానికి వెళ్ళలేని రీతిలో వీరిని మంత్రులు అడ్డుకొన్నారు. ఆ విధంగా ఉండగా **"వల్ వినైయేన్"** అని ఆ రాజ్యాధికారాన్ని పాపంగా చెప్పవచ్చునా ? అని అంటే, భగవానుని అనుభవించడానికి అడ్డుగా ఉండేది అంతా పాపం అని చెప్పతగినదే కదా !

**తూరాత మనక్కాతల్ తొణ్డర్‌తఙ్గళ్**
**కుழ్హామ్ కుழుమి త్తిరుప్పుకழ్‌కళ్ పలవుమ్ పాడి,**
**ఆరాత మనక్కళిప్పోడు అழுతకణ్ణీర్**
**మழை శోర నినైన్దురుకి యేత్తి, నాళుమ్**
**శీరార్న్ద ముழవోశై పరవై కాట్టుమ్**
**తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**పోరాழியమ్మానై క్కణ్డు తుళ్ళి**
**ప్పూతలత్తిల్ ఎన్ఱుకొలో పురళు నాళే** **9**

తూరాత కాతల్ మనమ్ = (భగవదనుభవంలో) ఏ లోటు లేని అభినివేశాన్ని కల మనస్సును కల్గినవారైన, తొణ్డర్‌తఙ్గళ్ కుழ்హామ్ = శ్రీవైష్ణవుల గోష్ఠిలో, కుழுమి = కలిసి, తిరు ప్పుకழ్‌కళ్ పలవుమ్ పాడి = (భగవానుని) కల్యాణగుణాలకు వాచకాలైన తిరునామాలను పాడి, ఆరాద మనక్కళిప్పోడు = (దానివల్ల) తనివి తీరని మనస్సులో ఉండే సంతోషంచేత, అழுద కణ్ నీర్ = ఏడ్చిన కళ్ళలో ఉండే ఆనందబాష్పాలు, మழை శోర = వర్షంవలె కురియగా, నినైన్దు ఉరుకి ఏత్తి = (భగవానుని స్మరించి, అందువల్ల, మనస్సు ద్రవించి స్తుతించి, నాళుమ్ = ప్రతిదినం, శీర్ ఆర్న్ద ముழవు ఓశై = ఐశ్వర్య సూచకం అయిన వాద్యాల ఘోష, పరవై కాట్టుమ్ = సముద్రఘోషాన్ని తలపించే, తిరు అరఙ్గత్తు అరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ = శ్రీరంగక్షేత్రంలోని ఆలయంలో ఆదిశేషునిపై పరుండి ఉండే, పోర్ ఆழி అమ్మానై = యుద్ధోన్ముఖం అయిన శ్రీసుదర్శనుని శ్రీహస్తంలో ధరించిన సర్వేశ్వరుని, కణ్డు = సేవించి, తుళ్ళి = ఆనందంతో తల ఏదో కాలు ఏదో తెలియనట్లు నర్తించి, పూతలత్తిల్ పురళుమ్ నాళ్ = భూతలంపై పొరలే దినం, ఎన్ఱుకొలో = ఎపుడో కదా !

**వ్యా. - ఒన్ఱుతామ్భాట్టు. (తూరాత మనక్కాతల్ తొణ్డర్‌తఙ్గళ్ కుழ்హాఙ్గుழுమి) "తూరా క్కுழிతూర్‌త్తు ఎనైనాళకన్ఱిరుప్పన్" ఎన్ఱు - సంసారికళ్ శబ్దాదివిషయఙ్గళై ప్పలనాళ్ అనుభవిత్తాలుమ్ ఇన్ద్రియఙ్గళ్ ఆరాతిక్కుమాపోలే, భగవదనుభవమ్ ఒరుకాలుమ్ ఆరాతిరుక్కుమ్ శ్రీవైష్ణవర్‌కళ్ కుழ்హాత్తిలే ఎన్నైయుమ్ కూడ క్కలశి. (తిరుప్పుకழ్‌కళ్ పలవుమ్ పాడి) అవనుడైయ కల్యాణగుణఙ్గళుక్కు వాచకమాన తిరునామఙ్గళ్ పలవఱ్ఱై**

యుమ్ పాడి. (ఆరాత మనక్కళిప్పోడ*ழு*త కణ్ణీర్మ*ழை* శోర) తిరునామఙ్గళై చ్చొన్నపడియాలే మనస్సుక్కు ఆరామైయాలే హృష్టనాయ్, అత్తాలే ఆనన్దాశ్రు ప్రవహిక్క.

(నినైన్దురుకి యేత్తి) ఇవర్కళ్ తిరళిలే కూడి త్తిరునామత్తై చ్చొన్నపడియాలే తిరునామ ద్వారా విషయత్తై నినైత్తు, అత్తాలే యురుకి. "ఉరుకి వ*ழி*న్దు పుఱప్పట్ట శొల్" ఎన్నుమ్బడి స్తోత్రాదికళై ప్పణ్ణి. (నాళుమ్ శీరార్న్ద విత్యాది) ఐశ్వర్యప్రకాశకమాన వాద్యఘోషఙ్గళ్ సముద్రఘోషత్తై క్కాట్టానిత్కుఱ కోయిలిలే తిరువనన్దా*ழ்*వానేమలే నిత్యవాసమ్బణ్ణుకిఱ, యుద్ధోన్ముఖమాన తిరువా*ழி*యై క్కైయిలేయుడైయ సర్వేశ్వరనై. (తుళ్ళి) ససమ్బ్రమనృత్త మ్బణ్ణి. (పూతలత్తిలెన్నుకొలో పురళునాళే) సింహాసనత్తిలే ఇఱుమాన్దిరుక్కుమిరుప్పొ*ழி*య హృష్టనాయ్ భూమియిలే పురళువతు ఎన్నుకొలో?

**భావదీపిక :- అవ :-** శ్రీరంగంలో భగవానుని దర్శించి, ఆనందంతో నర్తించి, భూమిపై దొరలాలని ఇందులో ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (తూరాత మనక్కాదల్ తొణ్డర్తఙ్గళ్ కు*ழா*మ్ కు*ழு*మి) - "తూరాక్కు*ழி* తూర్త్తు ఎనైనాళ్ అకన్దిరుప్పన్"** (తిరువాయ్-5-8-6) అని సంసారంలో పరిభ్రమించేవాడు శబ్దస్పర్శరూపరస గంధాలనే ఇంద్రియసుఖాలను పలు దినాలు అనుభవించినా త్వక్కు, వాక్కు, కన్ను, ముక్కు, చెవి- అనే అయిదు ఇంద్రియాలు తృప్తిని పొందనట్లుగా, భగవానుని ఎంతగా అనుభవించినా ఎపుడూ తృప్తిని చెందని శ్రీవైష్ణవుల సంఘంలో నన్ను కూడా చేర్చుకొని.

**(తిరుప్పుక*ழ்*కళ్ పలవుమ్ పాడి)** - భగవానుని కల్యాణగుణాలను తెలిపే తిరునామాలను పెక్కింటినిపాడి. **(ఆరాత మనక్కళిప్పోడు అ*ழு*త కణ్ణీర్ మ*ழை* శోర)** భగవానుని తిరునామాలను అనుసంధించినందువల్ల తృప్తి పొందని మనస్సులో ఆర్తిని పొంది, అందువల్ల ఆనందబాష్పాలు ప్రవహించగా,

**(నినైన్దురుకి ఏత్తి)** - శ్రీవైష్ణవుల సంఘంలోకూడి, తిరునామసంకీర్తనాన్ని చేసినందువల్ల, తిరునామం మూలంగా దానిచేత నిర్దేశింపబడే భగవానుని స్మరించి, దానివల్ల ద్రవించి, దానిని చూచినవారు. **"ఉరుకి వ*ழி*న్దు పుఱప్పట్ట శొల్"** (మనస్సు ద్రవించి బయటకు వ్యక్తమైన మాట) అని పలికేటట్లుగా స్తుతులను చేసి,

**(నాళుమ్ శీరార్న్ద ము*ழு*వోశై పరవై కాట్టుమ్ తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ పోరా*ழி* అమ్మానై క్కణ్డు)** - ఎల్లప్పుడు "ఉభయవిభూతులనే ఐశ్వర్యాన్ని కలవాడితడు" అని వ్యక్తంచేసే వాద్యాల ధ్వని సముద్రఘోషను స్మరింప జేసే శ్రీరంగంలోని దివ్యాలయంలో ఆదిశేషునిపైన నిత్యవాసం చేసేవాడై, యుద్ధసన్నద్ధంగా ఉండే శ్రీసుదర్శనుని శ్రీహస్తంలో కల సర్వేశ్వరుని సేవించగల్గి. **(తుళ్ళి) "కుమ్బిడు నట్టమిట్టాడి"**

(తిరువాయ్ 3-5-4) (నమస్కరించి నాట్యంచేసి ఆడి) అనే రీతిలో తల ఏదో, కాలు ఏదో తెలియునట్లు తుళ్ళి, నర్తించి,

**(పూతలత్తిల్ ఎన్నుకొలో పురళుమ్ నాళే)** - ప్రభువై, సింహాసనంలో దర్పంతో వేంచేసి ఉండే స్థితి పోయి, మహానందంతో భూమిపై దొరలేది ఎపుడో కదా !

**వన్ పెరు వానక ముయ్య అమరర్ ఉయ్య**
**మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశర్ ఉయ్య,**
**త్తున్బమికు తుయరకల అయర్వొన్టిల్లా**
**చ్చుకమ్ వళర అకమకి*ழ*ుమ్ తొణ్డర్ వా*ழ*,**
**అన్బొడు తెన్‌తిశై నోక్కి ప్పళ్ళికొళ్ళుమ్**
**అణియరఙ్గన్ తిరుము*ఱ్ఱ*త్తడియార్ తఙ్గళ్,**
**ఇన్బ మికు పెరుఙ్గు*ழ*ువు కణ్డు యానుమ్**
**ఇశైన్దుడనే ఎన్నుకొలో ఇరుక్కు నాళే** **10**

వల్ = (నైమిత్తిక ప్రళయంలోకూడా) నశించని, పెరు వానకమ్ = గొప్పతనాన్ని కల సత్యలోకం మొదలైన లోకాలన్నీ ఉజ్జీవించేటట్లు, అమరర్ ఉయ్య = (బ్రహ్మాది) దేవతలు తరించేటట్లు, మణ్ ఉయ్య = భూమి ఉజ్జీవించేటట్లు, మణ్ణులకిల్ మనిశర్ ఉయ్య = భూమిలో జన్మించిన చేతనులు ఉజ్జీవించేటట్లు, మికు తున్బమ్ తుయర్ అకల = మిక్కిలి దుఃఖాన్ని కల్గించే పాపాలు తీరేటట్లు, అయర్వు ఒన్టు ఇల్లా శుకమ్ వళర = దుఃఖం ఏమాత్రం కలవని సుఖం వృద్ధి చెందేటట్లు, అకమ్ మకి*ழ*ుమ్ = మనస్సులో (భగవదనుభవంవల్ల కల్గిన) ఆనందాన్ని కల, తొణ్డర్ వా*ழ* = శ్రీవైష్ణవులు ఉజ్జీవించేటట్లు, అన్బొడు = (శ్రీవిభీషణా*ழ్*వాన్ విషయంలో ఉండే) ప్రేమతో, తెన్ తిశై నోక్కి = దక్షిణదిక్కును చూచి (చూస్తూ), పళ్ళికొళ్ళుమ్ = పరుండిఉండే, అణి అరఙ్గన్ తిరుము*ఱ్ఱ*త్తు = శ్రీరంగనాథుని లోపల "తిరుము*ఱ్ఱ*మ్" (వాకిలి) అనేచోట, మికు ఇన్బమ్ = ఆనందం నిండిన, అడియార్‌తఙ్గళ్ = శ్రీవైష్ణవుల, పెరుమ్ కు*ழ*ువు కణ్డు = పెద్ద గోష్ఠిని చూచి, యానుమ్ ఇశైన్దు = నేనుకూడా వారిలో ఒకడినై కలసి, ఉడనే ఇరుక్కుమ్ నాళ్ = వారితో కలసి సేవిస్తూ ఉండడం, ఎన్నుకొలో = ఏనాడో !

**వ్యా. - పత్తామ్పాట్టు. (వన్బెరు వానక ముయ్య అమరరుయ్య) నైమిత్తికప్రళయా పత్తుక్కు ఇళైయాత బ్రహ్మలోకమ్ ముతలాక మేలుణ్డాన లోకఙ్గళుయ్య. అఙ్గుణ్డాన బ్రహ్మాదికళుజ్జీవిక్క వాయ్‌త్తు బ్రహ్మలోకత్తిల్ కోయిలా*ழ్*వార్ ఎ*ழ*ున్దరుళి యిరున్దపడి. (మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశరుయ్య) శ్రీవిభీషణా*ழ్*వానుక్కాక అఙ్గు నిన్టుమ్ ఇఙ్గేఱ**

**ఎ*ழ*ున్దరుళుక్కైయాలే భూమియుమ్, భూమియిలుణ్డాన చేతనరు ముజ్జీవిక్క. (తున్బ మికు తుయరకల) నిత్యదుఃఖత్తై విళైప్పిప్పతాన పాపజ్గళ్ అకల. (అయర్వొన్టిల్లా చ్చుకమ్ వళర) దుఃఖమ్ మి(శియామైయాలే నిత్యమాన సుఖమ్ వళర. (అక మకి*ழ*ుమ్ తొణ్డర్ వా*ழ*) భగవదనుభవత్తాలే నిరతిశయానన్దయుక్తరాన శ్రీవైష్ణవర్కళ్ వా*ழ*. (అన్బొడు తెన్ తిశై నోక్కి ప్పళ్ళికొళ్ళుమ్ అణి యరజ్గన్ తిరుము*ற்ற*త్తు) శ్రీవిభీషణా*ழ*్వానుక్కు రాజ్యత్తై క్కొడుత్తు అద్దిక్కై ప్పార్త్తు కృణ్వళర్న్దరుళుకిఱ పెరియపెరుమాళుడైయ ఉళ్ళిల్ తిరుము*ற்ற*త్తిలే. (అణి యరజ్గన్) అ*ழ*ికియ అరజ్గత్తై త్తనక్కు వాసస్థానమాక వుడైయవన్. (తిరుము*ற்ற*త్తడియార్తజ్గళ్ ఇన్బ మికు పెరుమ్ కు*ழ*ువు కణ్డు) నిరతిశయాన్దయుక్తరాయిరుక్కిఱ శ్రీవైష్ణవర్కళ్ తిరళై క్కణ్డు. (యాను మిశైన్దు) “అభిషిక్తక్షత్రియన్” ఎన్ఱు ఎన్నై నినైయాతే, అవర్కళిలే ఒరువనాక ఇశైన్దు. (ఉడనే యెన్ఱుకొలో ఇరుక్కుమ్నాళే) ఎన్ఱై చ్చిలర్ సేవిక్క, నాన్ నియామకనాయిరుక్కు మిరుప్పొ*ழ*ియ శ్రీవైష్ణవర్కళ్ తిరళిలే సేవిత్తిరుప్పతు ఎన్ఱో.**

*అరు :- పత్తామ్బాట్టు (వన్బెరు ఇత్యాది) అయర్వు - అజ్ఞానమాయ్, అవిద్యా అస్మితై ముతలాన పఞ్చక్లేశమిన్టిక్కే యిరుక్కై.*

**భావదీపిక :- అవ :-** ఈ పాశురంలో శ్రీరంగాలయం వాకిటిలో ఉండే భక్తుల సంఘంలో కలసి ఉండాలని ఆ*ழ*్వార్లు ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (వన్ పెరు వానకమ్ ఉయ్య అమరర్ ఉయ్య)** - నైమిత్తికప్రళయం ఏర్పడిన సమయంలోకూడా నశించని బలిమిని కల్గిన గొప్పతనాన్ని కల బ్రహ్మలోకం మొదలైన ఊర్ధ్వలోకాలు అన్నీ ఉజ్జీవించేటట్లు. ఆ లోకాలలో ఉండే బ్రహ్మ మొదలైన దేవతలందఱు తరించేటట్లు బ్రహ్మచేత ఆరాధింపబడినవాడై, ప్రణవాకారవిమానంలో శ్రీరంగనాథుడు వేంచేసి ఉన్నాడని శ్రీరంగమాహాత్మ్యం మొదలైనవానిలో ప్రసిద్ధం.

**(మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశర్ ఉయ్య)** - అక్కడనుండి ఇక్ష్వాకుకులప్రభువుల దగ్గరకు వచ్చి చేరి, పెరుమాళ్ అని పిలువబడే శ్రీరామునివరకు ఆ కులప్రభువులందఱిచేత ఆరాధింపబడి, ఆ శ్రీరామునిచే శ్రీవిభీషణా*ழ*్వాన్‌కు అనుగ్రహింపబడి, **“మన్నుడైయ విబీడణఱ్కా మదిళిలజ్గై త్తిశై నోక్కి మలర్ కణ్ వైత్త ఎన్నుడైయ తిరువరజ్గర్”** (పెరియతిరు- 4-9-2) (ప్రభువైన వీభీషణుని కోసం కోటలను కల లంకకు అభిముఖంగా తామరల వంటి నేత్రాలతో కటాక్షించే నా శ్రీరంగనాథుడు) అనే రీతిలో శ్రీవిభీషణా*ழ*్వాన్‌ను కటాక్షిస్తూ అయోధ్యనుండి శ్రీరంగానికి వచ్చి, అక్కడ పరుండి ఉండడంద్వారా ఈ భూమి భూమిలో ఉండే జీవులు ఉజ్జీవించేటట్లు చేసి.

**(తున్బ మికు తుయర్ అకల)** - ఆ జీవులు నిరంతరం అనుభవించే దుఃఖాలకు కారణం అయిన పాపాలు తీరేటట్లు- అని భావం.

**(అయర్వు ఒన్డిల్లా చ్చుకమ్ వళర)–"అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్"** (తిరుమాలై-2) (ఆ భోగాలను పొందినా అవి నాకు వద్దు) అనే రీతిలో దుఃఖమిశ్రితం కాకుండా ఎల్లప్పుడు ఆనందంగానే ఉండే ఉజ్జీవనం ఈ జీవులకు కలిగేటట్లుగా.

**(అక మకిழ்ழుమ్ తొణ్డర్ వాழ)** – భగవానుని అనుభవించడంవల్ల సాటి లేని మహానందాన్ని పొందే శ్రీవైష్ణవులు ఉజ్జీవించేటట్లు. **(అన్పొడు తెన్ తిశై నోక్కి ప్పళ్ళి కొళ్ళుమ్ అణియరజ్గన్ తిరుముற்றత్తు)** – శ్రీవిభీషణాழ்வాన్‌కు లంకారాజ్యాన్ని అనుగ్రహించి, అతడుండే దక్షిణ దిక్కును చూస్తూపరుండి ఉండే శ్రీరంగనాథుని కోవెల లోపల ఉన్న **"తిరుముற்றమ్"** అనే చోట.

(అణి యరజ్గన్)– అందమైన శ్రీరంగాన్ని తనకు వాసస్థానంగా గల శ్రీరంగనాథుడు.

**(అడియార్తజ్గళ్ ఇన్బ మికు పెరుమ్ కుழுవు కణ్డు యానుమ్ ఇశైన్దు)** – "పట్టాభిషేకాన్ని చేసికొన్న ప్రభువు" అని నన్ను భావించకుండా, వారిలో ఒకనినిగా అంగీకరించి, **(ఉడనే ఎన్డుకొలో ఇరుక్కుమ్ నాళే)** నన్ను కులంలోని వారు సేవించేటట్లు, వారిని నేను పాలించేటట్లుగా, ఉండే స్థితి పోయి, శ్రీవైష్ణవమహాసంఘాన్ని, పెరియ పెరుమాళ్‌ను సేవించడం ఎపుడో కదా!

ఈ పాశురంలో చెప్పబడ్డ– లోకం అంతా ఉజ్జీవించేటట్లు శ్రీరంగనాథుడు శ్రీరంగంలో పరుండి ఉన్నాడు అనే విషయం శ్రీరంగమాహాత్మ్యంలోని శ్రీక్రింది శ్లోకంలో చెప్పబడడం ప్రకృతంలో అనుసంధేయం. **"భువో భూత్యై భూభుజాం భూసురాణాం దివో గుప్త్యై శ్రేయసే దేవతానామ్, శ్రియై రాజ్ఞాం చోళవంశోద్భవానాం శ్రీమద్రంగం సహ్యజా మాజగామ"** (భూమి, భూమిని పాలించే శ్రీరంగనాథుడు, బ్రాహ్మణులు ఉజ్జీవించడం కోసం, భూలోకాన్ని రక్షించడంకోసం, దేవతల శ్రేయస్సుకోసం, చోళవంశంలో పుట్టిన రాజులకు తరగని సంపదను అనుగ్రహించడంకోసం శ్రీరంగవిమానం కావేరీనదీతీరాన్ని చేరింది).

**తిడల్ విళజ్గు కరైప్పొన్ని నడువుపాట్టు**
**త్తిరువరజ్గత్తరవణైయిల్ ప్పళ్ళికొళ్ళుమ్,**
**కడల్ విళజ్గు కరుమేని యమ్మాన్దన్నై**
**కణ్ణార క్కణ్డుకక్కుమ్ కాతల్ తన్నాల్,**
**కుడై విళజ్గు విఱల్తానై క్కొற்றవొళ్వాళ్**
**కూడలర్కోన్ కొడై క్కులశేకరన్ శొఱ్చెయ్‌త,**
**నడై విళజ్గు తమిழ்మాలై పత్తుమ్ వల్లార్**
**నలన్దికழ் నారణనడిక్కీழ் నణ్ణువారే** 11

తిడర్ విళఙ్గు కరై = దీవులు ప్రకాశించేటట్లుగా ఉండే తీరాన్ని కల, పొన్ని నడువు పాట్టు = కావేరీనది నడుమ, తిరు అరఙ్గత్తు అరవు అణైయిల్ పళ్ళికొళ్ళుమ్ = శ్రీరంగంలోని దివ్యాలయంలో ఆదిశేషుడనే పడుకపై, పరుండి ఉండే, కడల్ విళఙ్గు కరుమేని అమ్మాన్‌తన్నై = సముద్రంవలె శ్రమహరం అయిన రూపాన్ని కల సర్వేశ్వరుని, కణ్ ఆర కణ్డు ఉకక్కుమ్ కాదల్ తన్నాల్ = కళ్ళార దర్శించి, ఆనందించాలనే ఆశతో, కుడై విళఙ్గు = తెల్లని ఛత్రాలతో ప్రకాశించేవారై, విఱల్ తానై = విజయాన్ని కల సేనను, కొ*ற్ఱ*మ్ ఒళ్ వాళ్ = విజయంతో ప్రకాశాన్ని పొందికగా కల ఖడ్గాన్ని కలవారై, కూడలర్ కోన్ = మధురకు అధిపతియై, కొడై కులశేకరన్ = కొఱత లేని ఔదార్యాన్ని కలవారైన కులశేఖరప్పెరుమాళ్, శొల్ శెయ్ద = అనుగ్రహించిన (పల్కిన), నడై విళఙ్గు= (చక్కని) శైలితో ప్రకాశించే, తమి*ழ్* మాలై పత్తుమ్ వల్లార్ = (అందమైన) ద్రావిడంలో కూర్చిన ఈ పది పాశురాలను అభ్యసించగల్గినవారు, నలమ్ తిక*ழ్* నారణన్ = సమస్తకల్యాణగుణాలు నిండిన శ్రీరంగనాథునియొక్క, అడి కీ*ழ్* నణ్ణువారే = శ్రీచరణాల కింద చేరగలరు.

**వ్యా :- పదినోరామ్ పాట్టు. (తిడర్ విళఙ్గు కరైప్పొన్ని నడువుపాట్టు) విళఙ్గానిన్ఱ తిరుక్కుఱైయై యుడైత్తాయ్, క్కరైయైయుముడైత్తాన కావేరి శూ*ழ్*న్ద. (తిరువరఙ్గత్తర వణైయిల్ పళ్ళికొళ్ళుమ్ కడల్ విళఙ్గు కరుమేనియమ్మాన్దన్నై) కోయిలిలే తిరువన్దా*ழ்*్వాన్మేలే కణ్వళర్న్దరుళుకిఱ కడల్‌పోలే శ్రమహరమాన తిరుమేనినిఱైయుడైయ సర్వేశ్వరనై. (కణ్ణార క్కణ్డు ఉకక్కుమ్ కాతల్ తన్నాల్) కణ్ణాలే కణ్డనుభవిక్కవేణు మెన్నుమ్ ఆశైప్పాట్టోడే.**

**(కుడై విళఙ్గు విఱల్‌తానై క్కొ*ற్ఱ* వొళ్ వాళ్ కూడలర్‌కోన్) విళఙ్గుకిఱ వెణ్‌కొ*ற్ఱ* క్కుడైయైయుమ్, వె*ற్ఱ*ియైయుడైయ సేనైయైయుమ్, ఐశ్వర్యప్రకాశకమాన వాళైయు ముడైయరాయ్, మధురైక్కు నిర్వాహకరుమాన. (కొడై క్కులశేకరన్ శొఱ్చెయ్‌త) కొడై మాఱాతే కొడుక్కుమ్ పెరుమాళ్ అరుళిచ్చెయ్‌త. (నడై విళఙ్గు తమి*ழ్*మాలై పత్తుమ్ వల్లార్) ఉళ్ళిల్ అర్థత్తిల్ ఇ*ழ్*ియవేణ్డాతే, పదఙ్గళ్ శేర్న్ద శేర్‌త్తికళ్ పార్క్కవుమ్ వేణ్డాతే, ఇతుతానే ఆకర్షకమాయిరుక్కిఱ తమి*ழ్*త్తొడై పత్తుమ్ వల్లార్. (నలన్దిక*ழ్* నారణ నడికీ*ழ్* నణ్ణువారే) శీలాదిగుణపూర్ణరాయ్, సర్వస్వామికళాయ్, వత్సలరాయిరుక్కుమ్ పెరియ పెరుమాళ్ తిరువడికళిన్ కీ*ழ్* అనుభవిక్క ఆశైప్పట్టాప్పోలే కిట్టప్పెఱువర్‌కళ్.**

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.

పెరుమాళ్ తిరుమొ*ழ்*ి - ముతల్ తిరుమొ*ழ்*ి వ్యాఖ్యానమ్ ము*ற்ఱ*ి*ற்ఱ*ు.

*అరు :- పతినోరామ్బాట్టు, (తిడరిత్యాది) (కుఱై) తిరుముడిక్కుఱై. "తానై" సేవై. "కొ*ற்ఱ*మ్" వె*ற்ఱ*ి.*



**భావదీపిక :- అవ :-** ఈ పాశురంలో ఆழ்వార్లు ఈ దశకాన్ని అభ్యసించేవారికి కలిగే ఫలాన్ని పల్కి దశకాన్ని పూర్తిచేస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (తిదర్ విళఙ్గు కరై పొన్ని నడువు పాట్టు)** - దీవులతో ప్రకాశించే తీరాన్ని కల కావేరినది మధ్యలో ప్రకాశించే. **(తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ కడల్ విళఙ్గు కరుమేని అమ్మాన్‌తన్నై)** శ్రీరంగం పెరియకోవిల్‌లో ఆదిశేషునిపైన పరుండి ఉండేవాడై, సముద్రంవలె దర్శించేవారి శ్రమను, ఆర్తిని తీర్చే నీలమైన తిరుమేనిని కలవాడైన సర్వేశ్వరుని. **(కణ్ణార క్కణ్డు ఉకక్కుమ్ కాదల్‌తన్నాల్)** - కంటితో దర్శించి ఆనందించాలనే ఆశతో.

**(కుడై విళఙ్గు విఱల్ తానై క్కొఱ్ఱ వొళ్ వాళ్ కూడలర్ కోన్)**- ప్రభువులకే చెందిన, వెలుగుతున్న శ్వేతచ్ఛత్రాన్ని, విజయశీలాలైన ఆయుధాలను, సంపదను సూచించే ఖడ్గాన్ని కలవాడై, దక్షిణమధురకు రాజధానిగా కల పాండ్యదేశానికి అధిపతి అయిన.

**(కొడై క్కులశేకరన్ శొల్చెయ్‌త)** - నిత్యం ఎంతో ఉదారంగా దానం చేసే ఉదారుడైన కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన,

**(నడై విళఙ్గు తమిழ்మాలై పత్తుమ్ వల్లార్)** - శబ్దాలలో అంతర్భూతంగా ఉండే అర్థాలనుకూడా విచారించనక్కరలేనట్లు (శబ్ద మాధుర్యమే చాలు ఆనందాన్ని కల్గించడానికి, అర్థపరిశీలనవరకు పోనక్కరలేదని భావం) పదాల చేరికయొక్క అందం కూడా చూడనక్కరలేనట్లుగా పాశురాలే మనస్సుకు ఆకర్షకంగా ఉండే మాలికవంటి పది పాశురాలను కల ఈ దశకాన్ని పఠించేవారు.

**(నలన్తికழ் నారణ నడిక్కీழ் నణ్ణువారే)** - సౌలభ్యం, సౌశీల్యం మొదలైన గుణాలను, సర్వస్వామిత్వం మొదలైన పరత్వగుణాలను కలవాడై, భక్తవాత్సల్యాన్నే నిరూపకంగా కలవాడైన శ్రీరంగనాథుని శ్రీచరణాలలో కైంకర్యాన్ని చేసి, తాము ఆశపడినట్లు దరి చేరి అనుభవించి ఆనందించగలరు. **(నారణన్)** - నరసమూహం అయిన భక్తులపట్ల వాత్సల్యాన్ని కలవాడు.

**మొదటి దశకం - భావదీపిక సంపూర్ణం**

## ఇరణ్డామ్ తిరుమొழிతేట్టరుమ్ - ప్రవేశమ్

**అవ :- భగవద్విషయత్తిలే కైవైత్తార్‌క్కు సమ్భవిప్పన శిల స్వభావఙ్గళుణ్డు- అనుకూల్యసఙ్కల్పాదికళ్. "ఆనుకూల్యస్య సఙ్కల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్". ఆను కూల్యమా వతు - భగవద్విషయత్తిలుమ్, భాగవతవిషయత్తిలుమ్ పణ్ణుమ్ ఆనుకూల్యమ్.**

భగవద్విషయమ్ పూర్ణవిషయమాకైయాలే ఇవనుక్కు ఆనుకూల్యమ్ పణ్ణుకైక్కు త్తుఱై యిల్లైయితే. ఇప్పడి త్తుఱై యిల్లై ఎన్ఱు ఇవన్ కైవాఙ్గామైక్కితే ఇవనుకన్ద ద్రవ్యమే తనక్కు త్తిరుమేనియాకవుమ్, ఇవన్ తిరుమఞ్జనమ్పణ్ణిన పోతు తిరుమఞ్జనమ్ పణ్ణియుమ్, అముతు శెయ్యప్పణ్ణినపోతు అముతుశెయ్‌తుమ్, అల్లాతపోతు పట్టినియుమామ్పడి యితే అవర్‌కళుక్కు త్తన్నై అమైత్తువైప్పతు. ఇప్పడి యాయ్‌త్తిల్లైయాకిల్ పరిపూర్ణ విషయత్తిల్ ఇవనుక్కు కిఞ్చిత్కరిక్కైక్కు త్తుఱై యిల్లైయితే. "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" ఎన్ఱుమ్, "మమ ప్రాణా హి పాణ్డవాః" ఎన్ఱుమ్, "పత్తరావి" ఎన్ఱు మిరుక్కుమవనాకైయాలే తదీయవిషయత్తిలే పణ్ణుమ్ ఆనుకూల్యముమ్ భగవద్విషయత్తిలే పణ్ణి*ఱ్ఱా*మితే. ఆకైయాలే ఇవరుమ్ తమక్కు ఇవై యిరణ్డుమ్ పిఱన్దతు ఎన్గిఱార్. భగవద్విషయత్తిల్ పిఱన్ద ఆనుకూల్యమ్ పిఱన్దమై శొన్నార్ - కీ*ழி*ల్ తిరుమొ*ழி*యిల్. తదీయవిషయత్తిల్ ఆనుకూల్యమ్ పిఱన్దపడి శొల్లుకిఱార్ - ఇత్తిరుమొ*ழி*యిల్.

ఇరణ్డామ్ తిరుమొ*ழி* ప్రవేశమ్ ము*ఱ్ఱి*ఱ్*ఱు*.

*అరు :- తేట్టరుమ్ ప్రవేశే..... (తుఱై యిల్లై) ఇఱఙ్గ వழி యిల్లై.*

## పెరుమాళ్ తిరుమొ*ழி* - ఇరణ్డామ్ తిరుమొ*ழி*

### అవతారిక - భావదీపిక

భగవానుని విషయంలో అభినివేశాన్ని పొంది, అతనిని పొందాలని ఆశపడే వారికి క్రమక్రమంగా వారికి కలుగ వలసిన కొన్ని దశలున్నాయి. వాటిని– **"షోఢా హి వేద విదుషో వదంత్యేనం మహామునే! ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః"** (అహిర్బుధ్న్య–సంహిత–37–27,28) (ఓ మహర్షీ ! వేదవిదులు ఈ శరణాగతి ఆఱు విధాలైన అంగాలు కల్గినదని అంటారు. అవి ఏవి అంటే– భగవద్భాగవత విషయంలో ఆనుకూల్యం ఉన్నట్లుగా సంకల్పించడం, వారికి ప్రతికూలంగా ఉండే వానిని విడువడం, "స్వామి సొత్తును కాపాడతాడు" అనే నమ్మకం, "నీవు నన్ను రక్షించాలి" అని భగవానుని ప్రార్థించడం, తన ఆత్మను భగవానుని సన్నిధిలో సమర్పించడం, తనవద్ద తనను రక్షించుకోవడం కోసం ఏ ప్రయత్నం లేకుండా ఉండడం– అనే ఆఱు విధాలైన స్వభావాలలో కూడినది శరణాగతి) – అని పాంచరాత్రశాస్త్రానికి చెందిన అహిర్బుధ్న్య సంహితలో తెలుపబడింది. ఆనుకూల్యసంకల్పం అంటే– భగవానుని విషయంలో, భగవద్భక్తుల విషయంలో అనుకూలంగా ఉండాలని నిశ్చయించుకోవడం. భగవానుడు అన్ని కల్యాణగుణాలు నిండుగా కల్గినవాడు కనుక ప్రపన్నునకు అతని విషయంలో, అతని భక్తుల విషయంలో అనుకూలంగా ఉండడం సహజంగానే ఏర్పడుతుంది కదా!

భగవానుని విషయంలో మనం అభినివేశం పొందడానికి అవకాశం లేదు అని ప్రపన్నుడు వెనుకంజ వేయకుండా ఉండడంకోసం ఒక లోహరూపాన్ని కాని, శిలారూపాన్ని కాని, సుధామూర్తిని కాని తనకు తిరుమేనిగా పరిగ్రహించి, ప్రపన్నుడు తిరుమంజనాన్ని చేసేటపుడు తాను స్నానం చేసి, ఇతడు ఆరగింపు చేసినపుడు తాను ఆరగించి, లేనపుడు తాను ఉపవాసం ఉండి, భగవానుడు తనను వారికి పరాధీనునిగా చేసికొంటాడుకదా! ఈ విధంగా భగవానుడు తనను చేసికొనకపోతే పూర్ణుడైన అతని (భగవానుని) విషయంలో ఇతడు (ప్రపన్నుడు) కైంకర్యంచేయడంలో అభినివేశం పొందే అవకాశం లేదుకదా! **"ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** (గీత-7-18) (ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని- అనే ఈ నాల్గు విధాలైన భక్తులు ఉదారులే. కాని, జ్ఞాని మాత్రం నాకు ఆత్మ- అని నా సిద్ధాంతం) అని, **"ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః"** (భార-ఉద్యో-74-27) (రాజా! ద్వేషించేవారు పెట్టే అన్నం భుజించరానిది. ద్వేషించేవానికి భోజనం పెట్టకూడదు. నీవు పాండవులను ద్వేషిస్తున్నావు. పాండవులు నాకు ప్రాణాలు సుమా!) అని, **"పత్తరావి"** (భక్తులను తనకు ప్రాణంగా కలవాడు) (పెరియతిరు-10-1-8) అని అన్నట్లు భగవానుడు తన భక్తులను తనకు ప్రాణంగా కల్గినవాడు కనుక, భక్తుల విషయంలో అనుకూలుడై ఉండడం భగవానుని విషయంలో అనుకూలుడై ఉండడమే అవుతుంది. అందువల్ల కులశేఖరులుకూడా తమకు భగవానుని విషయంలోను, దాసుల విషయంలోను అనుకూలురై ఉండే స్వభావం కల్గింది- అని అంటున్నారు. భగవానుని విషయంలో అనుకూలురై ఉండే స్వభావం ఉండడాన్ని గత దశకంలో తెలిపారు. అతని భక్తుల విషయంలో అనుకూలురై ఉండే స్వభావం కల్గడాన్ని ఈ దశకంలో తెలుపుతున్నారు.

**అవతారిక అనువాదం ముగిసింది.**



**తేట్టరుమ్ తిఱల్ తేనినై తెన్నరఙ్గనై, తిరుమాతు వాழ்**
**వాట్ట మిల్ వనమాలైమార్పనై వాழ்త్తి మాల్కొళ్ శిన్దైయరాయ్,**
**ఆట్టమేవి యల్న్దழైత్తు అయర్వెయ్తుమ్ మెయ్యడియార్కళ్తమ్,**
**ఈట్టమ్ కణ్డిడ క్కూడుమేల్ అతు కాణుమ్ కణ్పయనావతే** 1

తేట్టరుమ్ = (మానవప్రయత్నంతో) వెదకి పొందడానికి వీలు కానివాడు, తిఱల్= తనను అనుభవించడానికి ఆవశ్యకం అయిన బలాన్ని ఇచ్చేవాడు, తేనినై = తేనెవలె పరమభోగ్యుడు, తెన్ అరఙ్గనై = అందమైన శ్రీరంగంలో నిత్యవాసం చేసేవాడు, తిరు మాదు వాழ் = లక్ష్మీదేవి నిత్యవాసం చేసే, వాట్టమ్ ఇల్ వనమాలై మార్బనై = ఎల్లప్పుడు వికాసం, సువాసన మాఱని, అందాన్ని కల వనమాలను అలంకరించుకొన్న

వక్షఃస్థలాన్ని కలవాడైన భగవానుని, వాழ்త్తి = (స్వామి, స్వామిని కలిగి ఉండే చేరికకు ఏ కొఱత రాకుండా ఉండేటట్లు) మంగళాశాసనాన్ని చేసి, మాల్ కొళ్ శిన్దైయరాయ్ = అతనిపై ఉదారమైన భక్తిని కలవారై (అందువల్ల), ఆట్టమ్ మేవి = నర్తించడంలో అభినివేశాన్ని పొంది, అలన్దు = (ఆ నర్తనంయొక్క అతిశయంచేత) అలసి, అழைత్తు = (నోరున్నదానికి ప్రయోజనం పొందడానికై భగవన్నామాలను) పల్కి, అయర్వు ఎయ్దుమ్ = ఒళ్ళు మఱచి ఉండే, మెయ్ అడియార్కళ్తమ్ = అనన్యప్రయోజనులైన భక్తుల, ఈట్టమ్ కణ్డిడ కూడిడుమేల్ = సంఘాలను దర్శించగల్గితే, అతు కాణుమ్ కణ్ పయన్ ఆవతే = కన్నులున్నదానికి ప్రయోజనం అదే కదా!

**వ్యా. :– ముత్తఱ్పాట్టు. అవ:– (తేట్టరు మిత్యాది) ముడియ భాగవతవిషయమ్ ఉద్దేశ్యమాకిఱతు – భగవద్గుణఙ్గళిలే అవగాహిత్తారెన్నుమతితే. "ఇన్నాన్ అర్థముడైయన్, క్షేత్రముడైయన్" ఎన్ను అశ్రయిప్పారైప్పోలే, భగవత్ప్రత్యాసన్నరెన్గితే ఇవర్కళై ప్పఱ్ఱుకిఱతు. భగవద్విషయత్తిలే స్తోత్రమ్పణ్ణ ఇழிన్దవర్ ఆచార్యవిషయత్తై స్తోత్రమ్పణ్ణప్పుక్కు అవర్క్కు నిఱమాక చ్చొల్లిఱ్ఱు భగవద్విషయత్తిల్ జ్ఞానభక్తికళైయితే. "జ్ఞానవైరాగ్యరాశయే".**

**వ్యా. :– (తేట్టరుమ్) తామే వన్దు సులభరామిత్తినై యల్లతు స్వయత్నత్తాల్ కాణవొణ్ణాతెన్నై. (తిఱల్ తేనినై) "య ఆత్మదా బలదా" ఎన్నుమాపోలే తన్నైయుమ్ కొడుత్తు, తన్నై అనుభవిక్కైక్కీదాన బలత్తైయుమ్ కొడుక్కుమ్ తేన్. (తేనినై త్తెన్నరఙ్గనై యిత్యాది) స్పృహణీయమాన తిరువరఙ్గత్తిలే నిత్యవాసమ్పణ్ణుమవనాయ్, తిరుమేనియిన్ స్పర్శత్తాలే ఒరుకాలై క్కొరుకాల్ శెవ్విపెఱుమాయ్త్తు ఇట్ట తిరుమాలై. (వాழ்త్తి) "వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాழ்కిన్ఱ మఙ్గైయుమ్ పల్లాణ్డు" ఎన్గిఱపడియే అవళుమ్, ఇవనుమ్ శేర్న్ద శేర్త్తిక్కు మఙ్గళాశాసనమ్పణ్ణి. (మాల్ కొళ్ శిన్దైయరాయ్) పిత్తేఱిన మనస్సైయుడైయ రాయ్.**

**(ఆట్ట మేవి) ఆడవేణుమెన్నుమ్ కార్యబుద్ధ్యా వన్దియిలే, ప్రేమమ్ ఒట్టామైయాలే ఆట్టత్తిలే మేవి. (అలర్న్దழைత్తు) అలమాన్దు కార్యప్పాడఱ క్కూప్పిట్టు. (అయర్వెయ్తుమ్ మెయ్యడియార్కళ్తమ్) క్రమప్రాప్తి పొఱామైయాలే అఱివు కుడిపోయ్, పరవశరాన అనన్యప్రయోజనరుడైయ. (ఈట్టమ్) ఇప్పడి యిరుప్పార్ ఉమక్కు ఎత్తనై పేర్ వేణుమ్? ఎన్న, అడియార్కళ్ కుழாఙ్గళై క్కాణప్పెఱిల్. (కూడుమేల్ అతు కాణుమ్ కణ్పయనావతే) ఇతు కూడిఱ్ఱామాకిల్ ప్రయోజనమ్ కణ్ణుక్కు ఇతల్లతిల్లై. దృష్టప్రయోజన మితు.**

*అరు :– ముతఱ్పాట్టు .... (తేట్టరు మిత్యాది) భాగవతవిషయత్తిల్ తమక్కు ప్పిఱన్ద అనుకూలమ్ శొల్లుకిఱారాకిల్ భగవత్ప్రత్యాసత్తియై యిట్టు చ్చొల్లువానేన్? ఎన్న అరుళిచ్చెయ్ కిఱార్ (ముడియ భాగవతవిషయ మిత్యాది). భాగవతవిషయత్తై స్తోత్రమ్ పణ్ణప్పుక్కు*

*భగవత్ప్రత్యాసత్తియై అవర్కళుక్కు ఏర్ఱామాక చ్చొన్న పేరుణ్డో? ఎన్న అరుళిచ్చెయ్‌కిఱార్ (భగవద్విషయత్తిలిత్యాది).*

**భావదీపిక :- అవ :-** భగవానుని గుణాలలో చాలా అభినివేశాన్ని పొందినవారు- అనే కారణంవల్లనే అతని దాసులు మనకు చాలా ఉద్దేశ్యభూతులు అవుతారు. లోకంలోని వారు ఎవరిని అయినా ఆశ్రయిస్తే "ఇతడు ధనవంతుడు; ఇతడు ఆస్తిపాస్తులను కలవాడు" అని కదా వారిని ఆశ్రయిస్తారు. అదే రీతిలో "భగవద్విషయంలో అభినివేశాన్ని కలవారు" అనే కారణంవల్లనే భగవద్భక్తులు వారిని ఆశ్రయిస్తారు. భగవానుని స్తుతించడానికి ప్రారంభించిన ఆళవందార్ తమకు ఆచార్యులైన నాథములను మొదట స్తుతించాలని ఆరంభించి- **"నమోఽచింత్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే, నాథాయ మునయే-గాధభగవద్భక్తిసింధవే"** (స్తోత్రరత్న-1) (ఇటువంటిది అని భావించడానికి సాధ్యం కానిది, ఆశ్చర్యకరమైనది, భగవానుని అనుగ్రహంచేత సులభంగా లభించేది అయిన జ్ఞానంయొక్క, వైరాగ్యంయొక్క రాశివంటివారుగాను, భగవానుని మననం చేసేవారుగాను, అగాధమైన భగవద్భక్తికి సముద్రంవంటివారు గాను ఉండే నాథమునులకు నమస్కారం) అని దానికి కారణంగా వారికి భగవానునిపట్ల ఉండే గొప్పజ్ఞానం, భక్తి-అనే గొప్పతనాలనుగూర్చి తెలిపారు కదా ! అదేవిధంగా, వీరుకూడా శ్రీరంగనాథుని భక్తుల సమూహాన్ని దర్శించడమే కన్నులున్నందులకు ఫలం- అని అంటున్నారు.

**వ్యాఖ్యానం:- (తేట్టరుమ్)** భగవానుడు స్వయంగా వచ్చి తనను దర్శింపజేస్తే తప్ప, ఎవరివల్ల తమ స్వప్రయత్నంతో దర్శించడానికి వీలు కాదని భావం. **(తిఱల్ తేనినై) - "య ఆత్మదా బలదా"** (యజు-అష్టక- 7-5-36) (ఏ పరమాత్మ తనకు భక్తులకు అనుగ్రహించి, తనను అనుభవించడానికి తగిన మనోబలాన్ని కూడా ఇస్తున్నాడో) అని వేదంలో చెప్పిన రీతిలో తనను ఇచ్చి, తనను అనుభవించడానికి తగిన బలాన్ని ఇచ్చేవాడై, తాను తేనెవలె భోగ్యభూతుడై ఉండేవాడు.

**(తేనినై తెన్నరజ్గనై తిరు మాదు వాழ் వాట్టమిల్ వనమాలై వాழ்త్తి)** అందఱిచేత ఆశ పడతగిన శ్రీరంగంలో ఎల్లప్పుడు వాసం చేసేవాడై, లక్ష్మీదేవి నిత్యవాసం చేసే తన తిరుమేనిలోని వక్షఃస్థలంలో అలంకరించుకొన్నందువల్ల వాడిపోవడం అనేది లేకుండా, సమయం గడిచే కొద్దీ మఱింత వికాసాన్ని పొందే వనమాలను కలవానిని. **"వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాழ்కిన్ఱ మజ్గైయుమ్ పల్లాణ్డు"** (తిరుప్పల్లాణ్డు-2) (చక్కనిదై, నీ కుడివైపు వక్షఃస్థలంలో నిత్యవాసంచేసే లక్ష్మికి మంగళం) అనే రీతిలో భగవానుడు, లక్ష్మీదేవి కలసి ఉన్న చేరికకు మంగళాశాసనాన్ని చేసి.

**(మాల్ కొళ్ శిన్దైయరాయ్)** - భగవానునిపట్ల గొప్ప భక్తిని కల్గిన మనస్సును కలవారై- అని భావం. **మాల్** - గొప్ప ప్రేమ. అంటే- భక్తి, **(ఆట్టమేవి)** - ఆడాలి-

అనే తలపు మాత్రమే కాకుండా, ప్రేమచేత ఉన్నచోట ఉండలేకుండా ఆడడంలో అభినివేశాన్ని పొంది.

**(అలన్దు అழைత్తు)** - నర్తనంలోని ఆధిక్యంచేత శరీరం అలసి; నోరున్నందులకు తగిన ఫలాన్ని పొందడానికిగా అతని తిరునామాలను పల్కి,

**(అయర్వు ఎయ్దుమ్ మెయ్యడియార్కళ్తమ్)** - "అతడు (భగవానుడు) పిలుచికొని వెళ్ళినపుడు కాలక్రమంలో అతనిని పొందవచ్చునులే" అని సహించి ఉండలేకుండా, (ఆర్త్యతిశయంవల్ల) జ్ఞానాన్ని కోల్పోయి, తమను మఱచి, అతని వద్దనుండి అన్యఫలాన్ని ఆశించకుండా, అతనిపట్ల అత్యంతాభినివేశాన్ని కల్గిన భక్తులయొక్క- అని భావం. ఈ విధంగా ఉండేవారు ఎంతమంది కావాలి ? అని అంటే,

**(ఈట్టమ్ కణ్డిడ)** -వారిని గుంపులు గుంపులుగా దర్శించగలగాలి- అని అంటున్నారు.

**(కూడుమేల్ అతు కాణుమ్ కణ్పయన్ ఆవతే)** - ఈ విధంగా దర్శించగల్గితే, ఇంతకంటే గొప్ప ఫలం కంటికి వేఱొకటి ఏదీ లేదు.

**(కాణుమ్ పయన్)**- పరలోకంలో కాక, ఈ లోకంలోనే పొందవలసిన ఫలం ఇది- అని అంటున్నారు.

**తోడులామలర్ మఙ్గై తోళిణై తోయ్న్దతుమ్, శుడర్ వాళియాల్**
**నీడు మామరమ్ శెగ్ఱతుమ్ నిరై మేయ్త్తతుమ్ ఇవైయే నినైన్దు,**
**ఆడి ప్పాడి యరఙ్గ! వో! ఎన్ఱழைక్కుమ్ తొణ్డరడిప్పొడి**
**ఆడ నామ్పెఱిల్, కఙ్గైనీర్ కుడైన్దాడుమ్ వేట్కై ఎన్నావతే 2**

తోడు ఇలామ్ మలర్ మఙ్గై = దళాలు అధికంగా ఉండే తామరపూవులను నివాసస్థానంగా కల లక్ష్మీదేవియొక్క, తోళ్ ఇణై తోయ్న్దదుమ్ = బాహువులను రెండిటిని ఆలింగనం చేసికోవడం, శుడర్ వాళియాల్= కాంతిని (పదును) కల బాణంలో, నీడు మా మరమ్ శెగ్ఱతుమ్ = ఉన్నతాలైన సాలవృక్షాలు ఏడింటిని తొలవడం, నిరై మేయ్త్తతుమ్ = పశుసమూహాలను మేపడం, ఇవైయే నినైన్దు= ఈ చేష్టితాలను అన్నిటినీ తలచి, ఆడి పాడి = (దానివల్ల కల్గిన) ఆనందాతిశయంచేత ఆడి పాడి, ఓ అరఙ్గ ఎన్ఱు అழைక్కుమ్ = శ్రీరంగనాథా ! అని పిలిచే, తొణ్డర్ = భక్తులైన శ్రీవైష్ణవుల, అడి ప్పొడి = పాదధూళిలో, నామ్ ఆడ పెఱిల్ = మనం అన్వయించగల్గితే, కఙ్గై నీర్ = గంగానదీజలంలో, కుడైన్దు ఆడుమ్ వేట్కై = అవగాహించి (మునిగి) స్నానం చేయడంలో ఉండే ఆశ, ఎన్ ఆవతు = ఎందుకు?

**వ్యా. :- ఇరణ్డామ్బాట్టు. (తోదులా మలర్‌మఙ్గై తోళిణై తోయ్‌న్దతుమ్) ఇతఴ్ మిక్కిరున్ద తామరైప్పూవై వాసస్థానమాకవుడైయ పెరియపిరాట్టియార్ తిరుత్తోళ్‌కళ్ ఇరణ్డైయుమ్ తోయ్‌న్దతుమ్. తనియన్ పెరువిడాయర్ పెరువెళ్ళత్తిలే ఇఴిన్దు అనుభవిక్క త్తేడినాప్పోలే తోయ్‌న్దతుమ్. (శుదర్ వాళియాల్) పుకరైయుడైయ అమ్బాలే. (నీడు మామరమ్ శెగ్ఱతుమ్) మిక్క ఓక్కత్తైయుడైత్తాన మరామరఙ్గళైఴైయు మెయ్‌తతుమ్. పణ్డే తుళైయానవగ్ఱిలే ఓట్టినాప్పోలేయాయ్‌త్తు, అనన్తమాయ్ బలవత్తరమాన సప్తసాలత్తై నిరసిత్తతుమ్. ఆశ్రితరై విశ్వసిప్పిక్కుమ్ శెయలితే. (నిరై మేయ్‌త్తతుమ్) ఉభయవిభూతినాయకనాయిరున్దువైత్తు కైయిలే ఒరుకోలై క్కొణ్డుపోయ్ ప్పశు మేయ్‌త్తతుమ్. (ఇవైయే నినైన్దు) ఇన్ద శీలాదిగుణఙ్గళైయే నినైన్దు. ఇవగ్ఱై నినైక్కుమతొఴియ వేఱొరు ప్రయోజనత్తైయుమ్ కణిశియాతే.**

**(ఆడి ప్పాడి) ప్రీతిప్రకర్షత్తాలే యిరుక్కమాట్టాతే ఆడిప్పాడి. (అరఙ్గ వో ఎన్ఱఴైక్కుమ్) పెరుమాళ్ తిరునామత్తై చ్చొల్లి ఆగ్ఱమాట్టాతే కూప్పిడుమ్. (తొణ్డరడిప్పొడి యాడ నామ్ పెఱిల్) భగవద్గుణవిద్ధరాన శ్రీవైష్ణవర్‌కళుడైయ పాదరేణుక్కళిల్ అవగాహిక్క ప్పెఱిల్. ఎప్పోతు మొక్క భగవత్సమ్బన్ధ ముడైయరాకైయాలే తీర్థభూతరాన శ్రీవైష్ణవర్ కళుడైయ పాదరేణుక్కళిలే అవగాహిక్క ప్పెఱిల్. (కఙ్గైనీర్ కుడైన్దాడుమ్ వేట్కై యెన్నావతే) కాదాచిత్కసమ్బన్ధమేయాయ్ ప్పల శిక్కుత్తలైకళిలే ఉపహతిప్పట్ట గఙ్గై యాడినాల్ ఎన్న ప్రయోజనముణ్డు! "నలన్దికఴ్‌శడైయాన్" ఇత్యాది. పొతువానతితే అతు.**

*అరు :- ఇరణ్డామ్బాట్టు - (తొదులా మిత్యాది) (పల శిక్కుత్తలై) పల జటైయై యుడైయ రుద్రన్ తలై.*

**భావదీపిక :- అవ :-** భగవానుడు రామకృష్ణాద్యవతారాలలో చేసిన అతిమానుష లీలలను తలచి ఆడి,పాడి "శ్రీరంగా ! శ్రీరంగా !" అని పిలచే భక్తుల శ్రీపాదధూళిలో స్నానం చేయడంకంటే, గంగానదీజలాలలో మునిగి స్నానం చేయడం గొప్ప కాదు-అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (తోదు ఇలా మలర్ మఙ్గై తోళిణై తోయ్‌న్దదుమ్)-** రేకులు ఎక్కువగా ఉండే తామరపూవును నివాసస్థానంగా కల లక్ష్మీదేవియొక్క బాహువులు రెండిటిని ఆలింగనం చేసికోవడం. మహాప్రవాహంలో ఒంటరిగా దిగి స్నానం చేసేటట్లే, పిరాట్టియొక్క రెండు బాహువులను ఆలింగనం చేసికోవడం ఇతడొక్కడే చేయదగిన అరుదైన కార్యం అని తెలుపుతున్నారు.

**(శుదర్ వాళియాల్)** కాంతిని కల ఒకే బాణంలో,

**(నీడు మా మరమ్ శెగ్ఱతుమ్)** -ఉన్నతంగా నిలచి ఉన్న సాలవృక్షాలు ఏడింటిని పడగొట్టడం. ఇంతకు ముందే రంధ్రం చేయబడ్డ చోట బాణాన్ని ప్రయోగించినట్లుగా,

చాలా ఎత్తైనవిగా, చాలా దృఢంగా ఉండే ఏడు సాలవృక్షాలను ఒకేబాణాన్ని ప్రయోగించి భేదించాడని భావం. దాసుడైన సుగ్రీవునకు "తాను వాలిని చంపగల్గినవాడు" అనే నమ్మిక కల్గించడంకోసం చేసిన పనికదా ఇది. ఇంతవరకు భగవానుని పరత్వం ప్రతిపాదింపబడింది. ఇక, అతని సౌలభ్యం చెప్పబడుతున్నది.

**(నిరై మేయ్త్తతుమ్)** - నిత్యవిభూతి అనే పరమపదం, లీలావిభూతి అనబడే ఈలోకం- అనే ఈ రెండిటికి నాయకుడై ఉన్నా, గోపాలుడైన కృష్ణుడై పుట్టి, చేతిలో ఒక ముల్లు కర్రను పట్టుకొని గోవులను మేపడం.

**(ఇవైయే నినైన్దు)** - ఈ సౌలభ్యసూచకాలైన గుణాలను, పరత్వగుణాలను తలచి- అని భావం. వీటిని తలవడం తప్ప వేఱు ఫలం దేనినీ భావించకుండా ఉంటారు- అని 'ఏ' (ఏవ) కారం చేత తెలుపబడుతున్నది.

**(ఆడి ప్పాడి)** - ఆనందాతిశయంచేత ఉన్నచోట ఉండలేకుండా ఆడి, పాడి. **(అరఙ్గ! వో ఎన్ఱழைక్కుమ్)** దర్శించాలనే ఆశ వల్ల ఏర్పడిన ఆర్తిచేత శ్రీరంగనాథుని తిరునామాలను చెప్పి, పిలిచే-

**(తొణ్డరడిప్పొడి ఆడ నామ్ పెఱిల్)** - భగవానుని గుణాలచేత విద్ధులైన శ్రీవైష్ణవుల శ్రీపాదధూళిలో అవగాహించి, స్నానం చేయగల్గితే- అని భావం. ఎల్లప్పుడు భగవత్సంబంధాన్ని కలవారు కాబట్టి, ఎప్పుడో ఆ భగవానుని సంబంధాన్ని కల గంగ, కావేరి మొదలైన తీర్థాలకంటే గొప్ప తీర్థాలై (పరిశుద్ధులై) ఉండే శ్రీవైష్ణవుల పాదధూళిలో అవగాహించి, స్నానం చేయాలి- అని ఆశపడుతున్నారు.

**(కఙ్గైనీర్ కుడైన్దాడుమ్ వేట్కై ఎన్నావతే)** - భగవానుని శ్రీపాదాలనుండి పుట్టినప్పటికీ, రుద్రుడు మొదలైనవారి పలు చిక్కు తలలో (జటలు కల్గిన తలలో) ప్రవేశించి మలినమైన గంగానదీజలంలో దిగి స్నానం చేస్తే ఏం ప్రయోజనం ఉంటుంది? **"నలన్తికழ் శడైయాన్ముడి కొన్రై మలరుమ్ నారణన్ పాదత్తுழாయుమ్ కలన్దిழிపునలాల్ పుకర్ పడు కఙ్గై"** (పెరియా. తిరు-4-7-3) **"శతుముకన్కైయిల్ శతుప్పుయన్ తోళిల్ శఙ్కరన్ శడైయిల్ తఙ్గి కతిర్ముక మణికొణ్డిழிపునల్ కఙ్గై" (పెరియా. తిరు-4-7-3)** అని అనే రీతిలో బ్రహ్మరుద్రుల సంబంధాన్ని కల్గినది కదా గంగానది.

**ఏఱడర్త్తతుమ్ ఏనమాయ్ నిలఙ్కీణ్డతుమ్, మున్నిరామనాయ్**
**మాఱడర్త్తతుమ్ మణ్ణళన్దతుమ్ శొల్లి ప్పాడి, వణ్ పొన్నిప్పేర్**
**ఆఱుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు అరఙ్గన్ కోయిల్ తిరుముற்றమ్,**
**శేఱు శెయ్ తొణ్డర్ శేవడి చ్చెழுమ్ శేఱు ఎన్ శెన్నిక్కణివనే** 3

ఏఱు అదర్త్తుదుమ్ = (నప్పిన్నైప్పిరాట్టికోసం) ఏడు ఎద్దులను మర్దించి సంహరించడం, ఏనమాయ్ నిలమ్ కీణ్డదుమ్ = (శ్రీభూమిప్పిరాట్టికోసం) మహావరాహమై, భూమిని దంతంతో గుచ్చి ఎత్తి ఉద్ధరించడం, మున్ ఇరామనాయ్ = రావణుడు సీతాదేవిని అపహరించినపడు, శ్రీరాముడై అవతరించి, మాఱు అదర్త్తదుమ్ = విరోధి అయిన రావణుని సంహరించడం, మణ్ అళన్దదుమ్ = (ఇంద్రునికోసం మహాబలి స్వాధీనం చేసికొన్న) భూమిని త్రివిక్రమరూపియై ఆ భూలోకాన్ని కొలువడం-అనే స్వామి లీలలను, శొల్లి పాడి = నోరార పల్కి, ప్రీత్యతిశయంచేత పాడి, వణ్ పేర్ పొన్ని ఆఱు పోల్ వరుమ్ = పెద్ద ప్రవాహంగా వచ్చే కావేరివలె స్రవించే, కణ్ణ నీర్ కొణ్డు = కన్నీటితో, అరఙ్గన్ కోయిల్ తిరు ముౝ్ౝమ్ = శ్రీరంగనాథుని దివ్యాలయంలోని వాకిలిని, శేఱు శెయ్ తొణ్డర్ = బురదగా చేసే శ్రీవైష్ణవుల, శే అడి శెౘ్చు శేఱు = శ్రీపాదాలచేత తొక్క బడ్డ అందమైన బురదను, ఎన్ శెన్నిక్కు అణివన్ = నా శిరస్సులో అలంకరించు కొంటాను.

**వ్యా. :- మూన్ఱామ్పాట్టు. (ఏఱదర్త్తతుమ్) నప్పిన్నైప్పిరాట్టియోట్టై సంశ్లేషత్తుక్కు ఇడైచ్చువరాన ఋషభఙ్గళేౘ్ౘైయు మదర్త్తతుమ్. (ఏనమాయ్ నిలఙ్గీణ్డతుమ్) శ్రీభూమిప్పి రాట్టియోట్టై సంశ్లేషత్తుక్కు విరోధియామ్పడి అవళుక్కు ప్రకారమాన భూమియై ప్రళయమ్ కొళ్ళ, ఉతవిౝ్ౝీలనెన్నుమ్ అవద్యమ్ వారాతపడి మహావరాహమాయ్ అణ్డభిత్తియిలే పుక్కు ఒట్టిన భూమియై ఒట్టు విడువిత్తతుమ్. (మున్నిరామనాయ్ మాఱదర్త్తతుమ్) పిరాట్టియై ప్పిరిత్త పైయలై ఎతిరియాక్కి క్కొన్ఱతుమ్. (మణ్ణళన్దతుమ్) పిరాట్టిమారోట్టై సంశ్లేషవిరోధికళై ప్పోక్కినాప్పోలే ఇన్ద్రనోడు విరోధిత్త మహాబలి కైక్కొణ్డభూమియై మీట్టు ఎల్లై నడన్దు కొడుత్తతుమ్. (శొల్లి ప్పాడి) ఇవ్వపదానఙ్గళై చ్చొల్లి, ప్రీతిప్రకర్షత్తాలే పాడి.**

**(వణ్ పొన్ని ప్పేరాఱుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు) కావేరి, పెరువెళ్ళమాయ్ అకిలుమ్, శన్దకణముమ్, ముత్తుమ్ కొణ్డువరుమాప్పోలే, అమైక్క నిల్లాతే వెళ్ళమిడుకిఱ కణ్ణనీరై క్కొణ్డు. (అరఙ్గన్ కోయిల్ తిరుముౝ్ౝమ్ శేఱు శెయ్ తొణ్డర్) అఙ్గు ప్పాఙ్గాక త్తిరువలకు తిరుప్పణి శెయ్తువైత్తాల్ ఇవర్కళ్ అత్తై క్కణ్ణనీరాలే శేఱాక్కువర్కళాయ్త్తు. (శేవడి చ్చెౘ్చుమ్ శేఱెన్ శెన్నిక్కణివనే) అమఙ్గలమాన పుౘ్చుకునెయ్యాలే అలఙ్కరిత్త దోషమ్ తీర మఙ్గళార్థమాన శ్రీవైష్ణవర్కళిన్ తిరువడికళిల్ అౘ్చుకియ శేౝ్ౝై యణివన్.**

**భావదీపిక :- అవ :-** వరాహ, త్రివిక్రమ, రామకృష్ణావతారాలలో భగవానుడు చేసిన అరుదైన కృత్యాలనుగూర్చి పల్కి, పాడి, శ్రీరంగనాథుని కోవెల వాకిటి భాగాన్ని తమ ఆనందబాష్పాలతో, శ్రీపాదధూళితో బురదగా చేసే భక్తుల శ్రీపాదాలచేత తొక్కబడ్డ అందమైన పంకాన్ని నేను శిరస్సులో ధరించాలి అని ఇందులో ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (ఏఱు అదర్త్తదుమ్)** -నప్పిన్నైప్పిరాట్టిని వివాహం చేసికోవడంకోసం వీర్యశుల్కంగా నిశ్చయింపబడినందువల్ల, అవరోధంగా ఉండే ఏడు ఎద్దులను వధించడం.

**(ఏనమాయ్ నిలమ్ కీణ్డదుమ్)** భూదేవితో కలసి ఆనందించడానికి అడ్డు అయేటట్లుగా ఆమె శరీరం అయిన భూమిని ప్రళయజలం ముంచెత్తినపుడు, ఆ ఆపదను తీర్చి, ఆమెకు సహాయపడలేదనే చెడ్డ పేరు రాకుండా ఉండేటట్లు మహావరాహరూపంలో అవతరించి, అండభిత్తిలో అంటుకొని ఉండే భూమిని దంతాగ్రంతో గుచ్చి ఎత్తి విడిపించడం.

**(మున్ ఇరామనాయ్ మాఱు అడర్త్తదుమ్)** – పూర్వం శ్రీరాముడై అవతరించి, సీతాపిరాట్టిని విడదీసిన రావణుని ప్రత్యర్థిగా ఎదిరించి పోరి సంహరించడం. **(మణ్ అళన్దదుమ్)** – ఈ విధంగా మూడు అవతారాలలో పిరాట్టితో నిత్యసంశ్లేషానికి కల్గిన ఆటంకాలను తీర్చినట్లే, త్రివిక్రమావతారంలో తన భక్తుడైన ఇంద్రునకు విరోధి అయిన మహాబలిచేత ఆక్రమింపబడ్డ భూమిని మూడు పాదాలతో కొలిచి, తిరిగి అతనికి ఇవ్వడం. **(శొల్లి ప్పాడి)** – ఈ విధంగా ఈ నాల్గు అవతారాలలోను చేసిన అపూర్వకృత్యాలనుగూర్చి పల్కి, దానిచే కల్గిన ఆనందాతిశయంచేత పాడి,

**(వణ్ పొన్ని ప్పేరాఱుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు) – "శన్దినొడు మణియుమ్ కొழிక్కుమ్ పునల్కావిరి"** (పెరియతిరు– 5-4-1) (చందనంతో పాటు మణులను కొట్టుకొనివచ్చే నీటిని కల కావేరి) అనే రీతిలో కావేరి గొప్ప ప్రవాహంగా సహ్యపర్వతం నుండి చందనం, ముత్యాలు, అగరు మొదలైనవానిని కొనివచ్చేటట్లే, అడ్డగించడానికి వీలులేనటట్లు ప్రవాహంగా కారే ఆనందబాష్పాలతో. **(అరఙ్గన్ కోయిల్ తిరుముற்றమ్ శేఱు శెయ్ తొణ్డర్)** – శ్రీరంగం కోవెల వాకిటిలో భగవానుడు వేంచేయడానికి వీలుగా శుద్ధం చేసి ఉంచిన స్థలాన్ని వీరు తమ కన్నీటితో బురదచేస్తారు.

**(శేవడి శెழுఞ్జేఱు ఎన్ శెన్నిక్కు అణివనే)** – నా శిరస్సును ప్రభువులకు ఉచితం అయిన సువాసనాద్రవ్యాలతో అలంకరిస్తున్నారు. భాగవతసంబంధం లేనందువల్ల అమంగళం అయిన ఆ అలంకారాలవల్ల కల్గిన దోషం తీరేటట్లు, మంగళకరం అయిన శ్రీవైష్ణవుల శ్రీపాదాల సంబంధాన్ని పొందిన ఆ అందమైన పంకాన్ని నేను అలంకరించుకొంటాను– అని ఆழ்వార్లు అంటున్నారు.

**తోయ్త్త తణ్డయిర్ వెణ్ణెయ్ పాలుడనుణ్డలుమ్, ఉడన్హాయ్చ్చి కణ్డు**
**ఆర్త్త తోళుడై ఎమ్బిరాన్ ఎన్నరఙ్గనుక్కు అడియార్కళాయ్,**
**నాత్తழுమ్బెழ నారణా! ఎన్ఱழைత్తు మెయ్ తழுమ్బతు త్తொழு**
**ఏత్తి, ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి ఏత్తి వాழ்த్తు మెన్నెఞ్జమే.** 4

తోయ్త్త తణ్ తయిర్ = తోడుపెట్టబడ్డ, చల్లని పెరుగును, వెణ్ణెయ్ = వెన్నను, పాల్ = పాలను, ఉడన్ ఉణ్డలుమ్ = ఒకే సమయంలో ఆరగించగానే, ఆయ్చ్చి కణ్డు=

యశోదాదేవి చూచి, ఉడన్టు = కోపించి, ఆర్త్త తోళ్ ఉడై = (తరువాత) ఆమెచేత కట్టబడ్డ చేతులను కలవాడై, ఎమ్బిరాన్ = నాకు శేషి అయిన శ్రీరంగనాథునకు, అడియార్‌కళాయ్ = శేషభూతులై, నా తழும்பு ఎழ = నాలుక కాయలు కాచేటట్లుగా, నారణా ఎన్టు అழைత్తు = నారాయణా! అని పిలిచి, మెయ్ తழும்பு తొழுదు = శరీరంలో కాయలు కాచేటట్లుగా నమస్కరించి, ఏత్తి = స్తుతించి, ఇన్బుఱుమ్= ఆనందాన్ని పొందే, తొణ్డర్ శే అడి = శ్రీవైష్ణవుల శ్రీచరణాలను, ఎన్ నెఞ్జమ్ = నా మనస్సు, ఏత్తి వాழ்త్తుమ్= స్తోత్రం చేసి, మంగళాశాసనాన్ని చేస్తుంది.

**వ్యా. :- నాలామ్బాట్టు. (తోయ్‌త్త తణ్డయిర్ వెణ్ణెయ్ పాల్) కడైన్దు పిరిత్త వెణ్ణెయ్, అతుక్కుఱుప్పాక త్తోయ్‌త్త తయిర్, అతుక్కడియాన పాల్. (ఉడనుణ్డలుమ్) ఇవై యడఙ్గలుమ్ నిశ్శేషమాక ఒరుకాలే అముతుశెయ్‌తవాతే. (ఉడన్టు) అదైయ క్కాణావిట్టవాతే కోపిత్తాళ్. (తీరా వెకుళియళాయ్) స్నేహత్తుక్కు అవధియుణ్డాకిలితే కోపత్తుక్కు అవధియుణ్డావతు. (ఆయ్‌చ్చి కణ్డు) వాయతు కైయతువాక కొణ్డియోదే కణ్డు పిడిత్తాళాయ్‌త్తు. (ఆర్త్త తోళుడై యెమ్బిరాన్) కణ్డవాతే కైయై ప్పిడిత్తు క్కట్టినాళ్. (ఎమ్ పిరాన్) ఆశ్రితస్పర్శముళ్ళ ద్రవ్యత్తాలల్లతు శెల్లామైయై క్కాట్టి ఎన్నై అనన్యార్హమాక్కి నవన్. (ఎన్నరఙ్గనుక్కడియార్‌కళాయ్) అవతారకాలత్తిల్ ఇழிన్దార్ ఇழవు తీర వన్దు సులభరాన పెరియపెరుమాళుడైయ శెయలిలే ఎழுతి క్కొడుత్తవర్‌కళాయ్‌త్తు.**

**(నాత్తழும்பెழ) నావానతు తழும்பేఱుమ్బడియాక. (నారణా ఎన్టழైత్తు) "అమ్మే" ఎన్బారైప్పోలే తిరునామత్తై అడైవు కెడచ్చొల్లి. (మెయ్ త్తழும்பு త్తొழுతు) ప్రణామమ్ పణ్ణినపడి తోర్ఱ ఉడమ్బెల్లామ్ తழும்பాక. చ్చిఱియాత్తానై ప్పోలే. (ఏత్తి) ఇప్పడిప్పట్ట శెయల్‌కళై చ్చొల్లి యేత్తి. (ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి) మనస్సిలే నినైత్తు ఏత్తుకైయాలే విషయత్తై క్కిట్టినాల్ పిఱక్కుమ్ నిరతిశయానన్దయుక్తరాయిరుక్కుమ్ శ్రీవైష్ణవర్‌కళ్ శ్రీపాదఙ్గళై. (తొణ్డర్ శేవడి యేత్తి వాழ்త్తు మెన్నెఞ్జమే) అవర్‌కళ్‌తాఙ్గళ్ అకప్పట్ట నవనీతచౌర్యత్తిల్ పోకాతు ఎన్నెఞ్జు. అతిలే అకప్పట్టవర్‌కళ్‌తఙ్గళై ఏత్తి వాழ்త్తు మిత్తనై. (ఏత్తి వాழ்త్తుమ్) "ఇచ్చెయలుక్కు ఇవర్‌కళ్ నిలవరావతే!" ఎన్టు స్తోత్రత్తై ప్పణ్ణి, ఇతు నిత్యమాకవేణు మెన్టు మఙ్గళాశాసనమ్ పణ్ణానిఱ్కుమ్.**

*అరు :- నాలామ్బాట్టు. (తోయ్‌త్త ఇత్యాది) స్నేహమ్ - చాటు. కొణ్డి - కళవు.*

**భావదీపిక :- అవ :-** చిన్ని చిన్ని ముడులు వేసిన దారంతో కట్టబడ్డ శ్రీకృష్ణుడైన భగవానునకు దాస్యాన్ని చేసేవారి శ్రీచరణాలకు నా మనస్సు పల్లాణ్డు పాడుతుంది- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (తోయ్‌త్త తణ్ తయిర్ వెణ్ణెయ్ పాల్)** - చిలికి తీసిపెట్టిన వెన్న, దానిని తీయడంకోసం తోడుపెట్టి ఉంచిన పెరుగు, దానికి కారణమై ఉండే పాలు.

**(ఉడన్ ఉణ్డలుమ్)** – వీనిని అన్నిటినీ నిశ్శేషంగా ఒకేమారు ఆరగించగానే,

**(ఉడన్దు)** – ఇవి అన్నీ కన్పించకపోవడవల్ల యశోద కోపించింది. **"తీరా వెకుళికళాయ్ చ్చిక్కెన ఆర్త్తడిప్ప"** (శిఱియ తిరు–36) (తీరని కోపాన్ని కలిగినదై గభాలున పట్టుకొని కొట్టగా) అనే రీతిలో యశోద చాలా కోపించింది. ఇతని (శ్రీకృష్ణుని విషయంలో) అంతులేని ప్రేమ కల్గినది కనుక, "ఈ రీతిలో ఇంత వెన్నను తినడంవల్ల ఇతనికి చెడ్డ కల్గుతుందేమో!" అనే అంతు లేని కోపాన్ని పొందింది. **(ఆయ్చ్చి కణ్డు)** – దొంగిలించేటపుడే సాక్షాత్తుగా చేతిలో, నోటిలో వెన్నను చూచి తల్లి యశోద పట్టుకొన్నది.

**(ఆర్త్త తోళుడై ఎమ్బిరాన్)**–ఆవిధంగా చూడగానే చేతులను కట్టివేసింది. **(ఎమ్బిరాన్)** – భక్తులు స్పృశించిన పెరుగు, వెన్న, పాలు మొదలైన వానిని భుజిస్తే తప్ప నిలువలేని తన సౌలభ్య స్వభావాన్ని ప్రదర్శించి, నన్ను తనవశం చేసికొన్నాడు. **(ఎన్ అరఙ్గనుక్కు అడియార్కళాయ్)** – ఈ కృష్ణావతారకాలంలో అతనిని అనుభవించలేని వారి కొఱతతీరేట్లు వచ్చి అందఱికీ సులభుడై ఉండే శ్రీరంగనాథుడు శయనించి అందంలో అభినివేశాన్ని పొంది, తమను ఆ స్వామికి దాసునిగా సమర్పించుకొన్నారు.

**(నాత్తழும్బెழ)** – తమ జిహ్వ కాయలు కాచేటట్లుగా.

**(నారణా ఎన్ఱు అழைత్తు)** – చిన్నపిల్లలు తల్లిని **"అమ్మా"** అని పిలిచేటట్లుగా తల్లిగా ఉండే ఆస్వామి యొక్క నారాయణాది నామాలను క్రమవివక్ష లేకుండా పల్కి.

**(మెయ్ తழும்బ తొழுదు)** – ఎడతెగకుండా దండం పెట్టడం స్ఫురించేటట్లుగా శరీరం అంతా కాయలు కాచేటట్లు నమస్కరించి– అని భావం. **"శిఱియాత్తాన్"** అనే ఆచార్యుల దగ్గర ఈ లక్షణం ఉన్నదని పెరియవాచ్చాన్ పిళ్ళై అనేవారు.

**(ఏత్తి)** – ఇటువంటి లీలను పల్కి స్తుతించి.

**(ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి)** – మనస్సులో పెట్టుకొని స్తుతించడంవల్ల ఈ స్వామిని నేరుగా దర్శిస్తే కలిగే అంతులేని ఆనందాన్ని కల శ్రీవైష్ణవుల శ్రీచరణాలను.

**(తొణ్డర్ శేవడి ఏత్తి వాழ்త్తుమ్ ఎన్నెఞ్జమే)** – వారు అభినివేశాన్ని పొందిన భగవానుని నవనీత చౌర్యవృత్తాంతంలో నా మనస్సు అభినివేశాన్ని పొందదు. ఆ లీలలో అభినివేశాన్ని పొందిన భక్తులను స్తుతించడంలోనే నా మనస్సు ఆసక్తమవుతుంది.

**(ఏత్తి వాழ்త్తుమ్)** – వెన్నను ఆరగించిన లీలలో వీరు అభినివిష్టులు కావడం **"ఎత్తిఱమ్"** (ఏం ఆశ్చర్యం !) అని వారినిగూర్చి స్తుతించి, వారి ఈ అభినివేశం ఎల్లప్పుడు ఉండాలని నా మనస్సు మంగళాశాసనం చేస్తూ ఉంటుంది.

**పొయ్ శిలై క్కురలే*ఱ్ఱె*రుత్త మిఱుత్తు ప్పోరర వీర్త్త కోన్,**
**శెయ్ శిలై చ్చుదర్ శూ*ళొ*ళి త్తిణ్ణమామతిళ్ తెన్నరఙ్గనామ్,**
**మెయ్ శిలై క్కరుమేక మొన్ఱు తన్నెఞ్జిల్ నిన్ఱు తిక*ళ* ప్పోయ్,**
**మెయ్ శిలిర్ప్పవర్తమ్మైయే నినైన్దు ఎన్మనమ్ మెయ్ శిలిర్క్కుమే** 5

పొయ్ శిలై కురల్ = వంచించే, కోపంతో కూడిన రంకెలను వేసే, ఏఱు ఎరుత్తమ్ ఇఱుత్తు = ఏడు కోడెల మూపురాలను మర్దించినవాడై, పోర్ అరవు = యుద్ధం చేయాలని వచ్చిన కాళియుడనే సర్పాన్ని, ఈర్త్త కోన్ = నిరసించి, (రేపల్లెకు) స్వామి, శిలై శెయ్= శిలలో నిర్మింపబడి, శుదర్ ఒళి = మిక్కిలి కాంతిని పొందికగా కల్గినదై, తెన్ అరఙ్గన్ ఆమ్= శ్రీరంగంలో నిత్యవాసం చేసే శ్రీరంగనాథుడనే, మెయ్ శిలై కరు మేకమ్ ఒన్ఱు= శరీరంలో వింటిని కల ఒక నీలమేఘం, తమ్ నెఞ్జిల్ నిన్ఱు తిక*ళ* ప్పోయ్ = తమ మనస్సులో ప్రకాశించేటట్లుగా, మెయ్ శిలిర్ప్పవర్తమ్మైయే = గగుర్పాటు కల్గిన దేహాన్ని కల శ్రీవైష్ణవులనే, ఎన్ మనమ్ నినైన్దు = నా మనస్సు తలచి, మెయ్ శిలిర్క్కుమ్= రోమాంచం పొందుతున్నది.

**వ్యా. :- అఙ్జామ్బాట్టు. (పొయ్ శిలై క్కురలే*ఱ్ఱి*రుత్త మిఱుత్తు) పొయ్-కృత్రిమ్. శిలై-కోపమ్. అసురావేశత్తాలే కృత్రిమమాయ్, కోపత్తైయుడైత్తాయిరున్దుళ్ళ ఏఱు మిఱాయ ప్పొరుతు. నప్పిన్నైప్పిరాట్టియోట్టై సంశ్లేషత్తుక్కు విరోధియాయ్ ప్పొరుకిఱవైయుమాయ్, చ్చిలైపోలే ఘోరమాన ధ్వనియై యుడైత్తాయిరున్దుళ్ళ ఋషభఙ్గళిన్ కకుత్తై ముఱిత్తు. (పోరరవు ఈర్త్త కోన్) తిరువాయ్ప్పాడియిల్ పశుక్కళుమ్, ఇడైయరుమ్ తణ్ణీర్ కుడిక్క వొణ్ణాతపడి జలత్తై దూషిత్తు క్కిడన్ద కాళియన్, యుద్ధోన్ముఖనాయ్ ప్పుఱప్పడుమ్బడి కలక్కి ప్పోయ్ క్కైయిల్ నిన్ఱుమ్ పోకవిట్టు, అత్తాలే తిరువాయ్ప్పాడియిలుళ్ళార్క్కు నాథనానవనై. (శెయ్ శిలై చ్చుదర్ శూ*ళొ*ళి త్తిణ్ణ మామతిళ్ తెన్నరఙ్గనామ్) కల్లాలే శెయ్యప్పట్టు ప్పిఱరాల్ అభిభవిక్కవొణ్ణాతపడియాన మతిప్పై యుడైత్తాయ్, తిణ్మైయై యుమ్, ఓక్కత్తై యుముడైత్తాన తిరుమతిళ్కళ్ పలవుమ్ శూ*ళ్*న్దిరుక్కిఱ కోయిలిలే కణ్వళర్న్దరుళు కిఱ.**

**(మెయ్ శిలై క్కరు మేకమ్) ఉడమ్బిలే విల్లైయుడైయ మేఘమెన్నుతల్; మెయ్యే విల్లోడే కూడిన మేఘన్దానెన్నుతల్. (ఒన్ఱు తన్నెఞ్జిల్ నిన్ఱు తిక*ళ* ప్పోయ్) "శోభయన్ దణ్డకారణ్యమ్" ఎన్నుమాపోలే. మాణిక్కక్కుప్పియిల్ ఉళ్ళునిన్ఱ నిలై పుఱమ్బే తెరియు మాపోలే, పెరియపెరుమాళై త్తఙ్గళ్ నెఞ్జిలే ఎ*ళు*న్దరుళువిత్తువైక్కైయాలే ని*ళ*లిడానిఱ్కు మాయ్త్తిఱే. (మెయ్ శిలిర్ప్పవర్) ఉళ్ళే ఎ*ళు*న్దరుళి యిరుక్కిఱ పడియై అనుసన్ధిత్తు పుళకితగాత్రరా యిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళ్. (తమ్మైయే నినైన్దు ఎన్మనమ్ మెయ్**

**శిలిర్క్కుమే) పెరియపెరుమాళై అనుభవిత్తు అవర్కళుడమ్బు పడుమ్ పాట్టై, అవర్కళై అనుభవిత్తు ఎన్నెఞ్జు పడానిన్రతు. స్పర్శద్రవ్యమ్ పట్టతెల్లామ్ పడానిన్రతు అమూర్తద్రవ్యమ్.**

*అరు :- అఞ్జామ్బాట్టు. (పొయ్ శిలై యిత్యాది) పొయ్ - అసురావేశమాకైయాలే పొయ్యాన ఋషభ మెన్గిఅతు. "శిలై క్కురల్"- ఇడిపోలే యిరుక్కై. స్పర్శదవ్యమ్- శరీరమ్.*

**భావదీపిక :- అవ :-** శ్రీకృష్ణుడై అవతరించి, అరుదైన లీలలను చేసిన శ్రీరంగనాథుని తిరుమేనిలో అభినివేశాన్ని పొంది, రోమాంచాన్ని పొందేవారిని చూచి నామనస్సు రోమాంచాన్ని పొందుతున్నదని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (పొయ్ శిలై క్కురలే*ర్ర్*ఎరుత్తమ్ ఇఱుత్తు)- "పొయ్ ఏఱు", "శిలై క్కురల్ ఏఱు"** అని విడదీసి అన్వయించి అర్థాన్ని చెప్పాలి. **"పొయ్"** అంటే వంచన. అసురావేశాన్ని పొందినందువల్ల, శ్రీకృష్ణునకు హాని కల్గించాలనే వంచనాభిప్రాయాన్ని కల ఎద్దులు అని, అసత్యమైన కోపంతో కూడిన రంకెలను వేసేది- అని భావం. **"శిలై"** అనే పదం కోపాన్ని తెలుపుతుంది. ఆ ఏడు ఎద్దులు అణగి ఉండేటట్లు యుద్ధాన్ని చేసి నప్పిన్నై పిరాట్టి వివాహం చేసికొని, ఆలింగనం చేసికోవడానికి అడ్డుగా ఉన్నదై, పోరాడేదై- అని భావం.

**(శిలై)** - పిడుగువలె భయంకరం అయిన ధ్వనిని కలవైన ఎద్దుల మూపురాలను అణచి- అని భావం.

**(పోరరవు ఈర్త్త కోన్)** - రేపల్లెలోని పశువులు, గొల్లలు నీళ్ళు తాగడానికి వీలులేనట్లు యమునానదీజలాలను విషపూరితం చేసిన కాళియుడనే సర్పం తనతో యుద్ధం చేసేటట్లు అతడు నివసించే మడుగులోని నీటిని కలియజేసి, ఆ మడుగులోనుండి అతడు పరుగెత్తి పోయేటట్లుగాచేసి, అందువల్ల రేపల్లెలో ఉండే వారికి స్వామి అయినవానిని.

**(శెయ్ శిలై చ్చుదర్ శూழ்ఒళి త్తిణ్ణ మామదిళ్ తెన్నరఙ్గనామ్)** - రాతితో నిర్మింపబడ్డదై, ఇతరులకు జయించడానికి సాధ్యం కానిదైన గొప్పతనాన్ని కల్గినదై, దార్ఢ్యాన్ని, ఔన్నత్యాన్ని కల్గిన ప్రాకారాలు అనేకం చుట్టి ఉండే శ్రీరంగం దివ్యాలయంలో నిద్రించే శ్రీరంగనాథుడనే.

**(మెయ్ శిలై క్కరు మేకమ్)** - **"మెయ్"** అంటే శరీరం. శరీరంలో వింటిని కల ఒక మేఘం- అని కాని, **"మెయ్"** అంటే సత్యమని, వాస్తవంగానే వింటిని కల్గిన మేఘం- అని కాని శ్రీరంగనాథుని రూపిస్తున్నదని చెప్పవచ్చు.

**(ఒన్దు తమ్ నెఞ్జిల్ నిన్దు తికழ ప్పోయ్)** - **"శోభయన్ దణ్డకారణ్యం దీప్తేన స్వేన తేజసా, అదృశ్యత తతో రామో బాలచంద్ర ఇవోదితః"** (ప్రకాశించే తన కాంతితో దండకారణ్యాన్ని అలంకరిస్తూ, అపుడే ఉదయించిన బాలచంద్రునివలె శ్రీరాముడు

కన్పించాదు) అనే రీతిలో, మాణిక్యపేటికలో నీలమణిని పెట్టినట్లయితే ఆమణి బయటకు ప్రకాశించేటట్లుగా, శ్రీరంగనాథుని తమ మనస్సుతో పెట్టుకొన్న విషయం బయటకు వ్యక్తం అయేటట్లుగా ఉండే దాసులు (భక్తులు).

**(మెయ్ శిలిర్ప్పవర్)** – శ్రీరంగనాథుడు లోపల వేంచేసి ఉన్నట్లే భావించి, భావించి గగుర్పాటు కలిగే దేహాన్ని కలవారై ఉండే శ్రీవైష్ణవులు.

**(తమ్మైయే నినైన్దు ఎన్ మనమ్ మెయ్ శిలిర్క్కుమే)** – శ్రీరంగనాథుని భావించి, భావించి వారి తిరుమేని పడే పాట్లను వారిని అనుభవించిన నా మనస్సు పడుతున్నది. కంటితో దర్శించేటట్లుగా ఉండే వారి శరీరం పడిన పాట్లను అన్నిటినీ కంటితో చూడడానికి సాధ్యం కాని నా మనస్సు పడుతున్నది– అని అంటున్నారు. ఇక్కడ గగుర్పాటు కల్గినట్లు చెప్పడం ఆనందబాష్పాలు స్రవించడం మొదలైనవానికి ఉపలక్షణం.

**ఆతి యన్ద మనన్ద మఱ్పుతమాన వానవర్తమ్పిరాన్,**
**పాత మామలర్ శూడుమ్ పత్తియిలాత పావికళ్ ఉయ్న్దిడ,**
**తీతిల్ నన్నెఱి కాట్టి ఎఙ్గుమ్ తిరిన్దు అరఙ్గనెమ్మానుక్కే,**
**కాతల్ శెయ్ తొణ్డర్క్కు ఎప్పిఱప్పిలుమ్ కాతల్ శెయ్యుమ్ ఎన్నెఞ్జమే 6**

ఆతి = జగత్కారణభూతుడై, అన్తమ్ = ప్రళయకాలంలోకూడా ఒకే స్థితిలో ఉండేవాడై, అనన్తమ్ = అన్ని వస్తువులలోను వ్యాపించి ఉండేవాడై, అఱ్పుతమ్ = ఆశ్చర్యభూతుడై, ఆన వానవర్తమ్ పిరాన్ = నాశం లేని నిత్యసూరులకు స్వామి అయిన శ్రీరంగనాథుని, మా మలర్ పాతమ్ = సాటి లేని తామరపూవువంటి శ్రీచరణాలను, శూడు ప్పత్తి ఇలాత = శిరస్సుపై ధరించే రీతిలోని భక్తి లేని, పావికళ్ ఉయ్న్దిడ = పాపులు సైతం ఉజ్జీవించేటట్లుగా, ఎఙ్గుమ్ తిరిన్దు = అన్ని చోట్ల సంచరించి, తీతు ఇల్ నల్ నెఱి కాట్టి= దోషం లేని మంచి మార్గాలను తాము నిర్మించి చూపేవారై, ఎమ్మాన్ అరఙ్గనుక్కే= మాస్వామి అయిన శ్రీరంగనాథునకే, కాతల్ శెయ్ తొణ్డర్క్కు = ప్రేమను కలవారైన, భక్తులపట్ల, ఎన్ నెఞ్జమ్ = నా మనస్సు, ఎప్పిఱప్పిలుమ్ = అన్ని జన్మలలోను, కాతల్ శెయ్యుమ్ = (కైంకర్యాన్ని చేయాలని) ఆశపడతుంది.

**వ్యా. :– అఱామ్బాట్టు. (ఆతి) జగత్కారణభూతన్. (అన్దమ్) ప్రళయకాలత్తిలుమ్ సదవస్థనాయిరుక్కుమవన్. (అనన్దమ్) కారణావస్థైయిలుమ్, కార్యావస్థైయిలు మొక్క వ్యాపిత్తు నిఱ్కుమవన్. (అఱ్పుతమాన) కార్యావస్థైయోదు, సదవస్థనాయ్ నిఱ్కు మత్తోదు వాశియఱ నిఱ్కుమ్ నిలైకళ్ వేఱోరిడత్తిల్ కాణవొణ్ణాతెన్నుమ్బడి యిరుక్కుమ్ ఆశ్చర్య భూతన్. (ఆన వానవర్ తమ్బిరాన్) ఆనపోతుమ్, అమిగ్రన్దపోతు మొక్క ఉళరా యిరుక్కుమ్ నిత్యసూరికళుక్కునాథన్. ఉభయవిభూతినాథనెన్ఱ పడి. (పాతమా మలర్**

**శూడుమ్ పత్తి యిలాత) అవన్ తిరువడికళాకిఱ శెవ్వి త్తామరైయై చ్చూడుమ్ భక్తియై యుడైయ రాయిరుక్కైయాయ్త్తు కర్తవ్యమ్. అతిల్లాత. (పావికళుయ్న్దిడ) భక్తి యిల్లాతపడి మహాపాపత్తై ప్పణ్ణి, "అసన్నేవ" ఎన్నుమ్పడి యిరుక్కిఱ దేశ మెఙ్గుమ్ పుక్కు సఞ్చరిత్తు అవర్కళై భక్తియుణ్డాక్కి ఉజ్జీవిప్పిక్కైక్కాక.**

**(తీతిల్ నన్నెఱి కాట్టి) తీమైయోడే కూడిన నెఱి యన్రిక్కే, చేతనర్ నల్వழிపోమ్పడి తాఙ్గళ్ ఆచరిత్తు క్కాట్టి. (ఎఙ్గుమ్ తిరిన్దు) పుకక్కడవ దేశ మెఙ్గుమ్ పుక్కు సఞ్చరిత్తు. (అరఙ్గనెమ్మానుక్కే కాతల్ శెయ్ తొణ్డర్క్కు) ఎన్నై అనన్యార్హమాక్కిన పెరియపెరుమాళ్ తిరువడికళిలే భక్తియుణ్డాయిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళుక్కు. (ఎప్పిఱప్పిలుమ్ కాతల్ శెయ్యు మెన్నెఞ్జమే) అనేకజన్మఙ్గళ్ పిఱన్దు అవర్కళుక్కు అడిమై శెయ్యవేణు మెన్ఱు ఆశైప్పడానిన్రతు ఎన్నెఞ్జు.**

*అరు:- ఆఱామ్పాట్టు. (ఆతి యిత్యాది). (కారణావస్థై) సృష్ట్యున్ముఖనా యిరుక్కిఱ అవస్థై.*

**భావదీపిక :- అవ:-** శ్రీరంగనాథునిపట్ల ప్రేమను కల భక్తుల విషయంలో అన్ని జన్మలలోను ప్రేమను కల్గి ఉండాలని ఈ పాశురంలో ఆழ்వార్లు ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (ఆతి)** - లోకాలకన్నిటికి కారణమై ఉండేవాడు. **(అన్తమ్)- "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"** (ఛాందో ఉప.6-2-1) (ప్రళయంలో **"సత్"** అనబడే సూక్ష్మదశలో ఉండే చేతనాచేతనాలను శరీరంగా కల్గిన బ్రహ్మమే ఉన్నది) అనే రీతిలో ప్రళయకాలంలోకూడా సూక్ష్మచేతనాచేతనాలను శరీరంగా కల్గిన **"సత్"** అనబడే స్థితిలో ఉండే బ్రహ్మమై ఉండేవాడు.

**(అనంతమ్)** - **"సత్"** అనబడే ఆకారణదశలోను, స్థూలచేతనాచేతనాలను శరీరంగా కల కార్యదశలోను, అచేతనాచేతనాలు అన్నిటిలో ఒకేవిధంగా వ్యాపించి ఉండేవాడు.

**(అఱ్పుతమ్)** - **"సత్"** అనే కారణదశలో ఉన్నపుడు, పూర్వం తెల్పిన కార్యదశలో ఉన్నపుడు ఒకేవిధంగా వ్యాపించి ఉండే దశలు ఇక ఎవరి వద్ద చూడడానికి సాధ్యం కాదు -అని చెప్పేటట్లుండే ఆశ్చర్యాన్ని కలవాడు.

**(ఆన వానవర్ తమ్పిరాన్)** - లీలావిభూతి అనే ఈ సంసారమండలం వ్యక్తంగా భాసించే కాలంలోను, భగవానునితో లీనమై అవ్యక్తంగా ఉండే కాలంలోను- ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉండే నిత్యసూరులకు నాథుడు. ఈ విధంగా మొదటి నాల్గు పదాలలో లీలావిభూతినాయకుడని, ఈ అయిదవ పదంలో నిత్యవిభూతినాథుడని చెప్పడంద్వారా ఉభయవిభూతికి నాథుడని చెప్పబడినట్లయింది.

**(పాద మా మలర్ శూడుమ్ పత్తి యిలాత)** - అతని శ్రీచరణాలనే విరిసిన తామరపూవును అలంకరించుకొనే భక్తిని కలవారై ఉండడమే జ్ఞానం కలవారు చేయవలసినది. ఆ భక్తిని లేని -

**(పావికళ్ ఉయ్న్దిద)** – భక్తి లేకుండా ఉండడానికి కారణమన మహాపాపాన్ని చేసి, **"అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః"** (తైత్తి. ఆనంద–6) (బ్రహ్మజ్ఞానం లేకపోతే, అతడు లేనివాడే **("అసత్")** అవుతాడు. బ్రహ్మజ్ఞానం ఉంటే, ఆ కారణంవల్లనే అతనిని సత్తగా తెలిసికొంటున్నారు) అనే రీతిలో బ్రతికి ఉన్నా అసత్తులుగా ఉండే వారున్నచోట్ల అంతా ప్రవేశించి వెదకి,వారికి భక్తిని కల్గించి, వారిని ఉజ్జీవింపజేయడంకోసం.

**(తీతిల్ నన్నెతి కాట్టి)**– వేదానికి బాహ్యంగా, దానికి అపార్థాలు పల్కి తిరిగే బాహ్యకుదృష్టులు చూపే దుర్మార్గాలనుండి నివర్తించి, చేతనులు సన్మార్గాలలో నిలచేటట్లు తాము ఆచరించి చూపి,

**(ఎఙ్గుమ్ తిరిన్దు)**– పోదగిన దేశాలన్నిటిలోను ప్రవేశించి, సంచరించి.

**(అరఙ్గన్ ఎమ్మానుక్కే కాదల్ శెయ్ తొణ్డర్క్కు)** – తనను నా వశం చేసికొన్న శ్రీరంగనాథుని శ్రీచరణాలలో భక్తితో కూడిన శ్రీవైష్ణవులకు.

**(ఎప్పిఱప్పిలుమ్ కాదల్ శెయ్యుమ్ ఎన్నెఞ్జమే)** – పలు పలు జన్మల నెత్తి, వారికి ప్రేమతో కైంకర్యం చేయాలి అని ఆశపడుతున్నది నా మనస్సు.

**కారి నమ్పురై మేని నఱ్కతిర్ ముత్త వెణ్ణకై చ్చెయ్య వాయ్,**
**ఆరమార్ప నరఙ్గ నెన్ను మరుమ్ పెరుమ్ శుదరొన్టినై,**
**శేరు నెఞ్జినరాకి చ్చేర్న్దు కశిన్దిఱ్రిన్ద కణ్ణీర్కళాల్,**
**వార నిఱ్పవర్ తాళినైక్కు ఓర్ వార మాకుమ్ ఎన్నెఞ్జమే.** **7**

కార్ ఇనమ్ పురై మేని = మేఘాల సమూహంతో సాటి వచ్చే తిరుమేనిని, నల్ కతిర్ = అందమైన కాంతిని, ముత్తమ్ వెణ్ నకై = ముత్యాలవంటి తెల్లని దంతాలను కల, శెయ్య వాయ్ = ఎఱ్ఱని అధరాన్ని, ఆరమ్ మార్బన్ = ముత్యాల మాలను అలంకరించుకొన్న వక్షఃస్థలాన్ని కలవాడైన, అరఙ్గన్ ఎన్నుమ్ =శ్రీరంగనాథుడనే, అరుమ్ పెరుమ్ = దొరకడానికి అరుదైనది, గొప్పతనాన్ని కల్గినది అయిన, శుదర్ ఒన్టినై = సాటి లేని తేజోరాశిని, శేరుమ్ నెఞ్జినర్ ఆకి = పొంది అనుభవించాలనే మనస్సును కలవారై, శేర్న్దు = అతనిని సమీపించి, కశిన్దు ఇఱ్రిన్ద= (భక్తి బలాత్కారం చేత) కఱగి ప్రవహించే, కణ్ నీర్కళ్ = కన్నీరు, వార నిఱ్పవర్ = ప్రవాహమై ప్రవహించేటట్లు ఉండేవారి, తాళ్ ఇణైక్కు = రెండు శ్రీచరణాల విషయంలోను, ఎన్ నెఞ్జమ్ = నా మనస్సు, ఒరు వారమ్ ఆకుమ్ = (ప్రతిఫలాన్ని ఆశించని) సాటి లేని ప్రేమను కల్గి ఉంటుంది.

వ్యా :- ఏ*ழ்*ామ్బాట్టు. (కారి నమ్బురై మేని) "తొక్క మేక ప్పల్ కు*ழ்*ాజ్గళ్" ఎన్గుమ్, "కార్ త్తిరళనైయ మేని" ఎన్గుమ్ శొల్లుకిఅపడియే తిరుమేనియైయుమ్ ఉడైయరాయ్. (నల్ కతిర్ ముత్త వెణ్ణకై చ్చెయ్య వాయ్) కణ్డారై ప్పోకామల్ తువక్కవల్ల వెణ్మైయైయుడైయ ముత్తు నిరైపోలేయిరుక్కుమ్ ముఖువలైయుమ్, ఇతుక్కు ప్పరభాగమాన తిరువధరత్తిల్ ప*ழ்*ుప్పైయు ముడైయరాయ్. (ఆర మార్వన్) "పెరియవరై మార్విల్ పేరార మ్బూణ్డు" ఎన్గు ఐశ్వర్యప్రకాశకమామ్బడి ఇట్టు ప్పూణవేణ్డుమ్బడి యిరుక్కిఱ హారత్తైయుమ్ తిరుమార్పిలే యుడైయరాయిరుక్కిఱ. (అరజ్గ నెన్నుమ్ అరుమ్ పెరుఞ్జుడరొన్ఱినై) పెరియ పెరుమాళెన్గు ఉభయవిభూతియిలుమ్ ప్రసిద్ధరాయ్, నిరవధికతేజోరూపరాయ్ అద్వితీయరానవరై.

(శేరుమ్ నెఞ్జినరాకి) అవర్ వన్దు కిట్టుమ్బోతు విలక్కామై అడియాక ప్పిఱన్ద భక్తియై యుడైయరాయ్. (శేర్న్దు కశిన్ది*ழ்*ిన్ద కణ్ణీర్కళాల్ వారనిఱ్పవర్ తాళిణైక్కు) అవనై క్కిట్టి నిరతిశయభక్తియుక్తరాయ్, క్కణ్ణమ్ కణ్ణీరుమాయ్ నిఱ్కుమవర్కళుక్కు భక్తి పారవశ్యత్తాలేయిఱే ఎన్గు అఙ్గుత్తైక్కుమ్ ఇవర్కళుక్కుమాయ్ నిల్లాతే ఇవర్కళుడైయ తిరువడికళుక్కు. (ఓర్ వార మాకు మెన్నెఞ్జమే) అనన్యప్రయోజనమాయ్ నిల్లానిన్ఱతు ఎన్నెఞ్జు.

*అరు :- ఏ*ழ్*ామ్బాట్టు. (కారిన మిత్యాది). (వెణ్మైయైయుమ్) ఎన్గిఱ చ కారత్తాలే ఒళియైయుమ్ శొల్లుకిఱతు. "ఆరమ్" - ముత్తుమాలై.*

***(భక్తిపారవశ్యత్తాలే) "భగవద్భక్తిపరవశరా యిరుక్కైయినాలేయన్ఱో ఇవర్కళుక్కు ఇన్ద అతిశయ ముణ్డాయ్త్తు" ఎన్గు నాముమ్ ఇవర్కళై ఆదరిక్కిఱతెన్గు అవనైయుమ్ ఇవర్కళైయుమ్ కలశి ఆదరియాలే ఇవర్కళ్ ఆదరియానిన్ఱతు.***

**భావదీపిక :- అవ :-** భగవద్భక్తుల శ్రీచరణాలలో ప్రత్యుపకారాన్ని ఆశించని ప్రేమను నా మనస్సు కల్గి ఉన్నదని ఇందులో ఆ*ழ்*్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (కార్ ఇనమ్ పురై మేని)** - మొదటి పాదంతో భగవానుని తిరుమేని సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు. **"తొక్క మేక ప్పల్ కు*ழ்*ాజ్గళ్"** (తిరువాయ్-8-5-8) (గుంపులు గుంపులుగా చేరిన పలు మేఘాల సంఘాలు) అని నమ్మా*ழ்*్వార్లు, **"కార్త్తిరళ్ అనైయ మేని"** (తిరుమాలై-22) (మేఘాల గుంపు అనదగిన తిరుమేని) అని తొణ్డరడిప్పొడి యా*ழ్*్వార్లు అనుగ్రహించిన రీతిలో మేఘసమూహంతో పోలిన, అందమైన రూపాన్ని కలవాడు భగవానుడు- అని అంటున్నారు. దీనివల్ల తిరుమేనియొక్క అందం అనే సముదాయశోభ (లావణ్యం) చెప్పబడింది. ఇక ప్రత్యవయవ శోభను (సౌందర్యాన్ని) తెలుపుతున్నారు.

**(నల్ కతిర్ ముత్త వెణ్ణకై చ్చెయ్యవాయ్)** - అందమైన కాంతిని కల్గినది కనుక చూచేవారిని తనను అతిక్రమించి పోలేనట్లుగా ఆకర్షించగల, ముత్యాలవరుసవంటి, తెల్లదనాన్ని కల పలు వరుసను, దీనికి పరభాగశోభను కల్గించే అధరంయొక్క ఎఱ్ఱదనాన్ని కలవాడు శ్రీరంగనాథుడు- అని అంటున్నారు.

**(ఆర మార్వన్) - "పెరియ వరై మార్విల్ పేరారమ్ పూణ్డు" (మూన్ఱామ్.తిరు-55)** (పెద్ద కొండచరియవంటి వక్షఃస్థలంలో గొప్ప హారాన్ని ధరించి) అని వ్యక్తం అయేటట్లు, ప్రభువులచేతనే అలంకరించుకోతగిన హారాలను వక్షఃస్థలంలో కల్గినవాడై ఉంటాడు శ్రీరంగనాథుడు- అని అంటున్నారు. ఇది ఆభరణశోభను తెలుపుతుంది.

**(అరజ్గన్ ఎన్నుమ్ అరుమ్ పెరుమ్ శుడర్ ఒన్ఱినై)** - శ్రీరంగనాథుడని, **"పెరియపెరుమాళ్"** అని ఉభయవిభూతులలోను పొగడబడేవాడై, అంతు లేని కాంతిని కలవాడై, సాటిలేనివాడై ఉండేవాడు.

**(శేరుమ్ నెఞ్జినరాకి)** - శ్రీరంగనాథుని దరి చేరాలనే మనస్సును కలవారై- అని భావం. శ్రీరంగనాథుడు తానే స్వయంగా అభినివేశంతో వీరి దగ్గరకు వచ్చేటపుడు అడ్డుపెట్టకుండా ఉండే తగిన భక్తిని కలవారై.

**(శేర్న్దు కశిన్దు ఇఱ్ఱిన్ద కణ్ణీర్కళాల్ వార నిఱ్పవర్తాళినైక్కు)** - అతనిని సమీపించి, సాటి లేని భక్తిని కలవారై, కళ్ళలో ఆనందబాష్పాలు ప్రవించేటట్లు ఉండేవారికి. భగవానుని పట్లగల భక్తిచేత తమ వశం తప్పి ఉండేవారు వీరు అనే కారణంచేత అతనికి, వీరికి కలిపి కైంకర్యం చేయడం కాకుండా, వీరి శ్రీచరణాలకు మాత్రమే కైంకర్యాన్ని చేసేవారై ఉన్నారని భావం.

**(ఒరు వార మాకుమ్ ఎన్ నెఞ్జమే)** - ఆ శ్రీచరణాలనే ప్రయోజనం కల్గిఉండి, వేఱు ప్రయోజనాన్ని దీనినీ ఆశించకుండా నిలచి ఉన్నది నా మనస్సు- అని అంటున్నారు.

**మాలై యుఱ్ఱ కడల్ కిడన్దవన్ వణ్డుకిణ్డు నఱున్దుఴాయ్,**
**మాలై యుఱ్ఱవరై ప్పెరుమ్ తిరుమార్పనై మలర్క్కణ్ణనై,**
**మాలై యుఱ్ఱెన్దాడి ప్పాడి త్తిరిన్దు అరజ్గనెమ్మానుక్కే,**
**మాలై యుఱ్ఱిడుమ్ తొణ్డర్ వాఴ్విక్కు మాలైయుఱ్ఱతు ఎన్నెఞ్జమే 8**

మాలై ఉఱ్ఱ = (తన తిరుమేనిని స్పృశించినందువల్ల గర్వాన్ని పొంది, దానివల్ల) అలలు ఎగిసిపడే, కడల్ కిడన్దవన్ = సముద్రంలో శయనించి ఉండేవాడు, వణ్డు కిణ్డు= తుమ్మెదలు గూడుకట్టుకొని ఉండే, నఱు తుఴాయ్ మాలై ఉఱ్ఱ = తులసీ మాలను అలంకరించుకొన్న, వరై పెరు తిరుమార్బనై = పర్వతంవలె విశాలం అయిన వక్షః

స్థలాన్ని కలవాడు, మలర్ కణ్ణనై = ఎఱ్ఱ తామరలవంటి తిరునేత్రాలను కలవాడైన స్వామివిషయంలో, మాలై ఉఱ్ఱు = ప్రేమను కల్గి ఉండి, ఎழுన్దు ఆడి పాడి తిరిన్దు = నిలుచున్న చోట నిలువకుండా నాట్యం చేసి పాడి తిరిగి, అరఙ్గన్ ఎమ్మానుక్కే = శ్రీరంగనాథుడనే నా స్వామివిషయంలో, మాలై ఉఱ్ఱిడుమ్ = పిచ్చెక్కి తిరిగే, తొణ్డర్ వాழ்వుక్కు = శ్రీవైష్ణవుల శ్రీవైష్ణవసిరి పట్ల, ఎన్ నెఞ్జు మాలై ఉఱ్ఱతు = నా మనస్సు ప్రేమను కల్గి ఉన్నది.

**వ్యా :- ఎట్టామ్పాట్టు. (మాలై యుఱ్ఱ కడల్ కిడన్దవన్) స్వస్పర్శత్తాలే అలై ఎఱికిఱ తిరుప్పాఱ్కడలిలే కణ్వళర్న్దరుళుకిఱవన్. (వణ్డుకిణ్డు నఱున్దుழாయ్ మాలై యుఱ్ఱవరై ప్పెరున్దిరుమార్పనై) వణ్డుకళ్ నెరుఙ్గియిరుక్కిఱ శెవ్విత్తిరుత్తుழாయ్మాలై శేర్న్దు, వరై పోలే యిరుక్కిఱ పెరున్దిరుమార్వైయుడైయవరై. "మైపోల్ నెడు వరైవాయ్ త్తాழு మరువిపోల్ తార్ కిడప్ప" ఎన్నక్కడవతిఱే. (మలర్ క్కణ్ణనై) శెవ్వి త్తామరైప్పూప్పోలే మలర్న్ద తిరుక్కణ్గళై యుడైయ.**

**(మాలైయుఱ్ఱెழுన్దాడి ప్పాడి త్తిరిన్దు) భక్తియైయుడైయరాయ్, ఇరున్దవిడత్తిల్ ఇరుక్కవొట్టామైయాలే ఎழுన్దు ఆడువతు పాడువతాయ్ ప్రీతి ప్రేరిక్క ఇరుక్కమాట్టాతే సఞ్చరిత్తు. (అరఙ్గనెమ్మానుక్కే మాలైయుఱ్ఱిడుమ్ తొణ్డర్వాழ்వుక్కు) కోయిలిలే సులభరానపడియై క్కాట్టి, ఎన్నై ఎழுతిక్కొణ్డ పెరియపెరుమాళుక్కే భక్తికార్యమాన పిత్తేఱి త్తిరియుమ్ శ్రీవైష్ణవర్కళుడైయ వైష్ణవలక్ష్మిక్కు. (మాలై యుఱ్ఱతు ఎన్నెఞ్జమే) పిత్తేఱానిన్రతు ఎన్నెఞ్జు.**

*అరు:-ఎట్టామ్పాట్టు. (మాలై యిత్యాది). మాలైయుఱ్ఱకడల్ - ఉకళిప్పై యడైన్ద కడల్.*

**భావదీపిక :- అవ :-** శ్రీరంగనాథునిపట్ల భక్తిని మెండుగా కల్గిన భక్తుల శ్రీవైష్ణవసిరిపట్ల నా మనస్సు ప్రేమను కల్గి ఉన్నది- అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (మాలై యుఱ్ఱ కడల్ కిడైన్దవన్)**- భగవానుని స్పృశించడంవల్ల కల్గిన ఆనందంచేత అలలు ఎగిసిపడే క్షీరాబ్ధిలో నిద్రించేవాడైన. **(వణ్డు కిణ్డు నఱున్దుழாయ్ మాలై యుఱ్ఱ వరై ప్పెరుమ్ తిరుమార్పనై)** - తుమ్మెదలు దట్టంగా చేరి శబ్దించే, అపుడే వికసించిన తులసిచేత కూర్పబడ్డ మాలలో అలంకరింపబడిన పర్వతంవలె ఉండే గొప్ప వక్షఃస్థలాన్ని కలవానిని. **"మైపోల్ నెడు వరై వాయ్ త్తాழுమ్ అరువిపోల్ తార్ కిడప్ప"** (మూన్దామ్ తిరు-59) (కాటుక వంటి నల్లని గొప్ప పర్వతంపై ప్రవహించే నీటి ప్రవాహంవలె తులసీమాల ప్రకాశించగా) అని చెప్పబడుతున్నది కదా!

**(మలర్ క్కణ్ణనై)** - అపుడే వికసించిన తామరపూవువలె విరిసిన తిరునేత్రాలను కలవానిని.

**(మాలైయుఱ్ఱెళున్దు ఆడి ప్పాడి త్తిరిన్దు)** – భక్తిని కలవారై, ఆ భక్తి ఉన్న చోట ఉండనీయకపోవడంవల్ల లేచి ఆడడం, పాడడం మొదలైన చేష్టలను చేస్తూ, భక్తితో ప్రేరేపింపబడి, ఒక చోటనే నిలచి ఉండలేక, పలు చోట్లలో సంచరించి. **(అరఙ్గన్ ఎమ్మానుక్కే మాలైయుఱ్ఱీడుమ్ తొణ్డర్వాళ్వుక్కు)** – శ్రీరంగం పెరియకోయిల్‌లో అందఱికీ సులభుడై ఉండే సన్నివేశాన్ని చూపి, నన్ను దాసునిగా చేసికొన్న శ్రీరంగనాథుని పట్ల భక్త్యతిశయంచేత పిచ్చిపట్టి తిరిగే శ్రీవైష్ణవుల శ్రీవైష్ణవసిరికి వైష్ణవులై ఉండడమే గొప్ప సంపద– అని భావం.

**(మాలై యుఱ్ఱతు ఎన్ నెఞ్జమే)** – పిచ్చిపట్టి తిరుగుతున్నది నా మనస్సు.

**మొయ్త్తు క్కణ్ పని శోర మెయ్కళ్ శిలిర్ప్ప ఏఙ్గి యిళైత్తు నిన్ఱు,**
**ఎయ్త్తు క్కుమ్బిడు నట్టమిట్టు ఎళున్దాడి ప్పాడి యిఱైఞ్జి, ఎన్**
**అత్తనచ్చరఙ్గనుక్కు అడియార్కళాకి అవరుక్కే**
**పిత్తరామవర్, పిత్తరల్లర్కళ్ మఱ్ఱైయార్ ముఱ్ఱుమ్ పిత్తరే.** 9

కణ్ పని మొయ్త్తు శోర = కన్నులు వర్షధారలవలె ఆనందాశ్రువులను వర్షించేటట్లు, మెయ్కళ్ శిలిర్ప్ప = శరీరం గగుర్పాటు చెందేటట్లు, ఏఙ్గి ఇళైత్తు నిన్ఱు = (భగవానునితలచి) వెక్కి వెక్కి ఏడ్చి, అలసి, నిలచి, ఏయ్త్తు = స్థితి కలతజెంది, కుమ్బిడు నట్టమిట్టు = ససంభ్రమంగా నృత్యాన్ని చేసి, ఎళున్దు ఆడి పాడి ఇఱైఞ్జి = లేచి, ఆటలను ఆడి, పాటలను పాడి, నమస్కరించి, అరఙ్గనుక్కు = శ్రీరంగనాథునకు, అడియార్కళ్ ఆకి = భక్తులై, అవరుక్కే = ఆ శ్రీరంగనాథునకే, పిత్తర్ ఆమవర్ = (భక్తిని పొంది) పిచ్చెక్కి తిరిగేవారు, పిత్తర్ అల్లర్కళ్ = పిచ్చివారు కారు, మఱ్ఱైయార్ ముఱ్ఱుమ్ = ఈ విధంగా భక్తి లేని మిగిలిన వారంతా, పిత్తరే = పిచ్చి పట్టినవారు.

**అవ : ఒన్ఱుతామ్బాట్టు. పిత్తేతి త్తిరివార్క్కో నీర్ పిత్తేఱువతు? ఎన్న, ప్రాప్తవిషయత్తిల్ పిత్తేఱుమవర్కళ్ పిత్తరన్ఱు ఎన్గిఱార్.**

**వ్యా : (మొయ్త్తు క్కణ్ పని శోర) ఇరణ్డు కణ్ణాలే వర్షధారైపోలే శొరియ. (మెయ్కళ్ శిలిర్ప్ప) పుళకితగాత్రరాయ్. (ఏఙ్గి యిళైత్తు నిన్ఱు ఎయ్త్తు క్కుమ్బిడు నట్టమిట్టెళున్దాడిప్పాడి ఇఱైఞ్జి) విషయత్తై నినైత్తు ఏఙ్గి యిళైత్తు శిథిలరాయ్, అవ్వళవన్ఱియిలే స్తబ్ధరాయ్ నిన్ఱు. అన్నిలైయుమ్ నిల్లాతే. (కుమ్బిడు నట్టమిట్టు) ససంభ్రమనృత్తమ్బణ్ణి. (ఇఱైఞ్జి) దీర్ఘప్రణామత్తై ప్పణ్ణి.**

**(ఎన్నత్త నచ్చన్) ఎనక్కు జనకనుమాయ్, ఎనక్కు స్వామియుమానవన్. (అరఙ్గనుక్కడియార్ కళాకి) పెరియపెరుమాళుక్కు అనన్యప్రయోజనరాయిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళుక్కు**

**అడియరాకి. (అవనుక్కే పిత్తరామవర్ పిత్తరల్లర్‌కళ్) అవరుక్కు భక్తిమాన్‌కళాయ్ భక్తికార్యమాన పిత్తేఱి త్తిరికిఱవర్‌కళ్ పిత్తరల్లర్‌కళ్. (మற్ఱైయార్ ముற్ఱుమ్ పిత్తరే) ఇన్ద భక్తికార్యమాన పిత్తిల్లాతవర్‌కళ్ అడైయ ప్పిత్తర్. ఇక్కలక్క మిల్లాతే తెళిన్దిరుక్కుమ్ సనకాదికళేయాకిలుమ్ అవర్‌కళ్ పిత్తర్.**

**భావదీపిక :- అవ :-** పైత్యం పట్టి తిరిగేవారి విషయంలోనా మీరు పిచ్చెక్కి తిరగాలి? అనే ప్రశ్న రాగా, స్వరూపానికి తగిన విషయంలో పిచ్చెక్కి తిరిగేవారు నిజానికి పిచ్చివారు కారు; ఆవిధంగా కానివారే పిచ్చివారు- అని ఈ పాశురంలో ఆழ்వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (మెయ్‌త్తు కృణ్‌పని శోర)** - రెండు కళ్ళనుండి వర్షధారలవలె ఆనందబాష్పాలు కురియగా, **(మెయ్‌కళ్ శిలిర్‌ప్ప)** - శరీరంలో రోమాంచం కలుగగా, **(ఏజ్గి ఇళైత్తు నిన్ఱు ఎయ్‌త్తు కుమ్బిడు నట్టమిట్టు ఎழுన్దు ఆడిప్పాడి ఇఱైఞ్జి)** - భగవానుని తలచి అతనిని పూర్ణంగా అనుభవించలేక, వెక్కి వెక్కి ఏడ్చి అలసి నిలచి, స్థితి కలతచెంది, అంతటితో ఆగకుండా చేసేది ఏమో తెలియకుండా స్థాణువు వలె నిలచి, ఆ స్థితిలో కూడా స్థిరంగా ఉండకుండా.

**(కుమ్బిడు నట్టమిట్టు)** - నమస్కరిస్తూ తలకిందులుగా నాట్యంచేసి. **(ఇఱైఞ్జి)** - భూమిపై దండాన్నిపెట్టి.

**(ఎన్ అత్తన్ అచ్చన్)** - నన్ను సృష్టించినవాడై, స్వామియై ఉండేవాడైన.

**(అరజ్గనుక్కు అడియార్‌కళాకి)** - శ్రీరంగనాథుని తప్ప ఇంకొకరిని తెలియనివారై ఉండే శ్రీవైష్ణవులకు దాసులై. శ్రీవైష్ణవులకు దాసులు అయినపుడే భగవానునకు దాసులకు ఉండడం స్థిరంగా ఉంటుంది- అని భావం.

**(అవరుక్కే పిత్తరామవర్ పిత్తరల్లర్‌కళ్)** - వారిపట్ల ప్రేమను కలవారై, ఆ ప్రేమఫలంగా పిచ్చిపట్టి తిరిగేవారు నిజానికి పిచ్చివారు కారు. **(మற్ఱైయార్ ముற్ఱుమ్ పిత్తరే)** - ఈ భక్తియొక్క ఫలంగా కలిగే, పిచ్చిలేకుండా ఉండేవారు అందఱు పిచ్చివారే. ఈ కలత లేకుండా తెలివిని కల్గి ఉండేవారు సనకసందనాదులవలె జ్ఞానులైనా వారు పిచ్చివారే.

**అల్లి మామలర్ మజ్గైనాన్ అరజ్గన్ మెయ్యడియార్‌కళ్‌తమ్,**
**ఎల్లైయిల్ అడిమైత్తిఅత్తినిల్ ఎన్ఱు మేవు మనత్తనామ్,**
**కొల్లి కావలన్ కూడల్ నాయకన్ కోழிక్కోన్ కులశేకరన్,**
**శొల్లినిన్ఱమిழ்మాలై వల్లవర్ తొణ్డర్ తొణ్డర్‌కళావరే**

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

అల్లి మా మలర్ మజ్గై నాదన్ = లోపలి రేకులను కల అందమైన తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడై, అరఙ్గన్ = శ్రీరంగనాథుని, మెయ్ అడియార్‌కళ్‌తమ్= నిజమైన దాసులయొక్క, ఎల్లైయిల్ అడిమై తిఱత్తినిల్ = అంతు లేని కైంకర్యవృత్తిలో, ఎన్టుమ్ మేవు మనత్తన్ ఆమ్ = ఏకాలంలో అయినా పొందికగా ఉండే మనస్సును కలవారు, కొల్లి కావలన్ = కొల్లి నగరానికి అధిపతి, కూడల్ నాయకన్ = మధురకు ప్రభువు, కోழி క్కోన్ = ఉఱైయూర్‌కు రాజు అయిన, కులశేకరన్ = కులశేఖరప్పెరుమాళ్ యొక్క, ఇన్ తమిழ் మాలై వల్లవర్ = తీయని పదాలతో కూడిన ద్రావిడపాశురాలను అభ్యసించగల్గినవారు, తొణ్డర్ తొణ్డర్‌కళ్ ఆవరే = దాసులకు దాసులుకాగలరు.

**వ్యా. :- పత్తామ్బాట్టు. (అల్లి మామలర్‌మజ్గై నాతన్ అరఙ్గన్) శ్రియఃపతియాన పెరియపెరుమాళుడైయ. (మెయ్యడియార్‌కళ్‌తమ్) అనన్యప్రయోజనరాయిరుక్కుమ్ శ్రీవైష్ణవర్‌కళుడైయ. (ఎల్లైయిల్ అడిమైత్తిఱత్తినిల్ ఎన్టుమ్ మేవు మనత్తనామ్) ఆత్మదాస్యత్తిలే ఎన్టుమొక్క ప్పొరున్దిన తిరువుళ్ళత్తైయుడైయరాయ్.**

**(కొల్లి కావలన్ కూడల్ నాయకన్ కోழிక్కోన్) కొల్లిక్కుమ్, మధురైక్కుమ్, ఉఱైయూరుక్కుమ్ నాయకరాన పెరుమాళ్. పెరియవుడైయారుడైయ ఇழవాల్ వన్ద వెఱుప్పాలే "వనవాసో మహోదయః" ఎన్టు వనత్తుక్కు ప్పోన్దతు ప్రియమాయిరున్దవర్‌క్కు "రాజ్యాద్భ్రంశో వనే వాసః" ఎన్టు ఇవ్విழవాలే అడియిల్ పోన్దతువు మెల్లామ్ తమక్కు వెఱుప్పుక్కుడలానాప్పోలే, "ఊనేఱు శెల్వత్తుదత్పిఱవి యాన్ వేణ్డేన్" ఎన్టుమ్, "ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్" ఎన్టుమ్ శొల్లుకిఱ ఇవర్‌క్కు త్తదీయశేషత్వత్తై త్తన్ద జన్మమెన్టు రాజ జన్మన్దన్నైయుమ్ కొణ్డాడుకిఱారితే. (శొల్లినిన్ తమిழ్‌మాలై వల్లవర్) ఇనితాన శబ్దఙ్గళై యుడైయ తమిழ్‌త్తొడై వల్లవర్‌కళ్. (తొణ్డర్ తొణ్డర్‌కళావరే) ఇవర్ ఆశైప్పట్టు ప్పోన్ద భాగవతశేషత్వమాకిఱ పురుషార్థత్తై లభిప్పర్‌కళ్.**

**పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.**

**పెరుమాళ్ తిరుమొழி ఇరణ్డామ్‌తిరుమొழி వ్యాఖ్యానమ్ ముగ్గిగ్గు.**

*అరు :- పత్తామ్బాట్టు (అల్లి యిత్యాది). "కొల్లి కావలన్" ఇత్యాదియాలే త్యాజ్యమాన జన్మత్తై యిట్టు త్తమ్మై క్కొణ్డాదలామో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (పెరియవుడైయారిత్యాది). "వనవాసో మహోదయః" ఎన్టు - రసావహమాన కాదు, పెరియవుడైయారుడైయ విశ్లేషత్తాలే "వనే వాసః" ఎన్టు దుఃఖహేతువానాప్పోలే త్యాజ్యమాన జన్మముమ్ తదీయవిషయత్తై ప్పగ్గు కైక్కు హేతువాకైయాలే కొణ్డాదలా మెన్టపడి.*

**భావదీపిక:- అవ :-** ఈ పది పాశురాలను అభ్యసించగల్గినవారు భగవద్భక్తులకు దాసులు కాగలరని అంటూ ఫలాన్ని తెలిపి ఈ పదవ పాశురంతో నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (అల్లి మా మలర్ మజై నాదన్ అరజ్గన్)** – శ్రియఃపతియైన శ్రీరంగనాథుని. **(మెయ్యడియార్కళ్తమ్)** – అతని విషయంలో అతని ఆనందంకోసమైన కైంకర్యాన్ని తప్ప, వేఱు దేనినీ ప్రయోజనంగా భావించని శ్రీవైష్ణవులయొక్క **(ఎల్లైయిల్ అడిమై త్తిఅత్తినిల్ ఎన్జుమ్ మేవుమ్ మనత్తనామ్)– "స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహా యది, ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావం చ సదా స్మర"** (విష్ణుధర్మమ్) (నీ ఉజ్జీవనంలో నీకు ఆశ ఉన్నట్లయితే, నీ సత్తలో నీకు ఆశ ఉన్నట్లయితే, ఆత్మయొక్క దాసత్వం, హరియొక్క స్వామిత్వం అనేవి స్వభావసిద్ధమైనవి– అని ఎల్లప్పుడు స్మరించు) అని చెప్పబడ్డ అంతు లేని కైంకర్యంలో ఎల్లప్పుడు అభినివేశాన్ని పొంది ఉండే మనస్సును కలవారైన.

**(కొల్లి కావలన్ కూడల్ నాయకన్ కోழிక్కోన్)** – "కొల్లి" అనే చేరదేశానికి రాజధాని. "కూడల్" అనే మధుర పాండ్యదేశానికి రాజధాని, **'కోழி'** అనబడే ఉఱైయూర్చోళదేశానికి రాజధాని. ఈ మూడిటికి అధిపతి. అంటే– చేరచోళపాండ్యరాజ్యాలకు మూడు కులశేఖరుల పాలనకు లోబడి ఉన్నవి అని తెలుపబడినట్లయింది. తమ పాశురాలలోనే **"అరశై వేణ్డేన్"** పలికే వీరు, ఈ రాజ్యాలకు ప్రభువును– అని తమను నిర్దేశించుకోవచ్చా! అని అంటే, శ్రీరాముని కొన్ని సూక్తులను ఇక్కడ గమనిస్తే కులశేఖరప్పెమాళయొక్క ఈ సూక్తులను అర్థం చేసికోవచ్చు. **"మా చ లక్ష్మణ సంతాపం కార్షీ ర్లక్ష్మ్యా విపర్యయే, రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః"** (రామా–అయో–22–29) (లక్ష్మణా! రాజ్యలక్ష్మి చేయిదాటి పోయినందుకు చింతించకు. రాజ్యం, వనవాసం– అనే ఈ రెండిటిలో వనవాసమే గొప్పదిగా నాకు తోస్తున్నది) అని శ్రీరాముడు వనవాసానికి బయలుదేరేటపుడు రాజ్యంకంటే వనవాసమే గొప్పది అని పల్కి, లక్ష్మణస్వామిని ఓదార్చాడు. అయితే వనవాసాన్ని చేరిన తర్వాత సీతావిశ్లేషాన్ని, జలాయువధను చూచిన తర్వాత వనవాసంలో తాను పొందిన ఆనందాలను అన్నిటినీ మఱచి, **"రాజ్యాత్ భ్రంశో వనేవాసః, సీతా నష్టా హతో ద్విజః, ఈదృశీయం మమాలక్ష్మీః నిర్దహేదపి పావకమ్"** (రామా–ఆర–67–24) (రాజ్యాన్ని కోల్పోవడం, వనంలో నివసించడం, సీతను పోగొట్టుకోవడం, జటాయువు వధింపడడం– అనే ఈ రీతిలో నాకు కల్గిన దుఃఖాలు నిప్పును కూడా దహిస్తాయి) అని అంటూ ఈ దుఃఖాలే పెద్దవిగా తోచి, రాజ్యాన్ని కోల్పోవడం, వనవాసం కల్గడం తనను చాలా బాధపెట్టినట్లు పలికాడు. ఈ విధంగా శ్రీరామునకు ఒక సమయంలో తీయనిదై తోచిన వనవాసం చాలా కఠినంగా ఇంకో సమయంలో తోచింది. అదేవిధంగా, కులశేఖరప్పెరుమాళ్కూడా **"ఊనేఱు శెల్వత్తు ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్"** (మాంస ప్రచురం అయిన దేహాన్ని పెంచే సంపదను కల ఈ మానవ జన్మను నేను కోరను) (4–1) అని, **"ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్"** (ఆనందాన్ని కల్గించే సంపదను ఈ రాజ్యాధికారాన్ని నేను కోరను) (4–

5) అని భగవద్విషయాన్ని అనుభవించడంలో అడ్డుగా ఉండడంవల్ల రాజ్యాన్ని, దానిని ఇచ్చిన రాచపుట్టుకను గర్హించారు. అయితే, అదే రాచపుట్టుక వీరికి భగవానుని భక్తులకు కైంకర్యాన్ని చేసే అతిశయాన్ని కల్గించినందువల్ల దానిని పొగడుతున్నారు. కనుక ఈ విధంగా నింద్యమైన రాచపుట్టుకే వీరికి ప్రశంసించదగినది కావడంలో అడ్డు లేదు.

**(శొల్లిన్ ఇన్ తమిழ் మాలైవల్లవర్)** – తీయని పదాలను కల ద్రావిడ పాశురాలతో కూర్చిన ఈ దశకాన్ని చక్కగా అనుసంధించగలవారు,

(తొణ్డర్ తొణ్డర్కళ్ ఆవరే) – వీరు ఈ దశకంలో ఇంకా ఇంకా లభించాలని ఆశపడిన 1. భక్తుల సంఘాలను దర్శించడం 2. భక్తుల శ్రీపాదధూళిలో నిమగ్నులై తీర్థమాడడం, 3. దాసుల ఎఱ్ఱని శ్రీచరణాల పంకాన్ని శిరస్సుకు అలంకరించుకోవడం, 4. భక్తుల అందమైన శ్రీచరణాలను స్తుతించి మంగళాశాసనం చేయడం, 5. దాసులను స్మరించి గగుర్పాటు పొందడం, 6. భక్తులకు ఏరూపంలో అయినా భక్తిని కల్గి ఉండాలని కోరుకోవడం, 7. వారి శ్రీచరణద్వయి విషయంలో ఆనుకూల్యాన్ని కల్గిఉండడం, 8. శ్రీవైష్ణవుల శ్రీవైష్ణవ సిరిపట్ల ప్రేమను కల్గి ఉండడం, 9. భక్తులపట్ల పిచ్చివారు కావడం– అని ఈ రీతిలో అన్నివిధాల ఫలాలను పొంది ఆనందిస్తారు– అని అంటూ ఫలాన్ని పల్కి ఈ ద్వితీయదశకాన్ని నిగమిస్తున్నారు.

**ఇరణ్డామ్ తిరుమొழி – వ్యాఖ్యానం అనువాదం ముగిసింది.**
**కులశేఖరాழ்వార్ తిరువడికళే శరణమ్**

## మూన్ఱామ్ తిరుమొழி – మెయ్యిల్ – ప్రవేశమ్

**అవ :– "పేరాళన్ పేరోతుమ్ పెరియోరై యెరు కాలుమ్ పిరికిలేన్" ఎన్ఱు భగవత్ప్రావణ్యమ్ తదీయశేషత్వపర్యన్తమాయ్, అవర్కళాలల్లతు శెల్లామై పిఱక్కుమళవు ముణ్డానతు శొల్లిన్ఱు– కీழில్ తిరుమొழியిల్. "ఎణ్ణాత మానిడత్తై ఎణ్ణాతపోతెల్లా మినియవాతే", "మానిడవరల్లర్ ఎన్ఱు ఎన్ మనత్తే వైత్తేనే" ఎన్ఱుమ్, "పిత్తరెన్ఱే పిఱర్ కూఱ" ఎన్ఱుమ్ పిఱక్కు మవస్థై యుణ్డు, భగవత్ప్రావణ్యత్తాలే. మున్బిల్ అతుక్కు సఙ్కల్పమాత్రమే యాయ్త్తు వేణ్డువతు; అడిమై అవర్కళ్ కొళ్ళ క్కొళ్ళవితే శెయ్వతు. ప్రాతికూల్యత్తిల్ వర్జిత్తే నిఱ్కవేణుమ్, భగవద్గుణఙ్గళోడ పాతి విభూతియుమ్ తదీయత్వాకారత్తాలే అనుభావ్య మెన్ఱు శొన్న శాస్త్రన్దానేయితే ఇత్తై త్యాజ్య మెన్ఱతుమ్. జ్ఞానకార్యమాయితే తదీయరుద్దేశ్యమాకిఱతుమ్, తమోగుణప్రచురరోడు సహవాసమ్ పొరున్దిన్ఱాకిల్ అజ్ఞానకార్యమితే.**

"మత్త స్సర్వ మహమ్" ఎన్ఱు సామాన్యబుద్ధి పణ్ణిన శ్రీప్రహ్లాదాழ்వాన్ పూర్వావస్థైయిల్, "మత్పితుః" ఎన్ఱు- అనవై రక్షిక్క ప్పార్త్తవన్ ప్రాతికూల్యత్తిలే విఞ్జినవాఱే అవనై విట్టు క్కాట్టిక్కొడుత్తానిఱే. శ్రీవిభీషణాழ்వాన్, ఆన్దనైయుమ్ హితమ్ శొల్లి ప్పార్త్తు త్తన్ హితత్తుక్కు మీళాత అవస్థైయానవాఱే, నెరుప్పుప్పట్ట విడత్తిల్ విలక్కవొణ్ణాత పోతు తన్నైక్కొణ్డు తాన్ తప్పువారైప్పోలే, ప్రాతికూల్యమ్ అశలిట్టు త్తన్నళవుమ్ వరు మెన్ఱు తన్నైక్కొణ్డు తాన్ తప్పినానిఱే. ప్రాతికూల్యమాకిఱతు - దేహాత్మాభిమానికళాకైయుమ్, విషయ ప్రవణరా యిరుక్కైయుమ్, దేహాద్వ్యతిరిక్తమ్ వేఱొరు వస్తు ఉణ్డెన్ఱఱియాతిరుక్కైయు మివైయిఱే, ఇప్పడి యిరుప్పారోడు ఎనక్కు ప్పొరున్దాతెన్గిఱార్ - ఇత్తిరుమొழியిల్.

*అరు :- మెయ్యిల్ వాழ்க్కై - ప్రవేశే."ఆనుకూల్యస్య సఙ్కల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్" ఎన్గిఱపడియే అనుకూల్యసఙ్కల్పమ్ శొల్లిన్ఱు - కీழ், ప్రాతికూల్యవర్జనమ్ శొల్లుకిఱతు - ఇత్తిరుమొழியిల్. ఇవన్ఱై యరుళిచ్చెయ్‌కిఱార్ (పేరాళ నిత్యాది వాక్యద్వయత్తాలే) కీழ் ఆనుకూల్యసఙ్కల్పత్తై ప్పారిత్తు, ఇఙ్గు "వర్జనమ్" ఎన్ఱు నన్ఱాక విట్టపడి శొల్లుకిఱతుక్కు క్కరుత్తెన్? ఎన్నిల్, అరుళిచ్చెయ్‌కిఱార్ (భగవత్ప్రావణ్యేత్యాది). గుణఙ్గళోపాతి విభూతియుమ్ తదీయత్వాకారత్తాలే ఉద్దేశ్యమన్ఱో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (భగవద్గుణఙ్గళిత్యాది) త్యాజ్య మానాల్ శిఱితు పేరుద్దేశ్యమాయుమ్, శిఱుతు పేర్ త్యాజ్యమాకిఱతు ఎన్? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్ (జ్ఞానకార్య మిత్యాది).*

*అజ్ఞానహేతు ఎన్ఱు విట్టపేరుణ్డో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (మత్త స్సర్వ మిత్యాది). సముద్రత్తిల్ తన్నై ప్పోకట్టపోతు సర్వేశ్వరనై క్కణ్డు తన్ పితా పణ్ణిన పాపత్తై ప్పొఱుక్కవేణు మెన్ఱు వేణ్డిక్కొణ్డా నెన్ఱతైప్పన్ఱ (మత్పితుః - రక్షకప్పార్త్తవన్ ఎన్గిఱతు)*

## మూన్ఱామ్ తిరుమొழி - అవతారిక - అనువాదం

రెండవ దశకంలో **"పేరాళన్ పేరోదుమ్ పెరియోరై ఒరుకాలుమ్ పిరికిలేనే"** (పెరియ.తిరు-7-4-4) (భగవానుని తిరునామాలను అనుసంధించే మహాత్ములను ఏ సమయంలోను విడువను) అనే రీతిలో భగవానునిపట్ల ఉండే అభినివేశం అతని భక్తులకు దాసుడై ఉండే పర్యంతం పరణమించి, వారిని విశ్లేషించి జీవించలేని స్థితి కల్గడాన్ని గూర్చి తెలియజేశారు. ఇది ప్రపన్నునకు సంభావితస్వభావం. అయిన (తనకు తానుగానే కలిగే స్వభావం అయిన) ఆనుకూల్యసంకల్పంలోకి చేరుతుంది.

ఇక, ఈ మూడవ దశకంలో చెప్పబడే విషయం ఏమంటే- భగవద్భాగవత విషయంలో ఈ విధమైన అభినివేశాన్ని కలవారికి, తమోగుణం అతిశయించడంవల్ల ఈ అభినివేశం లేనివారితో కలయిక లేకపోవడమనే ప్రాతికూల్యవర్జనం. ఇది ప్రపన్ననకు కలిగే ఇంకొక స్వభావం. ఇది మూడవ దశకంలో చెప్పబడుతున్నది. **"ఎణ్ణాద మానిడత్తై**

**ఎణ్ణాదపోదెల్లామ్ ఇనియవాతే"** (పెరియ. తిరు- 11-6-7) (ఆ భగవానుని చింతించని మానవునిగూర్చి భావించని సమయమంతా నాకు మధురంగా ఉండే తీరు ఎంత వింత? **"మానిడవర్ అల్లర్ ఎన్ఱు ఎన్ మనత్తే వైత్తేన్"** (పెరియతిరు 11-7-6) (భగవానుని స్మరించనివారు మానవులు కారని నా మనస్సులో తలచాను) అని తిరుమఙ్గైయాళ్వార్లు, **"పిత్తర్ ఎన్ఱే పలర్ కూఱ"** (తిరువాయ్ 3-5-8) (పిచ్చివాడని పలువురు నన్ను అనేటట్లుగా) అని నమ్మాళ్వార్లు ఈ స్వభావం. శ్రీవైష్ణవప్రపన్నులకు తప్పక కలుగవలసినది- అని పలికారు. గత దశకంలో చెప్పబడ్డ ఆనుకూల్యానికి "భగవద్భక్తులకు దాసుడనై ఉంటాను" అని సంకల్పించడంతోనే సరిపోతుంది. ఇది, కార్యకరమై దాస్యం చేయడం భగవద్భక్తులకు దాస్యం చేసినపుడే పూర్తి అవుతుంది.

భగవద్భాగవతులపట్ల అభినివేశం లేనివారిని తప్పక విడిచి పెట్టాలని అంటూ ఈ మూడవ దశకంలో చెప్పబడే అర్థంలో సంకల్పమాత్రం చాలదు. వారిని విడచిపెట్టే తీరాలి. భగవద్భాగవతులపట్ల ప్రేమ లేనివారుకూడా భగవానుని లీలావిభూతి అనే ఐశ్వర్యంలో చేరినవారై ఉండగా, అతని విభూతి అయిన వీరిని వర్జించవచ్చునా? అని అంటే, భగవానుని లీలావిభూతి అంతా అతని విభూతి అనే కారణంతో అతని కల్యాణ గుణాలవలె అనుభావ్యం అని పల్కిన శాస్త్రమే **"ప్రాతికూల్యస్య వర్జనమ్"** (అహిర్బుధ్న్య- 37-27) అని వీరిని విడచి పెట్టాలని చెప్పినందువల్ల, జ్ఞానులు వీరిని విడచిపెట్టి తీరాలి. భగవద్భాగవతులు పరిగ్రాహ్యులు అని, వారిపట్ల అభినివేశం లేనివారు విడచిపెట్టదగినవారు- అని నిశ్చయం కల్గడం జ్ఞానంవల్లనే కదా సంభవిస్తుంది. భగవద్భాగవతులపట్ల అభినివేశం లేని, తమోగుణం అతిశయించిన వారితో చేరిక అజ్ఞానంవల్ల కల్గుతుంది. కనుక, వారు విడువతగినవారే. **"సర్వగత్వా దనంతస్య స ఏవాహ మవస్థితః, మత్తః సర్వ మహం సర్వం మయి సర్వం సనాతనే"** (విష్ణుపురా- 1-19-85) (అనంతుడు అంతటా వ్యాపించి ఉన్నందువల్ల నేను అతడినై ఉన్నాను. నాలోనే అన్ని ఉన్నాయి) అని లోకం అంతా తనకు అంతర్యామిగా ఉండే భగవానుని కోసమే అని దర్శించిన ప్రహ్లాదాళ్వాన్ **"మయి ద్వేషానుబంధోఽ భూత్ సంస్తుతా వుద్యతే తవ! మత్పితు స్తత్కృతం పాపం దేవ! తస్య ప్రణశ్యతు"** (వి.పు.1-20-21) (దేవా! నిన్ను సదా స్తుతించడానికి ప్రయత్నించిన నా విషయంలో నా తండ్రికి నా పట్ల ద్వేషం ఏర్పడింది. దానివల్ల నా తండ్రికి కల్గిన పాపం నశించాలి.) అని అంటూ తన తండ్రి అయిన హిరణ్యుడు తనను సముద్రంలోకి తోసివేసినపుడు ఆ భగవానుని ఆగ్రహంనుండి రక్షించాలని ప్రయత్నించాడు. అయినా, అతడు భగవానుని ద్వేషించడంలో శ్రుతిమించిన తర్వాత అతనిని విడచి, నృసింహమూర్తి అతనిని సంహరించేటట్లుగా విడచివేశాడు కదా! శ్రీవిభీషణాళ్వాన్ కూడా తన అన్న అయిన రావణునకు "సీతను విడచిపెట్టు" అని వీలయినంతవరకు మంచిని ఉపదేశించి చూచాడు. అయినా రావణుడు తాను

పల్కిన మంచి మాటలను విననందువల్ల అతనిని విడచి, నిప్పు అంటుకొన్న ఇంటినుండి ఆ నిప్పును ఆర్పడానికి వీలుకానపుడు, తాను దానినుండి తప్పించుకొని పోయే రీతిలో, రావణునితో కలసి ఉంటే అతని ప్రాతికూల్యం తననుకూడా నశింపజేస్తుంది అని రావణుని విడచిపెట్టి, శ్రీరాముని దగ్గరకు వచ్చాడుకదా! ప్రాతికూల్యం అన్నది– దేహమే ఆత్మ అని భావించడం; శబ్దాదిలౌకికవిషయంలో అభినివేశాన్ని పొంది ఉండడం; దేహం కంటే విలక్షణం అయిన ఆత్మ, పరమాత్మ ఉన్నాయి అని తెలియకుండా ఉండడం– అనే రీతిలో పలు విధాలుగా ఉంటుంది. ఇటువంటి ప్రాతికూల్యాన్ని కల్గి ఉన్నవారితో నాకు సంబంధం లేదు– అని ఈ దశకంలో ఆழ்వార్లు అంటున్నారు.

**ప్రవేశం అనువాదం ముగిసింది.**

**మెయ్యిల్ వాழ்க్కైయై మెయ్యెన క్కొళ్ళుమ్, ఇ**
**వ్వైయన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఐయనే! అరఙ్గా! ఎన్ఱழைక్కిన్ఱేన్,**
**మైయల్ కొణ్డొழிన్దేన్ ఎన్దన్ మాలుక్కే** 1

మెయ్ ఇల్ వాழ்క్కైయై = అస్థిరం అయిన ఈ లౌకికజీవనాన్ని, మెయ్ ఎన కొళ్ళుమ్ = స్థిరమైనది అని భావించే, ఇవ్వైయమ్ తన్నొడుమ్ = ఈ లౌకికులతో, యాన్ కూడువతు ఇల్లై = నేను చేరను, ఐయనే = (ఓ నిరుపాధిక) బంధువా!, అరఙ్గా= శ్రీరంగనాథా!, ఎన్ఱు అழைక్కిన్ఱేన్ = అని పిలుస్తున్నాను, ఎన్‌తన్ మాలుక్కే = నాపట్ల ప్రేమను కల భగవానుని విషయంలోనే, మైయల్ కొణ్డొழிన్దేన్ = ప్రేమను (భక్తిని) కల వాడనై ఉన్నాను.

**వ్యా. :– ముతఱ్పాట్టు. (మెయ్యిల్ వాழ்క్కైయై మెయ్యెన క్కొళ్ళుమ్) మెయ్యెన్ఱుమ్ పొయ్యెన్ఱుమ్ - నిలై యిల్లామైయైయుమ్, నిలై నిఱ్కుమత్తైయుమ్ శొల్లుకిఱతు. నిలై నిల్లాతతిలే, నిత్యమాన ఆత్మవస్తువిల్ పణ్ణుమ్ ప్రతిపత్తియై ప్పణ్ణు మెన్నుతల్, మెయ్యిలే యుణ్డాన వాழ்క్కై ఎన్నుతల్. అతాకిఱతు – ప్రకృతియై ప్పఱ్ఱివరుమ్ ప్రాకృత భోగఙ్గళితే. (ఇవ్వైయన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్) దేహాత్మాభిమానికళాయిరుప్పారోడు ఎనక్కొరు శేర్త్తి యిల్లై.**

**(ఐయనిత్యాది) దేహాద్వ్యతిరిక్తమ్ వేఱొరువరుణ్డు ఎన్ఱఱిన్దవన్ ఎన్గిఱార్. (ఐయనే) నిరుపాధిక బన్ధువే. (అరఙ్గా) అనుష్ఠానపర్యన్తమాక్కిన, మూతలిత్తాప్పోలే కోయిలే వన్దు సులభనానవనే. (ఎన్ఱழைక్కిన్ఱేన్) కారియప్పాడఱ క్కూప్పిడానిన్ఱేన్. (మైయల్ కొణ్డొழிన్దేన్ ఎన్దన్ మాలుక్కే) అవన్ ఎనక్కు ప్పిత్తేఱినపడియై క్కణ్డు నానుమ్ అవనుక్కు ప్పిత్తనానేన్.**

**భావదీపిక :- అవ :-** అస్థిరమైన ఈ లౌకిక జీవనాన్ని స్థిరమైనది అని భావించే అజ్ఞులతో నేను చేరను. నాపట్ల వాత్సల్యాన్ని కల భగవానుని విషయంలో నేను ప్రేమను కల్గి ఉంటాను - అనిఅంటూ ఈ పాశురంలో ఆళ్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (మెయ్యిల్ వాழ్క్కైయై మెయ్ ఎన కొళ్ళుమ్)** - అస్థిరం అయిన ఈ లౌకిక జీవనాన్ని స్థిరమైనది అని చెప్పే- అని భావం. **"ఇవ్వైయమ్"** అనే పదానికి ఈ ప్రయోగం విశేషణం. **"మెయ్యిల్ వాழ్క్కై"** అని ఈ లోకజీవనాన్ని చెప్పడం బౌద్ధులు మాయా వాదులు చెప్పే రీతిలో "లేనిది ఉన్నట్లు భాసించే లోకజీవనం" అనే అర్థంలో కాదు. ఎందుకంటే- ఈ ఆళ్వార్ల మిగిలిన పాశురాలు ఆ మతాలకు విరుద్ధంగా ఉన్నందున. అందువల్ల ఇక్కడ **'మెయ్'** అని స్థిరంగా నిలచి ఉండే విషయాన్ని, **"మెయ్యిల్ వాழ్క్కై"** అని అస్థిరమైన ఈ లౌకిక జీవనాన్ని తెలుపుతున్నవి. స్థిరంగా నిలువని అచేతన వస్తువులను ఆశ్రయించి ఉండే ఈ లోకజీవనంలో స్థిరంగా ఉండే ఆత్మ- పరమాత్మలవలె నిత్యమని భావించే లోకజీవనాన్ని- అనే అర్థాన్ని ఇస్తుంది. లేక, **"మెయ్"** అనే పదం ఈ శరీరాన్ని నిర్దేశించేదై, **'మెయ్యిల్ వాழ్క్కైయై"** అనే ప్రయోగం ఈ శరీరాన్ని ఆశ్రయించి ఉండే లౌకిక జీవనం అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అంటే - మూలప్రకృతి అనే అచేతనంయొక్క వికారం అయిన ఈ శరీరాన్నిబట్టి ఏర్పడే శబ్దాదిభోగాలను తెలుపుతుంది.

**(ఇవ్వైయమ్ తన్నొడుమ్ కూడువతు ఇల్లైయాన్)** - "దేహమే ఆత్మ" అని భావించేవారితో నాకు ఏవిధమైన సంబంధం లేదని అంటున్నారు. పాశురంలోని చివరి రెండు పాదాలతో, దేహంకంటే విలక్షణం అయిన, జీవునకు అంతర్యామి అయిన పరమాత్మను నేను తెలిసికొన్నాను- అని అంటున్నారు.

**(ఐయనే)** - కర్మమూలంగా కలిగే సంబంధాలవంటివి కాకుండా సహజమైన, నిరుపాధికమైన సంబంధాన్ని కలవాడా !

**(అరఙ్గా)** - ఈవిధంగా సహజమైన సంబంధాన్ని కలవాడు- అని శాస్త్రాలు చెప్పగా వినడం మాత్రమే కాకుండా, దానిని నిరూపించేటట్లే, చేతనులను ఉజ్జీవింపజేయడంకోసం శ్రీరంగంలో పరుండి ఉండి, అందటికి సులభుడవై ఉండేవాడా !

**(ఎన్రు అழైక్కిన్రేన్)** - ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, ఈ విధంగా పిలువడమే ఒక ప్రయోజనంగా భావించి పిలుస్తున్నాను.

**(మైయిల్ కొణ్డు ఒழிన్దేన్ ఎన్దన్ మాలుక్కే)** - అతడు నాపట్ల గొప్పప్రేమను కల్గి ఉండడాన్ని చూచి నేనుకూడా అతనిపట్ల గొప్ప ప్రేమను పొందాను.

**నూలినేరిడైయార్ తిఱత్తే నిఱ్కుమ్,**
**ఞాలన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఆలియా అழైయా అరఙ్గా! ఎన్ఱు,**
**మాలెழுన్దొழிన్దేన్ ఎన్దన్ మాలుక్కే** 2

నూలిన్ నేర్ ఇడైయార్ తిఱత్తే నిఱ్కుమ్ = నూలుదారంవంటి సన్నని నడుమును కల స్త్రీలపట్ల అభినివేశాన్ని కల్గి ఉండే, ఞాలమ్ తన్నొడుమ్ = ఈ లోకంలోని వారితో, యాన్ కూడువతు ఇల్లై = నేను చేరను, ఆలియా = (ప్రేమాధిక్యంచేత) ఆడి, అరఙ్గా ఎన్ఱు = శ్రీరంగా ! అని శ్రీరంగనాథుని నామాన్ని పల్కి, అழிయా = పిలిచి, ఎన్‌తన్ మాలుక్కే = నా విషయంలో వాత్సల్యాన్నికల స్వామిపట్ల, మాల్ ఎழுన్దొழிన్దేన్ = వ్యామోహాన్ని పొంది ఉన్నాను.

**వ్యా. :- ఇరణ్డామ్పాట్టు. (నూలినేరిడైయార్ తిఱత్తే నిఱ్కుమ్) నూల్‌పోల్ నుణ్ణియ ఇడైయై యుడైయరాయిరుక్కుమ్ స్త్రీకళ్‌తిఱత్తిలే నిఱ్కుమ్. ఒరు అవయవత్తై అనుభవిక్కప్పు క్కాల్ మఱ్ఱైయ అవయవత్తిల్ పోకమాట్టాతే నిఱ్కుమ్. (ఞాలన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్) ప్రాప్తవిషయత్తిలిల్ ఇరుక్కక్కడవ ఇరుప్పై అప్రాప్తవిషయత్తే యిరుక్కుమవర్ కళోడు ఎనక్కొరు సమ్బన్ధ మిల్లై.**

**(ఆలియా ఇత్యాది) ఇవర్‌కళ్ అప్రాప్తవిషయత్తిలే పడుమ్ పాడెల్లామ్ ప్రాప్తవిషయత్తే పడుమవన్ నాన్- ఎన్గిఱార్. (ఆలియా అழிయా అరఙ్గా వెన్ఱు) ప్రీతిప్రకర్షత్తాలే యిరుక్కమాట్టాతే ఆలియా, పెరియపెరుమాళ్ తిరునామత్తై చ్చొల్లి అడైవు కెడ క్కూప్పిడా. (మాలెழுన్దొழிన్దే నెన్దన్ మాలుక్కే) "తేన తే తమనువ్రతాః" ఎన్నుమాపోలే అవన్ ఎన్బక్కల్ వ్యాముగ్ధనాన పడి కణ్డు నానుమ్ పిత్తేఱినేన్.**

**భావదీపిక :- అవ :-** అల్పానందంలోనే అభినివేశాన్ని కల ఈ లోకంలోనివారితో నేను చేరను. భగవానుని విషయంలోనే అభినివేశాన్ని పొందుతున్నాను- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (నూలినేర్ ఇడైయార్ తిఱత్తే నిఱ్కుమ్)** - నూలువలె సన్నని నడుమును కలవారై ఉండే స్త్రీల విషయంలో ఆసక్తిని కల్గి ఉంటారు. **"నిఱ్కుమ్"** అని అన్నందున వారి ఒక్కొక్క అవయవాన్ని అనుభవించాలని ప్రారంభిస్తే, మిగిలిన అవయవాలలోకి పోకుండా ఉంటారు- అని తెలుపుతున్నారు.

**(ఞాలమ్ తన్నొడుమ్ కూడువదిల్లై యాన్)** - ప్రాప్తవిషయం అయిన భగవద్విషయంలో చూపవలసిన అభినివేశాన్ని స్వరూపవిరుద్ధాలైన విషయాలలో చూపేవారితో నాకు ఏ సంబంధం లేదు- అని అంటున్నారు. వారు తగని విషయాలలో

చూపించే ఔత్సుక్యం అంతటిని నేను తగిన విషయంలో చూపుతున్నాను- అని చివరి రెండు పాదాలతో తెలుపుతున్నారు.

**(ఆలియా అరఙ్గా ఎన్ఱు అ***ఴై***యా)** - ఆనందాతిశయంచేత ఉన్నచోటనే ఉండ లేకుండా ఆడి, **"అరఙ్గా"** అని శ్రీరంగనాథుని తిరునామాన్ని అనుసంధించి, ఒక క్రమాన్ని పాటించకుండా పిలిచి.

**(మాల్ ఎ***ఴు***న్దొ***ఴి***న్దేన్ ఎన్దన్ మాలుక్కే) - "సర్వేషాం హి స ధర్మాత్మా వర్ణానాం కురుతే దయామ్, చతుర్ణాం హి వయఃస్థానాం తేన తే త మనువ్రతాః"** (రామా. అయో-17-16) (ధర్మస్వరూపి అయిన ఆ శ్రీరాముడు నాల్గు వర్ణాలవారిని, (శైశవ-బాల్య-యౌవన-వార్ధకమనే) నాల్గు పరువాలలో ఉండేవారిని, ఇంకా అందఱిని అనుగ్రహిస్తున్నాడు. అందువల్ల పురజనులు భగవానునిపట్ల అభినివేశాన్ని కల్గి ఉన్నారు.) అని అయోధ్యా పురజనులు శ్రీరామునిపట్ల గొప్ప ప్రేమను కల్గిఉన్నట్లే, భగవానుడు నాపట్ల గొప్ప ప్రేమను కల్గి ఉండడాన్ని చూచి, నేనుకూడా అతని విషయంలో ప్రేమను పొందాను.

**మారనార్ వరివెఙ్జిలైక్కు ఆట్చెయ్యుమ్,**
**పారినారొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఆర మార్బన్ అరఙ్గన్ అనన్దన్, నల్**
**నారణన్ నరకాన్తకన్ పిత్తనే** **3**

మారనార్ = మన్మథుని, వరి వెమ్ శిలైక్కు = అందమైన, క్రూరమైన వింటికి, ఆళ్ శెయ్యుమ్ = కట్టుబడి తిరిగే, పారినారొడుమ్ = ఈ లోకంలోని జనులతో, యాన్ కూడువతు ఇల్లై = నేను చేరడం లేదు, ఆరమ్ మార్వ్పన్ = ముత్యాలతో కూర్చిన హారాన్ని వక్షఃస్థలంలో కలవాడై, అనన్తన్ = పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యం కానివాడై, నల్ నారణన్ = జీవాత్మలకు గొప్పదైన ఆశ్రయమై, నరకాన్తకన్ = దాసులను నరకంలో పడకుండా కాపాడేవాడైన సర్వేశ్వరుని విషయంలో, పిత్తనే = నేను పిచ్చివాణ్ణి (గొప్ప ప్రేమను కలవాడను)

**వ్యా. :- మూన్ఱామ్పాట్టు (మారనార్ వరి వెఙ్జిలై క్కాట్చెయ్యుమ్) కామనుడైయ దర్శనీయమాయ్, త్తప్పవొణ్ణాతపడి కొడితాయిరుక్కిఱ విల్లుక్కు క్కుడిమకనాయ్ త్తిరియుమ్ పారినారొడుమ్ కూడువతిల్లై యాన్- ఎన్నుతల్. పారినారొడుమ్ కూడువతిల్లై యాన్ ఎన్నుతల్. శార్ఙ్గ మెన్నుమ్ విల్లాణ్డాన్ఱక్కు ఆట్చెయ్యుమవన్ నాన్.**

**(ఆరమార్వ్పన్ అరఙ్గన్) ఆకర్షకమాన వొప్పనైయై యుడైయ పెరియ పెరుమాళ్. (అనన్దన్) మనుష్యత్వే పరత్వమ్పోలే ఇఙ్గే వన్దు సులభరాయ్క్కిడక్కచ్చెయ్తే, పరిచ్ఛేదిక్క**

**వొణ్ణాతపడి యిరుక్కిఱవర్. (నన్నారణన్) తన్నుడైమైయై విడమాట్టామైయాలే అఴుక్కై విరుమ్బుమవన్. (నరకాన్దకన్ పిత్తనే) అవన్తన్ వాత్సల్యత్తాలే మేల్ విఴానిఱ్కు నడువే విరోధియుమ్ పోయ్క్కొడు నిఱ్కుమితే. ఇప్పడి ఇరుక్కిఱవనుక్కు ప్పిత్తనే.**

*అరు :- మూన్ఱామ్బాట్టు. (మారనారిత్యాది). "పారిలార్" ఎన్ఱు పాఠాన్తరమ్. పారిల్లాత వరెన్ఱాయ్, ఒరు నత్త మిల్లాత క్షుద్రరెన్ఱపడి. అన్ఱియే, అర్థ మిన్ఱియే శబ్దభేదమాత్రమాయ్ "పారిలాల్" ఎన్ఱు - భూమియిలుళ్ళారెన్ఱు ఏకార్థమాకవుమామ్. (నరకాన్దకన్) నరకాసురనుక్కు నాశకన్.*

**భావదీపిక :- అవ :-** మన్మథుని బాణాలకు వశులై తిరిగే ఈ లోకంలోని వారితో నేను కలవను. భగవానునిపట్ల గొప్ప ప్రేమను కల్గి ఉన్నాను- అని ఇందులో ఆఴ్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (మారనార్ వరివెఞ్జిలైక్కు ఆట్చెయ్యుమ్ పారినారొడుమ్ కూడువతు ఇలై యాన్)-** మన్మథునియొక్క అందమైన, ఎవరిచేత తప్పించుకోవడానికి వీలు లేని, క్రూరమైన వింటిచేత జయింపబడి తిరిగే భూలోకవాసులనే ఈ లోకులతో నేను చేరను- అని కాని, అటువంటి ఈ లోకంలో ఎవరితోను నేను చేరను- అని కాని అర్థాన్ని చెప్పవచ్చు. మొదటి అర్థంలో **"పారినార్"** అనేది సమస్తపదం. రెండవ అర్థంలో **"పారిన్ ఆరొడుమ్"** అని రెండు పదాలు. అరుమ్బదంలో **"పారినార్" ఇరుక్క ఓరిడమే యిల్లాత తాఴ్న్దవర్కళ్"** అని అర్థం చూపబడింది. దీని అర్థం ఏమంటే- మన్మథుని వింటికి విరుద్ధంగా మంచిని చేసే **"శార్ఙ్గమెన్నుమ్ విల్"** (తిరుప్పల్లాణ్డు-12) (శార్ఙ్గమనే విల్లును) అని పిలువబడే ధనుస్సును పాలించే భగవానునకే కైంకర్యం చేసేవారని భావం.

**(ఆరమార్వన్ అరఙ్గన్)** - అందఱిని ఆకర్షించే హారాలు మొదలైన ఆభరణాలను అలంకరించుకొన్న శ్రీరంగనాథుడు. **"ఆరమ్"** అనే పదం కిరీటం, మకుటం మొదలైన మిగిలిన ఆభరణాలకుకూడా ఉపలక్షణం. **(అనన్తన్)** - శ్రీరాముడుగా, కృష్ణుడుగా జన్మించే చోట పరత్వాన్ని చూపినట్లే అర్చావతారమై ఇక్కడకు వచ్చి, అందఱికీ సులభుడై పరుండి ఉన్నా, పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని పరత్వాన్ని ప్రదర్శిస్తున్నాడు.

**(నల్ నారణన్)** - నారాయణుడనే పదం నరసమూహాలైన తన సొత్తుపట్ల ప్రేమను కలవాడు- అనే అర్థాన్ని ఇక్కడ ఇస్తుంది. ప్రాకృతులు కనుక మలినమైన శరీరాన్ని కల బద్ధజీవులనుకూడా తన సొత్తు అయినందువల్ల వారిని విడువలేకుండా అభిలషించేవాడు. కనుక **"నల్ నారణన్"** అని విశేషింపబడ్డాడు.

**(నరకాన్తకన్)** – "నరకాసురసంహర్త" అని కాని, "భక్తులను నరకంలో పడకుండా కాపాడేవాడు" అని కాని అర్థాన్ని చెప్పవచ్చు. **"నరకనాశనై"** (పెరియా. తిరు-4-4-4) (నరకాన్ని నశింపజేసేవాడు). **"నరకనై త్తొలైత్త కరతలైత్తమైతియిన్ కరుత్తో"** (పెరియ. తిరు-10-9-4) (నరకాసురుని వధించడానికి తగిన బాహు బలిమిని తలచా?) అని పెరియాళ్వార్లు, తిరుమఙ్గైయాళ్వార్లు దీనిని అనుసంధించారు. నారాయణుడనే స్వామి తన సొత్తు అయిన జీవులపై గల వాత్సల్యంచేత వారిపట్ల అభినివేశాన్ని చూపి, రక్షించేటపుడు మధ్యలో వచ్చే ఆటంకాలు తమకు తామే తీరిపోతాయని భావం. **(పిత్తనే)**– ఈవిధంగా ఉండేవాని పట్ల ప్రేమను కలవాడనని అంటున్నారు ఆళ్వార్లు.

**ఉణ్డియే ఉడైయే ఉకన్దోడుమ్, ఇ**
**మ్మణ్డలత్తొడుమ్ కూడువతిల్లై యాన్,**
**అణ్డవాణన్ అరఙ్గన్ వన్పేయ్ములై,**
**ఉణ్డవాయన్తన్ ఉన్మత్తన్ కాణ్మినే** 4

ఉణ్డియే = ఆహారాన్ని, ఉడైయే = వస్త్రాలను, ఉకన్దు ఓడుమ్ = ఆశించి, తిరిగే, ఇమ్మణ్డలత్తొడుమ్ = ఈలోకులతో, యాన్ కూడువదిల్లై = నేను కలవడం లేదు. అణ్డమ్ వాణన్ = ఈ బ్రహ్మాండంలో ఉండేవారికి అధిపతి, వన్ పేయ్ ములై ఉణ్డ వాయన్ = క్రూరమైన మనస్సును కల పూతనయొక్క స్తన్యాన్ని దాని ప్రాణాలతో ఆరగించిన నోటిని కలవాడు అయిన, అరఙ్గన్తన్ = శ్రీరంగనాథుని విషయంలో, ఉన్మత్తన్ కాణ్మిన్ = పైత్యాన్ని (పిచ్చిన) పట్టినవాడనై ఉన్నాను.

**వ్యా. :– నాలామ్పాట్టు. (ఉణ్డియే యుడైయే యుకన్దోడుమ్) ఉపాసనత్తుక్కు శరీరమ్ వేణ్డుకైయాలే అతు ధరిక్కవేణ్డుమళవన్ఱియిలే, ఎల్లావఱ్ఱైయుమ్ అఖ్రియమాతి ఉణ్డియు ముడైయు మాక్కుమ్. (ఇమ్మణ్డలత్తొడుమ్ కూడువతిల్లై యాన్) "ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిన్నుమ్ వెఱ్ఱిలైయు మెల్లామ్ కణ్ణన్" ఎన్ఱిరుక్క ఒరు విభూతియుణ్డానాప్పోలే, ప్రాకృతభోగఙ్గళ్ విరుమ్బుకై క్కొరు విభూతియితే ఇతువుమ్.**

**(అణ్డవాణన్) అణ్డాన్తర్వర్తికళుక్కు నిర్వాహకన్. (అరఙ్గన్) ఇతుక్కు నిర్వాహక నాయిరుక్కు మిరుప్పాఖ్రియ, ఇతునుళ్ళే పుకున్దు సులభనాయ్ క్కోయిలిలే సన్నిహితనానవన్. (వన్ పేయ్ ములై యుణ్డ వాయన్ ఉన్మత్తన్ కాణ్మినే) ఇఙ్గే వన్దవతరిత్తు ప్రతిబన్ధకఙ్గళై త్తానే పోక్కుమవనుక్కు ప్పిత్తన్ నాన్. (తన్ఉన్మత్తన్ కాణ్మినే) ఔషధసేవై పణ్ణినారై మీట్కవొణ్ణాతాప్పోలే అవనుడైయ గుణచేష్టితఙ్గళిలే అకప్పట్టు ప్పిత్తనాన ఎన్నై క్కేవలశరీరపరరోడే శేర విడవొణ్ణుమో?**

*అరు :– నాలామ్పాట్టు. (ఉణ్డియే యిత్యాది). (ఎల్లావఱ్ఱైయుమ్ అఖ్రియమాఖుకై) వర్ణాశ్రమధర్మఙ్గళై యఖ్రియమాఖుకై. ఔషధసేవై – స్త్రీవిషయఙ్గళిలే పఱ్ఱుకైక్కు మరున్దిడుకై.*

**భావదీపిక :- అవ :-** "తిండిని, వస్త్రాలను కోరి తిరిగే ఈలోకులతో నేను చేరను, భగవానునిపట్లనే నేను అభినివేశాన్ని కల్గి ఉంటాను" అని ఆ‍ళ్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఉణ్డియే ఉడైయే ఉకన్దోడుమ్)** - భగవానుని ఉపాసించడానికి, భావించడానికి శరీరం పటిష్ఠంగా ఉండాలి కనుక, దానిని ధరించడానికి అవసరమైనంతగా వీటిని ఆశించడంతలో తప్పులేదు. అయితే, పలువురు లోకులు తమవద్ద ఉండే అంతటిని అమ్మి తిండికి, వస్త్రాలకు వినియోగించేవారై ఉన్నందున, వారిని **"ఉణ్డియే ఉడైయే ఉకన్దోడుమ్ ఇమ్మణ్డలమ్"** అని అంటున్నారు. **"ఎల్లావర్ఱైయుమ్ అ‍ళ్ళియమాతి"** అనే దానికి అరుంబదవివరణంలో **"వర్ణాశ్రమధర్మజ్ఞళై అ‍ళ్ళియమాతి"** అనే అర్థం గ్రహింపబడింది.

**(ఇమ్మణ్డలత్తొడుమ్ కూడువదిల్లై యాన్)**- ఈ లీలావిభూతిలో ఉండే వారితో నేను కలవను- అని అర్థం. **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిన్నుమ్ వెర్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (భుజించే అన్నం, తాగే పానీయం, తినే తాంబూలం అంతా శ్రీకృష్ణుడు) (తిరువాయ్ -6-7-1) అనే రీతిలో ధారకపోషకభోగ్యాలు అన్నీ భగవానుడే అని తలచి, నిత్యవిభూతిలో ఉండేటట్లే, అధమం అయిన ప్రకృతభోగాలనే సమస్తంగా భావించే లీలావిభూతిని **"ఇమ్మణ్డలమ్"** అని నిర్దేశిస్తున్నారు. దీనిలో చేరకుండా **"ఎల్లామ్ కణ్ణన్"** (తిరువాయ్-6-7-1) అని పల్కిన నమ్మా‍ళ్వార్ల వంటివారు అని అంటున్నారు. చివరి రెండు పాదాలతో నేను భగవానుని విషయంలోనే అభినివేశాన్ని కల్గి ఉన్నాను- అని అంటున్నారు.

**(అణ్డవాయన్)** - లీలావిభూతి అనే ఈ బ్రహ్మాండంలో ఉండే వారికి ప్రభువు.

**(అరఙ్గన్)** - దీనివల్ల పరమపదంలో ఉండలేక దీనిలోపల ప్రవేశించి, అందఱికీ సులభుడై శ్రీరంగంలో సమీపంలో ఉన్నాడు.

**(వన్ పేయ్ ములై యుణ్డవాయన్తన్ ఉన్మత్తన్ కాణ్మినే)** క్రూరమైన మనస్సును కల పూతనయొక్క స్తన్యాన్ని ఆమె ప్రాణాలతో ఆరగించిన భగవానునిపట్ల నేను గొప్ప ప్రేమను కల్గి ఉన్నాను- అని అంటున్నారు. పూతనావధం. ఇక్కడకు వచ్చి అవతరించి, భక్తులకు కలిగే ఆటంకాలను అన్నిటినీ తీర్చేవాడు- అని తెలుపుతున్నది. **(తన్ ఉన్మత్తన్ కాణ్మినే)** ఈ లోకంలో ఉండే భోగాలను అనుభవించడంకోసం దేహాన్ని బలపరచే మందులను భుజించేవారిని ఆ భోగాలనుండి నివర్తింపజేయడానికి వీలుకానట్లే, భగవానుని కల్యాణగుణాలలోను, లీలలలోను అభినివేశాన్ని పొంది, గొప్ప పిచ్చిని (ప్రేమను) కల నన్ను దానినుండి నివర్తింపజేసి, అన్నం వస్త్రాల విషయంలో అన్వేషించి అలమటించేవారితో చేర్చడానికి వీలులేదని భావం.

**తీతిల్ నన్నెఱి నిఱ్క అల్లాతు శెయ్,**
**నీతియారొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఆతి ఆయన్ అరఙ్గన్ అన్దామరై,**
**ప్పేతై మామణవాళన్దన్ పిత్తనే** 5

తీతు ఇల్ నన్నెఱి నిఱ్క = దోషం లేని మంచి మార్గం ఉండగా, అల్లాతు శెయ్ నీతియారొడుమ్ = క్షుద్రపురుషార్థాలను ఆశించడమే వ్రతంగా కలవారితో, యాన్ కూడువతిల్లై = నేను చేరడం లేదు, ఆతి = అన్ని లోకాలకు కారణమై, ఆయన్ = శ్రీకృష్ణుడై అవతరించి, అందఱికీ సులభుడై, అమ్ తామరై పోదై మా మణవాళన్ = అందమైన తామరపూవును నివాసస్థానంగా కల లక్ష్మీదేవియొక్క నాథుడైన, అరఙ్గన్‌తన్= శ్రీరంగనాథుని విషయంలో, పిత్తనే = పిచ్చెక్కి ఉన్నాను.

**వ్యా. :- అఙ్ఞామ్బాట్టు. (తీతిల్ నన్నెఱి నిఱ్క) తీవినైయోడు విరకాత నల్వ*ழి*నిఱ్క. ఇవనై యొ*ழి*న్ద ఫలఙ్గళుక్కు సాధనొన్నుషానమ్బణ్ణి ప్పెఱుమ్బేఱ్ఱిల్ ఇ*ழ*వే నన్దెన్నుమ్బడి యితే యిరుప్పతు. (అల్లాతు శెయ్ నీతియారొడుమ్ కూడువతిల్లై యాన్) ఇతర పురుషార్థఙ్గళై ఆశైప్పడుకైయే యాత్రైయాయిరుప్పారోడు కూడువతిల్లై యాన్. (ఆతి) ప్రమాణఙ్గళాల్ ఉపాస్యవస్తు ఎన్ఱు శొల్లప్పడుకిఱవన్. (ఆయన్) ఉపాస్యవస్తుతాన్ అరితు ఎన్న వొణ్ణాతపడి అవతరిత్తు సులభనానవన్. (అరఙ్గన్) అవతారమ్బోలే తీర్థమ్ ప్రసాదిత్తు పిఱ్పాడర్ ఇ*ழ*వామే కోయిలిలే వన్దు సన్నిహితరానవర్.**

**(అన్దామరై ప్పేతై మా మణవాళన్‌తన్ పిత్తనే) అ*ழ*కియ తామరైప్పూవై త్తనక్కిరుప్పిడ మాకవుడైయ పెరియపిరాట్టియారుక్కు వల్లభరానవర్క్కు ప్పిత్తనానేన్ నాన్. ఓరడి ఇవన్ పుకురనిన్ఱాల్ అత్తై క్కువాలాక్కి అవన్ నెఞ్జిలే పుఙ్బడుమ్బడి ఇవన్ పణ్ణిన అపరాధత్తై అవన్ కాణాతపడి యిరుక్కిఱ పురుషకారభూతై. (మామణవాళన్) "అప్రమేయం హి త త్తేజః." ఇవళుక్కు వల్లభనాకైయాలే వన్ద పెరుమైయైయుడైయవన్. విషయత్తిలే పిత్తన్ నాన్.**

***అరు :- అఙ్ఞామ్బాట్టు (తీతిలిత్యాది). మఱ్ఱై వ*ழి* పొల్లాతతో? ఎన్న, అరుళిచ్చెయ కిఱార్ (ఇవనై యొ*ழி*న్ద ఇత్యాది).***

**భావదీపిక :- అవ :-** "అధమప్రయోజనాలను కోరి, తగని కార్యాలను చేయడంలోనే జీవితాన్ని గడిపేవారితో నేను చేరను భగవానునిపట్లనే భక్తిని కల్గి ఉన్నాను" అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (తీతిల్ నన్నెఱి నిఱ్క) -** ఈ లోకంలో భగవానుని పొంది, చక్కని జీవితాన్ని గడపడానికి నిర్దుష్టాలైన మార్గాలు అనేకం ఉన్నా, భగవానుడుతప్ప మిగిలిన

ఫలాలను పొందడంకోసం ఉపాయాలను అనుష్ఠించేవారే పలువురు ఉన్నారు. వాటిని అనుష్ఠించి, వారు పొందే ఫలాలను చూస్తే, వాటిని పొందడంకంటే, పొందకుండా ఉండడమే మంచిది– అని చెప్పేటట్లుగా ఉంటుంది.

**(అల్లాతు శెయ్ నీతియారొడుమ్ కూడువతిల్లై యాన్)** – అటువంటి అన్యఫలాలను ఆశపడడమే జీవనక్రమంగానో, ఉజ్జీవించే మార్గంగానో భావించేవారితో నేను కూడను.

చివరి రెండు పాదాలతో తాము "భగవానుని పట్ల ప్రేమను కలవాడై ఉండడమే దీనికి కారణం" అని అంటున్నారు.

**(ఆతి)** – లోకాలకు అన్నిటికీ కారణభూతుడు. **"కారణం తు ధ్యేయః"** (అధర్వశిఖ) (ఎవడు లోకాలకు కారణభూతుడో, అతడే ధ్యానించదగినవాడు) మొదలైన ప్రమాణాల ద్వారా ఉపాసించదగినవాడు ఇతడే అని చెప్పబడేవాడు. **(ఆయన్)** – ఆవిధంగా ధ్యానించతగినవాడై ఉన్నా, పరమపదంలోనే ఉంటూ, దర్శించడానికి అరుదైనవాడై ఉండకుండా, శ్రీకృష్ణుడై అవతరించి, అందఱికీ సులభుడయ్యాడు.

**(అరఙ్గన్)** – శ్రీకృష్ణావతారం మొదలైన అవతారాలవలె ఆ కాలంలో ఉన్నవారికే సహాయపడేవాడై, అవతారం చివరలో పరమపదాన్ని చేరడంతో ఇక్కడ ఉండే వారికి దుర్లభుడై ఉండడంకాక, అందఱికీ సులభుడై శ్రీరంగం దివ్యాలయంలోకి వచ్చి సమీపంలో ఉండేవాడు. **(అన్దామరై ప్పేదై మా మణవాళన్‌తన్ పిత్తనే)** అందమైన తామరపూవును తనకు నివాసస్థానంగా కల, స్త్రీతిలకం అయిన లక్ష్మీదేవికి ప్రియవల్లభుడై ఉండేవానిపట్ల ఉన్మత్తుణ్ణి అయ్యాను. **"అన్దామరై ప్పేదై మామణవాళన్"** అని అన్నందున లక్ష్మీదేవియొక్క నిస్సమాభ్యధికమైన గొప్పతనం తెలుపబడింది. జీవుడు భగవానుని చూచి ఒక అడుగు ముందుకు వేస్తే, (అంటే, కొంచెం అనుకూలుడు అయితే) దానిని చాలా పెద్దదిగా తలచి, భగవానుని మనస్సులో పుండుపడేటట్లుగా జీవుడు చేసిన దోషాలను, అతడు గమనించకుండా ఉండేటట్లు చేసే పురుషకారభూతయై, ఉంటుంది– లక్ష్మీదేవి– అని భావం.

**(మామణవాళన్)** – **"మా"** అనే పదంతో లక్ష్మీదేవిని తెల్పి, **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా, న త్వం సమర్థ స్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే"** (రామా. ఆర. 37–18) (ఏ తేజస్సుకు జనకచక్రవర్తి కుమార్తె అయిన సీతాదేవి చెందినదో, ఆ రామతేజస్సు పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానిది. శ్రీరాముని వింటితో రక్షింపబడే ఆమెను అపహరించడం నీకు సాధ్యం కాదు) అనే రీతిలో ఆమెకు ప్రియవల్లభుడు కావడంవల్ల ఏర్పడిన గొప్పతనాన్ని కలవాడు భగవానుడు– అని అర్థం. అతని విషయంలో నేను పిచ్చివాడనై ఉండడంవల్లనే మిగిలినవారితో నేను చేరడం లేదని ప్రకృతంలో తాత్పర్యం.

**ఎమ్బరత్తర్ అల్లారొడుమ్ కూడలన్,**
**ఉమ్బర్వాழ்వై ఒన్ఱాక క్కరుతిలన్,**
**తమ్బిరాన్ అమరర్క్కు అరఙ్గనకర్,**
**ఎమ్బెరానుక్కు ఎழுమైయుమ్ పిత్తనే** 6

ఎమ్ పరత్తర్ అల్లారొడుమ్ = నావలె దాస్యాన్ని చేయనివారితో, కూడలన్ = నేను కూడను, ఉమ్బర్ వాழ்వై = దేవతల ఐశ్వర్యాలను, ఒన్ఱు ఆక = ఒక పదార్థంగా, కరుతిలన్ = భావించను, అమరర్క్కు తమ్బిరాన్ = నిత్యసూరులకు నిర్వాహకుడై, అరఙ్గనకర్ = శ్రీరంగంలో వేంచేసి ఉండే ఎమ్బిరానుక్కు = నా స్వామి అయిన శ్రీరంగ నాథుని విషయంలో, ఎழுమైయుమ్ = అన్ని కాలాలలోను, పిత్తనే = పిచ్చి వాణ్ణే.

**వ్యా. :- ఆఱామ్బాట్టు. (ఎమ్బరత్తర్ అల్లారొడుమ్ కూడలన్) ఎన్ యాత్రైయే యాత్రైయా యిరాతారై నాక్కు వళైత్తిరుప్పన్. "ఇన్నిన్ఱ నీర్మై యిని యా ముఱామై" ఎన్ఱుమ్, "వழுవిలా వడిమై శెయ్యవేణ్డు నామ్" ఎన్ఱుమ్ ఇరాతారోడు సమ్బన్ధ మిల్లై. (ఉమ్బర్వాழ்వై ఒన్ఱాక క్కరుతిలన్) సంసారత్తిల్ అరుచియుమ్, కైఙ్కర్యత్తిల్ రుచియు మిల్లైయాకిల్, బ్రహ్మాదికళ్ సమ్పత్తైయాకిలుమ్ తృణవత్కరిప్పన్.**

**(తమ్బిరానమరర్క్కు) "అయర్వఱుమమరర్కళతిపతి". (అరఙ్గనకర్ ఎమ్బిరానుక్కు) నిత్యసూరికళెల్లామ్ అనుభవిక్కుమాపోలే సంసారికళెల్లా మిழுవాతపడి కోయిలిలే వన్దు సులభరానవర్. (ఎழுమైయుమ్ పిత్తనే) ఇచ్చెయలుక్కు ఎన్ఱుమ్ పిత్తనాయ్ త్తిరియు మవన్.**

**భావదీపిక :- అవ :-** "ఈ లోకులతో చేరకపోవడమే కాకుండా, దేవలోకంలోని సంపదను ఒక పదార్థంగా లెక్కించను. ఎన్ని జన్మలెత్తినా, భగవానునిపట్ల వ్యామోహాన్ని కలవాడనే అవుతాను" అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఎమ్ పరత్తర్ అల్లారొడుమ్ కూడలన్) - "ఎమ్ పరత్తర్"** అని అంటూ తమవంటి వారిని ఆழ்వార్లు నిర్దేశిస్తున్నారు. నా ఉజ్జీవనక్రమంవలెనే తమ ఉజ్జీవనప్రకారాన్ని గ్రహించనివారి విషయంలో వారితో సంగాన్ని విడచి పెడతాను. **"ఇన్నిన్ఱ నీర్మై ఇని యా ముఱామై"** (తిరువిరు. 1) (వీటిలో స్థిరంగా ఉండే రుచి వాసనాది స్వభావాలను మేము పొందకుండా ఉండేటట్లు) అని ఈ లోకజీవనంలో సంబంధాన్ని విడచిపెట్టి నిరంతరం అయిన కైంకర్యాన్ని చేయాలి. **"వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** (విచ్ఛేదం లేని కైంకర్యాన్ని మనం చేయాలి) (తిరువాయ్-3-3-1) అని భగవత్కైం కర్యంలో అభినివేశం లేనివారితో నాకు సంబంధం లేదు.

**(ఉమ్బర్ వా౱్వై ఒన్రాక క్కరుతిలన్)**– ఈలోకజీవనంలో అభిలాషలేకుండా ఉండడం, భగవత్కైంకర్యంలో రుచి లేకపోతే బ్రహ్మమొదలైనవారి సంపద లభించినా దానిని తృణప్రాయంగా తలుస్తాను.

**(తమ్పిరాన్ అమరర్క్కు) – "అయర్వఱుమ్ అమరర్కళ్ అతిపతి"** (నిస్సమాభ్యధికులైన నిత్యసూరులకు అధిపతి) (తిరువాయ్ -1-1-1) అని నమ్మా౱్వార్లు పల్కిన రీతిలో నిత్యసూరులకు నాయకుడు.

**(అరఙ్గనకర్ ఎమ్బిరానుక్కు)**– నిత్యసూరులందఱు అనుభవించే అనుభవాన్ని సంసారులు కోల్పోకుండా ఉండేటట్లుగా శ్రీరంగం దివ్యాలయంలోకి వచ్చి సర్వసులభుడై వేంచేసి ఉండేవాడు.

**(ఎ౱ుమైయుమ్ పిత్తనే)** – ఎన్ని జన్మలు ఎత్తినా ఈ నైచ్యంకోసం నేను వ్యామోహాన్ని పొంది సంచరిస్తాను– అని అంటున్నారు.

**ఎత్తిఅత్తిలుమ్ యారొడుమ్ కూడుమ్, అ**
**చ్చిత్తన్దన్నై త్తవిర్త్తనన్ శెఙ్గణ్మాల్,**
**అత్తనే! అరఙ్గా! ఎన్ఱ౱ైక్కిన్ఱేన్,**
**పిత్తనాయ్ ఒ౱ిన్దేన్ ఎమ్బిరానుక్కే** 7

ఎత్తిఅత్తిలుమ్ = ఏ విషయాన్ని పొందడంకోసం అయినా, యారొడుమ్ = ఏవిధం అయిన మానవులలో అయినా, కూడుమ్ అచ్చిత్తమ్తన్నై = చేరి నశించే నా మనస్సును, శెమ్ కణ్ మాల్ = పుండరీకాక్షుడు, తవిర్త్తనన్ = పోగొట్టి అనుగ్రహించాడు, అత్తనే = నన్ను నియమించే స్వామీ!, అరఙ్గా = శ్రీరంగనాథా!, ఎన్ఱు అ౱ైక్కిన్ఱేన్ = అని పిలుస్తున్నాను. ఎమ్బిరానుక్కే = (ఇతరవిషయాలలో ఉండే అభినివేశాన్ని పోగొట్టిన) నాస్వామి విషయంలో, పిత్తనాయ్ ఒ౱ిన్దేన్ = పిచ్చివాణ్ణి అయ్యాను.

**అవ :– ఏ౱ామ్పాట్టు. ఇతరరోడు కూడాత నన్మై ఉమక్కు వన్దపడి ఎన్? ఎన్న, నా నడియాక వన్దతల్ల, సర్వేశ్వరనడియాక వన్దతు– ఎన్గిఱార్.**

**వ్యా :– (ఎత్తిఅత్తిలుమ్) అభాగవతనోడు సమ్భాషిక్క అభిమతపురుషార్థఙ్గళై ఎల్లామ్ లభిక్కలా మెన్నిలుమ్ అత్తైయుమ్ నాక్కు వళైప్పన్. (యారొడుఙ్గూడుమ్) పురుషార్థఙ్గళై లభియాతొ౱ిన్దాలుమ్ అవనోట్టై చ్చేర్త్తియాలే ఎల్లా మేన్మైయుముణ్డా మెన్నిలుమ్, అత్తైయుమ్ కాఱ్కడై కొళ్ళుమ్పడియానేన్. (అచ్చిత్తన్దన్నై త్తవిర్త్తనన్ శెఙ్గణ్మాల్) కణ్ణాలే కుళిర నోక్కి, తన్ వ్యామోహత్తై క్కాట్టి ప్పిఱరోడు మనస్సు పొరున్దాపడి పణ్ణినాన్. (అత్తనే) ఎనక్కు స్వామియానవనే!. (అరఙ్గా ఎన్ఱ౱ైక్కిన్ఱేన్) అన్ద స్వామిత్వత్తై నిర్వహిత్తుక్కొడుక్కైక్కాక**

**క్కోయిలిలే వన్దు సులభనానవనే! ఎన్ను కూప్పిడానిన్ఱేన్. (పిత్తనాయొఴిన్దే నెమ్బిరానుక్కే) ఇతరవిషయప్రావణ్యత్తోడు పొరున్దాతపడి పణ్ణిన ఉపకారకనుక్కు ప్పిత్తనానేన్.**

**భావదీపిక :- అవ :-** మిగిలినవారితో కలువకుండా ఉండే ఈ గొప్పతనం మీకు ఏ విధంగా వచ్చింది? అనే ప్రశ్న తల ఎత్తగా, "నావల్ల వచ్చినది కాదు ఇది. దీనిని కల్గించినవాడుకూడా భగవానుడే" అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఎత్తిఅత్తిలుమ్) -** భగవానునిపట్ల అభినివేశాన్ని లేనివానితో సంభాషిస్తే, నేను ఆశపడే అన్ని ఫలాలను పొందవచ్చు" అనే స్థితి ఏర్పడినా, అటువంటివానితో మాటలాడడంలో నాకు అభిరుచి లేదు.

**(యారొడుమ్ కూడుమ్)** - కోరిన ప్రయోజనాలను పొందనపుడు, అవైష్ణవులతో చేరడంవల్ల అన్ని గొప్పతనాలు కలుగుతాయి- అని అన్నా, అటువంటి సంబంధాన్ని, నా కాలు ధూళితో కూడా సమానంగా భావించను.

**(అచిత్తమ్తన్నై త్తవిర్త్తనన్ శెజ్గణ్ మాల్)** - నా ఎఱ్ఱని తామరపూవువంటి కన్నుతో చల్లగా చూచి, నాపట్ల తనకుండే ప్రేమను అంతా చూపి, అవైష్ణవులతో నా మనస్సు చేరకుండా ఉండేటట్లు చేశాడు.

**(అత్తనే)** - నన్ను సొత్తుగా కలవాడా!

**(అరజ్గనే ఎన్ను అఴైక్కిన్ఱేన్)** - తాను స్వామి, నేను సొత్తు- అనే క్రమానుసారంగా సులభుడై వచ్చి, వేంచేసి ఉండేవాడా ! అని పిలుస్తున్నాను.

**(పిత్తనాయ్ ఒఴిన్దేన్ ఎమ్బిరానుక్కే)**- మిగిలిన విషయాలలో అభినివేశం లేకుండా, వాటిలో అభిలాషను కలవారితో నేను చేరకుండా చేసిన గొప్ప ఉపకారి విషయంలో పిచ్చివాణ్ణి అయ్యాను.

**పేయరే ఎనక్కు యావరుమ్, యాను మోర్**<br>
**పేయనే ఎవర్క్కుమ్ ఇతు పేశి యెన్,**<br>
**ఆయనే! అరజ్గా! ఎన్ఱఴై క్కిన్ఱేన్,**<br>
**పేయనాయ్ ఒఴిన్దేన్ ఎమ్బిరానుక్కే** 8

యావరుమ్ = (స్థిరంగా నిలచి ఉండని భోగాలను కోరే) ఈలోకంలోని వారు అందఱు, ఎనక్కు = (పరమపురుషార్థాన్ని అభిలషించే) నాకు, పేయరే = పిచ్చివారే, యానుమ్ = నేనుకూడా, ఎవర్క్కుమ్ = వారికి అందఱికీ, ఓర్ పేయనే = ఒక పిచ్చివాడనే, ఇదు పేశి ఎన్=ఈవిషయాన్ని వివరంగా పల్కి ఏం ప్రయోజనం? ఆయనే= గోపాలుడై భూమిలో అవతరించిన ఓ శ్రీకృష్ణా!, అరజ్గా = శ్రీరంగనాథా!, ఎన్ను అఴైక్కిన్ఱేన్=

అని పిలుస్తున్నాను, ఎమ్బిరానుక్కే = సర్వేశ్వరుని విషయంలోనే, పేయనాయ్ ఒ_ళ్ళి_న్దేన్= పిచ్చి పట్టినవాణ్ణి అయ్యాను.

**అవ :– ఎట్టామ్పాట్టు. ఎల్లారుమ్ విట్టాలుమ్ ఒరువరల్లా ఒరువర్ ప_ఱ్ఱు_వర్కళితే. అవర్కళెల్లారుమ్ విడుమ్బడియానేన్– ఎన్గిఱార్.**

**వ్యా. :– (పేయరే యెనక్కు యావరుమ్) నిలై నిన్ఱ పురుషార్థత్తై విట్టు అస్థిరమాన ప్రాకృతభోగఙ్గళై విరుమ్బువతే!, పేయరాయిరున్దార్కళెన్ఱు విట్టేన్ నాన్. (యాను మోర్ పేయనే ఎవర్క్కుమ్) "కణ్ణాల్ కాణ్గిఱతొ_ళ్ళి_య వేఱే ఒన్ఱుణ్డెన్ఱు భ్రమియానిన్ఱాన్, పిత్త నాయిరున్దాన్" ఎన్ఱు విట్టార్కళ్ ఇవర్కళుమ్ ఎన్ఱై. (ఇతు పేశి యెన్) ఇత్తై ప్పరక్కచ్చొల్లు కిఱతెన్?**

**(ఆయనే) కణ్ణాల్ క్కాణ్గిఱతు పొయ్యోన్ఱిరాతపడి వన్దు అవతరిత్తు త్తన్ పడికళై నమక్కు క్కాట్టినవన్. (అరఙ్గా ఎన్ఱ_ళై_క్కిన్ఱేన్) అవతారత్తుక్కు ప్పిఱ్పాడర్ ఇ_ఴ_వోడే తలైక్కట్టాతపడి కోయిలిలే కణ్వళర్న్దరుళిన పెరియపెరుమాళ్ తిరునామత్తై చ్చొల్లి అఢైవు కెడ క్కూప్పిడానిన్ఱేన్. (పేయనాయొ_ళ్ళి_న్దే నెమ్బిరానుక్కే) "ఒరు విషయత్తిలే పిత్తేఱినవన్ నమక్కిని యాకాన్ కాణ్, విడాయ్" ఎన్ఱు ఇతరర్ ఎన్నై ఉపేక్షిక్కుమ్బడియానేన్.**

***అరు :– ఎట్టామ్పాట్టు. (పేయరే యిత్యాది). (కణ్ణాల్ కాణ్గిఱతు) "కణ్" ఎన్ఱు – జ్ఞానమాయ్, జ్ఞానత్తాలే కాణ్గిఱ వస్తు పొయ్యోన్ఱిరాతపడి అవతరిత్తు– ఎన్ఱపడి.***

**భావదీపిక :– అవ :–** గడచిన పాశురంలో "శ్రీవైష్ణవులు కానివారితో చేరడం లేదు" అని అన్నారు. "వీరు వారిని అందరినీ విడచిపెట్టి, వారితో కలువక పోయినా, వారిలో ఎవరైనా వచ్చి వీరిని బలవంతం చేయవచ్చుకదా ! ఆ విధంగా ఎవరైనా కొందరున్నారా !" అనే ప్రశ్న తల ఎత్తగా, "వారు అందఱు నా చేయి విడచిపెట్టేటట్లు అయ్యాను' అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :– (పేయరే ఎనక్కు యావరుమ్)** – "స్థిరమైన ఫలం అయిన భగవత్కైంకర్యాన్ని విడచిపెట్టి, అస్థిరాలైన శబ్దాది విషయభోగాలను కోరేవారలారా !, మీరు పిచ్చివారై ఉన్నారు" అని వారిని నేను విడిచిపెట్టాను.

**(యానుమ్ ఓర్ పేయనే ఎవర్క్కుమ్)** – "కంటితో చూచే ఈ లోకంలోని పదార్థాలు కాకుండా" ఎవరూ చూడని పరతత్త్వం అనేది ఒకటి ఉన్నది అని భ్రమించాడే ! చాల పిచ్చివాడై ఉన్నాడు వీడు" అని వీరు కూడా నన్ను విడచిపెట్టారు.

**(ఇదు పేశి ఎన్)** – దీనిని విరివిగా చెప్పడంవల్ల ఏమి ప్రయోజనం ?

**(ఆయనే)** – జ్ఞానులు తమ జ్ఞాననేత్రంలో దర్శించే భగవద్విషయం అసత్యం అని చెప్పలేనట్లుగా ఈ బాహ్యచక్షుస్సుతోకూడా అందఱు చూచేటట్లుగా వచ్చి, శ్రీకృష్ణుడై, అవతరించి, తన స్వరూపస్వభావాలను నాకు దర్శింపజేసినవాడు.

**(అరజ్గా ఎన్ఱు అழைక్కిన్ఱేన్)** – శ్రీకృష్ణాది విభవావతారాల కాలానికి తరువాతి వారు కూడా కోల్పోని రీతిలో శ్రీరంగంలోని ఆలయంలో శయనించి ఉండే శ్రీరంగనాథుని తిరునామాన్ని అనుసంధించి, ఒక క్రమం అనేది లేకుండా పిలుస్తున్నాను. **(పేయనాయ్ ఒழిన్దేన్ ఎమ్బిరానుక్కే)** "దర్శించలేని పరతత్త్వం విషయంలో పిచ్చిపట్టినవాడు వీడు. కంటితో చూచినదే నిజం అని భావించే మనకు పనికిరాడు. చేయి విడువదగినవాడే" అని ఇతరులు నన్ను ఒక పదార్థంగా భావించనివాణ్ణి అయ్యాను.

**అజ్గై యాழி యరజ్గ నడియిణై,**
**తజ్గు శిన్దై త్తనిప్పెరుమ్బిత్తనాయ్,**
**కొజ్గర్కోన్ కులశేకరన్ శొన్న శొల్,**
**ఇజ్గు వల్లవర్క్కు ఏత మొన్ఱిల్లైయే** 9

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

అమ్ కై ఆழி = అందమైన శ్రీహస్తంలో శ్రీసుదర్శనాన్ని కల, అరజ్గన్ = శ్రీరంగ నాథుని, అడి ఇణై = శ్రీచరణద్వయిలో, తజ్గు శిన్దై = అభినివేశం పొందే మనస్సును కలవారై, తని పెరుమ్ పిత్తన్ ఆయ్ = చాలా ప్రేమను, వ్యామోహాన్ని కలవారై, కొజ్గర్ కోన్ = పడమటి దిక్కుకు అధిపతి అయిన, కులశేకరన్ = కులశేఖరాழ்వార్లు, శొన్న = పల్కిన, శొల్ = ఈ పాశురాలను, వల్లవర్క్కు = అభ్యసించగల్గినవారికి, ఇజ్గు = ఈ విషయంలో, ఏతమ్ ఒన్ఱు ఇల్లై = (భగవదనుభవానికి) ఏవిధమైన అడ్డు కలుగదు.

**వ్యా. :– ఒన్బతామ్బాట్టు. (అజ్గై యాழி యరజ్గనడియిణై) అழకియమణవాళ ప్పెరుమాళ్ తిరువడికళిలే. (తజ్గు శిన్దై) పెరుమాళ్ తిరువడికళుక్కు అవ్వరుకు గన్తవ్యభూమి ఇల్లామైయాలే అజ్గే తజ్గు శిన్దైయైయుడైయ. (తని ప్పెరుమ్బిత్తనాయ్) భగవద్విషయత్తిల్ ఇవరోపాతి పిత్తేఱినార్ వేఱొరువర్ ఇల్లామైయుమ్, శిలవరాల్ మీట్కవొణ్ణామైయుమాన పిత్తనాయ్.**

**(కొజ్గర్ కోన్ కులశేకరన్ శొన్న శొల్) మేలై దిక్కుక్కు నిర్వాహకరాన శ్రీకులశేఖర ప్పెరుమాళ్ అరుళిచ్చెయ్త. (ఇజ్గు వల్లవర్క్కేత మొన్ఱిల్లైయే) ఇవఱ్ఱై వల్లవర్కళుక్కు ఇజ్గు ఏతమొన్ఱిల్లైయే. ఏతమా మావతు – అభాగవత స్పర్శమాతల్, భగవత్ప్రావణ్యత్తిల్ కుఱైయాతల్; ఇవఱ్ఱాల్ వరుమ్ దుఃఖ మొన్ఱుమ్ ఇస్సంసారత్తిలిరుక్కుమ్ నాళిలిల్లై.**

**ఇద్దుఃఖప్రసఙ్గ ముళ్ళతు ఇవ్విడత్తేయితే. ఇవై క*ற்ற*వర్కళుక్కు ఇప్రసఙ్గముళ్ళ దేశత్తిలే యిల్లై.**

**పెరియవాచ్చాన్‌పిళ్ళై తిరువడికళే శరణమ్**

**పెరుమాళ్ తిరుమొ*ழ*ి మూన్ఱామ్ తిరుమొ*ழ*ి వ్యాఖ్యానమ్ ము*ற்*ఱి*ற்*ఱు.**

**భావదీపిక :- అవ :-** ఈ దశకాన్ని అభ్యసించినవారికి భగవానుని పొందడంలో ఏ అడ్డు లేదు- అని ఫలాన్ని పల్కి నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (అమ్ కై ఆ*ழ*ి అరఙ్గన్ అడి యిణై)** - అందమైన శ్రీహస్తంలో శ్రీసుదర్శనాన్ని ధరించి ఉండే శ్రీరంగనాథుని శ్రీచరణాలలో. **(తఙ్గు శిన్దై)** - **"తఙ్గుమ్ శిన్దై"** అని భవిష్యత్కాలంగా చెప్పినందువల్ల "భగవానుని శ్రీచరణాలను విడచి పెట్టి పోయే చోటు ఏదీ లేనందువల్ల ఆ శ్రీచరణాలనే అన్ని సమయాలలోను ఆశ్రయించి ఉండే మనస్సును కల- అని భావం.

**(తని ప్పెరుమ్ పిత్తనాయ్)** - భగవానుని విషయంలో వీరివలె పిచ్చిపట్టిన వారు ఇంకొకరు లేరు- అని చెప్పే రీతిలో, ఈ విషయంనుండి ఎవరూ నివర్తించలేనట్లుండే పిచ్చివాడనై.

**(కొఙ్గర్ కోన్ కులశేకరన్ శొన్న శొల్)** - ద్రవిడదేశంలో పడమటిభాగంలో ఉండే చేరనాడుకు ప్రభువైన శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన ఈ దశకాన్ని. **(ఇఙ్గు వల్లవర్క్కు ఏదమ్ ఒన్ఱిల్లైయే)** - ఈ తిరుమొ*ழ*ిని అర్థానుసంధానంతో అభ్యసించగలవారికి ఈ లోకంలో ఏ అడ్డు లేదు. ఇక్కడ **"ఏతమ్"** అని అనడం- అవైష్ణవులతో చేరిక, భగవానునిపట్ల ఉండే అభినివేశంలో కొఱత- అనే ఈ రెండు. వీటివల్ల వచ్చే క్లేశం ఏదీ, ఈలోకంలో ఉండేవరకు వీరికి కలుగదు.

**(ఇఙ్గు ఇల్లై)** - ఈ క్లేశం ఈ లోకంలోనేకదా కలుగుతుంది. ఈ దశకాన్ని అభ్యసించినవారికి ఇది ఏర్పడే అవకాశం ఉన్న ఈ లోకంలోకూడా కలుగదు- అని భావం.

**మూన్ఱామ్ తిరుమొ*ழ*ి వ్యాఖ్యానానువాదం ముగిసింది.**

## నాలాన్దిరుమొ*ழ*ి - ఊనేఱుశెల్వమ్ - ప్రవేశమ్.

**అవ :- భగవద్ జ్ఞానముమ్ పిఱన్దు, ఇతరవిషయత్యాగముమ్ పిఱన్దు, గుణాధిక విషయత్తై అనుభవిక్కవేణు మెన్నుమ్ రుచియుమ్ పిఱన్దు, అన్ద గుణమ్ పూర్ణమాక అనుభవిక్కలామిడత్తే అనుభవిక్క వేణుమెన్ను మాశైయుమ్ పిఱన్దు, "అడియార్కళ్**

**కుழாఙ్గళై యుడన్ కూడువతెన్ఱుకొలో" ఎన్నుమాపోలే "అడియార్కళ్ తమ్ ఈట్టమ్ కణ్డిడ క్కూడుమేల్" ఎన్నుమతువుమ్ పిఱన్దు, ఇప్పడి భగవద్విషయత్తిలుమ్, భాగవత విషయత్తిలుమ్ ఆనుకూల్యముమ్ - ఇతరవిషయత్యాగపూర్వకమాక క్కణ్ణழிవఱ ప్పిఱక్కచ్చెయ్తే, విరోధియుమ్ పోయ్ అనన్తరమ్ భగవల్లాభమాకవుమ్ కాణామైయాలే, "యది వా రావణ స్స్వయమ్" ఎన్ఱుమ్, "ఆళ్ పార్త్తுழி తరువాయ్" ఎన్ఱుమ్ మేల్వి క్కదవవనన్భక్కల్ కుఱై యిల్లై; ఇతుక్కు వేఱే యొరు హృదయముణ్డాక వేణు మెన్ఱు పార్త్తు, శరీరసమనన్తరమ్ భగవల్లాభమాకిల్ పరిగ్రహిత్త శరీరమ్ క్షత్రియశరీరమాయ్ భోగఙ్గళిలుమ్ కుఱైవఱ్ఱిరున్ద పిన్బు శరీరరావసానత్తళవుమ్ భోగఙ్గళై భుజిత్తు, పిన్నై క్రమత్తాలే భగవత్ప్రాప్తి పణ్ణుకిఱో మెన్ఱు నినైత్తిరుక్కిఱే నెన్ఱు నినైత్తు ఆఱియిరున్దానాక వేణు మెన్నుమత్తై త్తిరువుళ్ళత్తిలే కొణ్డు, తమక్కు క్రమప్రాప్తి పొఱామై తోన్ఱ. "ఒన్ఱియాక్కై ప్పుకామల్ ఉయ్యక్కొళ్వాన్ నిన్ఱ వేఙ్గడమ్" ఎన్ఱుమ్, "మన్ది పాయ్ వడవేఙ్గడమామలై వానవర్కళ్ శన్ది శెయ్య నిన్ఱాన్" ఎన్ఱుమ్-కీழ் అనుభవిత్త పెరియ పెరుమాళ్ తామే సంసారసమ్బన్ధ మఱుత్తు క్కొడుక్కైక్కుమ్, కైఙ్కర్యమ్ కొళ్ళుకైక్కుమ్ తిరుమలైయిలే నిఱ్కిఱారాకైయాలే తిరువేఙ్గడముడైయాన్ తిరువడికళిలే విழுన్దు విరోధియిల్ అరుచి యుమ్, కైఙ్కర్యత్తిల్ రుచియుమ్ పిఱన్ద త్వరైయైయు మావిష్కరిక్కిఱార్.**

---

## నాల్గవ తిరుమొழி- ప్రవేశం - అనువాదం

**భావదీపిక :- అవ :-** భగవానునిగూర్చిన జ్ఞానం కల్గి, మిగిలిన విషయాలను విడచి పెట్టి, గుణాలలో నిస్సమాభ్యధికుడైన భగవానుని అనుభవించాలి- అనే ఆశ కల్గి, అన్యవిషయా లను విడచి పెట్టి, గుణాలతో ఏ సాటి మేటి లేని భగవానుని అనుభవించాలనే ఆశ కల్గి, ఆవిధంగా గుణపూర్తిని కల అర్చావతారం అయిన శ్రీరంగనాథుని దర్శించాలనే ఆశ కల్గి, **"అడియార్కుழாఙ్గళై ఉడన్ కూడువతు ఎన్ఱుకొలో"** (తిరువాయ్-2-3-10) అన్నట్లు పరమపదంలో అనుభవించాలి అని నమ్మాழ்వార్లు ఆశ పడినట్లే **"మెయ్యడియార్కళ్తమ్ ఈట్టమ్ కణ్డిడ క్కూడుమేల్"** (పెరుమాళ్-తిరు. 2-1) (నిజమైన భగవద్భక్తుల సమూహాన్ని దర్శించడం సంభవిస్తే) అని అర్చావతారంలో అనుభవించాలని వీరు ఆశపడ్డారు. ఈ విధంగా భగవానుని విషయంలోను, అతని భక్తుల విషయంలోను అనుకూల్యం, మిగిలిన విషయాలను విడవడం అనే ప్రాతికూల్యవర్జనం సంపూర్ణం కల్గినా, ఆటంకాలు తొలగి అర్చావతారస్వరూపి అయిన శ్రీరంగనాథుని, అతని భక్తులను అనుభవించలేక పోయారు. **"ఆనయైనం హరిశ్రేష్ఠ ! దత్త మస్యాభయం మయా, విభీషణో వా సుగ్రీవ! యది వా రావణ స్స్వయమ్"** (రామా-యుద్ధ- 18-34) (వానరశ్రేష్ఠా ! సుగ్రీవా! ఇతనిని పిలుచుకొని రా. అతడు విభీషణుడైనా

సరే, లేక, రావణుడైనా సరే. ఇతనికి నేను అభయాన్ని ఇస్తాను) అని, 'రావణుడు మారి వచ్చినా పరిగ్రహించవచ్చు' అని ఎదురు చూచేవాడై **"ఆళ్పార్త్తు*ళ్ళి*తరువాయ్"** (దాసులకోసం వెదకేవాడా) (నాన్ముకన్ తిరు-60) అని తనను చేరడానికి ఎవరైనా వస్తారా! అని ఎదురు చూచి, వారిపట్ల, అభినివేశాన్ని చూపించే భగవానునిలో ఏ కొఱత లేదు. అందువల్ల అతని మనస్సు వేఱు విధంగా భావిస్తున్నది కాబోలు. అంటే- ఈ శరీరం పోయిన తర్వాత పరమపదాన్ని చేరి, నన్ను పొందవచ్చు. వీరు పొందిన శరీరం క్షత్రియశరీరం కనుక, ఇక్కడ ఉన్నంతవరకు భోగాలకు లోటు లేదు. కనుక ఈ శరీరం పతనం చెందేవరకు రాజభోగాలను అనుభవించి, ఆ తరువాత అర్చిరాదిగతిద్వారా పరమపదాన్ని చేరి, నన్ను పొందవచ్చు- అని నేను భావిస్తున్నట్లు తలుస్తున్నాడు కాబోలు – అని ఆ*ళ్వా*ర్లు భావించి, "నేను ఆశపడే అర్చావతారానుభవాన్ని నాకు అనుగ్రహంచకుండా ఉన్నాడు" అని తలచి "ఈ శరీరం పతనమయే వరకు భగవద్భాగవతానుభవాన్ని పొందలేకుండా ఉండడం తమకు సహించరానిది- అని వ్యక్తం చేయడంకోసం **"ఒన్డియాక్కై పుకామై ఉయ్య క్కొళ్వాన్ నిన్ఱ వేఙ్గడమ్"** (తిరువాయ్-9-3-8) (ఆత్మతో ఏకీభవించి ఉండే, ప్రకృతిసంబంధ శరీరాలలో మళ్ళీ ఆత్మ ప్రవేశించకుండా ఉండేటట్లు రక్షించడంకోసం వేంకటాచలంలో ఉన్నవాడు) అని నమ్మా*ళ్వా*ర్లు, **"మన్ది పాయ్ వడవేఙ్గడ మామలై వానవర్కళ్ శన్ది శెయ్య నిన్ఱాన్"** (అమలనాది-3) (ఆడు కోతులు సంచరించే, ఉత్తర దిక్కులోని తిరుమలపై నిత్యసూరులు సంధ్యాకాలార్చన చేయగా నిలచి ఉన్నాడు) అని తిరుప్పాణా*ళ్వా*ర్లు తాము అనుభవించిన శ్రీరంగనాథుడే చేతనులకు ఈ సంసార సంబంధాన్ని తీర్చడానికి, ఈ లోకంలోనే కైంకర్యాన్ని పరిగ్రహించడానికి తిరుమలలో నిలచి ఉన్నాడు అని అన్నారు కనుక, శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో పడి, తమకు భగవద్భాగవతానుభవవిరోధులలో రుచి లేదని, కైంకర్యంలోనే రుచి ఉన్నదని, వాటిని ఈ జన్మలోనే పొందాలని తమకు త్వర కల్గిందని ఇందులో వ్యక్తంచేస్తున్నారు.



**ఊనేఱు శెల్వత్తు ఉడఱ్పిఱవి యాన్ వేణ్డేన్,**
**ఆనేఱే*ళ్*వెన్ఱాన్ అడిమైత్తిఱ మల్లాల్,**
**కూనేఱు శఙ్గ మిదత్తాన్ఱన్ వేఙ్గడత్తు,**
**క్కోనేరి వా*ళ్ళు*మ్ కురుకాయ్ ప్పిఱప్పేనే** 1

ఆన్ ఏఱు ఏ*ళ్* వెన్ఱాన్ = (నప్పిన్నైప్పిరాట్టిని వివాహమాడడం కోసంగా) బలిమిని కల ఏడు ఎద్దులను జయించిన భగవానునకు, అడిమై తిఱమ్ అల్లాల్ = దాస్యాన్ని

చేయడాన్నే తప్ప, ఊన్ ఏఱు శెల్వత్తు ఉడల్ పిఱవి = (దినదినానికి) మాంసాన్ని పెంచే సంపదను కల ఈ మానవజన్మను, యాన్ వేణ్డేన్ = నేను కోరను, కూన్ ఏఱు శఙ్గమ్ = వంపు తిరిగి ఉండే శ్రీపాంచజన్యాన్ని, ఇడత్తాన్‌తన్ = ఎడమచేతిలో కల భగవానునియొక్క, వేఙ్గడత్తు = వేంకటాద్రిపై, కోనేరి వాழுమ్ = స్వామిపుష్కరిణిలో నివసించే, కురుకు ఆయ్ పిఱప్పేనే = నీటికొంగగా పుట్టగలనా !

**అవ :- ముతల్పాట్టు. (ఊనేతిత్యాది) ప్రకృతిపురుషవివేకమ్ పణ్ణుకైక్కు యోగ్య తైయుళ్ళ మనుష్యజన్మమాయ్, అతిలే పరరక్షణత్తుక్కుఱుప్పాన క్షత్రియజన్మమ్ వేణ్డా; కైఙ్కర్యత్తిల్ ఎల్లై నిలత్తుక్కుఱుప్పాన తిర్యక్కాయ్ ప్పిఱక్క అమైయుమ్ నాన్- ఎన్గిఱార్.**

**వ్యా :- (ఊనేఱు శెల్వత్తుడల్ పిఱవి యాన్ వేణ్డేన్) ఇన్ద శరీరత్తుక్కు చ్చొల్లుకిఱ కుற்ற మెన్? ఎన్న, నాళ్ శెల్ల నాళ్ శెల్ల మాంసప్రచురమాయ్ వరుకైయాలే శరీరమ్ తడిత్తు ఆత్మా ఇళైక్కు మిత్తనై. అత్తాలే వేణ్డే నెన్గిఱార్. ధర్మముడైయ స్వరూపముమ్ నిత్యమాయిరుక్క చ్చెయ్‌తే "అసన్నేవ" ఎన్గిఱతు జ్ఞానసఙ్కోచత్తై ప్పற்றవితే. అప్పడియే జ్ఞానసఙ్కోచత్తై ప్పిఱప్పిక్కు మతువాకైయాలే వేణ్డే నెన్గిఱార్. (యాన్ వేణ్డేన్) తలై అఱుత్తుక్కొళ్ళుమవర్‌కళ్ శన్దనమ్ పూశి త్తిరియుమాపోలే విழுక్కాదఱియాతాన్ వేఱుమే ఎన్టిరున్దానామత్తనై. వివేక జ్ఞానముడైయ నాన్ వేణ్డేన్. శరీరత్తినుడైయ హేయత్తైయుమ్, ఆత్మావినుడైయ వైలక్షణ్యత్తైయుమ్, ఇతుతాన్ తనక్కే శేష మెన్నుమిడత్తైయుమ్ అనన్దానే అఱివిక్క అఱిన్ద నాన్ వేణ్డేన్.**

**(ఆనేతేழ் వెన్దాన్ అడిమైత్తిఱమల్లాల్) అవన్దానే విరోధియై ప్పోక్కి కైఙ్కర్యత్తిలే అన్వయిప్పిక్కుమవనాన నాన్. (ఆనేతేழ் వెన్దాన్) నప్పిన్నైప్పిరాట్టియోట్టై సంశ్లేషత్తుక్కు ఇడైచ్చువరాన ఋషభఙ్గళేழைయుమ్ వెన్దవన్. మాతావిన్ పక్కలిలే స్నేహత్తై ప్పణ్ణిన పితావై అనువర్త్తికుమ్ పుత్రనైప్పోలే. (అడిమై త్తిఱమల్లాల్) అడిమైయిల్ ఇడైయాట్ట మెన్నుతల్; "అహం సర్వమ్" ఎన్టుమ్, "వழுవిలావడిమై" ఎన్టుమ్ శొల్లుకిఱపడియే అడిమైత్తిరళ్- ఎన్నుతల్.**

**(కూనేఱు శఙ్గమిడత్తాన్) కైఙ్కర్యరుచియుడైయారై నిత్యకైఙ్కర్యమ్ కొళ్ళుమవన్. (కూనేఱు శఙ్గమిడత్తాన్) "ప్రాఞ్జలిం ప్రహ్వ మాసీనమ్" ఎన్నుమాపోలే భగవదనుభవచ్చెరుక్కాలే ఇళైయపెరుమాళైప్పోలే కాట్చిక్కు నోక్కాయిరుక్కిఱ శ్రీపాఞ్చజన్యాழ்వాన్. (శఙ్గ మిడత్తాన్) ఇడక్కైయిలే కాణిల్ "శఙ్గ మిడత్తాన్" ఎన్గిఱార్. వలక్కైయిలే తిరువాழி యాழ்వానై కణ్డవరాకైయాలే "వలక్కై యాழி"ఎన్గిఱార్. తిరుమార్విలే పిరాట్టియై కణ్డవాతే "నిన్ వలమార్పినిల్ వాழ்కిన్ఱ మఙ్గై" ఎన్గిఱార్. ఇవర్‌పడి యితితే. (తన్ వేఙ్గడత్తు) అఙ్గే అడిమైకొళ్ళుకైక్కు ప్పాఙ్గాన దేశమాకైయాలే ఎన్నతెన్టు అవన్ విరుమ్బిన తిరుమలైయిల్.**

(కోనేరి వాழ்ழுమ్ కురుకాయ్ ప్పిఱప్పేనే) విరజైయై ప్పఱ్ఱి అమానవవశత్తిలే వర్తిక్కుమాపోలే, తిరుక్కోనేరియై ప్పఱ్ఱి వర్తిక్కుమ్ కురుకాయ్ ప్పిఱప్పేన్ ఎన్గిఱార్. (వాழ்ழுమ్) కోయిల్ వాసమ్బోలేకాణుమ్ తిరుక్కోనేరియిల్. వర్తిక్కు మెన్గిఱ విడత్తుక్కు వేఱే వాచక శబ్దఙ్గళుణ్డాయిరుక్కచ్చెయ్తే "వాழ்ழுమ్" ఎన్గిఱ శబ్దత్తై ఇట్టపడియాలే అఙ్గుత్తై వాసన్దానే భోగరూపమా యిరుక్కు మెన్గై. (కురుకాయ్ ప్పిఱప్పేనే) ప్రకృతిపురుష వివేకమ్ పణ్ణుకైక్కుఱుప్పాన మనుష్యజన్మముమాయ్, అతిలే పరరక్షణత్తుక్కుఱుప్పు మాకైయాలే పుణ్యశరీరమాన క్షత్రియజన్మన్ వేణ్డా ఎన్గిఱార్ - అతు దుర్మానహేతు వాకైయాలే. ప్రకృతిపురుషవివేకమ్ పణ్ణవుమ్ మాట్టాతే, పరరక్షణత్తుక్కుఱుప్పు మిన్ఱిక్కే పాపయోనియా యిరుక్కిఱ తిర్యక్కాయ్ ప్పిఱక్క అమైయుమ్, తిరుమలై ఎల్లై క్కుళ్ళే పిఱక్క ప్పెఱిల్ ఎన్గిఱార్. "ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్" ఎన్గిఱార్; "కురుకాయ్ ప్పిఱప్పేన్" ఎన్గిఱార్. పిఱవియన్ఱు పోలే కాణుమ్ అఙ్గే పిఱక్కై.

*అరు :- ఊనేఱు ప్రవేశే. ముతఱ్పాట్టు. అఙ్గే వర్తిక్కైతానే కైఙ్కర్యత్తిల్ ఎల్లై. అఱువాయ్ నిత్యమా యిరుక్కిఱ ఆత్మావుక్కు ఇళైప్పుణ్డో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (ధర్మమిత్యాది). కీழ் పదత్తుక్కు త్తాత్పర్య మరుళిచ్చెయ్కిఱార్ (మాతా వినిత్యాది) ఇడక్కైయిలే యిరుక్కై స్వభావమన్ఱో? "ఇడత్తా" ఎన్ఱు విశేషిప్పానెన్? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (ఇడక్కైయిలే కాణలిత్యాది).*

**భావదీపిక :- అవ:-** "జ్ఞానశూన్యమైన మూలప్రకృతియొక్క వికారం అయిన శరీరం వేఱు; దానిలో ఉండే ఆత్మ వేఱు అని వివేకించి తెలిసికోవడానికి తగిన మానవజన్మను ఎత్తిన తరువాతకూడా, మానవజన్మలో ప్రజలను రక్షించవలసిన బాధ్యతను కల ఈ రాచజన్మ కైంకర్యానికి అడ్డుగా ఉన్నందువల్ల నాకు అది అక్కర లేదు. భగవద్భాగవత సంబంధాన్ని కల్గించగల్గిన తిరుమలలో నివసించే **"కురుకు"** (నీటికొంగ) అనే పక్షిగా పుట్టినా చాలు"- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఊన్ ఏఱు శెల్వత్తు ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్)** - నానాటికి మాంసం పెరగడంవల్ల శరీరం బలిసి, అందువల్ల కల్గిన అతిశయాన్ని కల ఈ మానవజన్మ నాకు వద్దు. ఈ మానవశరీరానికి వీరు చెప్పే కొఱత ఏమి? అని అంటే, నానాటికి మాంసం పెరిగి శరీరం బలుస్తుందే తప్ప, ఆత్మ తన స్వరూపానికి తగిన కైంకర్యాన్ని పొందకుండా చిక్కిపోతుంది. కనుక దీనిని వద్దు- అని అంటున్నారు. ఆత్మస్వరూపం, దాని ధర్మభూతజ్ఞానం నిత్యమే అయినా **"అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః"** (తైత్తి-ఆనం-6) (బ్రహ్మజ్ఞానం లేకపోతే అతడు బ్రతికి ఉన్నా లేనివాడే అవుతున్నాడు. బ్రహ్మజ్ఞానం ఉంటే, ఆకారణంవల్ల అతనిని అస్తిత్వం కలిగినవానినిగా తెలిసికొంటున్నారు) అని జ్ఞానంలో కొఱత ఏర్పడితే ఈ ఆత్మ

అసత్తు అవుతుంది– అని ఉపనిషత్తులో చెప్పినట్లే, స్వరూపజ్ఞానంలో కొఱత ఏర్పడవచ్చు కనుక, ఈ మానవజన్మను వద్దని అంటున్నారు.

**(యాన్ వేణ్డేన్)** – క్షుద్రదైవాలకు తమ తలను తఱిగి, బలి ఇచ్చేవారు, ఆ విధంగా బలి ఇవ్వడానికిముందు తమ శరీరానికి చందనం పూసికొని తిరిగేటట్లే, ఆత్మ పరమాత్మలనుగూర్చిన వివేకం లేనివాడు కావాలంటే ఈ శరీరాన్ని ఆదరించి తిరిగితే తిరుగవచ్చు. ఆత్మవివేకం కల నాకు అక్కర లేదు. శరీరం చాలా హేయమైనది అని, ఆత్మ కౌస్తుభంవలె చాలా భోగ్యమైనది అని, తనకే చెందినది అని, **"మయర్వఱ మదినల మరుళినన్"** అనే రీతిలో ఆభగవానుడు తానే తెలుపగా తెలిసిన నేను ఈ భౌతికజన్మను కోరను.

**(ఆనేఱు ఏ*ழ்* వెన్హాన్ అడిమై త్తిఱమల్లాల్)** – నప్పిన్నైప్పిరాట్టిని పరియణమాడడం కోసం దానికి అడ్డుగా ఉండే, బలాన్ని కల ఏడు ఎద్దులను జయించిన భగవానునకు దాస్యాన్ని చేయడమే కోరడడం కాకుండా, ఈ భౌతికజన్మను కోరను – అని తల్లిపట్ల ప్రేమను కల తండ్రికి దాస్యాన్ని చేయాలని కోరే కుమారునివలె ఆశపడుతున్నారు.

**(అడిమై త్తిఱమల్లాల్)** – దాస్యాన్ని చేయడం కాకుండా – అనే అర్థాన్ని గ్రహించవచ్చు. లేక, **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (రామా.అయో.31–25) (నీవు సీతాదేవితో కలసి పర్వతసానువులలో విహరించేటపుడు నేను నీవు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు మీ ఇద్దరికీ కైంకర్యాన్ని చేస్తాను) అని, **"ఒ*ழி*విల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని వ*ழு*విలా వడిమై శెయ్య వేణ్డుమ్"** (తిరువాయ్–3–3–1) (కాలం అంతా నిరంతరంగా నిలచి ఉండి విచ్ఛేదం లేని కైంకర్యాన్ని మనం చేయాలి) అనే చెప్పే రీతిలోనే సర్వదేశ – సర్వకాల – సర్వావస్థల లోను భగవానుని ఆనందంకోసమే అయిన కైంకర్యాన్ని చేయడం ఇక్కడ **"అడిమైత్తిఱమ్"** అని చెప్పబడుతున్నది– అని అనవచ్చు.

**(కూనేఱు శజ్ఞమ్ ఇడత్తాన్)** – వంపుతిరిగి ఉండే పాంచజన్యాన్ని తన ఎడమ చేతిలో ధరించేవాడు– అని భావం. దీనినిబట్టి శ్రీపాంచజన్యంవలె కైంకర్యంలో ఆశను కల వారినుండి నిత్యకైంకర్యాన్ని స్వీకరించేవాడని తెలుపబడింది.

**(కూనేఱు శజ్ఞ మిడత్తాన్) – "ఇత్యేవ ముక్తో మాత్రేదం రామో భ్రాతర మబ్రవీత్, ప్రాంజలిం ప్రహ్వా మాసీన మభివీక్ష్య స్మయన్నివ"** (రామా–అయో–4–4–2) (తల్లిచేత ఈ విధంగా చెప్పబడ్డ శ్రీరాముడు చేతులను జోడించి, నమస్కరించి నిలచిన తమ్ముడైన లక్ష్మణుని చూచి మందహాసం చేస్తున్నవానివలె ఈక్రింది విధంగా పలికాడు) అనే రీతిలో శ్రీరాముని దర్శించి కైంకర్యం చేసే గొప్ప వినయంవల్ల లక్ష్మణుడు చేతులను

జోడించి, భవ్యంగా వంగి వినమ్రంగా నిలచినట్లే, అందంగా వంగి ఉండి దర్శనమిచ్చే శ్రీపాంచజన్యాழ்వాన్- అని అంటున్నారు.

**(శఙ్గమిడత్తాన్)** -ఎడమచేతిలో శంఖాన్ని దర్శించినవారు కనుక **"శఙ్గమిడత్తాన్"** అని అంటున్నారు వీరు- కుడిచేతిలో శ్రీసుదర్శనాన్ని దర్శించారు కనుక **"వలక్కైయాழி ఇడక్కై చ్చఙ్గమ్"** (తిరువాయ్-6-4-9) (కుడిచేతిలో చక్రం, ఎడమచేతిలో శంఖం) అని పల్కిన నమ్మాழ்వార్లవలె. వక్షఃస్థలంలో లక్ష్మిని దర్శించగానే **"నిన్ వలమార్బినిల్ వాழ்కిన్ఱ మఙ్గై"** అని పల్కిన పెరియాழ்వార్ల వలె నేరుగా దర్శించినవారు కనుక ఈ విధంగా అంటున్నారు.

**(తన్ వేఙ్గడత్తు)** - దాస్యాన్ని స్వీకరించడానికి తగిన దివ్యదేశం కనుక **"ఎన్నుడైయతు"** (నాది) అని భగవానుడు ఆదరించి వేంచేసి ఉండే చోటు.

**(కోనేరి వాழுమ్ కురుకాయ్ పిఱప్పేనే)** - పరమపదంలోని విరజానదీతీరంలో అమానవపురుషుడు మోక్షాన్ని పొందేవారిని పిలుచుకొని పోవాలని ఆశపడేటట్లే, అర్చావతారంలోని అభినివేశంవల్ల కోనేరు అనే స్వామి పుష్కరిణిని ఆశ్రయించి జీవించే నీటికొంగగా జన్మించాలని ఆశపడుతున్నారు.

**(వాழுమ్)** - శ్రీరంగదివ్యాలయంలో నివసించేటట్లే తిరుమలలోని కోనేటిలో జీవించాలని ఆశపడుతున్నారు. **"ఇరుక్కుమ్"** వంటి సామాన్యవాచకాలని ప్రయోగించ కుండా **"వాழுమ్"** అని అనడంవల్ల అక్కడ నివసించడమే భోగ్యమైన ఉజ్జీవనమని- అని అంటున్నారు.

**(కురుకాయ్ పిఱప్పేనే)** - దేహాన్ని ఆత్మను వివేకించి తెలిసికోగల మానవజన్మను పొంది, అందులోను, జనులను పాలించడానికి తగిన క్షత్రియజన్మ కనుక, చాలా పుణ్యవశంచేత కల్గిన శరీరం అయిన రాచపుట్టుక సైతం నాకు వద్దు - అని అంటున్నారు; (ఎందుకంటే) అది అహంకారానికి కారణం అవుతుంది కనుక. దేహాన్ని, ఆత్మను వివేకించి తెలియలేని, ఇతరులను రక్షించడానికికూడా ఉపయోగపడని, పాపంచేత కల్గిన జన్మ అయినా పక్షిగా పుట్టినా చాలు- అది తిరుమలలోని ఎల్లలకు లోపల పుట్టగల్గితే -అని అంటున్నారు. **"ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్"** అని పల్కినవారు **"కురుకాయ్ పిఱప్పేనే"** అని అన్నందువల్ల దివ్యదేశవాసం కనుక అక్కడ తిరుమలలో జన్మించడాన్ని వీరు జన్మగా భావించలేదని తెలుస్తున్నది.

**ఆనాత శెల్వత్తు అరమ్బైయర్కళ్ తఱ్చూழ,**
**వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్,**

**తేనార్ పూఞ్జోలై త్తిరువేజ్గడచ్చునైయిల్,**
**మీనాయ్ ప్పిఱక్కుమ్ వితియుడైయే నావేనే** 2

ఆనాత శెల్వత్తు = ఏనాటికీ నశించిన (యౌవనం అనే) సంపదను కల, అరమ్బైయర్‌కళ్ = రంభ మొదలైన అప్సరసలు, తన్ శూழ = తనను పరివేష్టించి ఉండగా, వాన్ ఆళుమ్ శెల్వముమ్ = స్వర్గాన్ని పాలించే సంపదను, మణ్ అరశుమ్ = ఈ భూమిని పరిపాలించడాన్ని, యాన్ వేణ్డేన్ = నేను కోరను, తేన్ ఆర్ పూమ్ శోలై = తేనె నిండుగా ఉండే పూలను కల తోటను కల్గిన, తిరు వేఙ్గడమ్ శునైయిల్ = శ్రీవేంకటాచలంలో ఉండే కొండవాగులో, మీన్ ఆయ్ పిఱక్కుమ్ = చేపగా అయినా పుట్టే, విది ఉడైయేన్ ఆవేనే = భాగ్యాన్ని కలవాణ్ణి కావాలి.

**అవ :– ఇరణ్డామ్బాట్టు. ఇఙ్గుత్తై భోగఙ్గళిఙ్కాట్టిల్ నిలైనిన్ఱ భోగఙ్గళుమాయ్, ఇతుపోలే సావధియన్ఱియే నిరవధియు మాయిరుక్కు మితే స్వర్గత్తిల్ భోగమ్; అవై పెఱిల్ శెయ్‌వతెన్ నీర్? ఎన్న, అవైయుమ్ కీழ్జిల్ కழిత్త భూమియిల్ భోగముమ్ ఇరణ్డుమ్‌కూడ క్కిడక్కిలుమ్ వేణ్డా– ఎన్గిఱార్.**

**వ్యా :– (ఆనాత శైల్వత్తు అరమ్బైయర్‌కళ్) కెడాత సమ్పత్తు. అతావతు–అழియాత యౌవనశ్రీయైయుడైయ అప్సరస్సుకళ్. (తఞ్చూழ) ఇవన్‌తాన్ తప్ప నినైత్తాలుమ్ తప్ప వొణ్ణాతపడి అవర్‌కళ్ మేల్ విழ. (వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్) స్వర్గాదికళ్ అనుభవిక్కుమ్ సమ్పత్తోడేకూడ కీழ్జిల్ కழిన్ద రాజ్యశ్రీయైయుమ్ కూట్టినాలుమ్ వేణ్డేన్. "వేణ్డే" ఎన్గిఱతు – ఇవఱ్ఱుక్కు క్కుఱై యుణ్డాయన్ఱు; తామ్ నినైత్త పురుషార్థ మల్లామైయాలే వేణ్డే నెన్గిఱార్.**

**నీర్ వేణ్డి యిరుప్పతెన్, ఎన్న (తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడచ్చునైయిల్) తేనే మిక్కిరున్దుళ్ళ పొழిలెన్నుతల్. వణ్డుకళ్ మిక్కపొழిల్ ఎన్నుతల్. పొழిల్ శూழప్పట్టి రుక్కిఱ తిరుమలైయిల్ శునైకళిలే. (మీనాయ్ ప్పిఱక్కుమ్ వితియుడైయేనావేనే) కీழ్చ్చొన్న కురుకాయ్ ప్పిఱక్కిల్ అతుక్కు చ్చిఱకుణ్డాకైయాలే తిరుమలైయిల్ ఎల్లైయై క్కழియ ప్పఱక్కైక్కు యోగ్యతైయుణ్డితే. అప్పడియు మొన్ఱన్ఱియే ఉత్పత్తిస్థితిలయఙ్గళుమ్ తిరుమలై యిలే యామ్ మీనాయ్ ప్పిఱప్పేన్ ఎన్గిఱార్. (పిఱక్కుమ్ వితియుడైయేన్ ఆవేన్) ఇప్పోతు మీనాయ్ ప్పిఱకిఱార్. (పిఱక్కుమ్ వితియుడైయేన్ ఆవేన్) ఇప్పోతు మీనాయ్ ప్పిఱక్కవుమ్ వేణ్డా. ఒరు సుకృతత్తాలే అన్ద జన్మమ్ మేలే వరు మెన్నుమ్ తిణ్మై పిఱవు మమైయుమ్ ఎన్గిఱార్.**

**భావదీపిక:– అవ:–** ఇహలోకభోగాలు వద్దని మొదటి పాశురంలో అన్నారు. "ఈ లౌకిక భోగాలకంటే చాలా కాలం స్థిరంగా నిలచి ఉండేవి, వీటివలె అల్పమైన పరిమితిని

కల్గినవి కాక, దీర్ఘమైన కాలపరిమితిని కల్గినవిగాకదా స్వర్గభోగాలు ఉంటాయి. వాటిని పొందితే మీరు ఏంచేస్తారు?– అనే ప్రశ్న లేవగా, "మొదటి పాశురంలో వద్దన్న ఇహలోకసుఖాలు, స్వర్గలోక సుఖాలు– రెండూ కలిసి లభించినా నాకు అవి అక్కరలేదు" అని ఈ పాశురంలో అంటున్నారు.

**వాఖ్యానం :– (ఆనాత శెల్వత్తు అరమ్బైయర్కళ్)** – **"ఆనాత శెల్వత్తు"** అనే పదం నశించని యౌవనసంపదను తెలుపుతుంది. నశించని యౌవనసంపత్తిని కల రంభ, మేనక మొదలైన అప్సరలు అని భావం. (తఴ్జ్జ**ழ**) – తనను చుట్టిఉన్నా– అని భావం. అతడు తప్పించుకొని పోవాలని చూచినా పోలేనట్లుగా వారు ఇతనిపైబడి చుట్టుకొన్నా.

**(వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్)** – స్వర్గం మొదలైన వానిలో అనుభవించే సంపదతో పాటు, మొదటి పాశురంలో వద్దన్న రాజ్యసంపదను చేర్చి ఇచ్చినా అక్కరలేదు. సంపదలు కొఱతలను కల్గినది అనే భావంతో వీటిని వద్దని అనడం లేదు. తాము భావించే భగవత్సంబంధం అనే ప్రయోజనం వాటిలో లేనందువల్ల వద్దని అంటున్నారు. "అయితే, మీరు దేనిని కోరుతున్నారు ?" అనే ప్రశ్నరాగా, **(తేనార్ పూఞ్జోలై తిరువేఙ్గడచ్చునైయిల్)** – **"తేన్"** అనేది పూలలో ఉండే తేనెను, తుమ్మెదలను తెలుపుతుంది. **"తేనార్ పూఞ్జోలై"** అంటే "తేనె నిండుగా ఉండే పూలను కల తోటలు" అని కాని, "తుమ్మెదలు మెండుగా పూల తోటలు" అని కాని అర్థాన్ని గ్రహించవచ్చు. అటువంటి తోటలచేత చుట్టబడి–ఉండే తిరుమలలోని కొండవాగులలో– అని ఇక్కడి భావం.

**(మీనాయ్ ప్పిఱక్కుమ్ విదియుడైయేన్ ఆవేనే)** – మొదటి పాశురంలో చెప్పబడ్డ నీటికొంగగా పుడితే, దానికి రెక్కలు ఉంటాయి కనుక, తిరుమల ఎల్లలను దాటి పోవడానికి దానికి అవకాశం ఉన్నదికదా! ఆ విధంగా దాటిపోకుండా, ఈ కొండవాగులలోనే పుట్టి, జీవించి, నశించే తిరుమలలోని చేపగా పుట్టడమే కావాలని కోరుకొంటున్నాను– అని అంటున్నారు.

**(పిఱక్కుమ్ విదియుడైయేన్ ఆవేనే)**– "ఇపుడు వెంటనే చేపగా పుట్టాలని లేదు. ఒక పుణ్యం కారణంగా మఱుజన్మలో చేపగా పుట్టే జన్మ వస్తుంది అనే నిశ్చయాన్ని పొందినా చాలు" అని అంటున్నారు. **'విది'** అనే పదం పుణ్యంవల్ల నిశ్చయంగా కలిగే భాగ్యాన్ని తెలుపుతుంది.

**పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,**
**తున్నిట్టు ప్పుకలరియ వైకున్ద నీళ్వాశల్,**

**మిన్వట్ట చ్చుడరాழி వేఙ్గడక్కోన్ తానుమిழுమ్,**
**పొన్వట్టిల్ పిడిత్తుడనే పుకప్పెఱువే నావేనే. 3**

పిన్నిట్ట శడైయానుమ్ = పేనిన జటలను కలవాడైన శివుడు, పిరమనుమ్ = బ్రహ్మ, ఇన్దిరనుమ్ = దేవేంద్రుడు, మున్నిట్టు = ఒకరినొకరు సమ్మర్దించుకొని, పుకల్ అరియ= లోపలకు ప్రవేశించలేకుండా ఉండే, వైకున్దమ్ నీళ్ వాశల్ = (భూలోక) వైకుంఠం అనే తిరుమలలోని విశాలమైన వాకిలిలో, పిన్ వట్టమ్ శుడర్ ఆழி = మెఱపు మెరిసినట్లు కాంతిని వెదజల్లే శ్రీసుదర్శనుని కల, వేఙ్గడమ్ కోన్‌తాన్ = శ్రీవేంకటేశ్వరుడు, ఉమిழுమ్= ఉమిసే, పొన్ వట్టిల్ పిడిత్తు = తమ్మపడిగాన్ని చేతిలో పట్టుకొని, ఉనే పుక ప్పెఱువేన్ ఆవేనే = అంతరంగవృత్తిని చేసేవారితో ప్రతిదినం లోపల ప్రవేశించే భాగ్యాన్ని పొందాలి.

**అవ :- మూన్ఱామ్బాట్టు. పారతన్త్ర్యత్తుక్కు ఉఱుప్పాక ప్పెఱిల్ కీழிల్ కழிన్ద మనుష్య జన్మమేయాకిలుమ్ ఆమైయు మెన్గిఱార్.**

**వ్యా. :- (పిన్నిట్ట శడైయానుమ్) పిన్నప్పట్ట శడైయాన్ ఎన్నుతల్; పిన్నే నాలప్పట్ట శడై యానెన్నుతల్. పిన్నే వర్తిక్కక్కడవనితే పుత్రన్. అప్పడియే బ్రహ్మావిన్ పిన్నే నిఱ్కుమ్ శడైయాన్ ఎన్నుతల్. (పిరమనుమ్) ఇవనుక్కు జనకనాన బ్రహ్మావుమ్. (ఇన్దిరనుమ్) "స బ్రహ్మ స శివః" ఎన్ఱాల్ ఇవర్‌కళోడొక్క, "సేన్ద్రః" ఎన్నుమ్బడియాన ఇన్ద్రనుమ్, (తున్నిట్టు ప్పుకలరియ వైకున్ద నీళ్ వాశల్) ఒరువర్‌క్కొరువర్ మున్బు పోకవేణ్డి నెరుక్కుకైయాలే పుక అరితాయిరుక్కిఱ వైకున్ద నీళ్‌వాశలిలే.**

**(మిన్ వట్ట చ్చుడరాழி) మిన్నై వళైత్తాప్పోలే జ్యోతిస్సైయుముడైత్తాయ్, చ్చుగ్గ్రుమ్ వాయైయుముడైత్తా యిరుక్కిఱ తిరువాழிయాழ்వానై యుడైయ. (వేఙ్గడక్కోన్ఱాను మిழுమ్ పొన్ వట్టిల్ పిడిత్తుడనే పుకప్పెఱువే నావేన్) బ్రహ్మరుద్రాదికళ్ నెరుక్కి ప్పుకప్పెఱాతే నిఱ్క, "పణిక్కు క్కడవన్, ఇవనై ప్పుకుర విడు" ఎన్ఱు ఉళ్ళే అన్తరఙ్గవృత్తిక్కు క్కడవవర్‌కళోడే నానుమ్ సజాతీయనాయ్ ప్పుకవేణుమ్.**

**భావదీపిక :- అవ :-** పారతంత్ర్య స్వరూపానికి తగినట్లు దాస్యాన్ని చేయగల్గితే, ముందు గడచిన మానవజన్మ లభించినా చాలు- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (పిన్నిట్ట శడైయానుమ్)** - ఒకదానిలో ఇంకొకటి పెనవేసికొని ఉండే జటలను కలవాడని కాని, వెనుకకు వేలాడే జటలను కలవాడు అని కాని అర్థాన్ని గ్రహించవచ్చు. కుమారుడు తండ్రికి వెనక ఉండవలసినవాడేకదా ! ఆ రీతిలోనే తండ్రి అయిన బ్రహ్మకు వెనక నిలచి ఉండే జటలను కలవాడు- అని కూడా చెప్పవచ్చు.

**(పిరమనుమ్)** - ముందు పల్కిన జటలను కలవాడైన శివుని జనింపచేసిన బ్రహ్మ.

**(ఇన్దిరనుమ్) – "తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, స బ్రహ్మ స శివః సేంద్రః సోஉక్షరః పరమః స్వరాట్"** (తైత్తి.నారా–11) (వహ్నిశిఖ అనబడే ఆ దివ్యమంగళవిగ్రహంయొక్క నడుమ పరమాత్మ విశేషంగా ప్రకాశిస్తున్నాడు అతడే. బ్రహ్మకు అంతర్యామి. అతడే శివునకు అంతర్యామి. ఇంద్రునకు అంతర్యామి. బ్రహ్మమొదలైన వారికంటే కైవల్యనిష్ఠునికంటే గొప్పవాడు, కర్మకు వశం కానివాడు, నాశరహితుడు అయిన ముక్తాత్మకు కూడా అతడే అంతర్యామి.) అని చెప్పినట్లు బ్రహ్మను, శివుని పరమాత్మయొక్క విభూతిగా చెప్పినపుడు, వారికి తరువాత లెక్కపెట్టదగిన గొప్పతనాన్ని కలవాడు కనుక, వారితో చేర్చి పఠించబడే ఇంద్రుడు.

**(తున్నిట్టు ప్పుకలరియ వైకున్ద నీళ్ వాశల్)** – ఒకరిని ఇంకొకరు తోసికొని సమ్మర్దించుకొంటూ ప్రవేశించాలని చూచినా, లోపలకు వెళ్ళలేని భూలోకవైకుంఠం అయిన తిరుమలయొక్క విశాలమైన వాకిలిలో– అని అర్థం. పరమపదంలో వీరు ప్రవేశించడానికి చోటు లేనే లేనందువల్ల, తరువాత శ్రీవేంకటేశ్వరుని సన్నిధిని చెప్పినందువల్ల ఈ విధంగా అర్థం గ్రహింపబడింది.

**(మిన్ వట్ట చ్చుదరాழ்ి)** – మెఱపును గుండ్రంగా వంచినట్లుగా ప్రకాశించేవాడు, ఎల్లప్పుడు పరిభ్రమించే నోటిని కల్గిన వాడైన శ్రీసుదర్శనంయొక్క.

**(వేఙ్గడక్కోన్ తాన్ ఉమిழ்ుమ్ పొన్వట్టిల్ పిడిత్తు ఉడనే పుకప్పెఱువేన్ ఆవేనే)** – బ్రహ్మ, ఇంద్రుడు సమ్మర్దంవల్ల లోపలకు ప్రవేశించలేకుండా ఉన్నపుడు, "మేము ఉమిసే నీటిని గ్రహించే తమ్మపడిగాన్ని పట్టుకొనే కైంకర్యాన్ని చేసే ఇతనిని మాత్రం లోపలకు పంపించు" అని ఆజ్ఞాపించినందువల్ల, అంతరంగకైంకర్యాన్ని చేసే భక్తులతోతానుకూడా ఒకడై ప్రవేశించే భాగ్యాన్ని పొందాలి– అని అంటున్నారు.

**ఒణ్ పవళవేలై ఉలవు తణ్ పాఱ్కడలుళ్,**
**కణ్డుయిలు మాయోన్ కழ்లిణైకళ్ కాణ్బతఱ్కు,**
**ప్పణ్ పకరుమ్ వణ్డినఙ్గళ్ పణ్పాడుమ్ వేఙ్గడత్తు,**
**చ్చెణ్బకమాయ్ నిఱ్కుమ్ తిరువుడైయే నావేనే** 4

ఒణ్ పవళమ్ వేలై ఉలవు = కాంతిని కల పగడాలను తీరాలకు కొట్టుకొని వచ్చి చేర్చి, (అలలు అనే కాళ్ళతో) సంచరించే, తణ్ పాఱ్కడలుళ్ = చల్లని క్షీరాబ్ధిలో, కణ్ తుయిలుమ్ = నిద్రించే, మాయోన్ = ఆశ్చర్యగుణచేష్టితాలను కల భగవానుని, కழ்ల్ ఇణైకళ్ కాణ్బదఱ్కు = రెండు శ్రీచరణాలను సేవించడం కోసం, పణ్ పకరుమ్ వణ్డు ఇనఙ్గళ్ = తీయని రాగాలను పాడే తుమ్మెదల సమూహాలు, పణ్ పాడుమ్ వేఙ్గడత్తు = రాగాలను పాడేటట్లుండే తిరుమలలో, శెణ్బకమ్ ఆయ్ నిఱ్కుమ్ = చంపకవృక్షంగా ఉండే, తిరు ఉడైయేన్ ఆవేనే = భాగ్యాన్ని కలవాడను కావాలి.

**అవ :- నాలామ్బాట్టు. మనుష్యశరీరమ్ రాజావాకైక్కుమ్ పొతువాకైయాలే అతు వేణ్డా, తిరువేఙ్గడముడైయానుక్కు ఉఱుప్పామ్బడి తిరుమలైయిలే నిఱ్పతొరు స్థావరమాక అమైయుమ్ నాన్- ఎన్గిఱార్.**

**వ్యా :- (ఒణ్బవళ వేలై యులవుతణ్ పాఱ్కడలుళ్) ఒళ్ళియ పవళత్తై క్కరైయిలే కొడువన్దు కొழிక్కిఱ పాఱ్కడల్- ఎన్నుతల్. ఒళ్ళియ పవళఙ్గళై క్కొణ్డు ఉలావుకిఱ తిరైకళైయుడైయ శ్రమహరమాన తిరుప్పాఱ్కడలిలే- ఎన్నుతల్. (కణ్ తుయిలు మాయోన్) తిరుప్పాఱ్కడ లిలే "కిడన్దతోర్ కిడక్కై" ఎన్ఱు శొల్లుమ్బడి కణ్వళర్న్దరుళుకిఱ ఆశ్చర్యభూత నానవన్. (కழలిణైకళ్ కాణ్బతఱ్కు) అఙ్గు చ్చెన్ఱు కిట్టిక్కాణవొణ్ణాత అరుమై తీర క్కాణలామ్ దేశత్తిలే కాణ్గైక్కాక.**

**(పణ్ పకరుమ్) ఇయలై క్కఱ్ఱ శిక్షాబలత్తాలే ఇశైవరుమతిన్నియే వార్త్తై శొల్లుమ్బోతుమ్ పణ్ణాయిరుక్కై. (వణ్డినఙ్గళ్ పణ్బాడుమ్ వేఙ్గడత్తు) తాఙ్గళ్ పాడుకిఱ పాట్టుక్కు ఇశైన్ద వణ్డినఙ్గళానవై పణ్ పాడుకిఱ తిరుమలైయిలే. (శెణ్బకమాయ్ నిఱ్కుమ్ తిరువుడైయే నావేనే) తిరుమలైయిలే శెణ్బకమాయ్ నిఱ్కుమ్ సమ్పత్తుణ్డాక వేణుమ్. అతావతు - భగవత్ప్రత్యాసత్తియితే ప్రాప్యమ్. అతు కిట్టుమాన పిన్బు స్థావరమాయ్ నిఱ్కవుమ్ అమైయుమ్; మేలే ఏఱిన చైతన్యత్తాలే కార్య మిల్లై- ఎన్గిఱార్.**

*అరు :- నాలామ్బాట్టు. (ఒణ్ పవళ మిత్యాది). (తాఙ్గళ్ పాడుకిఱ) ఎన్దతు-వ్యాఖ్యాతృ వార్తైయాయ్, "తాఙ్గళ్" - ఆழ்వార్కళై చ్చొల్లుకిఱతు. ఆழ்వార్కళ్ పాశురత్తుక్కు చ్చేర వణ్డుకళ్ గానమ్ పణ్ణుకిఱతు- ఎన్దపడి. అన్ఱియే, వణ్డుకళాన తాఙ్గళెన్దాయ్, తఙ్గళ్ పాట్టుక్కు చ్చేర త్తాఙ్గళే గానమ్ పణ్ణుకిఱతు- ఎన్నవుమామ్.*

**భావదీపిక :- అవ :- "కైంకర్యాన్ని చేయగల్గితే మానవజన్మకూడా ఎత్తవచ్చు"** అని గడచిన పాశురంలో పలికారు. "మానవశరీరం ప్రభువుగా ఉండడానికికూడా సాధారణమైనది కనుక, అది వద్దు. శ్రీవేంకటేశ్వరుని కైంకర్యానికి ఉపయోగపడేటట్లుగా తిరుమలలో ఒక సంపెంగ చెట్టుగా నిలచినా చాలు" అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఒణ్ పవళమ్ వేలై ఉలవుతణ్ పాఱ్కడలుళ్)** - కాంతి నిండిన పగడాలను కొట్టు కొనివస్తూ ప్రవహించే అలలను కల్గినదై, దరి చేరినవారి శ్రమను తీర్చే క్షీరాబ్ధి. **"వేలై"** అనే పదం అలలను తెలుపడమే కాకుండా తీరాన్నికూడా తెలుపుతుంది కనుక, "కాంతిని చిమ్మే పగడాలను తీరానికి కొట్టుకొని వచ్చే పాలసముద్రం" అని కూడా చెప్పవచ్చు.

**(కణ్ తుయిలుమ్ మాయోన్)** - క్షీరాబ్ధిలో **"కిడన్దదోర్ కిడక్కై"** (తిరుమాలై -23) (శయనించి ఉన్నది అద్వితీయమైన సన్నివేశం) అని పలికే రీతిలో శయనించి ఉండే అందాన్ని చూపుతూ పరుండి ఉండే ఆశ్చర్యాన్ని కలవాడు.

**(కழలిణైకళ్ కాణ్బదఱ్కు)** – మనకు దరిచేరడానికి వీలుకాని అక్కడకు పోయి చేరి, అతని శ్రీచరణాలను దర్శించలేని కొఱత తీరేటట్లు, దర్శించదగిన తిరుమలలో దర్శించడం కోసం– అని భావం. వీరికి క్షీరాబ్ధికంటే తిరుమలయే ఉద్దేశ్యం కనుక, ఈ విధంగా ఇక్కడ అర్థాన్ని గ్రహించాలి.

**(పణ్ పకరుమ్)** – మానవులు ముందుగా పాటలోని శబ్దాలను పల్కడం నేర్చి, ఆ తరువాత సంగీతం నేర్పించేవారి శిక్షలో సంగీతమనే స్వరాన్ని నేర్చే రీతిలో కాకుండా, ధ్వనించడం ప్రారంభించినపుడే స్వరరూపంగానే ధ్వనించే తుమ్మెదలకు– అని భావం సహజసిద్ధంగానే సంగీతాత్మకంగా ధ్వనించే– అని సారం.

**(వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్ వేఙ్గడత్తు)** – తుమ్మెదల గుంపులు తాము ధ్వనించే స్వరాలతో కలిసేటట్లుగా రాగాలను పాడే తిరుమలలో– అని భావం. **"పణ్ పకరుమ్ వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్"** అని స్వరాన్ని పాడడాన్ని రెండుమార్లు చెప్పినందువల్ల **"పణ్ పాడుమ్"** అనే పదానికి. "తమవంటి ఆழ్వార్లు పాడే పాటతో అనుగుణంగా ఉండేటట్లు తుమ్మెదలు రాగాలను పాడే తిరుమలలో" అని వ్యాఖ్యానంలో అర్థం వివరింపబడింది.

**(శెణ్బకమాయ్ నిఱ్కుమ్ తిరువుడైయేన్ ఆవేనే)** – తిరుమలలో సంపెంగ చెట్టుగా నిలిచే సంపద నాకు కలగాలి– అని భావం. దీని ఆంతర్యమేమంటే– భగవానునితో సన్నిహితంగా ఉండడమే నాకు కావలసినది. అది లభిస్తే వృక్షంగా ఉన్నా చాలు. దానికంటే జ్ఞానాన్ని కల మానవజన్మ అక్కర లేదు– అని భావం.

**కమ్బమతయానై క్కழுత్తకత్తిన్ మేలిరున్దు,**
**ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్,**
**ఎమ్బెరుమాన్ ఈశ నెழிల్ వేఙ్గడమలైమేల్,**
**తమ్బకమాయ్ నిఱ్కుమ్ తవముడైయే నావేనే** **5**

కమ్బమ్ = (చూచినవారు అందఱు) భయపడేటట్లుగా, మదమ్ యానై = మదాన్ని కల్గిన ఏనుగుయొక్క కழுత్తు అకత్తిన్ మేల్ ఇరున్దు = మెడపై (తన గొప్పతనం వ్యక్తం అయేటట్లుగా వేంచేసి ఉండి), ఇన్బు అమరుమ్ శెల్వముమ్ = అన్ని భోగాలను అనుభవించేటట్లుగా ఉండే ఐశ్వర్యాన్ని, ఇవ్వరశుమ్ = (దానికి సాధనం అయిన) ఈ రాజ్యపరిపాలనను, యాన్ వేణ్డేన్ = నేను ఆశించను, ఎమ్బెరుమాన్ = నాకు స్వామి, ఈశన్ = అన్ని లోకాలకు ప్రభువు అయిన సర్వేశ్వరునియొక్క, ఎழிల్ వేఙ్గడమలైమేల్ =అందమైన తిరుమలలో, తమ్బకమ్ ఆయ్ నిఱ్కుమ్ = (ఏ పనికి ఉపయోగించని) స్తంభంగా నిలచిఉండే, తవమ్ ఉడైయేన్ ఆవేనే = భాగ్యాన్ని కల్గినవాడనుగా కావాలి.

**అవ :- అఙ్జామ్బాట్టు. శెణ్బకమానాల్ పరిమళత్తుక్కాక ఉళ్ళే కొణ్డు పుకువర్కళెన్ఱు ఒరు ప్రయోజనత్తై క్కణిశిత్తామితే. అప్పడియు మొన్ఱు మిల్లాత తమ్బకమాకవుమ్ అమైయు మెన్గిఱార్.**

**వ్యా :- (కమ్బమతయానై క్కళుత్తకత్తిన్ మేలిరున్దు) కణ్డారెల్లామ్ నదుఙ్గుమ్బడి మతిప్పై యుడైయ ఆనై- ఎన్నుతల్. మదత్తాలే కమ్బత్తినిన్ఱుమ్ విడవొణ్ణాతపడి నిఱ్కుమ్ యానై ఎన్నుతల్. ఒరువరాలుమ్ మేఱ్కొళ్ళవొణ్ణాతాకిలుమ్ రాజాక్కళై మేఱ్కొళ్ళవొట్టుమితే యానైకళ్. ఎల్లార్క్కుమ్ భయావహమాన యానైయై మేఱ్కొణ్డు తన్కరుత్తిలే నడత్తి. (ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్) అఙ్గే యిరున్దు ఎల్లా భోగఙ్గళుమ్ భుజిక్కుమ్ సమ్పత్తుమ్, అతుక్కడియాన రాజధర్మముమ్ యాన్ వేణ్డేన్.**

**నీర్ వేణ్డువతెన్? ఎన్నిల్ (ఎమ్బెరుమానీశన్) అఖిలజగత్స్వామి, అస్మత్స్వామి. (ఎళ్గిల్ వేఙ్గడమలైమేల్) ఎల్లార్క్కుమ్ స్వామియా యిరున్దువైత్తు ఎన్బక్కలిలే విశేషకటాక్షత్తై పణ్ణిన ఎన్నాయనతాన ఎళ్గిలుడైయ తిరుమలైయిలే. (తమ్బకమాయ్ నిఱ్కుమ్ తవముడై యే నావేనే) ఒరు ప్రయోజనత్తుక్కాకాతే అఙ్గే ముళైత్తు త్తీయ్న్దు పోవతొరు స్థావర మావేన్. (తవ ముడైయేనావేనే) అనేకజన్మసాధ్యతపఃఫలమ్ ఎన్ఱిరుక్కిఱార్ కాణు మితుతన్నై.**

**భావదీపిక:- అవ:-** ముందు పాశురంలో చెప్పిన రీతిలో సంపెంగ చెట్టుగా నిలచి ఉంటే దాని పూలు మొదలైనవానిని కోవెలకు తీసికొని పోవచ్చు. కనుక ఒక ప్రయోజనం కల్గుతుందని భావించి, వీరు ఈ విధంగా పలికారని చెప్పవలసి ఉన్నది. ఆ విధంగా ఏ ప్రయోజనం లేని స్థాణువువంటి వృక్షంగా ఉన్నా చాలు అని అంటున్నారు- ఈ దశకంలో.

**వ్యాఖ్యానం :- (కమ్బమదయానై క్కళుత్తకత్తిన్ మేలిరున్దు) - "కమ్బమ్"** అనే పదం కంపాన్ని, స్తంభాన్ని చెబుతుంది కనుక, "చూచిన వారంతా వణకేటట్లున్న గొప్పతనాన్ని కల ఏనుగు" అని కాని, మదం పట్టి ఉన్నది కనుక బయటకు వెళ్ళకుండా ఉండేటట్లు స్తంభానికి కట్టబడిన ఏనుగు- అని కాని అర్థాన్ని గ్రహించవచ్చు. **"మదమ్"** అనేది మొదటి అర్థంలో అతిశయాన్ని కల్గినదని, రెండవ అర్థంలో మదాన్ని పట్టి ఉన్నదనే అర్థాన్ని తెలుపుతుంది.

**(కళుత్తకత్తిన్ మేలిరున్దు)** - అన్యులు తనపై అధిరోహించడానికి సాధ్యం లేకపోయినా ప్రభువులను తనపైకి ఎక్కనిస్తాయి కదా మదపుటేనుగులు. "మిగిలిన వారికి భయాన్ని కల్గించే మదించిన ఏనుగులపై ఎక్కి, తన ఇష్టానుసారంగా నడపి"- అని భావం.

**(ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్)** - ఇటువంటి ఏనుగులపైకి ఎక్కి ఉండగల గొప్పతనంవల్ల రాజులకు తగిన అన్ని భోగాలను అనుభవించే సంపద; దానికి కారణం అయిన రాజ్యపాలన - ఇవి ఏమీ నాకు అక్కరలేదు. అయితే మీకు కావలసినది ఏమి? అని అంటే.

**(ఎమ్బెరుమాన్ ఈశన్ ఎழ்ిల్ వేఙ్గడమలైమేల్) - "అఖిలజగత్స్వామిన్। అస్మత్స్వామిన్"** (శరణాగతిగద్య) (లోకాలకు అన్నిటికి స్వామీ! నాకు స్వామి) అనే రీతిలో లోకాలకు అన్నిటికి నాయకునిగా ఉన్నా, నా విషయంలో గొప్పదైన కటాక్షాన్ని ప్రసరింపజేసిన నాథుడు వేంచేసి ఉండే అందమైన తిరుమలలో.

**(తమ్బకమాయ్ నిఱ్కుమ్ తవముడైయేన్ ఆవేనే)** - ఏ ప్రయోజనానికి సహాయపడకుండా తిరుమలలో మొలిచి, అక్కడే ఎండిపోయి స్థాణం(మొద్దు)గా పడి ఉండే చెట్టుగా ఉన్నా చాలు- అని అంటున్నారు. తిరుమలలో ఉండడమే చాలు. ఎవరికీ పడవలసిన ఆవశ్యకత లేదు- అని భావం.

**(తవముడైయేన్ ఆవేనే)** - ఈ విధంగా తిరుమలలో నిష్ప్రయోజనంగా ఉండడం పలు జన్మలలోచేసిన పుణ్యఫలం అని తలుస్తున్నారుకదా వీరు.

**మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనకైయుమ్,**
**అన్నవర్తమ్ పాడలొడుమ్ ఆడలవై ఆతరియేన్,**
**తెన్న వెన వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్ వేఙ్గడత్తుళ్,**
**అన్ననైయ పొఱ్కువడామ్ అరున్దవత్త నావేనే** **6**

మిన్ అనైయ నుణ్ ఇడైయార్ = మెఱుపువలె సూక్ష్మమైన నడుమును కలవారైన, ఉరుప్పశియుమ్ మేనకైయుమ్ అన్నవర్తమ్ = ఊర్వశి, మేనకవంటి అందమైన స్త్రీలు, పాడలొడుమ్ ఆడల్ అవై = ఆటలు, పాటలు మొదలైనవానిని, ఆదరియేన్ =నేను ఆదరించను, వణ్డు ఇనఙ్గళ్ = తుమ్మెదల గుంపులు, తెన్న ఎన పణ్ పాడుమ్ = "తెన తెన" అని ఝుంకారం చేస్తూ రాగయుక్తంగా పాడే, వేఙ్గడత్తుళ్ = వేంకటాద్రిలో, అన్ననైయ పొన్ కువడు ఆమ్ = నిస్సమాభ్యధికం అయిన శిఖరం కావడానికి తగిన, అరు తవత్తన్ ఆవేనే = గొప్ప తపస్సును కలవాడను కావాలి.

**అవ :- ఆఱామ్బాట్టు. స్థావరమానాల్ ఒరు నాళ్ ఉణ్డాయ్, ఒరునాళ్ ఇన్ఱియే పో మితే. అఙ్గనన్ఱియే, ఎన్రుమొక్క ఉణ్డాయిరున్ద తిరుమలైయిల్ ఏకదేశమాకవేణుమ్ నాన్-ఎన్గిఱార్.**

**వ్యా :- (మిన్ననైయ నుణ్ణిడైయారిత్యాది) మిన్పోలే నుణ్ణియ ఇడైయై యుడైయరాన దేవస్త్రీకళైప్పోలే అழ்ుకియరాయిరుక్కిఱ స్త్రీకళుడైయ ఆడల్ పాడల్కళిల్ ఎనక్కు ఆదర**

**మిల్లై. (తెన్న వెన వణ్డినజ్గళ్ పణ్బాడుమ్ వేజ్గడత్తుళ్) తెన తెన ఎన్ను ఆళత్తివైత్తు వణ్డినజ్గళ్ పణ్బాడుకిఅ తిరుమలైయిలే. (అన్ననైయ పొఋ్కువడామ్ అరున్దవత్తనావేనే) అప్పడిప్పట్ట పొఋ్కువడెన్నుమత్తనై. వేఋపమాన మిల్లై. (అరుమ్ తవత్త నానేవేనే) తిరువేజ్గడముడైయాన్ తనక్కు అవ్వరుకాకిఅతితే, ఆకైయాలే "అరున్దవత్తన్" ఎన్న క్కుఱై యిల్లైయితే.**

**భావదీపిక :- అవ:-** గత పాశురంలో పల్కినట్లు చెట్టుగా ఉంటే కొంతకాలం ఉండి, తర్వాత నశించి పోవచ్చు. ఆ విధంగా కాకుండా, తిరుమలలో సదా ఉండేటట్లు అందులో ఒక శిఖరంగా ఉండాలి– అని అంటున్నారు ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనకైయుమ్ అన్నవర్తమ్ పాడలొడుమ్ ఆడలవై ఆదరియేన్)** – మెఱపువలె సన్నని నడుమును కల ఊర్వశి, మేనక, మొదలైన దేవతాస్త్రీలవలె అందంగా ఉండే స్త్రీల ఆటపాటలు నాకు అక్కరలేదు.

**(తెన్న వెన వణ్డినజ్గళ్ పణ్ పాడుమ్ వేజ్గడత్తుళ్)– "తెన్నా తెనా వెన్ను వణ్డు మురల్ తిరువేజ్గడత్తు"** ("తెనా తెనా" అని అంటూ తుమ్మెదలు ఝుంకారం చేసే తిరుమలలో) అని ఝుంకారం చేస్తూ తుమ్మెదల గుంపులు రాగాలు పాడే తిరుమలలో. **(అన్ననైయ పొఋ్కువడామ్)** "తనకు తానే సాటి అయిన బంగారువంటి శిఖరం" అని చెప్పాలి తప్ప దీనికి ఇంకొక ఉపమానం లేదని భావం.

**(అరున్తవత్తన్ ఆవేనే)** – శ్రీవేంకటేశ్వరునకు సమీపంలో ఉన్నదికదా ! అందువల్ల శిఖరంగా ఉండడం గొప్ప పుణ్యఫలం అని వీరు చెప్పడంలో లోటు లేదు కదా !

**వానాళుమ్ మామతిపోల్ వెణ్ కుడైక్కీழ్ మన్నవర్ తమ్,**
**కోనాకి వీఱ్ఱిరున్దు కొణ్డాడుమ్ శెల్వఱియేన్,**
**తేనార్ పూఞ్జోలై త్తిరువేజ్గడమలై మేల్,**
**కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయే నావేనే** 7

వాన్ ఆళుమ్ మా మది పోల్ = ఆకాశాన్ని తన వెలుగుతో వ్యాపించే పూర్ణచంద్రుని వంటి, వెణ్ కుడై క్కీழ్ = శ్వేతచ్ఛత్రం నీడలో, మన్నవర్ తమ్ కోనాకి వీఱ్ఱిరున్దు = రాజాధిరాజుగా కొలువుండి, కొణ్డాడుమ్ శెల్వు = (అందరిచే) కీర్తింపబడే సంపదను, అఱియేన్ = నేను ఒక వస్తువుగా భావించను, తేన్ ఆర్ పూ శోలై = తేనె నిండుగా ఉండే పూల తోటలను కల, తిరు వేజ్గడమ్ మలైమేల్ =తిరుమల కొండపై, కానల్ ఆఋ పాయుమ్= ఒక అడవిలోకి వాగుగా ప్రవహించేటట్లుగా, కరుత్తు ఉడైయేన్ ఆవేన్ = భావనను కలవాడను కావాలి.

**అవ :- ఏழாమ్పాట్టు. తిరుమలైయిల్ శిఖరమానాల్ ఏఅవల్లార్ అనుభవిత్తు, మాట్టాతార్ ఇழழக్కుమతాయిరుక్కుమితే. అప్పడి యిన్ఱియే, ఎల్లార్క్కుమ్ అనుభవ యోగ్యమా యిరుక్కుమ్ కానాఱాక వేణుమ్ నాన్- ఎన్గిఱార్.**

**వ్యా. :- (వానాళుమ్ మామతిపోల్ వెణ్ కుడైక్కీழ்) ఆకాశప్పరప్పుక్కెల్లామ్ చన్ద్రన్ ఒరువనుమే యానాప్పోలే, లోక మెల్లామ్ తన్ వెణ్ కొற்றకుడైక్కీழ் ఒతుఙ్గుమ్పడియాక. (మన్నవర్తమ్ కోనాకి) నక్షత్రతారాగణఙ్గళ్ చన్ద్రనై సేవిత్తిరుక్కుమాపోలే. రాజాక్కళెల్లామ్ వన్దు సేవిత్తిరుక్కుమ్పడి రాజరాజనాయ్. (వీற்றిరున్దు కొణ్డాడుమ్ శెల్వతియేన్) వేఱుపడ ఇరున్దు కొణ్డాడుమ్ సమ్పత్తు ఎనక్కు ప్రతిపత్తివిషయమా యిరుక్కిఱతిల్లై. (తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడమలైమేల్)- తేల్ మిక్కిరున్దుళ్ళ శోలైయైయుడైయ తిరుమలైమేల్. (కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయే నావేనే) - సహ్యమ్ పற்றినతాకిల్ కీழே పోమితే! అఙ్గే శువతిప్పోమ్ కాట్టాఱుకళామ్ అభిసంధియై ఉడైయేనాకవేణుమ్.**

**భావదీపిక :- అవ :-** తిరుమలలో శిఖరంగా ఉన్నా, అది దానిని ఎక్కగల్గిన కొందఱికే అనుభవయోగ్యంగా ఉంటుంది. మిగిలినవారికి అనుభవయోగ్యంగా ఉండదు కనుక, అందఱు అనుభవించేటట్లుగా ఉండే, తిరుమలలోని అడవులలో వాగుగా కావాలి- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (వానాళుమ్ మా మది పోల్ వెణ్ కుడై క్కీழ்)** - విశాలమైన ఆకాశాన్ని అంతా చంద్రుడొక్కడే తన కాంతితో ప్రకాశింపజేసేటట్లు, లోకంఅంతా అంతటిని తన తెల్లని గొడుగుకింద ఒదిగి ఉండేటట్లుగా

**(మన్నవర్తమ్ కోనాకి)** - నక్షత్రసమూహాలు చంద్రుని చుట్టి ఉండేటట్లు ప్రభువులందఱు వచ్చి చుట్టి సేవించే రాజాధిరాజై.

**(వీற்றிరున్దు కొణ్డాడుమ్ శెల్వతియేన్)** - మిగిలిన అందఱికంటే గొప్పతనం వెలిగేటట్లుగా సింహాసనంలో వేంచేసి ఉండి, అందఱిచేత ప్రశంసింపబడే సంపద నా జ్ఞానానికి విషయం కావడంలేదు.

**(తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడమలైమేల్)** - తేనె మిక్కిలిగా ఉండే పూలను కల తోటలలో కూడిన తిరుమలపై,

**(కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయేన్ ఆవేనే)** - ఒక పర్వతాన్ని జన్మస్థానంగా కల్గి, బయటకు పోయి ప్రవహించే కావేరీనదివంటి నదిగా ఉంటే క్రిందకు పోయిపడుతుందికదా ! ఆ విధంగాకూడా తిరుమలలోనే ఒకచోట పుట్టి అక్కడే ఇంకొక చోట ఎండిపోయే అడవిలో నదిగా ఉండే భావనను కలవాడను కావాలి- అని అంటున్నారు.

**పిఱై యేఱు శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,**
**ముఱైయాయ పెరు వేళ్వి కుఱై ముడిప్పాన్ మఱైయానాన్,**
**వెఱియార్ తణ్శోలై త్తిరువేజ్గడమలైమేల్,**
**నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలైయుడైయేన్ ఆవేనే 8**

పిఱై ఏఱు శడైయానుమ్ = బాలచంద్రుని జటలలో ధరించిన శివుడు, పిరమనుమ్= బ్రహ్మ, ఇన్దిరనుమ్ = ఇంద్రుడు, ముఱై ఆయ = తమ యోగ్యతకు తగిన రీతిలో చేసే, పెరు వేళ్వి= గొప్ప యాగాలకు ఫలంగా, కుఱై ముడిప్పాన్ = వారి వారి కోరికలను పూర్తి చేసేవాడు, ముఱై ఆనాన్ = వేదప్రతిపాద్యార్థస్వరూపుడై ఉండేవాడు అయిన భగవానుని, వెఱి ఆర్ తణ్ శోలై = పరిమళం అతిశయించిన, చల్లని తోటలను కల్గిన, తిరు వేజ్గడమలైమేల్ = శ్రీవేంకటాద్రిపై, నెఱి ఆయ్ కిడైక్కుమ్ = (శ్రీవైష్ణవుల శ్రీచరణరేణువులు సోకే రీతిలో) దారిగా ఉండే, నిలై ఉడైయేన్ ఆవేన్ = స్థితిని కలవాడను కావాలి.

**వ్యా :- ఎట్టామ్పాట్టు. (పిఱై యేఱు శడైయానుమ్) సాధకవేషమ్ తోన్ఱుమ్పడి జటైయోడే యిరుక్కచ్చెయ్తే సుఖప్రధాన నెన్ఱు తోన్ఱుమ్పడి పిఱైయై ధరిత్తుక్కొణ్డిరుక్కిఱ హరనుమ్. (పిరమనుమ్) అవనుక్కు జనకనాన బ్రహ్మావుమ్. "సేన్ద్రః" ఎన్నుమ్పడియాన ఇన్ద్రనుమ్. (ముఱైయాయ పెరు వేళ్వి కుఱై ముడిప్పాన్) తన్దాముడైయ అధికారాను గుణమాకప్పణ్ణుమ్ యజ్ఞఫలమాన అధికారజ్గళై క్కొడుక్కుమవన్. (మఱైయానాన్) బ్రహ్మాదికళుక్కు ఆశ్రయణీయ నెన్నుమ్ వేదైకసమధిగమ్యనానవన్.**

**(వెఱి యార్ తణ్ శోలై త్తిరువేజ్గడమలైమేల్ నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలైయుడైయేనా వేనే) పరిమళమ్ మిక్కు కుళిర్త్తియైయుడైయ తిరుమలైమేలే. ఆఱానాల్ ఒరుకాల్ పెరుకినాల్ వినియోగప్పట్టు వఱ్ఱినాల్ వినియోగప్పడాతితే. అజ్గనన్నియే, ఎప్పోతుమొక్క శ్రీవైష్ణవర్కళ్ సఞ్చరిక్కైయాలే అవర్కళ్ పాదరేణు పడుమ్పడి వఴియాయ్ క్కిడక్కుమ్ తుణివుడైయ నావేనే. "తొణ్డరడిప్పొడి యాడ నామ్ పెఱిల్" ఎన్ఱిరుక్కుమవరితే.**

**భావదీపిక :- అవ:-** అడవి వాగుగా అయినా, ఒక సమయంలో ప్రవహించి, ఇంకొక కాలంలో అది ఎండిపోవచ్చు. అందువల్ల శ్రీవేంకటేశ్వరుని సేవించాలని వచ్చే జ్ఞానుల శ్రీచరణసంబంధం పొందేటట్లుగా తిరుమలకు వెళ్ళే స్థిరమైన మెట్లు కల దారిగా పడి ఉండాలి- అని ఇందులో ఆళ్వార్లు ఆశపడతున్నారు.

**వ్యాఖ్యానం : (పిఱై ఏఱు శడైయానుమ్)** - భగవానుని పొందడానికి ఉపాయాన్ని అనుష్ఠించే వాడు- అనే విషయం తెలిసేటట్లుగా జటలతో ఉన్నపుడే, సుఖప్రధానుడు అని స్ఫురించేటట్లు చంద్రుని తలపై ధరించే ఉండే శివుడు.

**(ఇన్దిరనుమ్) – "తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, స బ్రహ్మా స శివ స్సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్"** (తైత్తి. నారా) (వహ్ని శిఖ అనబడే ఆ దివ్యమంగళ విగ్రహంలో నడుమ పరమాత్మ విశేషించి ప్రకాశిస్తూ ఉంటాడు. అతడే బ్రహ్మకు, అంతర్యామి, అతడే శివునకు అంతర్యామి, అతడే ఇంద్రునకు అంతర్యామి. బ్రహ్మమొదలైన వారికంటే, కైవల్యనిష్ఠునికంటే గొప్పవాడు,కర్మకు వశుడు కానివాడు, నాశరహితుడు అయిన ముక్తాత్మకుకూడా అతడే అంతర్యామి) అనే రీతిలో బ్రహ్మరుద్రాదులకు తర్వాత లెక్కపెట్టదగిన ఐశ్వర్యాన్ని కలవాడు కనుక వారితో కలిపి పఠింపబడే ఇంద్రుడు.

**(ముఱైయాయ పెరు వేళ్వి క్కుఱై ముడిప్పాన్)** – తమ తమ పదవులకు తగిన రీతిలో అశ్వమేధాదియాగాలను చేసినందువల్ల కల్గిన ఫలాలు అయిన పదవులను ఇచ్చేవాడితడే.

**(ముఱైయానాన్)** "బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు– మొదలైనవారు తమ తమ పదవులను పొందడానికి ఆశ్రయించదగినవాడితడే" అని వేదంలో ఘోషింపబడింది.

**(వెఱి యార్ తణ్ శోలై త్తిరువేఙ్గడమలైమేల్ నెఱియాయ్ కిడైక్కుమ్ నెఱియుడైయేన్ ఆవేనే)** – పరిమళం అతిశయించిన చల్లని తోటను కల తిరుమలపై. (గత పాశురంలో ఆశపడిన రీతిలో) ఒక అడవి వాగుగా అయితే, ప్రహించే కాలంలో భగవద్భాగవతులకు ఉపయోగపడినా, ఎండిపోతే ఉపయోగించదు కనుక, ఆ విధంగా వాగుగా ఉండకుండా, ఎల్లప్పుడు శ్రీవైష్ణవుల ఎక్కి దిగుతున్నందువల్ల వారి పాదరేణువులు పడేటట్లుగా, కొండను ఎక్కే స్థిరమైన మెట్లను కల దారిగా ఉండే నిశ్చయాన్ని కలవాడను కావాలి – అని అంటున్నారు. **"తొణ్డరడిప్పొడి ఆడ నామ్ పెఱిల్ కఙ్గైనీర్ కుడైన్దాడుమ్ వేట్కై ఎన్నావతే"** (పెరుమాళ్ తిరు–2–2) (భగవద్భక్తుల శ్రీచరణరేణువులలో స్నానం చేయగల్గితే, గంగా నదీజలాలలో స్నానంచేయాలనే ఆశ ఎందుకు?) అని ఆశపడిన వారు కదావీరు.

**శెడియాయ వల్ వినైకళ్ తీర్క్కుమ్ తిరుమాలే!,**
**నెడియానే! వేఙ్గడవా! నిన్ కోయిలిన్ వాశల్,**
**అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దియఙ్గుమ్,**
**పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే** **9**

శెడి ఆయ = పాపఫలం అయిన, వల్ వినైకళ్ = క్రూరమైన సంసారసంబంధాన్ని, తీర్క్కుమ్ = తీర్చే, తిరుమాలే = శ్రియఃపతి అయిన స్వామీ!, నెడియానే = (ఆశ్రితపక్షపాతంలో) ఎల్లను లేనివాడా!, వేఙ్గడవా = వేంకటేశ్వరా!, నిన్ కోయిలిన్ వాశల్ = నీ ఆలయముఖద్వారంలో, అడియారుమ్ = (అనన్యప్రయోజనులైన) శ్రీవైష్ణవులు, వానవరుమ్ = (ప్రయోజనాంతరపరులైన) దేవతలు, అరమ్బైయరుమ్ = (ఇతరులకు

సేవను చేసే) రంభాద్యప్సరసస్త్రీలు, కిడన్దు ఇయఙ్గుమ్ = కూడి సంచరించే, పడి ఆయ్ కిడన్దు = గడపగా పడి ఉండి, ఉన్ పవళవాయ్ కాణ్బేన్ = నీ పగడంవంటి మోవిని దర్శించాలి.

**వ్యా :- ఒన్బతామ్బాట్టు. (శెడియాయ వల్‌వినైకళ్ తీర్‌క్కుమ్) తన్ తిరువడికళిలే తలై శాయ్‌త్తారుడైయ పాపఫలమాన సంసారసమ్బన్ధత్తై అఱుత్తుక్కొడుక్కుమవనాయ్‌త్తు. శెడి-పాపమ్. (తిరుమాలే) అతుక్కు నిబన్ధనమ్ కూడ విరున్దు శెయ్‌విప్పారుణ్డాకై. (నెడియానే) అవళ్‌తానుమ్ "ఎన్నాలుమ్ పొఱుక్కప్పోకాతు" ఎన్ఱపోతు "ఎన్నడియార్ అతు శెయ్యార్" ఎన్ఱు - ఆశ్రితవిషయత్తి లోరమ్ ఎల్లై కాణవొణ్ణాతవన్. (వేఙ్గడవా నిన్ కోయిలిన్ వాశల్) దేవరీరుడైయ తిరువాశలిలే.**

**(అడియారుమ్ వానవరు మరమ్బైయరుమ్ కిడన్దియఙ్గుమ్ పడియాయ్ క్కిడన్దు) అనన్యప్రయోజనరుమ్, ప్రయోజనాన్తరపరరుమ్, అన్యపరరుమ్ కిడన్దు సఞ్చరియానిన్ఱాల్ ఒరునినైవఱ్ఱు అచేతనవత్ కిడక్కవేణుమ్. (ఉన్ పవళవాయ్ కాణ్బేనే) పారతన్త్ర్యత్తుక్కు అచేతనసమాధియాకవుమ్ వేణుమ్; అతు పురుషార్థమాకైక్కు క్కాణవుమ్ వేణుమ్.**

**భావదీపిక :- అవ:-** పలు శ్రీవైష్ణవుల శ్రీచరణరేణువులను ధరించడంతో పాటు భగవానుని సేవించేటట్లుగా భగవానుని సన్నిధిలో ముందుగా ఉండే గడపగాఉండాలి- అని ఆశపడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (శెడియాయ వల్ వినైకళ్ తీర్‌క్కుమ్)-** తన శ్రీచరణాలలో తలను వంచినవారికి పూర్వకర్మల కారణంగా కల్గిన సంసార సంబంధాన్ని తీర్చి ఇచ్చేవాడు. **"శెడి"** అనే పదం పాపాన్ని సూచిస్తుంది. **"శెడియాయ వల్ వినైకళ్"** అనే ప్రయోగం పాపంవల్ల కల్గినది. అతడు తీరిస్తే తప్ప పోగొట్టుకోవడానికి వీలుకాని సంసారసంబంధాన్ని తెలుపుతున్నది.

**(తీర్‌క్కుమ్ తిరుమాలే)** - ఈ విధంగా సంసారసంబంధాన్ని తీర్చుకోవడానికి చేతనులకు పురుషకారాన్ని చేసే లక్ష్మీదేవితో కూడి ఉండే వాడా ! అని అంటున్నారు.

(నెడియానే) - **"తన్నడియార్ తిఱత్తకత్తు త్తామరైయాళాకిలుమ్ శిదకురైక్కుమేల్"** (పెరియా-తిరు-4-8-2) (తనదాసులపట్ల లక్ష్మీదేవి అయినా దోషారోపణ చేస్తే) అనే రీతిలో లక్ష్మీదేవికూడా "నాకు కూడా సహించరాని పాపాలను చేసినవాడు వీడు" అని అంటే, **"ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్"** (పెరియా. తిరు. 4-8-2) (నాదాసులు తప్పును చేయరు; చేస్తే మంచినే చేస్తారు) అని పలికేటట్లుగా వారి విషయంలోని పక్షపాతానికి అవధిలేని మహోన్నతుడు.

**(వేఙ్గడవా నిన్ కోయిలిన్ వాశల్)** – శ్రీవేంకటేశ్వరా! నీ గర్భగృహం వాకిలిలో.

**(అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దు)** – అతనిని తప్ప వేఱు ఏ ఫలాన్ని ఆశించని దాసులు, తాము కోరే ఫలాలకోసం అతనిని ఆశ్రయించే దేవతలు, ఆ దేవతలకు సేవచేసే దైవకాంతలు తనపై ఎక్కి సంచరిస్తే, తన కోసం అంటూ ఒక ఆనందం లేనందువల్ల, జ్ఞానశూన్యం అయిన వస్తువువలె నేను ఉండాలికదా అని అంటున్నారు. అయితే, వీరికి జ్ఞానానందాలు లేవా! మఱి– అని అంటే,

**(ఉన్ పవళవాయ్ కాణ్బేనే)** – అత్యంతపరతంత్రులు కనుక, తనకు అంటూ ఒక ఆనందం లేదు కాబట్టి, అటువంటి ఆనందలో అచేతనంవలె ఉండాలి. అయితే, భగవానుని చూచి ఆనందించడం జ్ఞానాన్ని కల చేతనునకు ఫలం కనుక, అటువంటి చేతనుని చూచి ఆనందించే భగవానుని పగడపు మోవిని స్వార్థరహితంగా దర్శించాలి– అని అంటున్నారు. తనకోసం (స్వార్థంగా) చేసే భగవదనుభవకైంకర్యాలు గొప్ప పురుషార్థాలు కావు అని, పరార్థంగా (భగవానుని ఆనందం కోసమైన) భగవదనుభవ కైంకర్యాలు గొప్ప పురుషార్థాలని ఇక్కడ తెలుపబడింది. వీరి ఈ అనుసంధానాన్ని అనుసరించే అన్ని దివ్యదేశాలలోను భగవానుని ముందుండే గడప **"కులశేఖరప్పడి"** అనే పేరుతో పిలువబడుతున్నది.

**ఉమ్బరులకాణ్డు ఒరు కుడైక్కీழ் ఉరుప్పశితన్,**
**అమ్బొఱ్కలైయల్‌కుల్ పెఱ్ఱాలుమ్ ఆతరియేన్,**
**శెమ్బవళవాయాన్ తిరువేఙ్గడ మెన్నుమ్,**
**ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏతేను మావేనే** **10**

ఉమ్బర్ ఉలకు = ఊర్ధ్వలోకాలను అన్నిటిని, ఒరు కుడై కీழ் = సాటిలేని తన శ్వేతచ్ఛత్రం నీడలో, ఆణ్డు = పాలించి, ఉరుప్పశితన్ = ఊర్వశియొక్క, అమ్ పొన్ కలై అల్‌కుల్= అందమైన బంగారు వస్త్రాన్ని అలంకరించుకొన్న నడుమును, పెఱ్ఱాలుమ్= పొందినా, ఆతరియేన్ = దానిని కోరను, శెమ్ పవళ వాయాన్ = ఎఱ్ఱని పగడంవంటి నోటిని కలవాడైన, ఎమ్బెరుమాన్ = నాస్వామియొక్క, తిరువేఙ్గడమ్ ఎన్నుమ్ పొన్ మలైమేల్ = వేంకటాద్రి అనే పేరును కల అందమైన పర్వతంపై, ఏదేనుమ్ ఆవేనే = ఏదయినా ఒక పదార్థంగా కావాలి.

**అవ :– పత్తామ్బాట్టు. కిట్టుమళవుమ్ వేణ్డా ఎన్గిఱీర్; కిట్టినవాతే అనుభవిక్కిఱీరెన్న, అవై కిట్టినాలుమ్ వేణ్డా వెన్గిఱార్.**

**వ్యా. :– (ఉమ్బరులకాణ్డొరుకుడై క్కీழ்) ఉపరితనలోకఙ్గళెల్లామ్ తన్నొరుముత్తిన్ కుడైక్కీழ் శెలుత్తి. (ఉఱ్పశితన్ అమ్బొఱ్కలై అల్‌కుల్ పెఱ్ఱాలు మాతరియేన్) అవఱ్ఱై**

**క్కిట్టు విత్తాలుమ్ ఎనక్కు ఆదరమ్ పిఱవాతు. (శెమ్బువళవాయాన్) ఉఱ్పశియై క్కణ్డాల్ అనాదరిక్కుమ్బడియాయ్త్తు ఉళ్ళు నిత్యిఱ విషయత్తిన్బడి. (తిరువేజ్గడమెన్నుమ్ ఎమ్బెరుమాన్ పొన్‌మలైమేల్) ఎన్నాయనుడైయ శ్లాఘ్యమాన తిరుమలైమేల్.**

**(ఏతేను మావేనే) అనన్దాఴ్వాన్, ఇవ్విడత్తుక్కు "తిరువేఙ్గడముడైయాన్దానాకవుమమైయుమ్" ఎన్నుమ్. అతుక్కు హృదయమెన్? ఎన్నిల్, శేషభూతర్‌తిరళుక్కు ప్పుఱమ్బాన శేషియాకిలు మమైయు మెన్రై. అజ్గనన్రిక్కే, భట్టరరుళిచ్చెయ్యుమ్బడి,-"నాను మతియవేణ్డా; తిరువేజ్గడముడైయాను మతియవేణ్డా; కణ్డారు మతిన్దు శ్లాఘిక్కవుమ్ వేణ్డా; తిరుమలై మేలే యుళ్ళతొరు పదార్థమాక అమైయుమ్" ఎన్బర్.**

**భావదీపిక :- అవ:-** మిగిలిన ప్రయోజనాలు మీకు లభించినా వద్దని అంటున్నారు తప్ప, ఒకవేళ అవి లభిస్తే వాటిని అనుభవించడాన్ని వదలరు- అని భగవానుని అభిప్రాయంగా తలచి, అవి లభించినా నాకు అక్కరలేదు సుమా!- అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఉమ్బర్ ఉలకు ఆణ్డు ఒరు కుడై క్కీఴ్)** - ఇంద్రలోకం మాత్రమే కాకుండా, పైన ఉండే దేవలోకాలన్నీ నా శ్వేతచ్ఛత్ర చ్ఛాయలో ఒరిగి ఉండే రీతిలో పరిపాలనను సాగించి,

**(ఉరుప్పశితన్ అమ్బెఱ్ఱలైయల్‌కుల్ పెగ్ర్రాలుమ్ ఆదరియేన్)** - ఇక్కడ ఊర్వశి అనుభవాన్ని ప్రస్తావించడం ఊర్ధ్వలోకసుఖాలు అన్నిటికీ ఉపలక్షణం. అవి అన్నీ దొరికినా నాకు వాటిలో అభినివేశం లేదు.

**(శెమ్బువళవాయాన్)** - ఈ ఊర్వశీభోగం మొదలైన అన్నిటినీ అలక్ష్యంచేసే (అనాదరించే) రీతిలోకదా తిరుమలలో వేంచేసి ఉండే భగవానుని ఎఱ్ఱని పగడం వంటి అధరంయొక్క రాగం ఉన్నది.

**(తిరువేఙ్గడ మెన్నుమ్ ఎమ్బెరుమాన్ పొన్ మలైమేల్)** - నా నాథుని మిక్కిలి గొప్ప తిరుమలపై,

**(ఏతేనుమ్ ఆవేనే)** - ఎంతటి తక్కువ వస్తువుగా అయినా నేను కావాలి- అని భావం. ఈ సందర్భానికి తిరుమలై అనన్దాఴ్వాన్ అర్థాన్ని చెప్పేటప్పుడు **"శ్రీవేంకటేశ్వరుడుగా అయినా చాలు"** అని అన్నారట. దీనికి భావం ఏమంటే- దీనికి ముందు పాశురాలలో ఆశపడినది- భగవానునకు శేషంగా ఉండే ఏదయినా ఒక వస్తువుగా కావాలి అని. ఆవిధంగా శేషంగా ఉండే అన్ని వస్తువులకంటే విలక్షణమైనది, కైంకర్యాన్ని స్వీకరించేవాడైన శ్రీవేంకటేశ్వరుని తిరుమేనిగా కావడం చేతనుని స్వరూపానికి నిజంగా తగిన ఫలం కాదు. అయినా, వేఱు ఏ గొప్ప వస్తువుగా కాకపోయినా, ఈ ఫలం అయినా కలగాలని అనన్దాఴ్వాన్ భావం. ఈ విధంగా కాకుండా భట్టర్ ఈ క్రింది అర్థనిర్వాహాన్ని అనుగ్రహించారు. "నాకు తెలియనిది, శ్రీవేంకటేశ్వరునకు తెలియనిది,

దర్శించేవారు తెలిసికొని, కీర్తించే యోగ్యతలేనిది అయిన తిరుమలలో ఉండే ఏదయినా ఒక వస్తువుగా అయినా చాలు– అని.

**మన్నియ తణ్ శారల్ వడవేజ్గడత్తాన్టన్,**
**పొన్నియలుమ్ శేవడికళ్ కాణ్బాన్ పురిన్దిఱైఞ్జి,**
**కొన్నవిలుమ్ కూర్వేల్ కులశేకరన్ శొన్న,**
**పన్నియ నూల్ తమి౹ళ్ వల్లార్ పాజ్గాయ పత్తర్కళే** **11**

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

కొల్ నవిలుమ్ = (విరోధులను) వధించడంలో ప్రావీణ్యాన్ని కల, కూర్ వేల్ = పదునైన వేలాయుధాన్ని కల, కులశేకరన్ = కులశేఖరా౹ళ్వార్లు, మన్నియ తణ్ శారల్ = మాఱని, స్థిరంగా ఉండే శైత్యాన్ని కల కొండచరియలను కల్గిన, వడ వేజ్గడత్తాన్ తన్ = ఉత్తరదిక్కులోని వేంకటాద్రిపై వేంచేసి ఉండే భగవానునియొక్క, పొన్ ఇయలుమ్ శే అడికళ్ = బంగారంవంటి, గొప్ప ఎఱ్ఱని శ్రీచరణాలను, కాణ్బాన్ = సేవించదానికి, పురిన్దు = ఆశపడి, ఇఱైఞ్జి = నమస్కరించి, శొన్న = అనుగ్రహించిన, పన్నియ నూల్ తమి౹ళ్ = విస్తరించిన, లక్షణానికి అనుగుణమైనవి అయిన ద్రావిడశబ్దసందర్భాలను, వల్లార్ = అభ్యసించగలవారు, పాజ్గు ఆయ పత్తర్కళే = (అతని మనస్సును ఆనందింపజేసే) భోగ్యులైన భక్తులు కాగలరు.

**వ్యా :– పతినోరామ్బాట్టు. (మన్నియ తణ్ శారల్ వడ వేజ్గడత్తాన్టన్ పొన్నియలుమ్ శేవడికళ్ కాణ్బాన్) కణ్డార్ కాల్ వాజ్గమాట్టాతే పిణిప్పడుమ్బడి శ్రమహరమాన పర్యన్తత్తైయుడైయ తమి౹ళ్క్కలైయాన తిరుమలైయై యుడైయవనుడైయ శ్లాఘ్యమాన తిరువడికళై క్కాణ్గైక్కాక. (పురిన్దిఱైఞ్జి) కాణవేణ్డుమ్బడి భక్తియైయుడైయరాయ్ తలైయాలే వణజ్గి కృవిపాడినారాయ్త్తు.**

**(కొన్నవిలుమ్ కూర్వేల్ కులశేకరన్ శొన్న) ప్రతిపక్షత్తై వెల్లవల్లరానాప్పోలేయాయ్త్తు కృవిపాట్టిరుక్కుమ్బడియుమ్. (పన్నియ నూల్ తమి౹ళ్వల్లార్) పరమ్బిన లక్షణోపేతమాన తమి౹ళ్త్తొడైయై వల్లవర్కళ్. (పాజ్గాయ పత్తర్కళే) ఇజ్గే యిరున్దు "అతు వాక వేణుమ్, ఇతు వాకవేణుమ్" ఎన్నాతే అవనుక్కు ఇష్టవినియోగార్హమావర్కళ్.**

**పెరియవాచ్చాన్బిళ్ళై తిరువడికళే శరణమ్.**

**పెరుమాళ్ తిరుమొ౹ళి నాలాన్దిరుమొ౹ళి వ్యాఖ్యానమ్ ము౹ర్౹ర్౹ర్౹ఱు.**

***వ్యా :– పతినోరామ్బాట్టు. (మన్నియ ఇత్యాది) (అతువాక ఇతువాక) అతువాయ్ ప్పిఱక్క ఇతువాయ్ ప్పిఱక్క.***



**భావదీపిక :- అవ:-** ఈ దశకాన్ని అభ్యసించగల్గినవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కి నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (మన్నియ తణ్ శారల్ వడ వేఙ్గడత్తాన్ తన్ పొన్నియలుమ్ శేవడికళ్ కాణ్బాన్)** – విడిచిపోలేనట్లుగా, చూచినవారిని ఆకర్షించే, మాఱని చల్లదనంతో కూడిన కొండచరియలను కల్గినది కనుక, చూచినవారి శ్రమను హరించేదై, ద్రవిడదేశానికి ఉత్తరదిక్కు ఎల్లగా ఉండే తిరుమలను కలవాని మిక్కిలి గొప్ప శ్రీచరణాలను దర్శించడంకోసం.

**(పురిన్దు ఇశైశ్జై)** – దర్శించాలి అనే భక్తిని కలవారై, శిరసా నమస్కరించి, నోటితో కవిత్వాన్ని చెప్పారు. (స్తుతించారు)

**(కొన్నవిలుమ్ కూర్ వేల్ కులశేకరన్ శొన్న)** – శత్రువులను సంహరించడంలో సమర్థులైనట్లే కవిత్వాన్ని చెప్పడంలో కూడా సమర్థులు– అనే విషయాన్ని తెలిపే రీతిలో అనుగ్రహించిన.

**(పన్నియ నూల్ తమిழ் వల్లార్)** భక్తిని కలవారి అందరిమనస్సులలో విస్తరించినదై, కవిత్వలక్షణానికి అనుగుణం అయిన ద్రావిడపాశురమాలికను అభ్యసించగల్గినవారు.

**(పాఙ్గాయ పత్తర్‌కళే)** – ఉన్నచోటనే ఉంటూ, "భగవత్సంబంధం ఉండే చోట ఈ విధంగా జన్మించాలి, ఆవిధంగా పుట్టాలి" అని ఆశపడవలసిన ఆవశ్యకత లేకుండా, అతని అభిమతానుసారంగా వినియోగించుకొనే భక్తులుగా కాగలరు.

**నాల్గవ దశకం వ్యాఖ్యానానువాదం ముగిసింది.**

---

## అఙ్జాన్దిరుమొழி - తరు తుయరమ్ - ప్రవేశమ్

**అవ :- (తరు తుయరమ్) తిరుమన్త్రత్తాల్ శొల్లిற్றాయ్త్తు– అనన్యార్హశేషత్వమితే. ఇన్ద అనన్యార్హశేషత్వప్రతిపత్తిక్కు విరోధితాన్ "నాన్, ఎన్నతు" ఎన్టిరుక్కుమ్ అహఙ్కార మమకారమితే. అనాత్మన్యాత్మబుద్ధియుమ్. అస్వే స్వత్వబుద్ధియుమితే సంసారమాకిఱ వృక్షత్తుక్కు బీజమెన్టు ప్రమాణఙ్గళ్ శొల్లుకిఱతు. అతు చేతనర్‌క్కుమ్ పొతువితే. అప్పడి యన్టియే, రాజాక్కళాకైయాలే అహఙ్కారమమకారవశ్యరాయితే యిరుప్పతు. "నిలా, తెన్టల్, శన్దనమ్" ఎన్టు శొల్లుకిఱ ఇవై పరార్థమాకాతపోతు స్వరూపసిద్ధి యిల్లైయామితే. అప్పడియేయితే పరార్థమాన వస్తువుక్కుమ్ అహఙ్కారమమకారత్తాలే స్వరూపసిద్ధి యழிయుమితే. ఇప్పడి పరార్థ మెన్నుమ్బడిక్కు ప్రమాణముణ్డో? ఎన్నిల్, ఇవనై "యస్మాస్మి" ఎన్టు మోతి, అవనై "పతిం విశ్వస్య" ఎన్టుమ్ ఓతుకైయాలే ఇవన్ ఒన్టుక్కుమ్ కడవనల్లన్; ఉడైయవనానవనే ఎల్లావற்றుక్కుమ్ కడవనెన్టతితే.**

అప్పడి ప్రమాణఙ్గళాల్ శొన్న శేషత్వప్రతిపత్తియానతు - తదీయశేషత్వపర్యన్తమాన అనన్యార్హశేషత్వమితే. అప్పడి తమక్కు ప్పిఱన్దిరుక్కచ్చెయ్తే అతు ఫలప్రదమాక క్కణ్డిలర్. తాన్ తన్కరుమమ్ శెయ్కిఱాన్ ఎన్టాతల్, నామ్ క్రమత్తాల్ శెయ్కిఱో మెన్ఱు ఆఱియిరున్దా నాతల్, నమ్ముడైయ త్వరైక్కడియాన రుచియు మఱియుమవనాకైయాలే రుచిపాకమానాల్ శెయ్కిఱో మెన్ఱు ఆఱియిరున్దానాతలామితనై. నమ్మైప్పోలన్ఱియే, శెయ్తతు అఱిన్దిరుక్కుమ్ సర్వజ్ఞనాయుమ్, నినైత్తతు తలైక్కట్టవల్ల సర్వశక్తియా యిరున్దువైత్తు ఆఱియిరుక్కుమ్బోతు శిల హేతుక్కళుణ్డాకవేణుమితే ఎన్ఱు పార్త్తు, "ఎనక్కు నాను మిల్లై; పిఱరు మిల్లై, పేఱ్ఱిల్ త్వరైయాలే తుడిక్కితే నిత్తనైయల్లతు సాధనానుష్ఠాన క్షమను మల్లేన్" ఎన్ఱు మిడత్తై అనన్యగతికళాయిరుక్కుమ్ పదార్థఙ్గళై నిదర్శనమాక విట్టు త్తమ్ముడైయ అనన్యగతిత్వత్తై త్తిరువిత్తువక్కోట్టు నాయనార్ తిరువడికళిలే విణ్ణప్పమ్ శెయ్కిఱార్.

*అరు :- తరుతుయరమ్ ప్రవేశే. శేషత్వజ్ఞానమ్ పిఱన్దిరుక్కచ్చెయ్తేయుమ్ తమక్కు ఉతవామైయాలే అనన్యగతిత్వాదికళ్ తమక్కిల్లైయాక నినైత్తిరున్దానాకవేణు మెన్ఱు తమ్ముడైయ అనన్యగతిత్వాదికళై ఆవిష్కరిక్కిఱార్ - ఇత్తిరుమొழிయిల్, ప్రథమత్తిలే శేషత్వత్తిన్ క్రమత్తై శిక్షిక్కిఱార్ (తిరుమన్త్రత్తాలిత్యాది) అహఙ్కారాదికళ్ విరోధమాకిఱతు ఎన్ద ఆకారత్తిలే? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (నిలా త్తెన్టలిత్యాది).*

## అయిదవ దశకం- ప్రవేశం - అనువాదం

**భావదీపిక :-** వేదాలన్నిటికి సారమైన తిరుమంత్రంలో ముఖ్యంగా చెప్పబడినది- అనన్యార్హశేషత్వమే. అంటే- జీవాత్మ పరమాత్మకు తప్ప వేఱెవ్వరికి శేషం కాదు- అనే జ్ఞానం. ఈ భావానికి అడ్డుగా ఉండేది **"అహమ్"** (నేను) అని అతడు దేహాన్ని ఆత్మగా భావించే అహంకారం, **"నాది" (మమ)** అని దేహంతో చేరిన వస్తువులను నాది అని భావించే మమకారం. **"అనాత్మన్యాత్మబుద్ధి ర్యా చాస్వే స్వమితి యా మతిః, సంసారతరు సంభూతి ర్బీజ మేతత్ ద్విధా స్థితమ్"** (విష్ణు.పు- 6-7-11) (ఆత్మ కాని దేహంలో ఆత్మ అనే బుద్ధి; తనది కాని వస్తువు తనది అనే బుద్ధి- అనేవి సంసారమనే విషవృక్షం యొక్క వృద్ధికి రెండు విధాలైన విత్తులు) ఇత్యాది ప్రమాణాలు ఈ అహంకార మమకారాలు రెండిటిని సంసారమనే వృక్షానికి బీజంవలె కారణంగా ఉన్నాయని చెబుతున్నాయి. ఈ రెండు అన్ని జీవులకు సామాన్యమైనా, (కులశేఖరులవంటి) ప్రభువులు అహంకార- మమకారాలకు చాలా వశులై ఉంటారు. వెన్నెల, చందనం, మలయమారుతం మొదలైన కొన్ని వస్తువులు ఇతరులకు ఉపయోగపడనపుడు అవి ఎందుకోసం ఉన్నాయో ఆ ప్రయోజనం వాటికి సిద్ధించదు. ఆ విధంగానే, జీవాత్మ భగవానునికోసమే ఉన్నందుచేత, అహంకార మమకారాలవల్ల దాని స్వరూపం సిద్ధించకుండా పోతుంది కదా! - ఈవిధంగా

జీవాత్మ పరమాత్మ కోసమే ఏర్పడి ఉన్నది అనే అర్థానికి ప్రమాణం ఉన్నదా ! అని అంటే, **"యస్యాస్మి న త మంతరేమి"** (యజు-బ్రాహ్మ-3-7) (ఎవనికి నేను దాసభూతునిగా ఉన్నానో ఆ పరమాత్మను విడచి వేఱొకని దగ్గరకు పోను) అని జీవాత్మ పరమాత్మకోసమే ఉన్నదని వేదం పల్కుతున్నది. **"పతిం విశ్వస్యాత్మేశ్వరమ్"** (తైత్తి-నారా-11) (లోకానికి అంతటికి పతి, తనకు తానే ఈశ్వరుడు) అని అంటూ పరమాత్మను లోకానికి అంతటికి స్వామి అని తెలిపింది. ఈవిధంగా జీవుడు సొత్తుగా, పరమాత్మ స్వామిగా ఉండడంవల్ల జీవునకు తన కార్యాన్ని తాను నెఱవేర్చుకొనే యోగ్యత లేదు- అని, పరమాత్మకే తన సొత్తు అయిన జీవుని కార్యాని పూర్తిచేయవలసిన బాధ్యత ఉన్నదని తెలుస్తున్నది. ఈ విధంగా ప్రమాణాలు జీవుడు పరమాత్మకే చెందినవాడనే భావనతో తాను ఉండాలని చెప్పడం పరమాత్మయొక్క భక్తులకుకూడ తాను శేషభూతుడు అని భావించే భాగవతశేషత్వంవరకు అనువర్తించినపుడే అది ఫలవంతం అవుతుంది. ఇటువంటి భావన తమకు కల్గినా, దాని ఫలంగా భాగవతకైంకర్యాన్ని భగవానుడు తమకు అనుగ్రహించలేదు- అని ఆఴ్వార్లు గమనించారు. దీనికి కారణం- "ప్రభువు అయిన వీరు రాజకార్యాలను నిర్వహించడంవల్ల దానికి ఇపుడు తీరిక లేదు" అని కాని, "మేము దానికి తగిన కాలంలో చేస్తాం అని సహించి ఉన్నాడు" అని కాని తలచి, భాగవత కైంకర్యాన్ని పొందడంలో తమకుండే త్వరకు కారణం అయిన అభినివేశాన్ని తెలిసినవాడు కనుక "వీరికి అభినివేశం ముదిరితే అపుడు దానిని నెఱవేరుస్తాంలే అని సహించి ఉన్నాడు భగవానుడు" అని భావించారు.

మనవలె జ్ఞానం, శక్తి లేనివాడుగా కాకుండా, అతడు (భగవానుడు) సర్వజ్ఞుడు, తలచినది తలచినట్లుగా నిర్వహించగల శక్తిని కలవాడై ఉన్నా, ఈవిధంగా అతడు సహించి ఉండడానికి కారణం మనవద్ద కొన్ని కొఱతలు ఉన్నందువల్లనే- అని భావించి, "నా కార్యాన్ని నెరవేర్చడం నావల్లకూడా సాధ్యం కాదు. నీవు తప్ప మిగిలినవారికి ఎవరికీ సాధ్యం కాదు. భగవద్భాగవతకైంకర్యాన్ని పొందాలి అనే ఆర్తిచేత నేను అలమటిస్తున్నానే తప్ప, దానికి ఏదయినా సాధనాన్ని అనుష్ఠించడానికి శక్తిని కల్గినవాడను కానే కాను" అనే విషయాన్ని, తమ రక్షణను తాము చేసికోకుండా ఉండే కొన్ని వస్తువులను ఉపమానాలుగా చూపించి, తమ అనన్యగతిత్వాన్ని నిరూపించి, తమ అనన్యశక్తిత్వాన్ని తిరువిత్తువక్కోడు అనే దివ్యదేశంలో ఉండే అర్చామూర్తి శ్రీచరణాలో ఆఴ్వార్లు విన్నపిస్తున్నారు.

**తరు తుయరమ్ తడాయేల్ ఉన్‌శరణల్లాల్ శరణిల్లై,**
**విరై కుఴువు మలర్‌ప్పొழిల్ శూழ் విత్తువక్కోట్టమ్మానే!,**

**అరిశినత్తాల్ ఈన్ఱతాయ్ అకఱ్ఱిడినుమ్, మఱ్ఱవళ్ తన్**
**అరుళ్ నినైన్దే అழுమ్ కుழவియతువే పోన్ఱిరున్దేనే 1**

విరై కుழవుమ్ = పరిమళం మిక్కిలిగా ఉండే, మలర్ = పూలను కల, పొழிల్ శూழ் = తోటలచే చుట్టబడిఉండే విత్తువక్కోడు అమ్మానే = తిరువిత్తువక్కోడు అనే దివ్యదేశంలో వేంచేసి ఉండేస్వామీ!, తరు తుయరమ్ = నీవే ఇచ్చే సంసారమనే ఈ దుఃఖాన్ని, తడాయేల్ = నీవే పోగొట్టకపోతే, ఉన్ శరణమ్ అల్లాల్ శరణ్ ఇల్లై = నీ శ్రీచరణాలు తప్ప వేఱు ఉపాయం లేదు, ఈన్ఱ తాయ్ = కన్న తల్లి, అరిశినత్తాల్ = చాల కోపంవల్ల, అకఱ్ఱిడినుమ్ = బిడ్డను గెంటివేసినా, మఱ్ఱు = తిరిగి, అవళ్తన్ అరుళ్ నినైన్దు = ఆమె వాత్సల్యాన్ని భావించి, అழுమ్ కుழవి అతువే = రోదించే చిన్నబిడ్డతో, పోన్ఱు ఇరున్దేనే = పోలి ఉన్నాను.

**వ్యా. :- ముతఱ్పాట్టు. (తరు తుయరమ్ తడాయేల్) నీయే తరుకిఱ దుఃఖత్తై నీయే మాఱ్ఱాయాకిల్. తన్నాలే తనక్కు విరోధివన్ద తెన్నుమ్; తానే సాధనానుష్ఠానత్తాలే అతు పోక్కి క్కొళ్ళావెన్నుమ్ శాస్త్రఙ్గళ్ శొల్లిక్కిడక్కచ్చెయ్తే, ఇవర్ అవనే తుయర్ తన్దా నెన్బానెన్? ఎన్నిల్. ప్రాప్తాప్రాప్తవివేకమ్బణ్ణి యిరుప్పారొరువరాకైయాలే శొల్లుకిఱార్. "తానే కర్మమ్ పణ్ణినవన్ తానే సాధనానుష్ఠానమ్ పణ్ణి త్తవిర్త్తుక్కొళ్ళుకిఱాన్" ఎన్ఱు నమ్మై ప్పఱ్ఱి యిట్టు త్తళ్ళ నినైత్తానాకిలుమ్, నానుమ్ తన్నై క్కుఱిత్తు ప్పరతన్త్రన్; నాన్ శెయ్త కర్మముమ్ తన్నై క్కుఱిత్తు ప్పరతన్త్రమ్; నాన్ పణ్ణుమ్ సాధనానుష్ఠానత్తుక్కు ఫలప్రదన్ తానాకైయాలే అతువుమ్ తన్నై క్కుఱిత్తు ప్పరతన్త్రమాకైయాలే (తరు తుయరమ్) ఎన్గిఱార్.**

**ముతలికళెల్లారుమ్కూడ ప్పెరియతిరుమణ్డపత్తుక్కు క్కీழ్ కవిన్దిరున్దు రహస్యార్థఙ్గళ్ విచారిత్తు ఎழுన్దరుళియరుప్పార్కళాయ్త్తు. ఒరునాళ్, నిత్యసంసారియాయ్ పోన్దవనుక్కు భగవద్విషయత్తిల్ రుచి పిఱక్కైక్కడి ఎన్? ఎన్ఱు విచారిక్కచ్చెయ్తే, యాదృచ్ఛికసుకృత మెన్న, అజ్ఞాతసుకృత మెన్న ప్పిఱన్దతు. అవ్వళవిల్ కిడామ్బిప్పెరుమాళిరున్దవన్ "నమక్కు భగవత్సమాశ్రయణమ్బోలే సుకృతదేవరొన్ఱొరువరుణ్డో ఆశ్రయణీయన్! ఎన్ఱాన్. పిళ్ళై తిరునఱైయూరరైయర్, "సుకృత మెన్ఱు శొల్లుకిఱతు నీర్తామ్ నినైక్కిఱత్తై క్కాణ్" ఎన్ఱార్. అతావతు - ఒన్ఱై ఆరాయప్పుక్కాల్ అతుక్కు అవ్వరుకు వేఱొన్ఱు ఇన్ఱియిరుప్పతితే - అడియావతు. యాతొన్ఱు ఫలప్రదమానతితే ఉపాయమావతు. అల్లతు నడువే అనేకావస్థై పిఱన్దాల్ అవఱ్ఱినళవల్ పర్యవసియాతితే. ఇతు ఇళైప్పాఱువతు ఇతిలే శెన్ఱితే. నడువు ఇళైప్పాఱాతితే. అత్తాలే తరు తుయర మెన్నలామితే.**

**(తడాయేల్) నీ విళైత్త దుఃఖమ్ నీయే పోక్కాయాకిల్. "మమ మాయా దురత్యయా" ఎన్ఱుమ్ - నమ్ముడైయ మాయై ఒరువరాల్ కడక్కవొణ్ణాతు కాణ్! ఎన్ఱుమ్; ఇతు కడక్క**

వేణ్డియిరున్దవన్ నమ్మె ప్పఱ్ఱి క్కుఱిత్తుక్కొళ్ళా నెన్నుమ్ నీయే శొల్లివైక్కైయాలే, నీయే తుయర్ తన్దా యెన్నుమ్బడి తోఱ్ఱప్పడుకిఱతితే. దుఃఖత్తై విళైప్పానొరువనుమ్; పోక్కువా నొరువనుమాయన్ఱితే యిరుప్పతు. పణ్ణినవన్దానే పోక్కుమిత్తనైయితే. పిళ్ళై తిరునఱైయూర రైయర్, "ఒరు కురువి పిణైత్త పిణైయిల్ ఒరువరాల్ అవిళ్ క్క వొణ్ణిఱతిల్లై; ఒరు సర్వశక్తి పిణైత్త పిణైయై ఎలియెలుమ్బనాన ఇవన్ అవిళ్క్క ఎన్దాల్ అవిళ్క్క ఎన్ఱు ఒరు కార్య మిల్లైయితే. అవన్దన్నైయే కాల్కట్టి ప్పోక్కుమిత్తనైయితే" ఎన్బార్.

(ఉన్ శరణల్లాల్ శరణిల్లై) ఇవ్వళవాక విళైత్తుక్కొణ్డ నాన్ ఎనక్కిల్లై. పిఱర్ రక్షకరుణ్డా కిలుమ్, నాన్ అవర్కళై రక్షకరాక క్కొళ్ళమాట్టామైయాలే అవర్కళు మిల్లై. నాన్ పణ్ణుమ్ సాధనానుష్ఠానముమ్ ఎనక్కు క్కుఱిత్తుక్కట్టియాకైయాలే దేవరీర్ తిరువడికళల్లతు వేఱుపాయ మిల్లై. (విరై క్కుழవు మలర్ ప్పొழిల్ శూழ్ విత్తువక్కోట్టమ్మానే) పరిమళ ప్రచురమాన శోలైయైయుడైత్తాన తిరువిత్తువక్కోట్టిలే ఎழுన్దరుళియిరుక్కిఱ సర్వేశ్వరనే! (విరై కుழవు మలర్ ప్పొழிల్ శూழ்) "సర్వగన్ధః" ఎన్గిఱ ప్రాప్యవస్తు వన్దు కిట్టినవిడ మెన్ఱు తోఱ్ఱియిరుక్కుమాయ్త్తు. (విత్తువక్కోట్టమ్మానే) ఉపాయమామ్బోతు సులభమాక వేణుమితే.

(అమ్మానే) ప్రజై ఉఱఙ్గుకిఱ తొట్టిల్ కీழ் కిడక్కుమ్ తాయైప్పోలే ఇఙ్గే వన్దు కిట్టినవనే! తమ్ముడైయ పారతన్త్ర్యత్తాలే తమ్ముడైయ రక్షణత్తుక్కు త్తమక్కు అనన్వయమ్ శొన్నార్. శేషియాకైయాలే తమ్ముడైయ రక్షణత్తుక్కు ప్రాప్తన్ అవన్ ఎన్గిఱార్ - ఇప్పోతు ఒరువన్ పేఱ్ఱుక్కు ఒరువన్ సాధనమామ్బోతు ఇత్తనై ప్రాప్తియుణ్డానాలల్లతు ఆకాతితే. ప్రజైయినుడై య నోయ్క్కు త్తాయితే కుడినీర్ క్కుడిప్పాళ్. మేల్ తాయై నిదర్శనమాక చ్చొల్లప్పుకుకిఱవరాకై యాలే ఇప్పోతు "అమ్మానే" ఎన్ఱు ప్రాప్తి తోన్ఱ చ్చొల్లుకిఱార్.

(అరిశినత్తాలిత్యాది) అవనే రక్షకనెన్నుమ్ అధ్యవసాయముణ్డానాలుమ్, పేఱు తాழ் త్తాల్ అవనై వెఱుక్కవేణ్డుమ్ ప్రాప్తి యుణ్డితే, చేతననాకైయాలే. "తనక్కేయాక ఎనై క్కొళ్ళు మీతే" ఎన్ఱు అచిత్సమమానమాక పారతన్త్ర్యత్తై చ్చొల్లివైత్తు, "ఎనక్కే కణ్ణనై యాన్ కొళ్ శిఱప్పు" ఎన్గిఱతు పురుషార్థసిద్ధి చేతననుక్కు ఆకవేణ్డియితే. అవనై క్కుఱిత్తు చేతనాచేతనఙ్గళిరణ్డుక్కుమ్ పారతన్త్ర్యమ్ అవిశిష్టమాయిరుక్కచ్చెయ్తే పురుషార్థసిద్ధి ఇవనుక్కుణ్డాకిఱతు చేతననాకైయాలే యితే. (అరిశినత్తాల్) - అరిన్దు పొకడ వేణ్డుమ్ శినత్తై యుడైయళాయ్క్కొణ్డు. (ఈన్ఱ తాయ్) "వళర్త్త తాయ్" ఎన్నాతే "ఈన్ఱ తాయ్" ఎన్ఱత్తాలే ప్రాప్తి శొల్లిఱ్ఱు.

(అకఱ్ఱిడినుమ్) "అకఱ్ఱిడినుమ్" ఎన్నైయాలే - అకఱ్ఱుకై అసమ్భావిత మెన్గిఱతు. "ఈన్ఱ తాయ్" ఎన్నైయాలే - పెఱుకైక్కు నోన్బు నోఱ్ఱైయుమ్, పత్తు మాసమ్ శుమక్కైయుమ్, ప్రసవవేదనై పడుకైయు మెన్గిఱ ఇవై ఎల్లాముడైయవళ్- ఎన్నై. (అకఱ్ఱి

డినుమ్) ఇప్పడి పెఱువతుక్కు మున్బుళ్ళ ఎల్లా దుఃఖముమ్ పట్టవళాకైయాలే వరుకిఱత్తై నినైక్కు మఱ్ఱొழியఅకఱ్ఱ నినైయాళితే. అవళ్తానే అకఱ్ఱిడిలుమ్. ఇత్తాల్ శొల్లిఱ్ఱాయ్త్తు - నిరుపాధికబన్ధువాన దేవరీర్ కైవిడిలుమ్ వేఱు ఎనక్కు ప్పుకలిల్లై- ఎన్గిఱార్.

(మఱ్ఱవళ్తన్ అరుళ్ నినైన్దే యழுజ్గుழవి) ఇవళ్ కోపిత్తువిట్టాలుమ్ వేఱొరు వరుదైయ అరుళై అపేక్షియాతితే ప్రజై. అతుక్కడియాన ప్రేమత్తుక్కు అవధియుణ్డాకిలితే కోపత్తుక్కు అవధియుళ్ళతు. స్నేహ మిల్లామైయాలే కోప మిల్లైయితే పిఱర్క్కు. నమ్బి తిరువழுతివళనాడు దాసరై ముతలియాణ్డాన్ కోపిత్తు, కైయాలుమ్ కాలాలుమ్ తుకైత్తు ఇழிత్తవాతే తిణ్ణైయిలే పట్టినియే ఒరు నాళ్ పోకాతే కిడన్దార్. ఆణ్డాన్ పిఱ్ఱైనాళ్ అముతు శెయ్యప్పుకుకిఱార్, "అవన్ శెయ్తతు ఎన్" ఎన్ను కేట్టవాతే, "పట్టినియే వాశలిలే కిడన్దార్" ఎన్ను కేట్టు అழைత్తు, "నీ పోకాతే కిడన్దతెన్?" ఎన్న, "ఒరు నాళ్ ఒరు పిడి శోఱిట్టవన్ ఎల్లాప్పడియాలుమ్ నిన్దిత్తాలుమ్ వాశల్ విట్టుప్పోకిఱతిల్లై - నాయ్. నాన్ ఎజ్గే పోవతు?" ఎన్దార్.

(అழுజ్గుழవి యతువే పోన్దిరున్దేనే) వేఱు శిలరాల్ ఆఱ్ఱవొణ్ణాతితే. మున్నాళ్ ములై కొడుత్త ఉపకారత్తై నినైత్తిరుక్కుమతాకైయాలే అవళ్తానే ఆఱ్ఱవేణుమే. "శిశు స్తనన్ధయః", "అళవిల్ పిళ్ళమై" ఎన్ను శొల్లుకిఱపడియే. అతావతు రక్తస్పర్శముదై యారెల్లారైయు మఱియాతే మాతా వొరుత్తియైయు మఱియుమళవేయాయ్త్తు అతి బాల్యమ్. అప్పడియే ఎమ్బెరుమానై క్కుఱిత్తు ఇవ్వాత్మవస్తు నిత్యస్తనన్ధయమాత్తు ఇరుప్పతు. ఆకైయాలితే ఇవన్ పేఱ్ఱుక్కు అవన్ ఉపాయమాకిఱతు.

*ముతఱ్పాట్టు. (తరు తుయరమిత్యాది). (శాస్త్రమ్) "సాధుకారీ సాధు భవతి, పాప కారీ పాపీ భవతి" ఎన్నుమ్, "ధర్మేణ పాప మపనుదతి" ఎన్నుమ్ శొల్లుకిఱవై.*

*కర్మమ్ అవనిట్టవழுక్కు ఎన్నుమతుక్కు సంవాదమాక ఓరైతిహ్య మరుళిచ్చెయ్కిఱార్. (ముతలికళిత్యాది). యాదృచ్ఛికమ్ - అజ్ఞాతసుకృత మెన్ను వివక్షై. (ఒన్దై ఆరాయ్కై) ఒరు హేతువై ఆరాయ్కై. కర్మత్తై యుణ్డాక్కుమత్తాలన్దియే ఫలప్రదత్వత్తాలుమ్ అవనే యుపాయ మెన్గిఱార్. (యాతొన్డిత్యాది). (అనేకావస్థై) అద్వేషాదికళ్.*

*తమ్ముడైయ వివేకాతిశయత్తాలే కర్మమ్ అవనధీన మెన్దతు - కీழ், అవన్ ఉక్తియాలుమ్ అవనధీనమెన్గిఱార్ (మమ మాయా ఇత్యాది).*

*"తరు తుయరమ్" ఎన్ను - అవన్ తన్దానాక చ్చొల్లియిరుక్క, ఇజ్గే "విళైత్తుక్కొణ్డ" ఎన్దతు- ప్రథమప్రయత్నమ్ తమ్మతాకైయాలే. "శరణల్లాల్ శరణిల్లై" ఎన్ను ఆకిఞ్చన్యమ్ తోఱ్ఱ చ్చొల్లివైత్తు, "అమ్మాన్" ఎన్ను - ప్రాప్తియైక్కైమ్ముతలాక చ్చొల్లలామో? ఎన్న అరుళిచ్చెయ్ కిఱార్ (తమ్ముడైయ ఇత్యాది) అన్దిక్కే, దృష్టాన్తత్తుక్కు అనుగుణమాక చ్చొల్లుకిఱారెన్గిఱార్ మేల్ (తాయై యిత్యాది)*

*"అరిశినత్తాల్" ఎన్று - దృష్టాన్తత్తిలే శొన్న శినమ్ దార్ష్టానికత్తిలుమ్ ఏఱుమ్ న్యాయత్తాలే, ఇప్పడి "అరిశినమ్" ఎన్று వెఱుక్కలామో ఎన్న? అరుళిచ్చెయ్‌కిఱార్. (అవనే రక్షకనిత్యాది) అవనుమ్ శేషియాయ్‌త్తానుమ్ పరతన్త్రనానాల్ అవన్ శెయ్‌తపడి కణ్డిరుక్కై యొழியప్రార్థక్కలామో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్. (చేతననాకైయాలే యిత్యాది). పురుషార్థమ్ చేతననుక్కొழியఇల్లై ఎన్గైక్కు జ్ఞాపక మేతు? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్. (అవనైక్కుఱిత్తిత్యాది).*

*తన్నై యొழియ అఱియాత పిళ్ళైయై అరుళుడైయ తాన్ అతీవ కోపిక్కలామో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్. (అతుక్కడియిత్యాది). అతుక్కడి - కోపత్తుక్కు హేతు. తళ్ళినాలుమ్ పుఱమ్బుపోకామైక్కు సంవాదమాక ఓరైతిహ్య మరుళిచ్చెయ్ కిఱార్. (నమ్బి తిరువழుతి వళనాడు దాసరిత్యాది).*

**భావదీపిక :- అవ:-** తల్లికోపంతో గెంటివేసినా, ఆమె కాళ్ళను చుట్టికొని ఏడ్చే బిడ్డవలె ఉన్నాను- అని ఈ దశకంలో ఆழ்వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (తరు తుయరమ్ తడాయేల్)** -నీవే కల్గించే దుఃఖాన్ని నీవే తీర్చకుండా ఉంటే- అని భావం. తనకు కలిగే ఆటంకాలు అనే దుఃఖాలన్నీ తన కర్మవల్లనే వచ్చాయి- అని, తానే కొన్ని సాధనాలను (ఉపాయాలను) ఆచరించి వాటిని పోగొట్టుకోవాలని శాస్త్రాలు చెబుతున్నపుడు, వీరు (ఆழ்వార్లు) భగవానుడే తమకు దుఃఖాలను ఇచ్చాడని అనడం ఏవిధంగా పొసగుతుంది? అని అంటే, జీవస్వరూపాన్నిగూర్చి, కర్మస్వరూపాన్ని గూర్చి, సాధనాన్ని గూర్చి యథార్థమైన స్థితిని తెలిసినవారు కనుక ఆழ்వార్లు ఈవిధంగా అంటున్నారు. ఏవిధంగా అంటే - ఈ జీవుడు తానే పుణ్యపాపరూపకర్మలను చేశాడు. అందువల్ల ఇతడే దీనికి సాధనానుష్ఠానం ఆచరించి, దానిని పోగొట్టుకోవాలి -అని మనపై దోషాన్ని ఆరోపించి మనలను పక్కకు గెంటివేయాలని అనుకున్నవాడైనా, నేను (జీవుడు కూడ) భగవానునకు చెందిన ఒక సొత్తువలె పరతంత్రుడను. నేను చేసిన కర్మఫలంకూడా అతడు తలిస్తేనే తీరేటట్లు, అతని అధీనంలో ఉండే పరతంత్రం. నేను చేసే సాధనానుష్ఠానానికి ఫలాన్ని ఇచ్చేవాడు తానే కనుక, అదికూడా అతనిపట్ల పరతంత్రం. అందువల్ల భగవానుడు తానే కల్గించిన దుఃఖాన్ని తానే తీర్చాలి - అని అంటున్నారు.

ఈ విషయంలో ఒక ఐతిహ్యం వ్యాఖ్యలో ఈ క్రింది రీతిలో ఉట్టంకింపబడింది. మన పూర్వాచార్యులు అందఱు శ్రీరంగంలోని దివ్యాలయంలో శ్రీరంగనాథుడు వేంచేసి ఉండే గర్భగృహానికి ముందున్న పెరియ తిరుమండపానికి తూర్పుదెసలో గల ఒకచోట కూర్చుని ఉండి రహస్యార్థాలనుగూర్చిన విచారాన్ని (చర్చను) చేసేవారు. ఒకనాడు- "అనాదికాలంగా సంసారంలో మునిగి ఉండే జీవునకు భగవానుని విషయంలో రుచి కల్గడానికి కారణం ఏమి? అనే విషయం విచారణకు వచ్చింది. "జీవుడు పూర్వం తెలిసి చేసిన పుణ్యమో, తెలియకుండా చేసిన పుణ్యమో దీనికి కారణం" అని కొందరు

అన్నారు. అపుడు కిడాంబిప్పెరుమాళ్ అనే ఆచార్యులు "మనం అన్నిటికీ భగవానునే ఆశ్రయించాము. మీరు చెప్పడాన్ని చూస్తే పుణ్యం అనే ఒక దేవతను ఆశ్రయించి ఉండాలని తెలుస్తున్నదే! (నిజానికి పుణ్యం అనేది భగవానుని మనస్సులో కలిగే సంతోషమే కనుక అతడు తప్ప పుణ్యం అనేది ఇంకొకటి లేదు- అని భావం)" అని అన్నారు. దీనిని బలపరచడంకోసం పిళ్ళైత్తిరునఱైయూర్ అరైయర్ "పుణ్యం అని మీరు భావించేది దేనిని? అది భగవానునకంటే వేఱయిన ఒక విషయమా? అని ప్రశ్నించారు. ఈ విచారంలోని ఆంతర్యం ఏమంటే- ఒక విషయాన్నిగూర్చి దానికి కారణం ఏది ? అని విచారించినపుడు, దేనికి పిమ్మట ఏ కారణం లేకుండా ఉంటుందో దానినే మూలమని అంటాము. ఏది ఫలాన్ని ఇస్తుందో అదే మూలకారణం అయిన ఉపాయం అవుతుంది. అది భగవానుడు తప్ప ఇంకొకటి కాదు. జీవునకు కలిగే అద్వేషం, ఆనుకూల్యం మొదలైన పలు అవస్థలను కారణంగా చెప్పడానికి వీలు లేదు, వాటికికూడా మూలకారణభూతుడు భగవానుడే అని అన్నందువల్ల మూలకారణంగా ఉండే స్వభావం భగవానుని వద్దనే ఉన్నది. మధ్యలో ఉండే పుణ్యం, పాపం మొదలైనవాని పరిమితిలో అది నిలువదు. అందువల్ల జీవుడు పడే దుఃఖాలను భగవానుడే ఇచ్చాడు అనడంలో లోటు లేదు.

**(తడాయేల్)** - నీవు నాకు కల్గించిన దుఃఖాన్ని నీవే తీర్చకపోతే- అని భావం. **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"** (భగ-7-14) (దేవ శబ్దవాచ్యుడనైన నాచే నిర్మింపబడినది, మూడు గుణాలను కల్గినది అయిన ఈ నా మాయను దాటడం చాలా అరుదు. నన్నే ఎవరు శరణంగా ఆశ్రయిస్తారో, వారు ఈ మాయను దాటగలరు) అని గీతలో "తమ మాయా అనే ప్రకృతిసంబంధం ఎవరిచేత స్వయంగా పోగొట్టుకోవడానికి సాధ్యం కాదు" అని, "నన్ను శరణు పొందినపుడే దీనిని పోగొట్టుకోవడానికి వీలవుతుంది" అని నీవే చెప్పినందువల్ల, ఈ దుఃఖాన్ని తీర్చిన నీవే- అనే అర్థం స్ఫురిస్తున్నదికదా ! దుఃఖాన్ని కల్గించినవాడు ఒకడైనపుడు, ఇంకొకనికి ఆ దుఃఖాన్ని పోగొట్టడం ఏవిధంగా సాధ్యం అవుతుంది? దుఃఖాన్ని కల్గించినవాడేకదా దానిని పోగొట్టాలి. 'పిళ్ళైతిరునఱైయార్ అరైయర్' "ఒక పిచ్చుక అల్లుకొన్న గూడును విడదీయడానికి ఎవరికీ వీలుకాదు. ఒక సర్వశక్తి అయిన పరమాత్మ కర్మతో కట్టివేసిన కట్టును బలహీనమైన ఎముకలను కల ఎలుకలవలె అల్పుడైన ఇతడు (జీవుడు) ఈ సంసారం అనే బంధాన్ని తెంచుకోవాలని భావించడం నెరవేరదు. అతని (భగవానుని) పాదాలపై పడి అతనిని పురస్కరించుకొనే దానిని పోగొట్టుకోవలసి ఉన్నది కదా" అని అనడం ఇక్కడ స్మరించదగినది.

**(ఉన్ శరణల్లాల్ శరణ్ ఇల్లై)** - అనాదికాలంగా నా కృత్యాలవల్ల దీనిని (దుఃఖాన్ని) కల్గించుకొన్న నాచే దీనిని పోగొట్టుకోవడం సాధ్యం కాదు. లోకంలో ఒక్కొక్క ఆపదనుండి కాచే రక్షకులు కొంతమంది ఉన్నా, వారు అనాదికాలంగా ఉండే ఈ సంసార సంబంధమనే

మహావిపత్తును పోగొట్టలేనివారు కనుక, వారిని నేను రక్షకులుగా గ్రహించలేను. వారుకూడా దీనిని పోగొట్టలేరు. నేను చేసే సాధనానుష్ఠానాలు సముద్రంలో మునిగేవాని గొంతులో కట్టిన రాయివలె ఇంకా ఇంకా ఈ సంసారసముద్రంలో నన్ను ముంచి వేస్తాయి కనుక, వాటివల్లకూడా వీటిని (దుఃఖాలను) పోగొట్టుకోవడానికి వీలు కాదు. అందుచేత నీ శ్రీచరణాలు తప్ప ఈ సంసార దుఃఖాన్ని పోగొట్టడానికి ఇంక వేఱే ఉపాయం లేదు.

**(విరై కుழావు మలర్ పొழిల్ శూழ் విత్తువకోట్టమ్మానే)** – పరిమళం నిండిన తోటలను కల విత్తువక్కోడులో వేంచేసి ఉండే సర్వేశ్వరా !

**(విరై కుழావు మలర్ పొழిల్ శూழ்)** – **"సర్వగంధః సర్వరసః"** (ఛాందో–3–14–2) (అన్ని సుగంధాలను కలవాడు, అన్ని రసాలను కలవాడు పరమాత్మ) అని ఉపనిషత్తులలో పరమపదంలో పొందదగినదిగా చెప్పబడ్డ పరబ్రహ్మ ఈ లోకానికి వేంచేసిన చోటు ఇది అని తోచేటట్లున్నది. ఈ దివ్యదేశం.

**(విత్తువక్కోట్టమ్మానే)** చేతనులు ఉజ్జీవించడానికి ఉపాయం అయేటపుడు భగవానుడు అందఱికి పొందానికి సులభమైన అర్చావతారంగా కావాలి కదా!

**(అమ్మానే)** బిడ్డను కాపాడడంకోసం ఆ బిడ్డ నిద్రించే తొట్టికి కిందనే పరుండిఉండే తల్లివలె, సంసారిజీవులనే తనబిడ్డలు నివసించే ఈ లోకంలోకి వచ్చి సమీపంలో ఉండేవాడా ! అని భావం. తాము భగవానునకు అచేతనంవలె అతని అధీనంలో ఉండే పరతంత్రులు కనుక **"నిన్ శరణల్లాల్ శరణిల్లై"** అని తమను రక్షించుకోవడానికి తమకు యోగ్యత లేదని అన్నారు. **"అమ్మానే!"** అని సొత్తు అయిన తమను కాపాడడానికి స్వామి అయిన అతడే యోగ్యుడు అని ఇందులో అంటున్నారు. సంసారి జీవులు మోక్షాన్ని పొందడానికి పరమపురుషుడు ఉపాయం అయేటపుడు వారు సొత్తుగాను, ఇతడు స్వామిగా ఉండవలసిన ఆవశ్యకత ఉన్నదికదా! చంటిబిడ్డకు బాధ కలిగితే తల్లికదా ముందు మందును తాగుతుంది. పాశురం ద్వితీయార్ధంలో తల్లిని దృష్టాంతంగా చెప్పబోతున్నారు కనుక ఇపుడు **"అమ్మానే!"** అని అతనిని, తమకు మధ్య ఉండే సంబంధం స్ఫురించేటట్లు అంటున్నారు.

పాశురం ఉత్తరార్ధంలో, కోపంతో బిడ్డను గెంటివేసే తల్లి కాలును చుట్టుకొని ఏడ్చే బిడ్డను తమకు దృష్టాంతంగా తెలుపుతున్నారు. **(అరిశినత్తాల్ .... ఇరున్దేనే)** – పాశురం పూర్వార్ధంలో అతడే తమను కాపాడేవాడనే నిశ్చయాన్ని తెలిపారు. మఱి ఇపుడు **"ఈన్త తాయ్ అకర్ఱిడినుమ్"** అని అంటూ ఇక్కడ భగవానుని విషయంలో కొఱత పలుకవచ్చునా ! అని అంటే, అతడే మనలను కాపాడేవాడు– అనే నిశ్చయం ఉన్నా, కైంకర్యమనే ఫలాన్ని పొందడంలో ఆలస్యం అయినపుడు వీరు జ్ఞానాన్ని కల చేతనులు

కనుక, తమకు, అతనికిమధ్య ఉండే సంబంధం కారణంగా అతనిపట్ల కొఱతను (లోపాన్ని) పల్కడంలో వీరికి సంబంధం ఉన్నది. **"తనక్కేయాక ఎనై క్కొళ్ళుమీదే"** (తిరువాయ్- 2-9-4) (నీకే శేషభూతుణ్ణి అయేటట్లు నన్ను పరిగ్రహించు. ఇదే నేను ఆశించేది) అని అచేతనంవలె తమనుకూడా భగవానునకు పరతంత్రులమని పల్కిన నమ్మాழ்వార్లే వెంటనే **"ఎనక్కే కణ్ణనై యాన్ కొళ్ శిఱప్పు"** (నాకు స్వామి అయిన శ్రీకృష్ణుని ఆశించే ప్రయోజనం ఇదే) అని అతనికి కైంకర్యమనే ఫలం కలగాలని అన్నారు కదా! జ్ఞానశూన్యం అయిన అచేతనవస్తువు, జ్ఞానాన్ని కల జీవుడు- అనే రెండూ ఒకే విధంగా భగవానునకు పరతంత్రాలు అయినా, జీవుడు జ్ఞానాన్ని కలవాడు కనుక, అతడు (భగవానుడు) అభిలషించిన కైంకర్యం చేయడం అనే ఫలం ఇతనికి ఆవశ్యకం కదా!

**(అరిశినత్తాల్)** - బిడ్డ తనను పెట్టే బాధను చూచి, దానిని చంపివేయాలి అన్నంత కోపాన్ని పొందినదై.

**(ఈన్ఱ తాయ్)** - "పెంచినతల్లి" అని అనకుండా **"ఈన్ఱ తాయ్"** (కన్నతల్లి) అని అనడంద్వారా తమకు, భగవానుకు మధ్యఉండే సంబంధాన్ని తెలుపుతున్నారు.

**(అకఱ్ఱిడినుమ్)** - 'గెంటివేసినా' అని అన్నందున కన్నతల్లి అయిన ఈమె గెంటివేయదు; ఆవిధంగా, ఒకవేళ గెంటివేసినా- అనే అర్థం వస్తుంది. **"ఈన్ఱ తాయ్"** అని అన్నందువల్ల, బిడ్డను పొందడానికి ఈమె నోమును నోచడం, పది మాసాలు గర్భంలో ధరించడం, ప్రవసవేదనను పడడం- అనే పలు శ్రమలను ఈ బిడ్డకోసం భరిస్తుంది -అని తెలుపబడింది.

**(అకఱ్ఱిడినుమ్)** - కనడానికి ముందు ఆ బిడ్డకోసం అన్ని బాధలు పడినది కనుక, ఆ బిడ్డ రాబోయే కాలంలో ఇంకా ఇంకా అభివృద్ధి చెందాలి అని తలుస్తుందే తప్ప, గెంటివేయాలని చూడదుకదా ! కోపానికి వశయై ఒకవేళ ఆమె గెంటివేయాలని చూచినా- అనే అర్థం ప్రకృతంలో వస్తుంది. ఈ దృష్టాంతంద్వారా తల్లివంటి సహజ సంబంధాన్ని కలవాడవైన నీవు నన్ను చేయి విడచినా నాకు వేఱు గతి లేదు -అని తెలుపుతున్నారు.

**(మఱ్ఱవళ్తన్ అరుళ్ నినైన్దే అழுఴక్కుழవి)** - ఈమె కోపించి తోసివేసినా వేఱొకతె కృపను అన్వేషించి పోదుకదా ఆ బిడ్డ. తనకు పాలను ఇచ్చి, ఆదరించి పెంచిన ఆమె కాళ్ళనే చుట్టుకొని బిడ్డ ఏడుస్తుంది. కోపం ఉన్నచోటనే గుణం ఉంటుంది- అనే లోకోక్తికి తగినట్లుగా, తల్లికి బిడ్డపట్ల ఉండే ప్రేమ అంతు లేనిది కనుక, అది బాధ పెట్టేటపుడు అంతు లేని కోపంకూడా కల్గుతుంది. మిగిలిన స్త్రీలకు ఆ బిడ్డపట్ల అంత ప్రేమ ఉండదు కనుక కోపం కూడా ఉండదు.

ఈ అర్థానికి అనుగుణంగా ఇక్కడ వ్యాఖ్యానంలో ఒక ఐతిహ్యం ప్రస్తావింప బడుతున్నది– నమ్బి తిరువழுది వళనాడు దాసర్ అనే ఆచార్యులు ముదలియాణ్డాన్ శిష్యులు. ఒకసారి వారిపట్ల కోపంతో ఆణ్డాన్ వారిని చేతులతో, కాళ్ళతో గెంటి, తన్నివేశారు. దాసర్ ముదలియాణ్డాన్ ఇంటివాకిలి తిన్నెపైననే ఉండి, ఒకనాడు పూర్తిగా నిరాహారంగా ఉండిపోయారు. మఱునాడు ముదలియాణ్డాన్ భుజించేటపుడు శిష్యుని స్మరణ కల్గి, "అతడు ఏం చేస్తున్నాడో !" అని ఇంటిలో ఉండేవారిని అడిగారు. వాకిట్లో నిరాహారంగా పడి ఉన్నారు– అని వారు అన్నారు. ముదలియాణ్డాన్ శిష్యుని పిలిచి, "నీవు ఎందుకోసం నా వాకిలిని విడిచిపోకుండా ఉన్నావు ?" అని అడిగారు. దానికి బదులుగా దాసర్ – "కుక్కకు ప్రతిదినం ఒకముద్ద అన్నం పెట్టేవాడు తరువాత అన్ని రీతులలో దానిని గెంటి వేసినా అతని వాకిలిని విడిచి పోకుండా, ఆ కుక్క అక్కడే అరుస్తూ ఉంటుందికదా!, నేను ఎక్కడకు పోను ?" అని అన్నారట– అనేది ఈ ఐతిహ్యం.

**(అழுమ్ కుழవి యతువే పోన్ఱిరున్దేనే)** – కన్నతల్లి గెంటివేసినపుడుకూడా, బిడ్డ ఏడవడాన్ని తల్లితప్ప వేఱు ఇంకెవరూ మాన్పలేరు కదా ! పుట్టినప్పటినుండి తల్లి స్తన్యాన్ని ఇచ్చి పెంచడాన్ని తలచుకొన్నందువల్ల గెంటివేసిన ఆమే ఓదారిస్తే తప్ప, బిడ్డ ఏడుపును నిలుపదుకదా ! **"నిరాసకస్యాపి న తావదుత్సహే మహేశ ! హాతుం తవ పాదపంకజమ్, రుషా నిరస్తోఽపి శిశు స్తనంధయో న జాతు మాతు శ్చరణౌ జిహాసతి"** (స్తోత్ర -26) (సర్వేశ్వరా ! నన్ను నీవు బయటకు గెంటి తోసివేసినా, నీ శ్రీచరణకమలాలను విడువడానికి నేను ఇచ్చగించను. స్తన్యాన్ని తాగే బిడ్డను కోపంతో తల్లి గెంటివేసినా, తల్లి కాళ్ళను ఏ సమయంలోను ఆ బిడ్డ విడువదుకదా) అని అంటూ ఈ పాశురాన్ని శ్రీయామునులు స్తోత్రరత్నంలో చాలా అందంగా వివరించారు. **"అళవిల్ పిళ్ళైమై ఇన్బత్తై ఇழన్దై పావియేన్"** (పెరుమాళ్. తిరు-7-4) అని వీరే (కులశేఖరులే) దేవకీ విలాపంలో తల్లికి, చంటిబిడ్డకు మధ్య గల ప్రేమపాశాన్నిగూర్చి పలికారు. చంకలోని బిడ్డ మొదట రక్తసంబంధాన్ని కల తండ్రి మొదలైనఎవరినీ తెలియకపోయినా తల్లిని మాత్రమే తెలిసి కొంటుంది. అందువల్ల ఇక్కడ **"అழுమ్ కుழవి"** అనే పదం చంటిబిడ్డనే తెలుపుతుంది. అదే రీతిలో "భగవానునిపట్ల ఈ జీవుడు ఎప్పటికీ చంటిబిడ్డగానే ఉంటాడు. అందువల్లనే ఇతడు పొందే ఫలానికి అతడు ఉపాయం అవుతున్నాడు." అన్నది ఈ పాశుర సారసంగ్రహం.

**కణ్డారికழ்వనవే కాతలన్తాన్ శెయ్తిడినుమ్,**
**కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్పోల్,**
**విణ్డోయ్ మతిళ్ పుదైశూழ் విత్తువక్కోట్టమ్మా!, నీ**
**కొణ్డాళా యాకిలుమ్ ఉన్ కుఱైకழలే కూఱువనే** 2

విణ్ తోయ్ మదిళ్ = ఆకాశాన్ని తాకే కోటలతో, పుడై శూழ் = చుట్ట పరివేష్ఠింపబడ్డ, విత్తువక్కోట్టమ్మా = విత్తువక్కోడులోని స్వామీ !, కణ్డార్ ఇకழ்వనవే = చూచేవారందఱూ నిందించదగ్గ కార్యాలనే, కాతలన్ తన్ శెయ్‌దిడినుమ్ = భర్త చేసినా, కొణ్డానై అల్లాల్ అఱియా = తనను వివాహమాడిన భర్తను తప్ప వేఱెవ్వరినీ మనస్సులో కూడా తలవని, కుల మకళ్‌పోల్ = కులకాంతవలె, నీ కొణ్డు ఆళాయ్ ఆకిలుమ్ = నీవు నావల్ల కైంకర్యాన్ని గ్రహించి రక్షించకుండా ఉపేక్షించినా, ఉన్ కురై కழలే = నీ ధ్వనించే వీరకడియాలను కల శ్రీచరణాలనే, కూఱువన్ = శరణు పొందుతాను.

**వ్యా. :- ఇరణ్డామ్పాట్టు (కణ్డారికழ்వనవే కాతలన్తాన్ శెయ్‌తిడినుమ్) తానుమ్ అవను మఱిన్దతాక ప్పిఱక్కుమ్ ప్రణయకలహఙ్గళుక్కుమ్, పరిహారఙ్గళుక్కుమ్ ఓరవధి యిల్లైయిఱే. అప్పడియన్ఱియే, ఇవర్‌కళ్ కార్యమ్ కొణ్డు కార్య మిల్లాత ఉదాసీనరుమ్ ఇకழுమ్పడిక్కీడాన అసహ్యఙ్గళై అవన్ పణ్ణినాలుమ్. (కాతలన్) ప్రేమత్తై యిట్టు నిరూపిక్క వేణ్డియిరుక్కుమవన్. (కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్) ఇవ్వరుకు అవన్ పణ్ణుమ్ అపకారఙ్గళై క్కాఱుదైకొణ్డు సమ్బన్ధత్తిల్ ముతలడియిలే నినైత్తిరుక్కుమవళైప్పోలే. (కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్) అగ్నిక్కు అన్తర్యామియాన సర్వేశ్వరనై సాక్షియాక క్కొణ్డవనైయల్లతు అఱియాతవళైప్పోలే. "కొణ్డానై యల్లాల్ అఱియా" ఎన్గైయాలే- పాతివ్రత్యమ్ శొల్లిఱ్ఱు. "కుల మకళ్" ఎన్గైయాలే ఆభిజాత్యమ్ శొల్లిఱ్ఱు.**

**(విణ్డోయ్ మతిళ్ పుడై శూழ் విత్తువక్కోట్టమ్మా) పిరాట్టి స్వయంవరత్తుక్కు శ్రీమిథిలైయిల్ పుఱచ్చోలైయిలే విట్టిరున్దాప్పోలే, ఇవరై స్వయంవరిక్కైక్కాకవిఱే తిరువిత్తు క్కోట్టిలే వన్దు నిఱ్కిఱతు. (నీ కొణ్డాళాయాకిలుమ్) ఇవ్వళవాక ఉపకారకనాన నీ కుఱైయుమ్ తలై క్కట్టాతే ఉపేక్షిత్తాలుమ్. (ఉన్ కురైకழలే కూఱువనే) ఉన్ తిరుపడికళల్లతు ఎనక్కు వేఱు పుకలిల్లై. ఉపకారకనాన నీ ఉపేక్షిత్తాయ్ ఎన్ఱు కైవాఙ్గుమవనన్ఱు నాన్. "ఎనతావి యార్? యాన్ ఆర్?" ఎన్ఱు-నీ పణ్ణిన ఉపకారత్తుక్కు త్తలై శీయ్‌క్కుమవన్ నాన్- ఎన్గిఱార్.**

*అరు :- ఇరణ్డామ్పాట్టు. (కణ్డారిత్యాది). "కొణ్డానైయల్లాతఱియా" ఎన్ఱు పాఠమాతల్; "కొణ్డానైయల్లాలఱియా" ఎన్ఱు పాఠమాతల్. అవనైయొழிయ అవన్ పణ్ణు ముపకార మఱియాత వళెన్నుతల్ ; అవనైయొழிయ అన్యపురుషనై యఱియాత వళెన్నుతల్.*

---

**భావదీపిక :- అవ:-** భర్త నీచకార్యాలను చేసినా, అతనినితప్ప ఇంకొకరని తలపని కులకాంతవలె, నీవు నన్ను రక్షించకపోయినా, నిన్ను తప్ప ఇంకెవరినీ తెలియను- అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (కణ్డార్ ఇకழ்వనవే కాతలన్‌తాన్ శెయ్‌దిడినుమ్)** - భార్య, భర్త మాత్రం తెలియగల్గినవై, ప్రేమతో వారిద్దరి మధ్య కలిగేవైన కలహాలు సంభవించడం,

అవి తీరడం– భార్యాభర్తలమధ్య అనేకం ఉంటాయి. ఆ విధంగా కాకుండా, వీరితో ఏవిధమైన సంబంధం లేని దారిలో పోయేవారుకూడా తెగడేటట్లుగా, సహించడానికి వీలు లేని నీచకార్యాలను భర్త చేసినా– అని భావం. **"కణ్డార్"** అనే ప్రయోగం ఏ సంబంధం లేని, దారిలో పోయేవారిని తెలుపుతుంది.

**(కాతలన్)** – భర్త కనుక, ప్రేమే స్వరూపనిరూపకంగా ఉండవలసినవాడు. ప్రేమను పురస్కరించుకొని నిరూపింపబడవలసినవాడు. ముందు పల్కిన నీచకార్యాలను చేసేవాడు ప్రేమను కలవాడుగా ఉండే అవకాశం లేదు. కనుక, ఇక్కడ ప్రేమను కలవాడనే అర్థాన్ని గ్రహించడం పొసగదు.

**(కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్)** – తాళిని కట్టి, భార్యగా స్వీకరించిన తరువాత అతడు చేసే దుష్కార్యాలను లెక్కించకుండా, తనను భార్యగా స్వీకరించినవాడనే మొదటి కృత్యాన్నే లెక్కించి, అతనిని గర్హించకుండా ఉండే సత్కులసంజాత అయిన భార్యవలె.

**(కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్)** – అగ్నికి అంతర్యామి అయిన సర్వేశ్వరుని సాక్షిగా పెట్టుకొని భర్తగా గ్రహించినవానిని తప్ప, ఇంకొకరిని తెలియని స్త్రీవలె. **"కొణ్డానై యల్లాల్ అఱియా"** అని అన్నందువల్ల పతివ్రత అయిన ఆమె అణకువ చెప్పబడింది. **"కులమకళ్"** అని అన్నందువల్ల ఆమె ఆభిజాత్యం చెప్పబడింది.

**"కొణ్డానై యల్లాతు అఱియా"** అని, **"కొణ్డానై యల్లాల్ అఱియా"** అని రెండు విధాలైన పాఠాలున్నాయి. భార్యగా పరిగ్రహించాడు– అనేవిషయాన్నే తప్ప, అతడు చేసే ఉపకారాన్ని దేనినీ తెలియనిది– అని కాని, అతనిని తప్ప ఇంకొకరిని మనస్సులో కూడా తలవనిది– అని కాని అర్థాన్ని గ్రహించవచ్చు.

**(విణ్ తోయ్ మదిళ్ పుదై శూழ் విత్తువకోట్టమ్మా)** – సీతాదేవియొక్క స్వయంవరసమయంలో మిథిలానగర బాహ్యోద్యానంలో శ్రీరాముడు విడిది చేసినట్లుగా, కులశేఖరనాయిక అయిన వీరిని తానే స్వయంగా పరిగ్రహించడంకోసం కదా భగవానుడు తిరువిత్తుక్కోడులో వేంచేసి ఉన్నాడు.

**(విత్తువకోట్టమ్మా!)** – విత్తువక్కోడులో వేంచేసి ఉండే స్వామీ! **"అమ్మాన్"** అనే పదంలోని చివరి అక్షరం లోపించి సంబోధనలో **"విత్తువకోట్టమ్మా!"** అని అయినది. **"అమ్మానే!"** అని కొన్ని ప్రతులలో, **"అమ్మా"** అని కొన్ని ప్రతులతో ఉన్నా అర్థంలో ఏభేదం లేదు.

**(నీ కొణ్డాళాయాకిలుమ్)** – ఆ భర్తవలె కాకుండా, ఇంతవరకు నాకు అన్ని ఉపకారాలను చేసిన నీవు ఇకపై నన్ను దాసునిగా స్వీకరించకుండా అలక్ష్యం చేసినా.

**(ఉన్ కురై కழలే కూఱువనే)** – "నీవు సర్వరక్షకుడవు" అనే దానిని నాకు చూపి, మధురంగా ధ్వనించే వీరకడియాలను కల నీ శ్రీచరణాలు తప్ప నాకు వేఱు గతి లేదు. ఇంతవరకు పలు ఉపకారాలను చేసిన నీవు ఇక ఉపేక్షించినా, నేను నిన్ను విడచి పోను– అని అర్థం. **"ఎనతావియుళ్ కలన్ద పెరునల్లుదవి క్కైమ్మాఱు ఎనదావి తన్దొழிన్దేన్ ఇని మీళ్వతు ఎన్బదుణ్డే!, ఎనదావి యావియుమ్ నీ పొழிలేழுమ్ ఉణ్డ ఎన్దాయ్! ఎనతావి యార్! యానార్! తన్ద నీ కొణ్డాక్కినైయే"** (తిరువాయ్–2–3–4) (సర్వసంహారకుడ వైన ఓస్వామీ! నీవు నాతో కలసి ఉండడం అనే గొప్ప ఉపకారానికి ప్రత్యుపకృతిగా ఆత్మను నీకు సమర్పించాను. అది తిరిగి నేను పొందడం అనేది ఉన్నదా? నీవు నా ఆత్మకు ఆత్మవు. అయ్యో! నా ఆత్మ ఎవరిది? నేను ఎవరివాడను? సృష్టించిన నీవే వీటిని గ్రహించావు కదా!) అని నమ్మాழ்వార్లు అనుగ్రహించినట్లే నీవు ఇంతవరకు చేసిన ఉపకారాలను తలచి, శిరస్సు పంకించి ప్రశంసించేవాడనుకదా నేను– అని అంటున్నారు. పరమాత్మకు, జీవాత్మకు మధ్యగల నవవిధసంబంధాలలో గత పాశురంలో పితాపుత్రసంబంధం, ఈ పాశురంలో భర్తృభార్యాసంబంధం చెప్పబడ్డాయి.

**మీన్ నోక్కుమ్ నీళ్ వయల్ శూழ் విత్తువక్కోట్టమ్మా!, ఎన్**
**పాల్ నోక్కాయాకిలుమ్ ఉన్పఱ్ఱల్లాల్ పఱ్ఱిలేన్,**
**తాన్ నోక్కాతు ఎత్తుయరమ్ శెయ్తిడిలుమ్, తార్వేన్దన్**
**కోల్నోక్కి వాழுమ్ కుడిపోన్ఱిరున్దేనే** **3**

మీన్ నోక్కుమ్ = (సముద్రంలో ఉండే) చేపలు (సముద్రం ఎండిపోయినా మనకు ఆశ్రయం ఇదే సుమా! అని) చూచే రీతిలోని, నీళ్ వయల్ శూழ் = విస్తరించిన సస్యక్షేత్రాలచేత చుట్టబడి ఉండే, విత్తువకోట్టమ్మా = విత్తువక్కోడు దివ్యదేశంలోకి స్వామీ!, ఎన్బాల్ = దాసునిపై, నోక్కాయ్ ఆకిలుమ్ = నీవు కటాక్షించకపోయినా, ఉన్ పఱ్ఱు అల్లాల్ పఱ్ఱు ఇలేన్ = నిన్ను శరణంగా ఆశ్రయించడాన్ని విడచి ఇంక ఎవరినీ శరణు పొందను, తార్ వేన్దన్ = (ప్రజల రక్షణకోసం) మాలను ధరించిన ప్రభువు, తాన్ నోక్కాయాతు = (అటువంటి) తానే ప్రజలను కాపాడకుండా, ఎత్తుయరమ్ శెయ్దిడినుమ్= ఎటువంటి దుఃఖాలను కల్గించినా, కోల్ నోక్కి వాழுమ్ = అతని శాసనదండాన్నే చూచి ఉజ్జీవించే, కుడిపోన్ఱు ఇరున్దేనే = జనులతో సాటిగా ఉన్నాను.

**వ్యా. :– మూన్ఱామ్బాట్టు. (మీన్ నోక్కుమ్ నీళ్ వయల్ శూழ்) మత్స్యమెన్ఱు పేర్ పెఱ్ఱవై యద్దైయ కృటాక్షిక్కుమ్ దేశమాయ్త్తు. కడలిల్ మత్స్యమ్, "కడల్ వఱ్ఱినాల్ నమక్కు ప్పుకలిడమ్" ఎన్ఱు నినైత్తిరుక్కుమ్ దేశమాయ్త్తు. (విత్తువక్కోట్టమ్మా) పరమపదత్తిలుళ్ళారుమ్ శీలగుణ మనుభవిక్కుమ్ దేశమాయ్త్తు. ఉత్కర్షమ్ ధర్మిప్రయుక్త**

మెన్ఱు ప్రమాణత్తాలే నామ్ కేట్టఱియుమాపోలే శీలాదికళ్ ధర్మిప్రయుక్తమెన్ఱు ఇరుక్కు మిత్తనైయిఱే పరమపదత్తిల్; కణ్డనుభవిక్కలావతు ఇజ్గేయిఱే.

(విత్తువకోట్టమ్మా ఎన్బాల్ నోక్కాయాకిలుమ్) పరమపదమాకిఱ ఒరు నాడాక నీ నోక్కుకిఱ నోక్కై ఎన్నై ఒరువనైయుమే నోక్కి వన్దిరున్ఱు, ఇప్పోతు ఎన్నై కృటాక్షియా తిరున్దాయాకిలుమ్. (ఉన్ పఱ్ఱల్లాల్ పఱ్ఱిలేన్) ఎన్నుడైయ రక్షైయిల్ ఉద్యుక్తనాన ఉన్నై విట్టు బాధకరాక సమ్ప్రతిపన్నరానారై ప్పఱ్ఱువేనో? నిత్యసంసారియాయ్ ఇవ్వళవాక చ్చూఴ్ఱ్తుక్కొణ్డ ఎన్నై ప్పఱ్ఱవో? ఎన్నుడైయ రక్షణత్తిల్ ఎన్నోపాతియుమ్ ప్రాప్తియిల్లాత పిఱరై ప్పఱ్ఱవో?.

(తాన్ నోక్కాతు ఎత్తుయరమ్ శెయ్‌తిడిలుమ్ తార్ వేన్దన్) ప్రజైకళుడైయ రక్షణత్తిలే దీక్షిత్తు త్తనిమాలై ఇట్టిరుక్కిఱ రాజావానవన్, రక్షణత్తిలే నెకిఴ నిఱ్కుమళవన్ఱిక్కే, ఎల్లా దుఃఖజ్గళైయుమ్ విళైక్కిలుమ్. (తార్ వేన్దర్ కోల్ నోక్కి వాఴుమ్ కుడిపోన్ఱిరున్దేనే) రక్షక నాయిరున్దువైత్తు బాధకనానాలుమ్ అవనుడైయ ఆజ్ఞానువర్తనమ్ పణ్ణుమ్ కుడిపోలే యిరున్దేన్. శిఱియత్తై ప్పెరియతు తిన్నామల్ కాక్క త్తాన్ మాట్టాన్. శెజ్గత్తీరై కట్టి రక్షిప్పిత్తుక్కొళ్ళుమ్ ప్రాప్తి అవనుక్కుణ్డు. ఎన్ రక్షణత్తిల్ ఎనక్కు అన్వయమిల్లాతాప్పోలే, సమ్బన్ధముడైయ నీయే రక్షిక్కు మిత్తనై. నాన్ శెయ్యలావతు మిల్లై. నీ మాట్టాతతు మిల్లై.

*అరు :– మూన్ఱామ్బాట్టు. (మీనిత్యాది). (తాన్‌మాట్టాన్) కుడియాన తాన్ మాట్టాన్, రాజావై క్కొణ్డు రక్షప్పిత్తుక్కొళ్ళుమ్ ముఱై కుడియానవనుక్కుణ్డెన్ఱపడి.*

**భావదీపిక :– అవ :–** ప్రభువు కఠినపాలకుడైనా, తనను రక్షించడంకోసం అతనినే ఎదురుచూచి జీవించే జనులవలె ఉన్నాను– అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :– (మీన్ నోక్కుమ్ నీళ్ వయల్ శూఴ్)** – లోకంలో చేపలు అనే పేరును కల్గినవి అన్నీ తాము బతికే నీరుండే చోట్లు అన్నీ ఎండిపోయినా ఈ పొలాలలోని నీరు మాత్రం ఎండదు. అక్కడకు పోయి చేరవచ్చు"– అని చూచే విశాలమైన సస్యక్షేత్రాలతో చుట్టబడి ఉన్నది విత్తువక్కోడు– అని భావం. సముద్రంలోని చేపలు కూడా "మనకు చేరే చోటు" అని తలచే దివ్యదేశం– అని అన్నందువల్ల ఇక్కడి జలపౌష్కల్యం చెప్పబడింది.

**(విత్తువకోట్టమ్మా)** – విత్తువక్కోడులో వేంచేసి ఉండే ఉభయవిభూతినాయకా! పరమపదంలో ఉన్నవారు కూడా అక్కడ అనుభవించడానికి వీలు లేని సౌలభ్యగుణాన్ని ఇక్కడకు వచ్చి అనుభవిస్తారు. కనుక, వారికి నాయకుడు– అని భావం. ఈ లీలావిభూతిలో ఉండే మనం సకలకల్యాణగుణాలను కల భగవానునకు, మనం అనుభవించడానికి సాధ్యం కాని, అంతు లేని పరత్వగుణాలు అతనికి ఉన్నాయి– అనే విషయాన్ని అతనినిగూర్చి పలికే శ్రుతులు మొదలైన ప్రమాణాలవల్ల విని తెలిసికొనేటట్లే,

పరమపదంలో ఉన్నవారు కూడా సౌలభ్యగుణాలు పరమపదంలో అతనిదగ్గర ఉన్నాయి అని తెలిసికొంటారే తప్ప, దర్శించి అనుభవించే వీలు లేదు. వాటిని దర్శించి అనుభవించే వీలు ఈ దివ్యదేశంలోనే –అని భావం.

**(విత్తువకోట్టమ్మా ! ఎన్బాల్ నోక్కాయాకిలుమ్)** విత్తువక్కోడులో వేంచేసి ఉండే నా స్వామీ! పరమపదమనే ఒక విభూతి అంతటినీ రక్షించడంకోసం నీవు కటాక్షించే చూపును నా ఒక్కనిపైననే కటాక్షించడంకోసం ఇక్కడ విత్తువక్కోడులో వేంచేసి ఉండే నీవు ఇపుడు నన్ను కటాక్షించకపోయినా.

**(ఉన్ పఱ్ఱల్లాల్ పఱ్ఱిలేన్)** – నన్ను రక్షించడంలో అనాదికాలంగా ప్రయత్నించే నిన్ను విడచి, నన్ను బాధించడమే స్వభావంగా కలవారు– అని నేను తెలిసినవారిని ఆశ్రయించనా ! అనాదికాలంగా సంసారంలో పరిభ్రమించి, ఇక్కడ ఉండే బాధపడవలసిన స్థితిని తెచ్చుకొన్న నన్ను నాకు రక్షకునిగా భావించనా ! నన్ను రక్షించడంలో నా అవధిలోకూడా యోగ్యతను లేని మిగిలినవారిని ఆశ్రయించనా !

**(తాన్ నోక్కాతు ఎత్తుయరుమ్ శెయ్దిడినుమ్ తార్ వేన్దన్)** – ప్రజలను కాపాడడంకోసం వ్రతం పూని, దానికోసంగా విలక్షణమైన మాలను ధరించే రాజు తాను చెయ్యవలసిన రక్షణకార్యాన్ని చేయకుండా పోవడంతోపాటు, దుఃఖాలను అన్నిటినీ వారికి కల్గించినా. **(తార్వేన్దన్ కోల్ నోక్కి వాழుమ్ కుడిపోన్ఱు ఇరున్దేనే)** – రాజదండాన్ని నిర్వహించవలసినవాడు క్రూరపరిపాలకుడై, ప్రజలను పీడించేవాడైనా, అతని ఆజ్ఞనే అనుసరించి ఉండే ప్రజలవలె ఉన్నాను. బలహీనులను బలవంతులు బాధించకుండా కాచే పనిని పౌరుడు తాను స్వయంగా చేయలేడు. తాను కాషాయాన్ని ధరించి, ప్రభువు చేత రక్షింప జేసే వంతు సజ్జనునకు ఉన్నది. అదేవిధంగా నన్ను కాపాడడంలో నాకు ఏ అన్వయం, బాధ్యత లేదు. స్వామి అయిన నీవే నన్ను రక్షించాలి. నన్ను రక్షించుకోవడానికి నేను చేయవలసినది అన్నది ఏదీ లేదు. నన్ను రక్షించడానికి నీవు చేయలేనిది అన్నది ఏదీ లేదు.

**వాళాల్ అఱుత్తు చ్చుడినుమ్ మరుత్తువన్బాల్,**
**మాళాత కాతల్ నోయాళన్ పోల్, మాయత్తాల్**
**మీళా త్తుయర్ తరిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, నీ**
**ఆళా ఉనతరుళే పార్ప్పన్ అడియేనే.** 4

విత్తువకోట్టమ్మా = విత్తువక్కోడు దివ్యదేశంలో ఉండే స్వామీ !, వాళాల్ అఱుత్తు శుడినుమ్ = కత్తిలో నఱకడం, వాతపెట్టడం వంటివి చేసినా, మరుత్తువన్ పాల్ మాళాత కాతల్= వైద్యునిపట్ల తొలగని ప్రేమను కల, నోయాళన్ పోల్ = రోగివలె, నీ = నీవు,

మాయత్తాల్ = నీ మాయలో, మీళా తుయర్ తరిలుమ్ = నాకు తీరని దుఃఖాన్ని కల్గించినా, అడియేన్ = నీకు దాసుణ్ణి అయిన నేను, ఆళా = నీకు కైంకర్యం చేయడంకోసంగా, ఉనతు అరుళే పార్ప్పన్ = నీ కృపనే ఎదురుచూస్తాను.

వ్యా. :- నాలామ్బాట్టు. "ఒరువనాలే హితమ్" ఎన్గుమ్, "ఫలత్తిలే అన్వయమ్ ఒరుతలైక్కే" ఎన్గుమ్ అధ్యవసిత్తాల్, అహితఙ్గళైయే ప్రవర్తియానిన్గాన్ ఎన్గు తోఱ్ఱినాలుమ్ అవనే రక్షకనెన్గు కిడక్కవితే కడవతు. పిళ్ళై తిరునఱైయూరరైయరై, పిళ్ళైకళ్ "పుకై శూழ்న్దపడి సహిక్కప్పోకిఱతిల్లై" ఎన్న, "శఱ్ఱుప్పోతన్నో వ్యసనప్పడువతు; శ్రీవైకుణ్ఠ నాథన్ తిరువడికళిలే సుఖమేయిరుక్కవన్నో? పుకుకిఱతు" ఎన్గారితే. తాన్ తఙ్ఞమాక ప్పఱ్ఱిన విషయత్తుక్కు అన్యథాసిద్ధి పిఱన్దతో? ఎన్గు మీళుమ్బడియిరుక్కిఱదశైయిలే. హేత్వన్తర మితు; అవ్వరుకిల్ పేఱ్ఱిల్ కుఱై ఇల్లై ఎన్నుమ్ అధ్యవసాయ మిరున్దపడియితే. ఇతితే మహావిశ్వాసమాకిఱతు. తోఱ్ఱుకిఱ ఆపాతప్రతీతియై క్కణ్డు మీళాతే యిరుక్కు మతితే.

(వాళాల్ అఱుత్తు చ్చుడినుమ్) హింసాసాధనత్తై క్కొణ్డు అఱుప్పతు శుడువతు ఆనాలుమ్. (మరుత్తువన్బాల్ మాళాత కాతల్ నోయాళన్‌పోల్) అహితఙ్గళై మేన్మేలన ప్రవర్తిప్పిక్కచ్చెయ్‌తేయుమ్ భిషక్కు "అవన్ నమక్కు హితకరన్" ఎన్గు అవనుక్కు త్తన్ సర్వస్వత్తైయుమ్ కొడుత్తు. అవన్‌పక్కలిలే స్నేహత్తై పణ్ణుమ్ వ్యాధియాళరైప్పోలే. (మాయత్తాల్ మీళా త్తుయర్ తరిలుమ్) "మమ మాయా దురత్యయా" ఎన్నుమ్బడియే ఉన్నుదైయతాన ప్రకృతిసమ్బన్ధత్తాలే అపునరావృత్తిలక్షణమే దుఃఖత్తై విళైక్కిలుమ్. (విత్తువక్కోట్టమ్మా నీ మీళాత్తుయర్ తరిలుమ్) ఎనక్కు త్యాజ్యమాన సంసారత్తిలే ఎన్నుదైయ రక్షణత్తుక్కాక క్కుడియేతి యిరుక్కిఱ నీ నిత్యదుఃఖత్తై విళైక్కిలుమ్. పెఱ్ఱ తాయ్ ప్రజైక్కు అహితమ్ శెయ్యిలితే నీ శెయ్‌వతు. అప్పడి యిరుక్కిఱ నీ శెయ్యిలుమ్. (ఆళా) స్వరూపానురూపమాన వృత్తియై ప్పెఱుకైక్కాక.

(ఉనతరుళే పార్ప్పన్) ఇప్పోతు తోఱ్ఱుకిఱ వ్యసనఙ్గళై బుద్ధిపణ్ణాతే, ఉన్ కృపైయైయే బుద్ధిపణ్ణి ఇరుప్పన్. ఇప్పడి ఇరుక్కైక్కు నిబన్ధన మెన్? ఎన్నిల్, (అడియేనే) అడియేనాకాయాలే. ఎన్ స్వరూపత్తైయుమ్, ఉన్ స్వరూపత్తైయుమ్ నేరాక అఱిన్దవ నాకైయాలే. (అసౌ) అన్గు కణ్డాప్పోలే కైయుమ్ విల్లుమాయ్ నిఱ్పర్, అవనుక్కు అచ్చత్తాలే, తమక్కు ఉరువువెళిప్పాట్టాలే మున్నే నిఱ్పర్; తీరక్కழ்య అరాధమ్ శెయ్‌త ఎనక్కు అవర్ కృపై పణ్ణువరో ఎన్గు అవనుక్కు నినైవాక క్కొణ్డు, (పురుషర్షభః) నీ అనుకూలనాయ్ ఓరడి వర నిన్గాల్ అత్తైయే నినైత్తు నీ పణ్ణిన అపరాధ మెల్లామ్ బుద్ధిపణ్ణువరో? అవర్ పురుడోత్తమర్ కాణ్. (మున్బాழ் కాణాన్) కుఱ్ఱత్తై మఱక్కు మతిన్గియే, "కుఱ్ఱమ్ శెయ్‌త నాళై నినైక్కిల్ కుఱ్ఱమ్ తోఱ్ఱు మెన్గు అన్నాళైయుమ్ మఱక్కుమవర్ కాణ్" ఎన్గు పిరాట్టి రావణనుక్కు అరుళిచ్చెయ్‌తపడియే ఇని నీరల్లతు పుకలిల్లై ఎన్గిఱార్.

*అరు :- నాలామ్బాట్టు. (వాళాలిత్యాది). హితపరనానవన్ అహితఙ్గళై ప్పణ్ణా నిన్గపోతుమ్ అవనే రక్షక నెన్ఱు అధ్యవసిత్తిరుక్క వేణు మెన్నుమతుక్కు సంవాదమాక ఓరైతిహ్యా మరుళిచ్చెయ్‌కిఱార్ (పిళ్ళై తిరునఱైయూరరైయరిత్యాది). అన్యథా సిద్ధియావతు-సర్వజ్ఞత్వాదికళ్ ఉణ్డెన్గిరున్దోమ్, అజ్ఞత్వాదికళుణ్డాయ్‌త్తెన్ఱు నినైక్కై. (హేత్వన్తరమ్) మత్వాపమ్.*

*ఎన్గ అవస్థైయిలుమ్ నీ యల్లతిల్లై ఎన్గిఱతు ఎప్పడి యిరుక్కిఱతు? ఎన్న, "అసౌ" ఎన్గత్తై ప్పఱ్ఱ అవరుళిచ్చెయ్‌కిఱార్ (అన్ఱు కణ్డాప్పోలే యిత్యాది).*

**భావదీపిక:- అవ:-** "వైద్యుడు రోగిని నయం చేయడంకోసం కత్తితో కోయడం, నిప్పుతో కాల్చడం మొదలైన పనులను చేసినా, రోగికి అతనిపట్ల వెగటు కలుగదు. సరికదా, ప్రేమే కల్గుతుంది. ఆ రీతిలోనే, నాకు హితాన్ని చేయడం కోసంగా, నీవు కష్టాలను కల్గించినా, నీ విషయంలో నేను ప్రేమను కలిగి ఉంటాను" అని ఇందులో అంటున్నారు. గత పాశురంలో చెప్పినట్లుగా భగవానుడు రక్షకుడని, ఆ పరమాత్మే జీవుని పొంది, ప్రయోజనం పొందేవాడని స్థిరమైన నమ్మకం ఉంటే, పరమాత్మ జీవునకు దుఃఖాలనే కల్గిస్తున్నాడని తోచేటట్లుగా ఉన్నా, పరమాత్మ తమను రక్షించడంకోసమే వాటిని చేస్తున్నాడని భావించడమే తగినది కదా! ఈ సందర్భంలో శ్రీపరాశరభట్టర్ కాలంలో జీవించిన ఆచార్యులు పిళ్ళైతిరునఱైయూర్ అరైయర్‌నుగూర్చిన ఈ క్రింది ఐతిహ్యం వ్యాఖ్యలో ఉట్టంకింప బడింది. "పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ తమ కుటుంబంతో కలసి తిరుచ్చికి సమీపంలో ఉండే తొట్టియమ్ తిరునారాయణ పురంలో వెలసిన వేదనారాయణస్వామిని సేవిస్తూ ఉన్నపుడు, ఇతరమతస్థులు కొందఱు కోవెలకు నిప్పును ముట్టించారు. అపుడు భగవానుని తిరుమేనికి నిప్పు సోకి బాధించకుండా ఉండడంకోసం పిళ్ళైతిరుఱైయూర్ అరైయర్ తమ సంతానంతో కలిసి భగవానుని తిరుమేనిని ఆలింగనం చేసికొన్నారు. అంతటా పొగ కమ్ముకొని, ఊపిరి ఆడకుండా తల్లడిల్లిన అరైయర్ కుమారులు తమకు పొగను సహించడం సాధ్యం కాదని అన్నారు. అపుడు అరైయర్- "ఇక కొంచెంసేపే బాధ. తర్వాత ఈలోక జీవితంనుండి విడుదలను పొంది, అంతులేని ఆనందం అయిన వైకుంఠ మహానగరాన్ని చేరి, భగవానుని శ్రీచరణాలలో ఆనందంగా ఉండవచ్చు. అంతవరకు సహించి ఉండండి- అని అన్నారు"- అన్నది ఈ ఐతిహ్యం. జీవుడు దుఃఖాలను అనుభవించేపుడు మనం ఆశ్రయించిన భగవానుడు మనలను ఈ విధంగా బాధపెడు తున్నాడే! నిజానికి అతడు మనలను కాపాడేవాడేనా!" అని తలచి, భగవానునిగూర్చిన నమ్మికలో సడలే స్థితి కలుగుతుంది. అపుడు- "ఆ దుఃఖాలకు కారణం మన కర్మలే. మనలను సంస్కరించడం కోసమే భగవానుడు వాటిని అనుభవించేటట్లు చేస్తున్నాడు. చివరలో తన కైంకర్యాన్ని అనుగ్రహించి, అతడు తమకు మంచిని చేస్తాడు" అని నమ్మకం కల్గి ఉండాలి- అని చూపుతున్నది- ఈ పాశురం. ఇదే ప్రపన్నునకు ఉండవలసిన మహావిశ్వాసం అనే స్వభావం. వైద్యుడు

కత్తితో ఖండించి, నిప్పుతో కాల్చినా అపుడు ఏర్పడే బాధను చూచి అతనిని విడిచిపెట్టకుండా ఉండేటట్లే, మనం దుఃఖాలను అనుభవించేటపుడు 'భగవానుడు మనకు దుఃఖాలను కల్గించాడు' అని పైపైన తోచే భావనతో అతనిని విడచిపెట్టకుండా "అతడు మనకు మంచినే చేస్తున్నాడు" అనే నిశ్చయంతో ఉండడమే మహావిశ్వాసం అవుతుంది.

**వ్యాఖ్యానం :- (వాళాల్ అఱుత్తుచ్చుడినుమ్)** - కఠినమైన బాధను కల్గించే కత్తిని తీసికొని ఖండించడం, నిప్పుతో కాల్చడం - మొదలైనవానిని చేసినా.

**(మరుత్తువన్ పాల్ మాళాద కాదల్ నోయాళన్ పోల్)** - వైద్యుడు ఖండించడం, కోయడం- మొదలైన క్రూరకృత్యాలను నిరంతరం చేసినా, "అతడు మనకు వ్యాధిని నయం చేయడం కోసంగానే ఈవిధంగా చేస్తున్నాడు" అని తెలిసి, అతనికి గొప్ప ధనాన్ని ఇచ్చి, అతని పట్ల ప్రేమను చూపే రోగివలె.

**(మాయత్తాల్ మీళా త్తుయర్ తరిలుమ్) - "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"** (భ.గీ. 7-14) (దేవుడనైన నాచే నిర్మింపబడినది, మూడు గుణాలను కల్గినది అయిన ఈ నా మాయ దాటరానిది. నన్నే ఎవరు శరణంగా ఆశ్రయిస్తారో, వారే ఈ మాయను దాటగలరు) అనే రీతిలో నీచే అనుగ్రహింపబడ్డ, నా దేహాల పరంపరవల్ల ఏనాటికీ తీరని దుఃఖాన్ని కల్గించినా- అని భావం. **"మాయమ్"** అనేది **"మాయాం తు ప్రకృతిం విద్యాత్"** (శ్వేతాశ్వతర) (మాయ అనే పదం ప్రకృతిని తెలుపుతుంది) అనే ప్రమాణాన్ని బట్టి ఈ పదంచేత మూలప్రకృతియొక్క వికారం అయిన దేహాల అనువృత్తి చెప్పబడుతున్నది.

**(విత్తువక్కోట్టమ్మా! నీ మీళా త్తుయర్ తరిలుమ్)** - నాచే విడువతగిన ఈ లోకంలో నున్న కాపాడడంకోసం వచ్చిన నీవు, తీరని తొలగని దుఃఖాలను కల్గించినా- అని భావం. **"తుయర్ తరిలుమ్"** అని అన్నందున "కన్నతల్లి బిడ్డకు కష్టాన్ని కల్గించడం ఏ విధంగా సాధ్యం కాదో, ఆ విధంగా నీవు దుఃఖాన్ని ఇవ్వడంకూడా జరగని కార్యం. అటువంటి నీవు ఒకవేళ దుఃఖాన్ని కల్గించినా- అని భావం.

**(ఆళా)**- నీ దాసుణ్ణి అయిన నా స్వరూపానికి తగిన కైంకర్యాన్ని పొందడం కోసం.

**(ఉనదరుళే పార్ప్పన్)** ఇపుడు నేను అనుభవించే దుఃఖాలను లెక్కించకుండా నీ దయనే లెక్కిస్తాను. ఈ విధంగా ఉండడానికి కారణం ఏమి ? అంటే,

**(అడియేన్)** - దాసుణ్ణి అయినందువల్ల, **(నీ)** సొత్తు అయిన నా స్వరూపాన్ని, స్వామివి అయిన నీ స్వరూపాన్ని స్పష్టంగా తెలిసినవాణ్ణి కనుక - అని భావం.

"నా స్వరూపాన్ని, నీ స్వరూపాన్ని స్పష్టంగా తెలిసినవాడవు" అనే దానికి, "నాకు నీవు తప్ప వేఱుగతి లేదు" అనేదానికి సంవాదంగా **"మిత్ర మౌపయికం కర్తుం రామః స్థానం పరీప్సతా, వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః"** (రావణా! నీవు బతికి ఉండాలని కోరుకొన్నా, లేక, ఘోరమైన చావు రావద్దని అనుకొన్నా, ఈ పురుషశ్రేష్ఠుడైన శ్రీరాముని మిత్రునిగా చేసికోవడం మంచిది) అనే సీతాదేవి వాక్యం ప్రకృతంలో ప్రమాణంగా ఉట్టంకింపబడుతున్నది. సీతాదేవి రావణునకు ఉపదేశం చేసేటపుడు శ్రీరాముని **"అసౌ పురుషర్షభః"** అని శ్రీరాముడు తనకు రావణునకు ముందు నిలుచుని ఉన్నట్లుగా నిర్దేశించింది. సీతాదేవి శ్రీరాముని విశ్లేషించడానికి ముందు చేతిలో కోదండాన్ని ధరించి ఉండగా దర్శించినట్లే, ఇపుడుకూడా అదే సన్నివేశంలో తన ముందు నిలుచున్నట్లు మనోనేత్రంతో దర్శిస్తున్నది. రావణునకు శ్రీరామునివద్ద ఉండే భయంచేత, ఆ స్వామి అతని కంటిముందు కన్పిస్తూ ఉంటాడని తలచి, తనకు పూర్వసన్నివేశం నేరుగా దర్శిస్తున్నట్లుగా మనోనేత్రం ముందు కన్పిస్తున్నందున **'అసౌ'** అని అన్నది. అంతేకాక, పరదారాపహరణం అనే మహాపాపాన్ని చేసిన నన్ను శ్రీరాముడు అనుగ్రహిస్తాడా ?" అని రావణుని తలపుగా భావించి, **"పురుషర్షభః"** (పురుషశ్రేష్ఠుడు) కనుక నిన్ను సైతం అనుగ్రహిస్తాడని అన్నది. మహాపాపాన్ని చేసిన నీవు కొంచెం స్నేహాన్ని చూపినా, దానినే తలచి, నీవు చేసిన దోషాలను అన్నిటినీ మఱచిపోయే పురుషోత్తముడు" అని అన్నది. ఈ సందర్భంలో **"మున్బ్బுழி కాణాన్"** (ముదల్ తిరు. 72) అనే పొయ్‌కై ఆழ్వార్ల పాశురం గ్రహించతగినది. ఈ పాశురంలోని భావం ఏమంటే– పూర్వం కల్పాలతరబడి నేను చేసిన పాపాలను అన్నిటినీ మఱచిపోవడమే కాకుండా, పాపాన్ని చేసినవారిని తలిస్తే పాపాలుకూడా గుర్తుకు వస్తాయి కనుక, ఆ దినాలను కూడా భగవానుడు మఱచిపోతున్నాడు" అని భావం. "ఇటువంటి పురుషోత్తముడితడు" అని సీతాదేవి రావణునితో పల్కినట్లే, నేనుకూడా తెలిసికొన్నవాణ్ణి కనుక, నీవు తప్ప నాకు వేఱు గతి లేదు" అని ఇందులో అంటున్నారు. "భగవానుడు రక్షకుడు, జీవుడు రక్షింపబడేవాడు" అనే రక్ష్యరక్షకసంబంధం ఇందులో చెప్పబడింది.

**వెఙ్గట్టిణ్ కళిఱడర్త్తాయ్ విత్తువక్కోట్టమ్మానే!,**
**ఎఙ్గు ప్పోయ్ ఉయ్‌కేన్ ఉన్నిణైయడియే యడైయలల్లాల్,**
**ఎఙ్గుమ్ పోయ్ క్కరై కాణాతు ఎఱికడల్ వాయ్ మీణ్డేయుమ్,**
**వఙ్గత్తిన్ కూమ్బేఱుమ్ మాప్పఱవై పోన్ఱేనే. 5**

వెమ్ కణ్ = భయంకరాలైన నేత్రాలను, తిణ్ కళిఱు = కఠినహృదయాన్ని కల (కువలయాపీడం అనే) ఏనుగును, అడర్త్తాయ్ = సంహరించినవాడా! విత్తువక్కోట్టు మ్మానే= విత్తువక్కోడు అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామీ!, ఉన్ ఇణై అడియే

అడైయల్ అల్లాల్ = నీ శ్రీచరణాలను శరణు పొందడం తప్ప, ఎజ్గు పోయ్ ఉయ్‌కేన్ = వేతెక్కడకు పోయి ఉజ్జీవించగలను? ఎతి కడల్ వాయ్ =అలలు వీచే సముద్రం నడుమ, ఎజ్గుమ్ పోయ్ = నాల్గు దిక్కులలోకి పోయి, కరై కాణాతు = తీరాన్ని చూడలేక, మీణ్డు= తిరిగివచ్చి, ఏయుమ్ వజ్గత్తిన్ = అక్కడ ఉండే నావయొక్క కూమ్బు ఏఱుమ్= చుక్కాని కర్రపైకి ఎక్కే, మా పఱవై పోన్టేనే = పెద్ద పక్షివలె ఉన్నాను.

**వ్యా. :- అఞ్జామ్బాట్టు. (వెజ్గణ్ తిణ్ కళిఱడర్త్తాయ్) వెవ్వియ కణ్ణైయుమ్, తిణ్ణియ నెఞ్జైయుముడైత్తాన కువలయాపీడత్తై క్కొన్రవనే! ప్రబలప్రతిబన్ధకజ్గళుణ్డైన్దిరుక్క వేణుమో దేవరీరుళ్ళీరాయిరుక్క. (విత్తువక్కోట్టమ్మానే) "ప్రతిబన్ధకమ్ పోక్కిన్ఱు అవతార కాలత్తిలేయితే. అతు తీర్థమ్ ప్రసాదిత్తతితే!" ఎన్రు పిఱ్పాడర్క్కు ఇழక్కవేణ్డాతపడి తిరువిత్తువ క్కోట్టిలే వన్దు సన్ని హితనానవనే! పరమపదమ్ కలవిరుక్కైయాక స్వామ్యత్తై నిర్వహిక్కైక్కాక వన్తో ఇజ్గు వన్దెழున్దరుళి యిరుక్కిఱతు. (విత్తువక్కోట్టమ్మానే ఎజ్గు పోయ్యుయ్‌కేన్) ప్రాప్తనుమాయ్, పశియనుమానవన్ వాశలిలే వన్దు "శోఱు శోఱు" ఎన్నానిఱ్క, అన్యరాయ్ నిరపేక్షరానవర్‌కళై ఉణ్ణ వழைప్పారైపోప్లే, ఉన్నై విట్టు ప్పరమపదత్తిలే యిరుక్కిఱ అవాప్తసమస్తకామనై ప్పత్ఱావో? (ఎజ్గు పోయ్యుయ్‌కేన్) ఉజ్జీవనహేతువాక పోప్మిడ మిల్లై. వినాశహేతువాక పోప్కిల్ పోమిత్తనైయితే. ఉకన్దరుళిన దేశజ్గళై విట్టు దేవతాన్తరజ్గళై ప్పత్ఱుకైయావతు - వినాశపర్యాయమితే.**

**(ఉన్నిణైయడియే అడైయలల్లాల్) అధ్యవసాయమావతు - బుద్ధ్యర్థమితే. "గత్యర్థాః బుద్ధ్యర్థాః" ఎన్ర న్యాయత్తై నినైక్కిఱార్. అవన్తానే వన్దు కిట్టచ్చెయ్‌తే, ఇழక్కిఱార్ ఇழక్కిఱతుమ్, పెఱుకిఱార్ పెఱుకిఱతుమ్ - అప్రతిపత్తియాలుమ్ ప్రతిపత్తియాలుమితే. (ఎతికడలిత్యాది) పెరియ క్షోభత్తై యుడైయ కడలిలే ఒరు మరక్కలమావతు, అతిన్ కొమ్బిలే యిరున్దతొరు పక్షి నాలు దిక్కిలుమ్ పోక్కిడమ్ తేడి ప్పఱన్దాలుమ్ కరై కాణవొణ్ణాతితే. మీణ్డు వన్దు, కాల్ పావలావతు ఇమ్మరక్కలత్తిలేయితే. అప్పడియే సంసారసాగరత్తై క్కడక్కుమ్బోతు ఉకన్దరుళిన దేశమాన తిరువిత్తువక్కోట్టై ప్పత్ఱిక్కడక్కలా మత్తనై యల్లతు వేఱు ఉపాయ మిల్లెయితే కడక్కైకు. ఉకన్దరుళిన దేశత్తై ఒழిన్దెల్లామ్ అక్కడల్‌పోలేయితే. (మా ప్పఱవై పోన్టేనే) తాన్ ఏతిట్టుక్కొణ్డు అకల మెల్లామ్ నీరిలే యాழుకైక్కుడలా మిత్తనైయితే. అవన్ కై నెకిழన్దా నెన్రు తోత్ఱ అడిమట్టైయై ఉఱక్కప్పత్ఱుమిత్తనైయితే.**

*అరు :- అఞ్జామ్బాట్టు. (వెజ్గణిత్యాది), (ఎజ్గుమ్ పోయ్) - పరమపదవ్యావృత్తి యాతల్, దేవతాన్తరవ్యావృత్తియాతల్. (అకల మెల్లామ్) మాప్పఱవై యాకైయాలే తన్ శిఱకిన్ పరప్పెల్లామ్ (అవన్) ఓడక్కారన్. (అడి మట్టై) శమ్బాన్ మరత్తినుడైయ అడి ప్పార్శ్వమ్. ఇతుక్కు స్వాపదేశమ్- తానేతిట్టుక్కొణ్డ స్వయత్న మెల్లామ్, పక్షి నీరిలే అழున్దుమాపోలే నాశకరమామ్. ఆకైయాలే స్వయత్నత్తై విట్టు అవన్దివడికళై చ్చిక్కన ప్పత్ఱుకై యెన్రపడి.*

**భావదీపిక :- అవ :-** "నడి సముద్రంలో నావచుక్కాని స్తంభంపైకి ఎక్కిన పక్షి తీరాన్ని చూడలేక తిరిగి ఆ స్తంభం దగ్గరకే తిరిగి వచ్చేటట్లున్నాను నేను" అని ఇందులో ఆழ்వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (వెఙ్గణ్ తిణ్ కళిఱు అదర్త్తాయ్)** –వేడిమిని (క్రూరతను) మిక్కిలిగా కల్గిన కళ్ళను, కఠినమైన మనస్సును కల కువలయాపీడాన్ని సంహరించినవాడా ! నీవు రక్షకుడవై ఉన్నపుడు నాకు ఎదురయే బలమైన అడ్డంకులను తలచి భయపడవలసిన అక్కర ఉన్నదా!– అని భావం.

**(విత్తువక్కోట్టమ్మానే)** – "ఆ విధంగా అడ్డంకులను పోగొట్టి రక్షించడం కృష్ణావతారకాలంలోకదా! ఆ అవతారం పూర్తి అయినదికదా !" అని తరువాతి కాలంవారు కొఱత పడవలసిన అక్కరలేనట్లుగా తిరువిత్తువక్కోడుకు వచ్చి సమీపంలో వేంచేసి ఉండే స్వామీ! పరమపదంలోమాత్రం వేంచేసి ఉంటే ఇతడు స్వామి (సొత్తుదారుడు) అనే విషయాన్ని స్థిరీకరించడానికి సాధ్యంకాదు కదా! దానిని (స్వామిత్వాన్ని) క్రమంలో నడిపించడం కోసంకదా ఇక్కడకు వచ్చి, అర్చావతారరూపంలో వేంచేసి ఉన్నది.

**(విత్తువక్కోట్టమ్మా ఎఙ్గు ప్పోయ్ ఉయ్కేన్)**– సంబంధాన్ని కలవాడై, పరిచయాన్ని కలవాడై ఉండేవాడొకడు స్వామి వాకిటిలోకి వచ్చి – "అన్నం పెట్టు" అని నిలచినపుడు, అతనిని చూడకుండా, తనతో సంబంధాన్ని లేని, పరిచయం లేనివారిని భుజించడానికి పిలిచేవారివలె, నీవు మాట్లాడకుండా ఉన్నా నిన్ను విడచి పరమపదంలో కోరికలన్నీ నెఱవేర్చుకొని ఆనందించేవానిని (పరరూపిని) నేను ఆశ్రయించగలనా ? నావంటివారికి అన్నం పెట్టడంకోసం వచ్చినవాడవు కదా నీవు– అని భావం.

**(ఎఙ్గు ప్పోయ్ ఉయ్కేన్)**– అర్చావతారరూపివి అయిన నిన్ను విడచి, పరమపద నాథుని వద్దకు పోయి నా కోరికను తీర్చుకొనగలనా ! అని భావం. ఆ విధంగా కాకుండా, ఇంకొక దైవం దగ్గరకు పోగలనా? అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(ఎఙ్గు ప్పోయ్ ఉయ్కేన్)** – ఇంకొక చోటికి పోయి, నేను ఉజ్జీవనాన్ని పొందడం సాధ్యం కాదు కనుక, ఉజ్జీవించడంకోసం పోదగిన చోటు ఏదీ లేదు. రక్షకులు కాని అన్యదైవాల దగ్గరకు పోతే, స్వరూపనాశమే కల్గుతుంది కనుక, నశించిపోవాలంటే ఆ విధంగా పోవచ్చు. భగవానుడు ఆదరంతో వేంచేసి ఉండే దివ్యదేశాలను విడచి, ఇంకొక దైవాన్ని ఆశ్రయించడం, స్వరూపనాశానాన్ని పొందడం– రెండూ ఒకటేకదా !

**(ఉన్ ఇణై అడియే అడైవతల్లాల్) – "గత్యర్థాః బుద్ధ్యర్థాః"** (గత్యర్థకధాతువులన్నీ జ్ఞానార్థకాలు) అనే న్యాయంతో ఇక్కడ భగవానుని శ్రీచరణాన్ని పొందడం అంటే ఆస్వామి శ్రీచరణాన్ని శరణంగా నమ్మి ఉండడమే. భగవానుడు తానే వచ్చి అర్చావతార రూపంగా

వేంచేసి, సమీపంలో ఉన్నపుడు ఉజ్జీవించడాన్నిగూర్చి పలుకడంవల్ల అతని శ్రీచరణాన్ని ఆశ్రయించడం అన్నది అతడుండే చోటికి చేరడం మాత్రమే కాదు, అతనిని శరణంగా మనస్సులో నిశ్చయించుకోవడంకూడా. ఆవిధంగా నమ్మకం కల్గి ఉండకపోవడం అతని కోల్పోవడమే. అతనిని శరణంగా గ్రహించడమే ఉజ్జీవనాన్ని పొందడం.

**(ఎతి కడల్ వాయ్ మీణ్డేయుమ్ వజ్గత్తిన్ కూమ్బేఋమ్)** – **"ఎతి కడల్వాయ్"** అని ఆరంభించి అతడుతప్ప వేఱొక గతి లేదు అనే విషయానికి ఒక దృష్టాంతాన్ని చూపుతున్నారు. అలలు వీచే సముద్రంలో ఒక నావ ప్రయాణిస్తున్నది. ఆనావ తీరాన్ని వదలి బయలుదేరేటపుడున్నది. దాని తెరచాప కొయ్యపైకి ఎక్కి కూర్చున్న ఒక పక్షి ఆ నావ నడిసముద్రానికి వచ్చిన తరువాత తీరాన్ని చూడాలని అనుకొని నాల్గు దిక్కులలో తీరాన్ని అన్వేషించడంకోసం ఎగిరిపోయినా, తీరాన్ని చూడలేకపోయింది. ఆ స్థితిలో తిరిగి ఆ పక్షి ఎగిరి తిరిగి వచ్చి, ఆతెరచాప కొయ్యపైకే ఎక్కి కూర్చున్నది. అదే రీతిలో, సంసారం అనే సముద్రంలో తీరాన్ని చూడాలని అంటే తిరువిత్తువక్కోడువంటి ఒక దివ్యదేశాన్ని ఆశ్రయించి, సంసారసముద్రాన్ని దాటాలే తప్ప ఇంకొక ఉపాయం లేదు కదా ! భగవానుడు వేంచేసి ఉండే దివ్యదేశాలను తప్ప మిగిలిన చోట్లు అన్నీ ఆశ్రయించి నిలవడానికి సాధ్యం కాని సముద్రంవంటివేకదా!

**(మాప్పుఅవై పోన్టేనే)** – అటువంటి పెద్దపక్షివలె ఉన్నాను– అని భావం. పక్షి తన పెద్ద రెక్కలతో ఎంతగా ఎగిరినా, దానికి ఇంకొక ఆశ్రయం లేనట్లే, నేను ఎంతగా ప్రయత్నం చేసినా, ఈ (సంసార) సముద్రాన్ని దాటడం నా వీలు కాదు. నా ప్రయత్నాలు సముద్రంలో మునిగిపోవడానికి ఉపయోగిస్తాయే తప్ప దాటడానికి ఉపయోగపడవు. నావతెరచాప కొయ్యనే ఆశ్రయంగా గ్రహించే పక్షివలె, "నావల్ల ఏమీ సాధ్యం కాదు" అనే విషయం వ్యక్తం అయేటట్లుగా భగవానుని పాదమూలాన్ని స్థిరంగా ఆశ్రయించడమే కర్తవ్యం– అని భావం.

**శెన్ద*ழ*లే వన్ద*ழ*లై చ్చెయ్‌తిడిలుమ్, శెజ్గమలమ్**
**అన్దరమ్ శేర్ వెజ్గతిరోఋక్కల్లాల్ అలరావాల్,**
**వెన్దుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, ఉన్**
**అన్దమిల్ శీరక్కల్లాల్ అకమ్ కు*ழை*యమాట్టేనే** 6

శెమ్ త*ழ*లై వెన్దు = ఎఱ్ఱని నిప్పు సమీపానికి వచ్చి, అ*ழ*లై శెయ్‌దిడినుమ్ = వేడిమిని కల్గించినా, శెజ్గమలమ్ = ఎఱ్ఱ తామరపూవు, అన్దరమ్ శేర్ వెమ్ కదిరోఋక్కు అల్లాల్ = ఆకాశంలో ప్రకాశించే, వేడి కిరణాలను కల సూర్యుని చూచి తప్ప, అలరా = (ఆ నిప్పును చూచి) వికసించదు, విత్తువకోట్టమ్మా = విత్తువక్కోడు అనే దివ్యదేశంలో

ఉండే స్వామీ!, వెమ్ తుయర్ = (అనుభవవినాశ్యాలైన) నా క్రూరకర్మలను, విట్టావిడిలుమ్= నీవు పోగొట్టకపోయినా, ఉన్ అన్దరమ్ ఇల్ శీర్క్కు అల్లాల్ = నీ అవధి లేని కల్యాణగుణాలకు తప్ప, అకమ్ కుழ்ழైయమాట్టేన్ = (ఇంకొక దానికి) నా మనస్సు ద్రవించదు.

**వ్యా :- ఆఱామ్బాట్టు. (శెన్దழலే వన్దழలై చ్చెయ్తిడిలుమ్) దాహకమాన అగ్ని కిట్టి ఉష్ణత్తై పణ్ణినాలుమ్. (శెజ్గమల మిత్యాది) తామరైయానతు ఆదిత్యన్ దూరస్థనానేయా కిలుమ్ అవనుడైయ కిరణత్తుక్కు అలరు మత్తనై యల్లతు అగ్ని కిట్టిన్రిన్ష్టు అతినుడైయ ఉష్ణత్తుక్కు అలరాతు. (వెమ్ తుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా) అనుభవ వినాశ్యమాన పాపజ్గళై పోక్కి ఇతుక్కు వికాసత్తై విళైప్పిక్క వన్దిరుక్కిఱ నీ ఉపేక్షిత్తాయా కిలుమ్. (ఉన్నన్దమిల్ శీర్క్కల్లాల్) కల్యాణయుక్తమాన ఉన్ గుణజ్గళుక్కల్లతు. (అకజ్గుழ்ழైయ మాట్టేన్) ఎన్నెఞ్జు నెకిழ்ழాతు.**

***అరు :- ఆఱామ్బాట్టు (శెన్దழலిత్యాది). తామరైయానతు అగ్నిక్కు అలరాతాప్పోలే నీ దుఃఖత్తై విళైత్తాలుమ్ నెఞ్జు కలజ్గామల్ ఉన్‌గుణజ్గళుక్కే ఈడుపడు మెన్గపడి.***

**భావదీపిక :- అవ :-** సూర్యునకు తప్ప ఇంకొక దానిని చూచి వికసించని తామరపూవువలె నా హృదయకమలం నీ కల్యాణగుణాలకు తప్ప ఇంకొక దానికి వికసించదు- అని ఇందులో ఆழ்ழ்వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (శెన్దழலే వెన్దు అழలై చ్చెయ్దిడినుమ్)** - "సూర్యుని వేడిమిలో తామరపూవు వికసిస్తుంది" అని తలచిన కొందఱు తామరపూవు దగ్గరకు మండే నిప్పును పెట్టి వేడి చేసినా,

**(శెజ్గమలమ్ అన్దరమ్ శేర్ వెజ్కదిరోఱ్కల్లాల్ అలరావాల్)** - తామరపూవు చాలా దూరంలో ఉండే సూర్యుని ఉష్ణకిరణాలు సోకడంవల్ల వికసిస్తుంది తప్ప, నిప్పు సమీపంలో పెట్టినా దాని వేడిమికి వికసించదు.

**(వెన్దుయర్ వీట్టావిడిలుమ్ విత్తువకోట్టమ్మా)** - అనుభవించి తీరవలసిన, అంతు లేని క్రూరపాపాలను పోగొట్టి నా హృదయకమలాన్ని వికసింపజేయడానికే వేంచేసిన నీవు అలక్ష్యంచేసినా.

**(ఉన్ అన్దమిల్ శీర్క్కల్లాల్)** - లెక్కలేనన్ని నీ కల్యాణగుణాలను కల నీ గుణాలకు తప్ప.

**(అకమ్ కుழ்ழైయమాట్టేనే)** - నా హృదయకమలం వేఱు దేనికీ వికసించదు.

**ఎత్తనైయుమ్ వాన్ మఱన్ద కాలత్తుమ్ పైజ్గూళ్గ్కళ్,**
**మైత్తెழுన్ద మాముకిలే పార్త్తిరుక్కుమ్ మற்றవైపోల్,**
**మెయ్త్తుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, ఎన్**
**శిత్తమ్ మిక ఉన్పాలే వైప్పన్ అడియేనే** 7

విత్తువకోట్టమ్మా = విత్తువక్కోడులోని స్వామీ !, వాన్ =మేఘాలు, ఎత్తనైయుమ్ మఱన్ద కాలత్తుమ్ = ఎంతకాలం వర్షం కురవకపోయినా, పైమ్ కూழ்కళ్ = పచ్చదనాన్ని కల పైరులు, మైత్తు ఎழுన్ద మా ముకిలే పార్త్తు ఇరుక్కుమ్ = నల్లని రంగుతో ఆకాశం పైకి వచ్చే పెద్ద పెద్ద మేఘాలనే ఎదురుచూచే రీతిలో ఉంటాయి, అవైపోల్ = ఆ సస్యాలవలె, మెయ్ తుయర్ వీట్టావిడిలుమ్ = తప్పక అనుభవించి తీరవలసిన దుః ఖాలను నీవు పోగొట్టకపోయినా, అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, ఎన్ శిత్తమ్ ఉన్పాలే మిక వైప్పన్ = నీ మనస్సును నీ విషయంలోనే మిక్కిలిగా కల్గి ఉంటాను.

**వ్యా :- ఏழாమ్పాట్టు. (ఎత్తనైయుమ్ వాన్ మఱన్ద కాలత్తుమ్) కార్కాలత్తిల్ వర్షియాతే మేఘఙ్గళ్ మఱుత్త కాలత్తిలుమ్. పైజ్గూழ்కళుణ్డు-పయిర్కళ్. (మైత్తెழுన్ద ఇత్యాది) ఆకాశత్తిలే కఱుత్త మేఘఙ్గళై ప్పార్త్తిరుక్కుమత్తనై యల్లతు నీర్నిలమ్ తేడిప్పోక అఱియాతాప్పోలే. (మెయ్త్తుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా) "అవశ్య మను భోక్తవ్యమ్" ఎన్గిఱ పాపత్తై ప్పోక్కి సంసారబన్ధ మఱుత్తుక్కొడుక్క వన్దిరుక్కిఱ నీ అతు శెయ్తిలైయాకిలుమ్. (ఎన్ శిత్త మిక వున్పాలే వైప్ప నడియేనే) ఎన్రక్షణత్తిలే నెకిழ் న్దాయెన్ఱు తోற்ற ఒరుకాలుక్కొరుకాల్ ఉన్పక్కలిలే నెఞ్జు ప్రవణమాకానిన్ఱతు.**

**భావదీపిక :- అవ :-** వర్షం ఏమాత్రం కురవకుండా క్షామం కల్గిన కాలంలోకూడా పైరులు వర్షాన్ని కురిసే మేఘాలకోసమే ఎదురుచూస్తాయి. అదేరీతిలో, నీవు నా దుః ఖాలను తీర్చకపోయినా, నా మనస్సు నిన్నే ఎదురుచూస్తుంది- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఎత్తనైయుమ్ వాన్ మఱన్ద కాలత్తుమ్ పైజ్గూழ்కళ్)** - వర్షాకాలంలో వర్షం కురవకుండా మేఘాలు అదృశ్యమైన సమయంలో కూడా పచ్చని పైరులు.

**(మైత్తెழுన్ద మాముకిలే పార్త్తిరుక్కుమ్ మற்றవైపోల్)** - ఆకాశంలో కన్పించే నల్లని మేఘాల కోసం ఎదురు తెన్నులు చూస్తుంది తప్ప, గుంటలు, నీటి చెలమలు వంటి జలాశయాలను అన్వేషించడం తెలియనట్లే,

**(మెయ్ త్తుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా) - "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్, నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతై రపి"** (బ్రహ్మకైవర్తం)- (ప్రకృతిమండలమ్ 26-70) (మానవునిచేత చేయబడ్డ పుణ్యాపాపరూపమైన కర్మల

ఫలాలు తప్పకుండా అనుభవించి తీరవలసినదే. నూఱు కోట్ల కల్పాల కాలం అయినా కర్మలు అనుభవించకపోతే నశించవు) అనే రీతిలో చేసిన కరల్మను అనుభవించే పోగొట్టుకోవాలి కనుక, **"మెయ్ త్తుయర్"** అనదగిన పాపాలను పోగొట్టి, తనను చేరినవారికి సంసారబంధాన్ని తెంచడంకోసమే వేంచేసి ఉండే నీవు వాటిని నశింప చేయకపోయినా.

**(ఎన్ శిత్తమ్ మిక ఉణ్బాలే వైప్పన్ అడియేనే)** – నన్ను రక్షించవలసిన నీవు రక్షించకుండా ఉన్నావు– అని తోచే ఒక్కొక్క సమయంలో సైతం నామనస్సు నీపట్ల ఇంకా ఇంకా అభినివేశాన్నే పొందుతున్నది.

**తొక్కిలఙ్గు యాఱెల్లామ్ పరన్దోడి, తొ౹డుకడలే**
**పుక్కన్ఱి ప్పుఱమ్ నిఱ్క మాట్టాత మఱ్ఱవైపోల్,**
**మిక్కిలఙ్గు ముకిల్ నిఱత్తాయ్ విత్తువక్కోట్టమ్మా!, ఉన్**
**పుక్కిలఙ్గు శీరల్లాల్ పుక్కిలన్ కాణ్ పుణ్ణియనే!** 8

తొక్కు ఇలఙ్గు ఆఱు ఎల్లామ్ = పుష్కలమైన జల౹పవాహంతో ౹పకాశించే నదులన్నీ, పరన్దు ఓడి = (కన్పించని చోట్ల అంతటా) వ్యాపించి, ౹పవహించి, తొడు కడలే పుక్కు అన్ఱి = గంభీరమైన సము౹దంలోకి చేరి కలుస్తాయి తప్ప, పుఱమ్ నిఱ్కమాట్టాత = వేఱొక చోటికి పోయి చేరవు. మిక్కు ఇలఙ్గు = మిక్కిలిగా ౹పకాశించే, ముకిల్ నిఱత్తాయ్= కాలం మేఘంవంటి వర్ణాన్ని కలవాడా!, విత్తువకోట్టమ్మా = విత్తుక్కోడులోని స్వామీ! నిర్వాహకుడా!, అవైపోల్ =ఆ నదులవలె, పుక్కు ఇలఙ్గు = నా మనస్సులో ౹పవేశించి ౹పకాశించే, ఉన్ శీర్ అల్లాల్ = నీ కల్యాణగుణాలు తప్ప, పుక్కిలన్ = (వేఱు దేనిలోను) అవగాహించను.

**వ్యా. :– ఎట్టామ్బాట్టు. (తొక్కిలఙ్గి యాఱెల్లామ్ పరన్దోడి) జలరాశి ఎల్లామ్ తిరణ్డు ఒళియైయుడైత్తాయ్, పార్త్త విడమెఙ్గుమ్ పరన్దోడి. (తొడుకడలిత్యాది) ఆఴ్న్ద కడలిలే శెన్ఱు పుక్కల్లతు పుఱమ్బు నిఱ్కమాట్టాత ఆఱుకళ్‌పోలే. "సము౹ద ఇవ సిన్ధుభిః" ఎన్నుమాపోలే. ఇవై పుక్కాల్ కడల్ నిఱైవుమ్, ఇల్లై యాకిల్ కుఱైప్పుదుకిఱతుమన్ఱిఱే; ఇవఱ్ఱుక్కు ప్పుఱమ్బు తరిప్పు అరితాయిఱే పుకుకిఱన.**

**(మిక్కిలఙ్గు ముకిల్ నిఱత్తాయ్) మిక్కు ఉజ్జ్వలమాన కాళమేఘమ్బోలే యిరుక్కిఱ నిఱత్తైయుడైయవనే! (విత్తువక్కోట్టమ్మా) అమ్మేఘమ్ పడిన్ద మలై. (ఉన్ పుక్కిలఙ్గు శీరల్లాల్ పుక్కిలన్ కాణ్) ఉళ్ పుక ఉళ్ పుక ఉజ్జ్వలమాన కల్యాణగుణ్గళిలే యల్లతు, ఉళ్ పుక ఉళ్ పుక మసృణమాయిరుక్కుమ్ గుణఙ్గళిలే అవగాహిత్తిలేన్ కాణ్. ఇతుక్కు నిబన్ధనమెన్? ఎన్నిల్, (పుణ్ణియనే) ౹పథమసుకృతమ్ నీ యాకైయాలే.**

**భావదీపిక :- అవ:-** నదులన్నీ కన్పించినచోట్ల అంతా వ్యాపించి ప్రవహించినా, సముద్రంలోనే పోయి చేరేటట్లే, నీ గుణసముద్రంలోనే నా మనస్సు అనే నది అభినివేశాన్ని పొంది, కలుస్తున్నది- అని ఇందులో ఆళ్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (తొక్కు ఇలఙ్గు ఆఱెల్లామ్ పరన్దు ఓడి)** - అక్కడక్కడ వర్షించే వర్షం నీరు అంతా ఒక చోట చేరి, కాంతిని కల్గినదై, కన్పించిన చోట్లలో వ్యాపించి ప్రవహించినా,

**(తొడు కడలే పుక్కన్ఱి పుఱమ్ నిఱ్కమాట్టాత మగ్ఱైవైపోల్)** - లోతైన సముద్రంలోకి చేరి కలుస్తుందే తప్ప వేఱెక్కడా నిలువని నదులవలె. **"సర్వదాఽభిగత స్సద్భిః సముద్ర ఇవ సింధుభిః"** (రామా.బాల. 1-16) (శ్రీరాముడు, నదులచే పొందబడే సముద్రునివలె, సత్పురుషులచేసదా ఆశ్రయింపబడేవాడు) అని చెప్పినట్లుగా, నదులు సముద్రంలోకే సంగమించేటట్లు, సత్పురుషులు శ్రీరాముని పొందినా, వారు పొందినందువల్ల శ్రీరామునకు ఒక పూర్ణత కల్గడం కాని, పొందకపోతే కొఱత కల్గడమో జరుగని రీతిలో, నదులు చేరడంవల్ల సముద్రానికి నిండుతనం కాని, చేరనందువల్ల సముద్రానికి కొఱత కల్గడం కాని లేదుకదా ! నదులు వేఱెక్కడా నిలువలేకపోవడంవల్లకదా!- అవి సముద్రంలోకి చేరుతున్నాయి. అదే రీతిలో వేఱెక్కడా ప్రవేశించి నిలువలేనందువల్ల, నేను నిన్ను పొందుతున్నాను- అని అంటున్నారు. పాశురంలోని ఉత్తరార్ధంలో.

**(మిక్కిలఙ్గు ముకిల్ నిఱత్తాయ్)** - మిక్కిలిగా వెలిగే నల్లని మేఘంవలె ఉండే వర్ణాన్ని కలవాడా !

**(విత్తువక్కోట్టమ్మా)** - ఆ మేఘం ఆశ్రయించి ఉండే పర్వతమే విత్తువక్కోడు అనే దివ్యదేశం,

**(ఉన్ పుక్కిలఙ్గు శీరల్లాల్ పుక్కిలన్ కాణ్)** - లోపల ప్రవేశించి, అనుభవించగా, అనుభవించగా ప్రకాశించే నీ కల్యాణగుణాలలో కాకుండా, అనుభవించగా, అనుభవించగా అసారంగా తోచే మిగిలినవారి గుణాలలో నేను అభినివేశాన్ని పొందడం లేదు. దీనికి ఏం కారణం? అని అంటే,

**(పుణ్ణియనే) -"పుమాంసం నయతి ఇతి పుణ్యమ్"** (జీవుని పిలుచుకొని పోయేవాడు కనుక భగవానుడు పుణ్యుడని అనబడుతున్నాడు) అనే వ్యుత్పత్తినిబట్టి నన్ను నీవద్దకు పిలుచుకొని పోయే మొదటి పుణ్యం నీవే కనుక నీ కల్యాణగుణాలలో తప్ప మిగిలినవారి గుణాలలో నేను అభినిష్టుడను కానే కాను- అని భావం.

**నిన్నైయే తాన్ వేణ్డి నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్**
**తన్నైయే, తాన్ వేణ్డుమ్ శెల్వమ్బోల్, మాయత్తాల్**

**మిన్నైయే శేర్ తికిరి విత్తువక్కోట్టమ్మా!,**
**నిన్నైయేతాన్ వేణ్డి నిఱ్పన్ అడియేనే** 9

మిన్నైయే శేర్ = మెఱుపువలె ప్రకాశం నిండి ఉండే, తికిరి = చక్రాన్ని కల, విత్తువకోట్టమ్మా = విత్తువక్కోడులోని స్వామీ !, నిన్నైయే తాన్ వేణ్డి = నిన్నే కోరి, నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్ తన్నైయే = నాశరహితం అయిన ఐశ్వర్యాన్ని కోరనివానినే, తాన్ వేణ్డుమ్ = తానుగానే స్వయంగా వచ్చి చేరగోరే, శెల్వమ్ పోల్ = నశ్వరమైన ఐశ్వర్యం వలె, మాయత్తాల్ = నీ మాయతో (నన్ను ఉపేక్షించినా), అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, నిన్నైయే తాన్ వేణ్డి నిఱ్పన్ = నిన్నే పొందాలని కోరుతున్నాను.

**వ్యా :- ఒన్ఱుతామ్బాట్టు. (నిన్నైయే తాన్ వేణ్డి నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్ తన్నైయే తాన్ వేణ్డుమ్ శెల్వమ్బోల్) నిన్నైయే వేణ్డి నిరవధికసమ్పత్తై క్కాఱ్ఱదై కొణ్డవన్ఱన్నైయే అవసరప్రతీక్షమాయ్ ప్పార్త్తు నిఱ్కుమ్ ఐశ్వర్యమ్బోలే- ఎన్నుతల్, మోక్షలక్ష్మియైప్పోలే- ఎన్నుతల్. (మాయత్తాల్ మిన్నైయే శేర్ తికిరి విత్తువక్కోట్టమ్మా) మిన్బోలే పళపళ త్తిరున్దుళ్ళ తిరువాళ్ళియై "ఎప్పోతుమ్ కైకళ్ళలా నేమి"యానాయ్, ఆశిలే వైత్త కైయుమ్ తానుమాయ్ ఎన్నుదైయ రక్షణత్తుక్కాక ఇఱ్ఱువన్దిరున్దువైత్తు క్కాఱ్ఱదై క్కొణ్డాయాకిలుమ్. (నిన్నైయే తాన్ వేణ్డి నిఱ్పనడియేనే) తన్నై క్కాఱ్ఱదై కొణ్డవనై ఐశ్వర్యమ్ విడాతాప్పోలే నీ ఎన్నై ఉపేక్షిక్క ఉన్నైయే పఱ్ఱి నిన్రేన్.**

***అరు :- ఒన్ఱుతామ్బాట్టు. (నిన్నైయే యిత్యాది). నీళ్ శెల్వమాకైయాలే మోక్షత్తై క్కాట్టుకిఱతు. అతువుమ్ "భావో నాన్యత్ర గచ్ఛతి" ఎన్ఱ తిరువడియైయుమ్ పిన్ శెన్దతు.***

**భావదీపిక :- అవ :-** సంపదను కోరనివారిని ఆ సంపద తానే అన్వేషించి పొందేటట్లు, నీవు నన్ను గర్హించి గెంటినా, నిన్నే నేను ఆశ్రయిస్తున్నాను- అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (నిన్నైయే తాన్ వేణ్డి నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్ తన్నైయే తాన్ వేణ్డుమ్ శెల్వమ్పోల్)-** ఈ ప్రయోగం పాశురంలో పైన ఉండే భాగంలో చెప్పబడే అర్థానికి దృష్టాంతం. 'నిన్నే కోరి కుబేరునివంటి గొప్ప సంపదను సైతం గర్హించి కాదనే ప్రపన్నాధికారులను, వారు కోరకపోయినా, తానే అన్వేషించి వచ్చి పొందే సంపదవలె"- అని భావం. ఇటువంటి అధికారికి అతడు దానిని దుర్వినియోగం చేసి, చెడిపోడు- అనే నిశ్చయం ఉంటే, సంపదకు అధిదేవత అయిన లక్ష్మీదేవి అతనికి గొప్ప సంపదను ఇస్తుంది- అని భావం. కులశేఖరులు అటువంటివారు కనుక, రాజ్యపదవినే పొందారన్న విషయం గమనార్హం. ఈ రీతిలో అర్థాన్ని గ్రహించకుండా, ఇటువంటి గొప్ప ప్రపన్నాధికారిని ఉత్తమమైన సంపద అయిన మోక్షమే అన్వేషించి వచ్చి పొందేటట్లుగా- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**(మిన్నైయే శేర్ తికిరి విత్తువక్కోట్టమ్మా)** – మెఱపువలె తళతళా జ్వలించే సుదర్శనుని, **"ఎప్పోదుమ్ కైకఴలా నేమియాన్ నమ్మేల్ వినై కడివాన్"** (పెరియతిరు వన్దాది–87) (సదా చేతిలో సుదర్శనాన్ని కలవాడు మన పాపాలను తొలగిస్తాడు) అనే రీతిలో నన్ను సంస్కరించి, రక్షించడంకోసం చేతిలో ధరించి, విత్తువక్కోడు లోకి వచ్చి వేంచేసి ఉండే స్వామీ!

**(మాయత్తాల్)** – **"నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్"** అనే దృష్టాంతంలో ఉన్నదానికి తగినట్లు, "నీ ఆశ్చర్యకరమైన సంకల్పంతో నన్ను పురస్కరించుకొని నీవు నన్ను తిరస్కరించినా" అని కొన్ని పదాలను అధ్యాహారం చేసికొని అర్థాన్ని గ్రహించాలి. నన్ను రక్షించడంకోసం శ్రీహస్తంలో సుదర్శనాన్ని ధరించి ఉన్నవాడవు కనుక, నీవు నన్ను గర్హించి, తిరస్కరించడం కూడా నీవు నన్ను సంస్కరించడం కోసమే అయిఉండాలి– అని భావం. **"మాయా వయునం జ్ఞానమ్"** అనే నిఘంటువునుబట్టి ఇక్కడ **'మాయా'** శబ్దం భగవానుని సంకల్పరూపం అయిన జ్ఞానాన్ని తెలుపుతుంది.

**(నిన్నైయేతాన్ వేణ్డి... నిఱ్పన్ అడియేనే)** తనను గర్హించి కాదన్న ప్రపన్నుని వద్దకు, సంపద స్వయంగా అన్వేషించి వచ్చి పొందేటట్లే, నీవు నన్ను గర్హించి, తోసివేసినా, తోసివేసినా నిన్నే ఇంకా ఇంకా దృఢంగా ఆశ్రయిస్తున్నాను– అని అంటున్నారు. **"నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్ తన్నైయే తాన్ వేణ్డుమ్ శెల్వమ్పోల్"** అనే ప్రయోగానికి మోక్షసంపదను కోరకుండా శ్రీరామచంద్రునే కోరిన హనుమానునివలె, మోక్షసంపదను కాదని శ్రీరంగనాథునే కోరిన తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లవలె ఉండే అధికారులను, మోక్షసంపద తానే వచ్చి పొందుతుంది– అని అరుంబదవివరణంలో అర్థం తెలుపబడింది. ఈ వివరణంలో **"మాయత్తాల్"** అని ప్రారంభమయే దార్ష్టాంతికంతో దృష్టాంతం పొసగదు.

**విత్తువక్కోట్టమ్మా! నీ వేణ్డాయే యాయిడినుమ్,**
**మఱ్ఱారుమ్ పఱ్ఱిలేనెన్ఱు అవనైత్తాళ్ నయన్ద,**
**కొఱ్ఱవేల్ తానై కులశేకరన్ శొన్న**
**నఱ్ఱమిఴ్ పత్తుమ్ వల్లార్ నణ్ణార్ నరకమే** 10

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

విత్తుక్కోడు అమ్మా = విత్తువక్కోడులో వేంచేసి ఉండే సర్వేశ్వరా!, నీ వేణ్డాతే ఆయిడినుమ్ = నీవు నన్ను అభిలషించకపోయినా, మఱ్ఱు ఆరుమ్ పఱ్ఱు ఇలేన్ ఎన్ఱు = ఇక ఎవరిని నేను శరణు పొందను అని, అవనై తాళ్ నయన్ద = ఆ సర్వేశ్వరుని శ్రీచరణాలలో అభినివేశంతో, కొఱ్ఱమ్ వేల్ తానై = విజయాన్నే ఇచ్చే వేలాయుధాన్ని, సేనను కల వారైన, కుల శేకరన్ శొన్న= కులశేఖరాఴ్వార్లు అనుగ్రహించిన, నల్

తమిళ్ఴ్ పత్తుమ్= అర్థగౌరవాన్ని కల ద్రావిడపాశురాలు పదింటిని, వల్లార్ = అభ్యసించగల్గిన వారు, నరకమ్ నణ్ణార్ = (క్రూరపాపాలను చేసినా) ఈ సంసారంలోకి వచ్చి జన్మించరు.

**వ్యా :- పత్తామ్బాట్టు. (విత్తువక్కోట్టమ్మా నీ వేణ్ణాయేయాయిడినుమ్) ఇతుక్కెన్ఱు వన్దిరుక్కిఱ నీ ఎన్నై ఉపేక్షిత్తాయేయాకిలుమ్. (మఱ్ఱారుమ్ పఱ్ఱిలే నెన్ఱవనైత్తాళ్ నయన్ద) "వేఱొరు పుకలిల్లై, నాన్ అనన్యగతి" ఎన్ఱు అవన్టిరువడికళై యాశైప్పట్టు. (కొఱ్ఱ వేల్ తానై క్కు లశేకరన్ శొన్న) ప్రతిపక్షత్తై ప్పక్కవేరోడే వాఙ్గవుమ్వఱ్ఱాన వెఱ్ఱిమైయుడైయ వేలైయుమ్, సేనైయైయుముడైయ పెరుమాళ్ శొన్నవై. ప్రతిపక్షత్తై వెల్లుకైక్కీడాన పరికరముడైయరానాప్పోలేయాయ్త్తు, భగవత్ప్రాప్తిక్కు ప్పరికరమాక ఇవరుడైయ అనన్యగతిత్వముమ్. (నల్ తమిళ్ఴ్ పత్తుమ్ వల్లార్) కడల్ పేరాళ్ఴమా యిరుక్కచ్చెయ్తే ఉళ్ళుళ్ళ పదార్థఙ్గళ్ తోఱ్ఱుమ్బడియాయిరుక్కుమాపోలే అర్థమ్ మిక్కిరుక్కుమాయ్త్తు ఇత్తిరుమొళ్ఴి. ఇవై వల్లవర్కళ్. (నణ్ణార్ నరకమే) సంసార సమ్బన్ధత్తుక్కడియాన పాపత్తై ప్పణ్ణినార్కళాకిలుమ్ ఇస్సంసారత్తిలే వన్దు ప్రవేశియార్కళ్.**

**పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్**

**పెరుమాళ్ తిరుమొళ్ఴి అఞ్జామ్ తిరుమొళ్ఴి వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు**

**భావదీపిక :- అవ:-** నీవు నన్ను గర్హించి తిరస్కరించినా, వేఱెవ్వరు నాకు గతి లేరు- అని భగవానుని శ్రీచరణాలను తాము ఆశ్రయించిన విషయాన్నిగూర్చి ఆళ్ఴ్వార్లు పల్కిన దశకాన్ని అభ్యసించేవారికి మఱుజన్మ కలుగదు- అని ఫలాన్ని పల్కి ఆళ్ఴ్వార్లు ఈ దశకాన్ని నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (విత్తువక్కోట్టమ్మా! నీ వేణ్డాయే యాయిడినుమ్)** - విత్తువక్కోడులో నన్ను రక్షించడం కోసమే వేంచేసి ఉండే నీవు నన్ను కాదనే అవకాశం లేదు. ఆవిధంగా ఒకవేళ నన్ను సంస్కరించడంకోసంగా నన్ను నీవు తొలగదోసినా.

**(మఱ్ఱారుమ్ పఱ్ఱిలేన్ ఎన్ఱు అవనై త్తాళ్ నయన్ద)** - "నాకు వేఱు శరణం లేదు. నేను అనన్యగతిని" అని పల్కి అతని శ్రీచరణాలను అభిలషించిన

**(కొఱ్ఱవేల్తానై క్కులశేకరన్ శొన్న)** - శత్రువులను జయించి, విజయాన్ని అందించే వేలాయుధాన్ని, సేనను కల కులశేఖరప్పెరుమాళ్ పల్కిన ఈ దశకం అని భావం. శత్రువులను జయించడానికి వేలాయుధం, సేన సహాయంగా ఉండేటట్లే, భగవానుని పొందడానికి వేఱు గతిలేనందువల్ల అనన్యగతిత్వం వీరికి సహాయభూతంగా ఉన్నదని భావం.

**(నఱ్ఱమిழ் పత్తుమ్ వల్లార్)** – సముద్రం ఎంతో లోతును కల్గి ఉన్నా, దాని లోపల ఉండే ముత్యాలు మొదలైన వస్తువులు స్వచ్ఛంగా ప్రకాశించేటట్లే, సులభమైన ద్రావిడపదాలతో కూడిన ఈ దశకంలో చాలా గొప్ప అర్థాలు నిండుగా పొదగబడి ఉన్నవి. దీనిని చక్కగా అభ్యసించగల్గినవారు.

**(నణ్ణార్ నరకమ్)** – ఈ సంసారమండలంలో పరిభ్రమించడానికి కారణం అయిన పాపాన్ని చేసినవారైనా, తిరిగి ఇక్కడకు వచ్చి జన్మించరు. ఇక్కడ నరకం అన్నది నరకంకంటే క్రూరమైన బాధను కల్గించే ఈ సంసారాన్ని నిర్దేశిస్తుంది.

**పెరుమాళ్ తిరుమొழி - అఞ్జామ్ తిరుమొழி వ్యాఖ్యానానువాదం ముగిసింది.**

## ఆఱామ్ తిరుమొழி - ఏర్ మలర్ - ప్రవేశమ్.

**అవ :– (ఉకన్దరుళిన దేశత్తై అనుభవిత్తార్ - కీழ். అవ్వనుభవమ్ అవతారఙ్గళిల్ అనుభవాపేక్షైయై ప్పిఱప్పిత్తతు. అతిల్ తోళ్తీణ్డియాన కృష్ణావతారత్తై అనుభవిత్తవర్ కళుడైయ పాశురత్తాలే అనుభవిక్కిఱార్) ఇత్తలైయాల్ పేఱు శెయ్యలావతు ఇల్లామైయాల్ కిలాయ్క్క త్తొడఙ్గినార్. భగవద్విషయత్తిల్ భావబన్ధత్తిల్ ఊఱ్ఱమిరున్దపడి పిరాట్టి మార్దశైయై ప్రాప్తరాయ్ క్కూడువతు పిరివతు ఊడువతామ్బడియానార్. నమ్మాழ்వారుక్కు "మిన్నిడైమడవారుమ్", తిరుమఙ్గైయాழ்వారుక్కు "కాతిల్ కడిప్పు" మ్బోలే యిరుక్కిఱ తాయ్త్తు ప్పెరుమాళుక్కు ఇత్తిరుమొழி.**

**నమ్మాழ்వార్ భగవద్విషయత్తిల్ నిన్ఱ ఊఱ్ఱ మెల్లామ్ తోఱ్ఱ వన్మైయుడైత్తా యిరుక్కుమ్ "మిన్నిడైమడవార్". తిరుమఙ్గైయాழ்వార్ తమ్ మార్దవ మెల్లామ్ తోఱ్ఱ మెన్మైయుడైత్తాయిరుక్కుమ్ "కాతిల్ కడిప్పు". ఇవర్తమ్ముడైయ రాజకుల మెల్లామ్ తోఱ్ఱి యిరుక్కుమ్ ఇత్తిరుమొழி. కృష్ణావతారమ్ తోళ్తీణ్డియాకైయాలే "ఒరు శెవ్వాయ్క్కిழமై ముళ్పడ ప్పెఱ్ఱిలోమ్; పల్లిలేపట్టు త్తెఱిత్తతు" ఎన్ఱు పఞ్చలక్షమ్ కుడియిల్ పెణ్గళుక్కు కృష్ణన్ పక్కలుళ్ళ విడాయెల్లామ్ తమక్కొరువర్క్కు ముణ్డాకైయాలే తిరువాయ్ప్పాడియిల్ పెణ్గళ్ పేచ్చాలే పేశుకిఱార్.**

*అరు :– ఏర్ మలర్ ప్రవేశే. అవర్కళూడలుక్కుమ్, ఇవర్కళూడలుక్కుమ్ వాశి ఏతు? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (నమ్మాழ்వారిత్యాది). (వన్మై) నెఞ్జిల్ కాఠిన్యమ్. "పోకు నమ్బి", "కழகమేఱేల్ నమ్బి" ఎన్ఱు – కాఠిన్యమ్ తోఱ్ఱ చ్చొల్లుకై. (మార్దవమ్) వెట్టిమైయాయిరాతే, "ఇతువెన్? ఇతువెన్నో" ఎన్ఱు – మృదువాక చ్చొల్లుకై. (రాజకులమ్) "ఉన్ వరవు పార్త్తే" ఎన్ఱు తన్ మతిప్పు త్తోఱ్ఱ చ్చొల్లుకై. అవతారాన్తరఙ్గళిరుక్క కృష్ణావతారత్తిలే ఊడువానెన్? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (కృష్ణావతారమిత్యాది).*

## ఆఱవ దశకం- ప్రవేశం - అనువాదం

**భావదీపిక :-** భగవానుడు అభిమానించే అర్చావతారదివ్యదేశాలలైన శ్రీరంగాన్ని, తిరుమలను, తిరువిత్తువక్కోడును గత దశకాలలో అనుభవించారు. ఆ అనుభవంవల్ల అర్చావతారాలు అధికంగా ఉండే ఈ కలియుగానికి అత్యంతసన్నిహితం అయిన శ్రీకృష్ణావతారాన్ని అనుభవించాలని ఈ ఆழ్వార్లకు ఆశ కల్గింది. అందువల్ల శ్రీకృష్ణుని అధికంగా అనుభవించిన నమ్మాழ్వార్ల **"మిన్నిడై మడవార్"** (తిరువాయ్-6-2) అనే దశకంలోని అనుభవంవంటి అనుభవాన్ని ఈ తిరుమొழிతో శ్రీకృష్ణుని అనుభవిస్తున్నారు. గత దశకంలో భగవానుని పొందడానికి తమకు వేఱు గతి లేదు- అనే అర్థాన్ని అనుసంధించి బాధపడ్డారు. అయితే, అతనిని అనుభవించాలిఅనే అభిలాష చాలా ఎక్కువగా కల్గినందువల్ల పిరాట్టి దశను పొంది శ్రీకృష్ణునితో కలిసి విశ్లేషించి, ప్రణయకలహం చేసే గోపికల మాటలవంటి మాటలను ఈ దశకంలో కులశేఖరులు పల్కుతున్నారు.

**"మిన్నిడై మడవార్"** (తిరువాయ్-6-2) అనే తిరువాయ్మొழிలో నమ్మాழ్వార్లు శ్రీకృష్ణునితో ప్రణయకలహం చేసే గోపికల స్థితిని పొంది,పాడారు. తిరుమజ్గై ఆழ్వార్లు **"కాదిల్ కడిప్పు"** (పెరియతిరు-10-8) అనే దశకంలో అదే స్థితిని పొంది పాడారు. ఈ దశకం కులశేఖరప్పెరుమాళ్ అదే స్థితిని పొంది, అనుగ్రహించే పాశురాల సమాహారం. నమ్మాழ్వార్లు తమకు శ్రీకృష్ణునిపట్ల గల అభినివేశం అంతా స్ఫురించేటట్లు **"పోకు నమ్బీ"** (6-2-1) (నమ్బీ! వెళ్ళిపో), **"కழகమేఱేల్ నమ్బీ!"** (6-2-5) (నమ్బీ! అబద్ధపుమాటలతో బాధించకు), **"ఒరు నాన్తు తడి పిణక్కే"** (6-2-7) (ఒకనాడు కర్రతో కలహించేటట్లుగా కాగలదు) అని చాలా కఠినంగా పలికారు. తిరుమజ్గైయాప్వార్లు తమ మనస్సులో ఉండే మార్దవం అంతా స్ఫురించేటట్లు **"ఇతువెన్! ఇతువెన్? ఇతువెన్నో?"** (పెరియతిరు-10-8-8) (ఇదేమి, ఇదేమి, ఇదేమి) అని మృదువుగా పలికారు. వీరు తాము రాజకులంలో పుట్టినవారు అనే విషయం తోచేటట్లు **"వాశుతేవా! ఉన్ వరవు పార్త్తే"** అని తమ ఆభిజాత్యగౌరవంతోచేటట్లుగా ఇక్కడ పల్కుతున్నారు.

కలియుగంలో ఈ ఆழ்వార్లు అవతరించారు కనుక, ద్వాపరయుగం చివరలో వేంచేసి ఉన్న శ్రీకృష్ణావతారం, అవతారాలలో వీరికి అత్యంత సమీపం అయినది. ఒక మంగళవారాన్ని (కొంచెం కాలం) ముందుగా పొందలేకపోయామే! ఆహారం పళ్ళకు చిక్కి నోటిలోనుండి జారిపోయినట్లుగా, కొంచెం కాలానికి ముందు ప్రవర్తించిన శ్రీకృష్ణావతారాన్ని అనుభవించడానికి వీలులేకపోయిందే!" అనే ఆర్తిని కలవారైనందువల్ల రేపల్లెలో ఉండే అయిదు లక్షల ఇళ్ళలోని గోపికలు శ్రీకృష్ణుని విషయంలో పొందిన ప్రేమ అంతా, వీరిక ఒక్కరివద్దనే కల్గినందువల్ల, రేపల్లెలోని గోపికలమాటలతో ఈ దశకాన్ని పల్కుతున్నారు.

**ఏర్ మలర్ ప్పూజ్గు*ళ*ల్ ఆయర్ మాతర్ ఎనై ప్పలరుళ్ళ ఇవ్వూరిల్, ఉన్తన్**
**మార్వు త*ళు*వుతఱ్కు ఆశై యిన్మై అతిన్దతిన్దే ఉన్తన్ పొయ్యై క్కేట్టు,**
**క్కార్ మ*ళై*పోల్ పనిక్కూతలెయ్‌తి క్కూశి నడుజ్గి యమునైయా*ఱ్ఱి*ల్,**
**వార్ మణఱ్కున్ఱిల్ పులరనిన్తేన్ వాశుతేవా! ఉన్ వరవు పార్త్తే** **1**

వాశుతేవా = ఓ వసుదేవుని కుమారా!, ఏర్ మలర్ పూ కు*ళ*ల్ ఆయర్ మాతర్ = అందమైన మాలను అలంకరించుకొన్న, సువాసనతో కూడినవైన కేశాలను కల గోపికలు, ఎనై పలర్ ఉళ్ళ = ఎంతమందో ఉండే, ఇ ఊరిల్ = ఈ రేపల్లెలో, ఉన్ తన్ మార్వు త*ళు*వుతఱ్కు = నీ వక్షస్సును ఆలింగనం చేసికోవడానికి, ఆశై ఇన్మై అఱిన్దు అఱిన్దే = ఆశలేక పోవడాన్ని చక్కగా తెలిసికొన్న, ఉన్‌తన్ పోయ్యై కేట్టు = నీ అసత్యం అయిన మాటలను విని, కూర్ మ*ళై*పోల్ పని కూతల్ ఎయ్‌తి = పెద్ద వర్షంవలె కురుస్తున్న మంచువల్ల ఏర్పడిన చల్లదనంలో చిక్కుకొని, కూశి = (ఎవరు చూస్తారో? ఏమో! అని) జంకి, నడుజ్గి = (భయంవల్ల, చలివల్ల) వణకి గడగడలాడి, యమునై ఆ*ఱ్ఱి*ల్ = యమునానదిలో, వార్ మణల్ కున్ఱిల్ = పెద్ద ఇసుకతిన్నెలో, ఉన్ వరవు పార్త్తు = నీ రాకను ఎదురు చూచి, పులర నిన్తేన్ = పొద్దు పొడిచేవరకు నిలచి ఉన్నాను.

**అవ :- ముతఱ్పాట్టు. ఒరు పిరాట్టి, “యమునైయిల్ మణలిలే; పోయ్ నిల్లు, నాన్ అజ్గే వరుకిఱేన్” ఎన్ఱు శొల్లివిడ, అవళ్ అజ్గే పోయ్ విడియుమళవుమ్ నిన్ఱు, అవన్ వరక్కాణామైయాలే అవనై క్కణ్డపోతు ఊడి చ్చొల్లుకిఱ వార్త్తైయాయిరుక్కిఱతు.**

**వ్యా :- (ఏర్‌మలర్ ప్పూజ్గు*ళ*లాయర్ మాతర్) అ*ళ*కియ మలరైయుడైత్తాయ్, మలరుక్కుజ్గాడ నా*ఱ్ఱ*త్తై క్కొడుక్కుమ్ మయిర్ముడియైయుడైయ ఇడైప్పెణ్గళ్. (ఎనై ప్పలరుళ్ళ వివ్వూరిల్) అనేకమ్ పేర్ తిరళాన ఇవ్వూరిల్– తిరువాయ్‌ప్పాడియిల్. (ఉన్తన్ మార్వు త*ళు*వుతఱ్కాశైయిన్మై యతిన్దతిన్దే) “అనేకమ్ పెణ్గళుళ్ళ ఊరుమాయ్‌నీయుమ్ సర్వసాధారణనుమానాల్ ఉన్మార్వై యాశైప్పడక్కడవతన్ఱు” ఎన్ఱు అఱిన్దువైత్తు. (ఉన్తన్ పొయ్యై క్కేట్టు) ఉన్ స్వరూపత్తై ఉణరవొట్టాతితే ఉన్ వార్త్తై. “నీయల్లతు పుకలుణ్డో? ఉన్నై యల్లతు నానఱివేనో?” ఎన్ఱు తా*ళ్*న్ఱు తోన్ఱ నీ శొల్లుమ్ వార్త్తైయై క్కేట్టు.**

**(కూర్ మ*ళై*పోల్ పని క్కూతలెయ్‌తి) మిక్క మ*ళై*పోలే పెయ్‌కిఱ పనియాల్ వన్ద కుళిరిలే అకప్పట్టు. (కూశి) “ఆర్ కాణ్గిఱార్‌కళో” ఎన్ఱు కూశి. (నడుజ్గి) అచ్చత్తాలుమ్, కుళిరాలుమ్ నడుజ్గి. (యమునైయా*ఱ్ఱి*ల్) అతుతాన్ ఏకాన్తస్థలత్తిలేయో? సర్వసాధారణ మాన దేశత్తిలేయన్నో! (వార్ మణల్ కున్ఱిల్ పులరనిన్తేన్) నిన్ఱతుతాన్ తనియే నిఱ్కలామ్ దేశత్తిలే నిన్తేనో?, భోగత్తుక్కు ఏకాన్తస్థలత్తిలేయన్నో? ఎల్లారుమ్ వన్దు సఞ్చరిత్తు క్కాణుమ్బోతు సర్వసాధారణమాన దేశత్తిలే వన్దాళ్ ఎన్ఱిరామే భోగత్తుక్కేకాన్తమాన**

**మణఱ్కున్ఱిలే విడియు మళవుమ్ నిన్ఱాళ్ ఎన్నుమ్బడి తోర్ఱ్ర నిన్ఱేన్. (వాశుదేవా) నీ ఇఙ్గు నిఱ్కిఱ తెన్? ఎన్నిల్, ఉన్నై విశ్వసిత్తన్ఱు; ఉన్ పితావై విశ్వసిత్తు. ఒరు వార్త్తై యల్లతఱియాత శ్రీవసుదేవర్ పిళ్ళై ఎన్నుమత్తై విశ్వసిత్తు నిన్ఱేన్. (ఉన్ వరవు పార్త్తే) ఉన్నుడై యழகు కాణవేణు మెన్నుమ్ నశైయాలే.**

***అరు :- ముతఱ్పాట్టు. (ఏర్ మలరిత్యాది), (పూఙ్గుழల్) అழகాయ కుழల్. కుழలుక్కు అழகు పరిమళమ్. "ఆశైయిన్మై" - ఆశైప్పడ యోగ్యతైయిల్లామై. ఆఱిన్దాల్ ఆశైప్పడు వానెన్? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (ఉన్ స్వరూపత్తై యిత్యాది).***

***"పనిక్కూతల్" - పనియాల్ వన్ద ఊతల్. వార్తల్ - నెడుమైయుమాకైయాలే - పెరియమణఱ్కున్ఱు- ఎన్ఱపడి. "పులర" - విడియుమళవుమ్.***

**భావదీపిక:- అవ:-** శ్రీకృష్ణుడు ఒక గోపికతో "యమునానదీ తీరంలో ఇసుకతిన్నెపై నిలచి ఉండు. నేను అక్కడకు వస్తాను" అని అన్నాడు. ఆమె అక్కడకు పోయి తెల్లవారేవరకు వేచి ఉన్నా, అతడు రానందువల్ల, ఆమె తరువాత అతనిని చూచినపుడు ప్రణయరోషం తల ఎత్తి ఆ ప్రణయకలహంతో పలికే మాటలుగా ఈ దశకం అనుగ్రహింపబడింది.

**వ్యాఖ్యానం :- (ఏర్‌మలర్ పూఙ్కుழల్ ఆయర్‌మాతర్)** - అందమైన పూలను కల్గినదై, పూవుకుకూడ సువాసనను కల్గించే అందమైన కేశపాశాన్ని కల గోపికలు.

**(ఎనైప్పలర్ ఉళ్ళ ఇవ్వూరిల్)** - పలువురు గుమిగూడి ఉండే ఈ రేపల్లెలో.

**(ఉన్‌తన్ మార్వు తழுవతఱ్కు ఆశై యిన్మై అఱిన్దు అఱిన్దే)** - ఈ ఊరు పలువురు కన్యలను కల్గినది. నేను ఒక్కతెనే నీ వక్షస్సును ఆలింగనం చేసికోవాలని ఆశపడడం తగినది కాదు" అని తెలిసినా.

**(ఉన్ తన్ పొయ్యై క్కేట్టు)** - నీవు పల్కిన ఈ అసత్యమైనమాట అందఱికీ సమానుడవు- అనే నీ స్వరూపాన్ని తెలియలేనట్లు చేసివేసింది. ఆ మాట ఏది ? అని అంటే, "నీవుతప్ప నాకు వేఱు కాలక్షేపం ఉన్నదా? నీవుతప్ప ఇంకొకతె నాకు తెలుసునా?" అని నాకు విధేయుడవై ఉండేవానివలె నీవు పల్కిన మాటను విని.

**(కూర్ మழைపోల్ పనిక్కూతల్ ఎయ్‌తి)** - పెద్ద వర్షంవలె కురిసే మంచువల్ల కల్గిన చలిలో చిక్కుకుని,

**(కూశి)** - "నేను ఇక్కడకు వచ్చి నీకోసం వేచి ఉండడాన్ని ఎవరైనా చూడబోతారు" అని భయపడి,

**(నడుఙ్గి)** - భయంవల్ల, చలివల్ల వణకి,

**(యమునై ఆర్గ్రిల్)** – అదికూడా ఎవరూ తెలియని ఒక ఏకాంతప్రదేశంలో నా ఉన్నాను! అందులోను వచ్చిపోయే నదిఇసుక తిన్నెలో కదా వచ్చి నిలుచున్నాను.

**(వార్ మణల్ కున్ఱిల్ పులరనిన్ఱేన్)** – ఆ విధంగా నిలుచునే ఉన్నాను. ఒంటరిగా ఉండవలసిన ఇరుకువీధిలో నిలుచున్నానా ! అందఱూ కలసి క్రీడించి ఆనందించడానికి తగిన పెద్దనది తీరంలోని ఇసుకమేటపైకదా నిలుచున్నాను. అందఱు వచ్చి తిరిగే చోటు అయినందువల్ల **"ఈమెకూడా వచ్చింది"** అని తలవడానికి వీలులేకుండా, శ్రీకృష్ణునితో కలిసి ఆనందించడంకోసం ఇసుకతిన్నెపై ఉదయకాలంవరకు నిలుచున్నది– అని తెలిసేట్లుకదా నిలుచున్నది.

**(వాశుతేవా)** – వసుదేవుని కుమారా! అని భావం. నీవు ఇక్కడ ఎందుకోసం నిలుచున్నావు? అనే ప్రశ్న రాగా, అసత్యం పలికే నీపట్ల నమ్మికను కల్గి నిలుచున్నదానను కాను. అసత్యం తెలియనివారై, ఎల్లప్పుడూ నిజాన్నే పలికే వసుదేవుని పుత్రుడవు అయినందువల్ల "నీవు కూడా నిజాన్నే పల్కుతున్నావు" అని నమ్మి నిలుచున్నాను.

**(ఉన్ వరవు పార్త్తే)** – నీ అందాన్ని దర్శించాలి అనే ఆశతో ఈ విధంగా నిలుచున్నాను.

**కెణ్డై యొణ్కణ్ మదవాళొరుత్తి కీழ్ై యకత్తు త్తయిర్ కడైయ**
**క్కణ్డు, ఒల్లై నానుమ్ కడైవనెన్ఱు కళ్ళవిழ்యై విழித్తుప్పుక్కు,**
**వణ్డమర్ పూఙ్గుழల్ తాழ்న్దులావ వాణ్ ముకమ్ వేర్ప్ప చ్చెవ్వాయ్ తుడిప్ప,**
**త్తణ్డయిర్ నీ కడైన్దిట్ట వణ్ణమ్ తామోతరా! మెయ్యఱివన్ నానే 2**

తామోతరా = తామోతరా!, కీழ்ై అకత్తు = నా ఇంటికి తూర్పుదెసలో ఉండే ఇంటిలో, కెణ్డై ఒణ్ కణ్ = బేడిసచేపలవంటి కాంతి నిండిన కన్నులను కల్గినదై, మదవాళ్ ఒరుత్తి = ఒక అందమైన వనిత, తయిర్ కడైయై క్కణ్డు = ఒంటరిగా పెరుగును చిలుకడాన్ని చూచి, నానుమ్ = నేనుకూడా, (నీతోపాటు) ఒల్లై కడైవన్ ఎన్ఱు = శీఘ్రంగా చిలికి ఇస్తాను – అని పల్కి, కళ్ళమ్ విழ்యై విழித్తు = దొంగ చూపులను చూచి, పుక్కు = ఆమె దగ్గరకు చేరి, ప్రవేశించి, వణ్డు అమర్ పూ కుழల్ = తుమ్మెదలు అమరి ఉండే పూలు అలంకరించుకొన్న కేశపాశం, తాழ்న్దు ఉలావ = చాలా కిందకు వేలాడుతూ, అటు ఇటు కదలాడేటట్లు, వాళ్ ముకమ్ వేర్ప్ప = కాంతి నిండిన ముఖంలో స్వేదం అంకురించేట్లు, శెమ్ వాయ్ తుడిప్ప = ఎఱ్ఱని పెదవులు అదిరేటట్లు, తణ్ తయిర్ = చల్లని పెరుగును, నీ కడైన్దిట్ట వణ్ణమ్ = నీవు చిలికిన తీరులోని, నాన్ మెయ్ అఱివన్= నేను సత్యాన్ని తెలియగలను.

**ఇరణ్డామ్పాట్టు. అవ :– వేఱొరు పిరాట్టి వార్తై.**

వ్యా :- (కెణ్డై యొణ్ కణ్ మడవాళొరుత్తి) ముగ్ధమాన నోక్కై యుడైయళాయ్, శొల్లిற్றెల్లామ్ మెయ్యెన్టిరుక్కుమ్ పరువత్తై యుడైయాళొరుత్తి. (కీழ்ழையకత్తు) భావనాప్రకర్షత్తాలే తిరువాయ్ప్పాడియిల్ ఒరు అకముణ్డాయ్, అతుక్కు కీழ்ழ் యకము మాయ్ చ్చెల్లుకిఅతుకాణుమ్ ఇవర్క్కు. "నీతాన్ మూలైయడియే నడన్దతు వేఱోరిడత్తేయో? ఎన్నకత్తుక్కు కీழ்ழయకత్తేయన్నో? (తయిర్ కడైయ క్కణ్డు) ఊరెజ్ఞుమ్ అడియొత్తి త్తిరియుమితే. "తనియే నిన్టు తయిర్ కడైవారుణ్డో?" ఎన్టు, ఒరుత్తి తనియే నిన్టు తయిర్ కడైయక్కణ్డవాతే అలభ్యలాభమ్ పెற்றానాయ్ ఓడిచ్చెన్టు పుక్కాన్.

(ఒల్లై నానుమ్ కడైవనెన్టు) "నీ తనియే నిన్టు తయిర్ కడైయిల్ ఒరుకాలుమ్ వెణ్ణెయ్ ప్పట్టతాకమాట్టాతు. శడక్కెన వెణ్ణెయ్ పడువతు నానుమ్ ఒరుతలై పற்றி క్కడై యిలాయ్త్తు" ఎన్టు. "అన్టు తేవరశురర్ వాజ్ఞ" ఎన్టు పిఅర్ కైవిట్టాల్ కడైవతు పిఅర్ కార్యమాకిలితే. ఇజ్ఞు ఇవళుమ్ ఒరుతలై ప్పற்றిలితే తన్ప్రయోజనమావతు. (కళ్ళ విழிయై విழிత్తు ప్పుక్కు) ఇవన్ కళ్ళవిழி; అవళ్ కెణ్డై యొణ్ కణ్ మడవాళ్. నోక్కుమ్, నినైవుమ్, శెయలుమ్, శొల్లుమ్ ఒరుపడిప్పట్టిరుక్కుమ్ అవళుక్కు, ఇవనుక్కు నోక్కొరుపడియుమ్ నినైవొరుపడియుమ్, శొల్ ఒరు వడియుమ్, శెయల్ వేఱొరు పడియుమాయిరుక్కుమ్. ఇవన్ నోక్కాలే "ఎల్లామ్ మెయ్" ఎన్టు అవళ్ విశ్వసిత్తాళాయ్త్తు.

(వణ్డమరిత్యాది) మేల్ పణ్ణిన వ్యాపారజ్ఞళ్ ఒరు మహాభారతమితే. (వణ్డమర్ పూజ్ఞుழల్ తాழ்న్దులావ) ఉన్కుழలై విశ్వసిత్త వణ్డుకళ్ ఎన్పట్టనవో? (వాళ్ ముకమ్ వేర్ప్ప) తామరైయిలే ముత్తు ప్పడిన్దాప్పోలే ఒళియైయుడైయ ముకమ్ వేర్ప్ప. (శెవ్వాయ్ తుడిప్ప) అధరస్ఫురణమ్ పిఅక్క ఇవైయెల్లామ్ పుణర్చ్చిక్కుఱియితే. తమిழర్ "శునైయాడల్" ఎన్టు ఒరు కలవియై చ్చొల్లుమాపోలే. (తణ్డయిర్ నీ కడైన్దిట్టవణ్ణమ్) ఉన్నైఇజ్ఞుక్కు ప్పొరున్దిన తయిర్ కడైన్దపడి. ఇవళ్ శొన్నవాతే, "ఇజ్ఞనే యిరుప్పన శిల ఎనక్కు ఉణ్డో?", ఎన్న (తామోతరా మెయ్యఱివన్ నానే) ఉన్నుడమ్బిల్ తழும்బై మఱైక్కలామాకిలన్నో ఉన్ శెయల్కళై మఱైక్క లావతు.

*అరు :- ఇరణ్డామ్పాట్టు (కెణ్డై యిత్యాది). అవళోదే కూడవేణుమో? తానే తనియే కడైకిఅతుక్కు ఎన్? ఎన్న, అరుళిచ్చెయ్కిఅర్ (అన్టు తేవరిత్యాది).*

**భావదీపిక :- అవ :-** ఇంకొక గోపిక మాటలతో ఇందులో పల్కుతున్నారు. అందమైన నేత్రాలను కల్గినదై, నాయకుడు పల్కినది అంతా నిజమే అని భావించడానికి తగిన అణకువను (నాయకునకు లోబడి ఉండే స్వభావాన్ని) కల్గిన ఒక చిన్నగోపిక.

**వ్యాఖ్యానం :- (కీழ்ழై యకత్తు)** - తమను చిన్న గోపికగానే భావించడంవల్ల, ఆ భావనాప్రకర్షచేత రేపల్లెలో తమకు ఒక ఇల్లు ఇన్నట్లు, దానికి తూర్పున ఉండే ఇంటిలో జరిగిన వృత్తాంతాన్నిగూర్చి పల్కేటట్లు ఆழ்వార్లు అంటున్నారు. "నీవు ఈ విధంగా

మానం పోయేటట్లు తిరగడం వేఱెక్కడనో కాదు. నా ఇంటికి తూర్పు దిశలో ఉండే ఇంటిలోనేకదా చేశావు- అని అంటున్నారు. ఆ సంగతి ఏమి ? అని అంటే, దానిని ఇక వివరిస్తున్నారు.

**(తయిర్ కడైయై క్కణ్డు)** - తుంటరితనం చేయడంకోసం శ్రీకృష్ణుడు ఒంటరిగా ఉండి, ఎవరైనా పెరుగును చిలికేవారున్నారా? అని వెదకి తిరుగుతాడుకదా! ఆ విధంగా ఒకతె ఒంటరిగా ఉండి పెరుగును చిలుకడాన్ని చూచినవాడు అలభ్యలాభం పొందిన వానివలె అక్కడకు పరుగెత్తిపోయి ప్రవేశించాడు.

**(ఒల్లై నానుమ్ కడైవన్ ఎన్టు)** - "నీవు ఒంటరిగా ఉండి పెరుగును చిలికితే ఏ సమయానికీ వెన్నరాదు. త్వరగా వెన్నను ముద్ద చేయడంకోసం నేనుకూడా ఒక పక్కనిలచి చిలుకుతాను, ఉండు" అని అంటూ ప్రవేశించాడు. **"అన్టు తేవర్ అశురర్ వాజ్గ అలై కడల్ అరవ మళావి"** (తిరువాయ్ 7-1-7) (అపుడు దేవతలు, అసురులు మధించగా అలలు నిండే సముద్రంలో వాసుకిని చుట్టి) అనే రీతిలో దేవతలకు అమృతం ఇవ్వడం కోసం పాలకడలిని చిలికినపుడు అది పరుల కార్యం కనుక వారు సముద్రాన్ని చిలుకలేక చేయివిడచిన తర్వాతనే రెండు వైపులా రెండు రూపాలతో తానే నిలచి సముద్రాన్ని చిలికాడు. ఇక్కడ బాలగోపికలు అందాన్ని అనుభవించడం అనే తన స్వప్రయోజనం కోసంగా చిలుకుతున్నాడు కనుక, ఆమె ఒక వైపు, తానొక వైపు నిలచి పెరుగును చిలుకడం ఆరంభించాడు.

**(కళ్ళ విழிయై విழித్తు ప్పుక్కు)** - ఆ గోపిక **"కెణ్డై యొణ్ కణ్మడవాళ్"** కనుక ఆమె చూపు, మనసు, చేష్ట మాట పెరుగును చిలుకడంలోనే లగ్నమై ఉంటాయి. ఇతడు దొంగ చూపులు చూసేవాడు కాబట్టి, దొంగచూపులను చూస్తూ పెరుగును చిలుకడం అనే నెపంలో ఈమె అందాన్ని అనుభవించడానికి ప్రారంభించాడు కనుక, ఇతని చూపును, దొంగచూపును మాత్రంచూచి నిజంగానే ఇతడు పెరుగును చిలుకడంలో తనకు సహాయపడడంకోసం వచ్చాడని నమ్మింది. చూపు, భావన, పని, మాట ఒకేవిధంగా ఉంటాయి ఆమెకు. ఇతనికి చూపు ఒకవిధంగా, భావన ఇంకొకవిధంగా, మాట వేఱొక విధంగా, పని వేఱొక విధంగా ఉంటాయి.

**(వణ్డమర్ పూఙ్కుழల్ తాழ్న్దులావ వాళ్ ముకమ్ వేర్ప్ప చ్చెవ్వాయ్ తుడిప్ప)** - పెరుగును చిలికేటపుడు ఇతడు ఆమెను ఆకర్షించడంకోసం చేసిన చేష్ట కనుక, తుమ్మెదలు ధ్వనించే పూలు అలంకరించుకొన్న తన కేశబంధం కిందకు జారి, అటు ఇటు కదలాడేటట్లు, కాంతి నిండిన ముఖం స్వేదస్విన్నం అయేటట్లు, ఎఱ్ఱని పెదవులు కంపించేటట్లు పెరుగును చిలికాడు. ఇతడు చేసిన చేష్టలు అన్నీ వివరిస్తే ఇంకొక మహాభారతం అవుతుంది.

**(వణ్డమర్ పూఙ్కుழల్ తాழ్న్దు ఉలావ)** – తన కేశబంధాన్ని ఆశ్రయంగా తలచి నిలచిన తుమ్మెదలు ఏమి పాట్లు పడ్డాయో !

**(వాణ్ ముకమ్ వేర్ప్ప)** – తామరలో ముత్యాలు పుట్టినట్లుగా కాంతిని కల ముఖపద్మంలో స్వేదబిందువులు జనించాయి.

**(శెవ్వాయ్ తుడిప్ప)** – పెదవులు అదరగా– అని భావం. ఇవి అన్నీ నాయకుడు నాయకిని అనుభవించేటపుడు కలిగే గుర్తులు కదా! ద్రావిడ గ్రంథాలలో నాయకుడు, నాయకి కలసి అనుభవించడాన్ని **"శునైయాడల్"** అని అంటారు. అటువంటిదొక అనుభవం సంభవించిందని ప్రకృతభావం.

**(తణ్ తయిర్ నీ కడైన్దిట్ట వణ్ణమ్)** – పెరుగును చిలుకడం కోసం ప్రారంభించి, నీ ఆశకు అనుగుణంగా బాలగోపికలతో నీవు ప్రవర్తించిన ప్రవర్తనలను అన్నిటిని. ఈ పాశురాన్ని పాడే బాలగోపిక ఈ విధంగా అనగానే– "నీవు నాపైన నింద మోపుతున్నావు. ఈ విధంగా ఏమీ నేను చేయలేదే" అని శ్రీకృష్ణుడు అనగా,

**(తామోతరా! మెయ్యఱివన్ నానే)** – **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"**తో నిన్ను నీ తల్లి కట్టినపుడు ఏర్పడ్డ కిణాన్ని మఱుగుపఱుచుకొనగల్గితే, ఈ నీ చేష్టలను కూడా దాచుకోవచ్చు– అని అంటున్నది గోపిక. (**"తామోతరన్"** –దారంతో నడుమున కట్టబడ్డవాడు).

**కరు మలర్ క్కూన్దలొరుత్తితన్నై క్కడైక్కణిత్తు, ఆఙ్గే యొరుత్తితన్పాల్**
**మరువి మనమ్ వైత్తు మఱ్ఱొరుత్తి క్కురైత్తు ఒరుపేతైక్కు ప్పొయ్ కుఱిత్తు,**
**ప్పురికుழల్ మఙ్గై యొరుత్తితన్నై ప్పుణర్తి అవళుక్కుమ్ మెయ్యనల్లై,**
**మరుతిఱుత్తాయ్! ఉన్ వళర్త్తియూడే వళర్కిన్ఱతాల్ ఉన్తన్ మాయైతానే 3**

మలర్ = పూలతో కూడిన, కరు కూన్దల్ = నల్లని కేశబంధాన్ని కల్గిన, ఒరుత్తి తన్నై= ఒక గోపికను, కడై క్కణిత్తు = క్రీగంటిచూపులతో చూచి, ఆఙ్గే = ఆ విధంగా ఉండగానే, ఒరుత్తితన్ పాల్ = వేఱొక స్త్రీ వైపు, మనమ్ మరువి వైత్తు = మనస్సును పొందికగా నిలిపి, మఱ్ఱు ఒరుత్తిక్కు = వేఱొక స్త్రీకి, ఉరైత్తు= "నీ దాసుణ్ణి నేను" అని పల్కి, ఒరు పేదైక్కు = ఏమీ తెలియని ఒక కన్యకకు, పొయ్ కుఱిత్తు = (ఇక్కడ నాకోసం కాచుకొని ఉండు) అని అసత్యమైన చోటును నిర్దేశించి, పురి కుழల్ మఙ్గై ఒరుత్తి తన్నై = అందమైన కేశపాశాన్ని కల ఒక చిన్ని కన్నియతో, పుణర్త్తి = కలిశావు, అవళుక్కుమ్ = ఆ కన్యకు కూడా, మెయ్యన్ అల్లై = అసత్యాన్నే పలికావు, మరుతు ఇఱుత్తాయ్ = (చిన్నవయస్సులోనే) రెండు మద్దిచెట్లను విఱిచి కూలగొట్టినవాడా !, ఉన్ వళర్త్తియూడే = నీ వయస్సు పెరుగుతున్నకొద్దీ, ఉన్తన్ మాయై =నీ దొంగతనం, వళర్కిన్ఱతు ఆల్ = అయ్యో ! వృద్ధిచెందుతున్నదే !

**అవ :- మూన్ఱామ్బాట్టు. వేఱొరుత్తి వార్త్తై.**

**వ్యా :- (కరు మలర్ కూన్దలొరుత్తితన్నై క్కదైక్కణిత్తు) నెయ్త్తిరుణ్డు పూవైయుడై త్తాయిరుక్కిఱ మయిర్ ముడియైయుడైయాళొరుత్తియై తాన్ అవళ్ మయిర్ ముడియిలే తోఱ్ఱమై తోఱ్ఱ చ్చిఱాఙ్గణిత్తు ప్పార్త్తు. నేరే పార్త్తానాకిలితే "పొతు నోక్కు" ఎన్ఱిరుక్కలావతు. (అఙ్గే యొరుత్తిన్బాల్ మరువి మనమ్ నైత్తు) ఇవళ్‌పక్కలిలే కణ్ శెల్లా నిఱ్క వేఱొరుత్తి పక్కలిలే. "అవళై యల్లతఱియోమ్" ఎన్నుమ్బడి మనస్సై అఙ్గే వైత్తు. (మఱ్ఱొరుత్తిక్కు ఉరైత్తు) మనస్సు అవళ్ పక్కలిలే యిరుక్కచ్చెయ్తే వేఱే యొరుత్తిక్కు "అడియేన్" ఎన్ఱు శొల్లి. (ఒరు పేతైక్కు ప్పొయ్ కుఱిత్తు) శొన్న వార్త్తైయై విశ్వసిత్తు అకవాయ్ అఱియాతాళొరు ముగ్ధైక్కు "ఇన్నవిడత్తిలే పోయ్ నిల్లు; నాన్ అఙ్గే వరుకిఱేన్" ఎన్ఱు ఇడఙ్గుఱిత్తు.**

**(పురికుழల్ మఙ్గై యొరుత్తితన్నై ప్పుణర్తి) మయిర్ ముడి అలైతి కులైతియాయ్ ప్పేణాతే భోగయోగ్యైయా యిరుప్పాళొరుత్తియోడే సంశ్లేషిత్తు. (అవళుక్కుమ్ మెయ్యనలై) అతువుమ్ మిథ్యాపరిరమ్భణమ్. అతావతు - పొయ్యే తழువుకై. (మరుతిఱుత్తాయ్) పరువమ్ నిరమ్బువతఱ్కు మున్నే తీణ్డినార్త్తై క్కొల్లప్పుక్కాయ్. (ఉన్ వళర్త్తి యిత్యాది) ఉన్నుడైయ వఞ్చనముమ్, నీ పిరాయమ్ పుక, అతువుమ్ ఒక్క ప్పిరాయమ్ పుకానిన్ఱతితే.**

**భావదీపిక :- అవ :-** ఇంకొక గోపిక పలికే మాటగా ఈ పాశురాన్ని పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (కరు మలర్ కూన్దలొరుత్తితన్నై క్కదై క్కణిత్తు)** - నల్లని వర్ణాన్ని కల్గిన, నిగనిగలాడే పూలతో కూడినవైన కేశపాశాన్ని కల్గిన ఒకతెను- తాను ఆమెయొక్క కేశపాశంతో బంధింపబడి, జయింపబడడం తెలిసేటట్లుగా క్రీగంటి చూపులతో చూచి. నేరుగా చూస్తే సామాన్యకటాక్షమై ఉంటుంది. క్రీగంటి చూపుతో చూస్తున్నాడు కనుక ఇది దొంగచూపుగా ఉంటుంది.

**(అఙ్గే ఒరుత్తితన్‌పాల్ మరువి మనమ్ వైత్తు)** - ఈ విధంగా ఈమెపట్ల దొంగచూపు చూసేటపుడు మనస్సులో ఇంకొకతెను తలుస్తూ, ఆమెతప్ప ఇంకెవరినీ తెలియని విధంగా చేష్టను ఒక విధంగాను, మనస్సును ఇంకొక విధంగాను కల్గి ఉన్నాడు.

**(మఱ్ఱొరుత్తిక్కు ఉరైత్తి)** - మనస్సు, చేష్ట, మాట- అనే మూడు కరణాలలో మూడవది అయిన వాక్కు అనే మాటకూడా, మిగిలిన రెండిటిని అన్వయించకుండా, వేఱుగా ఇంకొక చిన్నగోపికను ఉద్దేశించి "నీకు నేను దాసుణ్ణి" అని అన్నాడు.

**(ఒరు పేదైక్కు ప్పొయ్ కుఱిత్తు)** - ఇతడు, ఇంతకుముందే సంగమించినదై, ఇతడు చెప్పిన మాటను నమ్మి ఇతనికి లోపల ఉన్న భావాన్ని తెలియకుండా ఉండే ఇంకొక

కన్నియతో "ఇదిగో ! అక్కడకు పోయి నిలచి ఉండు. నేను అక్కడకు వస్తాను" అని, అదే సమయంలో ఆమెకు సంగమస్థలాన్నిగూర్చి సంకేతం చేశాడు.

**(పురి కుళ్లల్మజై ఒరుత్తితన్నై పుణర్త్తి)** – కేశపాశాన్ని సంస్కరించుకోనందువల్ల తాఱుమాఱుగా, భోగానికి యోగ్యతను కల్గినదై ఉండే ఇంకొకతెను ఆలింగనం చేసు కొన్నావు.

**(అవళుక్కుమ్ మెయ్యనల్లై)** – ఆమెను ఆ విధంగా తడవినదికూడా మనసార కాదు; (ఆలింగనం చేసికోవడం కూడా) అసత్యమే.

**(మఱుతిఱుత్తాయ్)** – చిన్నబాలుడవై ఉన్నపుడే జంట మద్దిచెట్లనడుమ దోగాడుతూ పోయి, వాటిని కూలగొట్టినవాడవుకదా నీవు! ఈవిధంగా నిన్ను స్పృశించినవారిని బాధించడం నీకు చిన్నప్పటినుండి ఉండేదే కదా!– అని భావం.

**(ఉన్ వళర్త్తియూడే వళర్కిన్టతాల్ ఉన్టన్ మాయైతానే)** –నీ వయస్సు ఎదిగేకొద్దీ నీ వంచకచేష్టలుకూడా వృద్ధిచెందుతున్నవికదా! తాను పరమాత్మను అనే విషయం, అందఱికి సమానుణ్ణి అనే విషయం, తనకు పత్నీస్థానంలో ఉండే అందఱి స్పర్శను కోరేవాడు అనే విషయం ఈ లీలవల్ల తెలుస్తున్నందున, ఇటువంటి పాశురాలు పైపైన చూచినపుడు నిందవలె తోచేవై, వాస్తవానికి స్తుతిగా పరిణమించేవై ఉంటాయనే విషయం తెలియదగినది.

**తాయ్ ములైప్పాలిల్ అముతిరుక్క త్తవళ్లన్దు తళర్నడై యిట్టు చ్చెన్టు,**
**పేయ్ ములై వాయ్ వైత్తు నఞ్జై యుణ్డు పిత్తనెన్టే పిఱరేశ నిన్టాయ్,**
**ఆయ్ మికు కాతలొడు యానిరుప్ప యాన్ విడ వన్ద ఎన్తూతియోడే,**
**నీ మికు పోకత్తై నన్గుకన్దాయ్ అతువుమ్ ఉన్ కోరమ్బుక్కు ఏఱ్కుమన్టే** 4

తాయ్ = తల్లి అయిన యశోదాదేవియొక్క, ములైయిల్ = స్తన్యంలో, పాల్ అముదు ఇరుక్క = పరమభోగ్యం అయిన పాలు ఉన్నా, (దానిని ఆరగించకుండా), తవళ్లన్దు = దోగాడుతూ, తళర్ నడై ఇట్టు శెన్టు = తడబడే గమనంతో వెళ్ళి, పేయ్ ములై వాయ్ వైత్తు = పిశాచి అయిన పూతనస్తన్యంలో నోటిని పెట్టుకొని, నఞ్జు ఉణ్డు = విషాన్ని ఆరగించి, పిత్తన్ ఎన్టే = పిచ్చివాడు అని, పిఱర్ ఏశ నిన్టాయ్ = ఇతరులు నిందించే రీతిలో ఉన్నవాడా !, యాన్ =నేను, ఆయ్ మికు కాదలొడు ఇరుప్ప = చాలా అధికం అయిన ప్రేమతో ఉండగా, నీ = నీవు, యాన్ విడవన్ద = నాచే దూతగా పంపబడి వచ్చిన, ఎన్ తూతియోడే = నా పరిచారికతో, మికు పోకత్తై = చాలా భోగాన్ని, నన్గు ఉకన్దాయ్ = చక్కగా అనుభవించావు. అతువుమ్ = ఆ లీలకూడా, ఉన్ కోరమ్బుక్కు= నీ తుంటరితనానికి, ఏఱ్కుమ్ అన్టే = తగినట్లే ఉన్నది కదా!

అవ :- నాలామ్పాట్టు. (ఉకన్దరుళిన దేశఙ్గళై అనుభవిత్తార్ కీ*ழ్*. అవ్వనుభవమ్ అవతారఙ్గళై అనుభవిక్క వేణు మెన్ను మపేక్షై పిఱన్దు, అతిల్ తోళ్‌తీణ్డియాన కృష్ణావతారత్తై అనుభవిత్తవర్‌కళ్ పాశురత్తాలే అనుభవిక్కిఱార్.)

వ్యా :- (తాయ్ ములైప్పాలిల్ అముతిరుక్క) ఉన్నై ప్పెఱుకైక్కు నోన్బు నోற్*ற్రు*, ప్పత్తు మాసమ్ శుమన్దు, నీ ములై యుణ్ణిల్ ధరిత్తు, ములై యుణ్ణావిడిల్ నెఱిత్తు అ*ற్ற*ాళా యిరుక్కిఱవళుదైయ, ఉనక్కు ధారకమాన ములైప్పాలిరుక్క. (తవ*ழ్*న్దు తళర్ నదై యిట్టు చ్చెన్ను) తవ*ழ్*న్దు నడక్కప్పుక్కమాట్టాతే తళర్నమ్బాతి చ్చెన్ను. (పేయ్‌ములై వాయ్ వైత్తు నఞ్జై యుణ్డు) ఉన్బుక్కల్ భావబన్ద మిల్లాత పూతనైయుదైయ ములైయిలే వాయ్‌వైత్తు. వినాశత్తై విళైప్పతాన నఞ్జై యుణ్డు. (పిత్తనెన్ఱే పిఱరేశ నిన్రాయ్) రాగద్వేషఙ్గళుక్కు విషయవిభాగమ్ పణ్ణమాట్టాత అద్దైవుకేద నెన్ఱు నాట్టారేశుమ్బడి నిన్రాయ్.

నాన్ ఇప్పోతు వి*ழ*ిక్కాడతియాతే శెయ్‌తతెన్? ఎన్ను, (ఆయ్‌మికు కాతలొడు యానిరుప్ప యాన్ విడవన్ద ఎన్ తూతియోదే) ఎన్ దూతవాక్యఙ్గొణ్డు వన్దవళోడే. (నీ మికు పోకత్తై నన్గుకన్దాయ్) ఆయ్ - ఆయమ్ పొన్ ఉన్నై యాశైప్పట్టు వైవర్ణ్యత్తైయుదైయ నానిరుక్క. "ఆయ్" ఎన్ఱు కదైక్కుఱైచ్చలాయ్ క్కిడక్కిఱతు. ఎన్నోడు పరిమాఱుమ్ పరిమా*ற్ற* త్తుక్కు అవ్వరుకే ఎన్నివైవుమ్ ఉన్నినైవుమ్ కొణ్డు పరిమాఱ నినైత్తాలుమ్ అవళుక్కు అన్నినైవు ఇల్లామైయాలే మాన్దుమవళితే అవళ్. (అతువు మున్ కోరమ్బుక్కేఱ్కుమన్రే) కోరమ్బుమావతు - తీమ్బు. అతావతు - ఉన్ తీమ్బుక్కేఱ్కు మిత్తనైయితే ఎన్నై.

*అరు :- నాలామ్పాట్టు. (తాయ్‌ములై యిత్యాది). కీ*ழ్*ற్ఱిరుమొ*ழ*ిక్కుమ్, ఇతుక్కుమ్ శొన్నవళవన్రిక్కే అడి తొడఙ్గియుమ్ సఙ్గతి యరుళిచ్చెయ్‌కిఱార్ (ఉకన్దరుళిన ఇత్యాది).*

*(కదైక్కుఱైత్తల్) ఆయ ఎన్గిఱ అకారమ్ కుఱైన్దు, "ఆయ్" ఎన్ఱు యకారమాయ్ కిడక్కిఱతు. "మికు పోకమ్" ఎన్రత్తై ప్ప*ற్ற* అరుళిచ్చెయ్‌కిఱార్ (ఎన్నోడు పరిమాఱుమిత్యాది).*

**భావదీపిక :- అవ :-** వేఱొక చిఱుగోపిక సూక్తి ఈ పాశురంగా అమరింది.

**వ్యాఖ్యానం :- (తాయ్ ములైప్పాల్ అముదిరుక్క)** - నిన్ను పొందడంకోసంగా నోము నోచి, పది మాసాలు మోసి, నీవు స్తన్యాన్ని తాగితే ప్రాణధారణ చేసి, తాగకపోతే బాధపడి భరించలేనిదిగా ఉండే యశోదయొక్క, నిన్ను అమృతంవలె తృప్తి పఱచేది అయిన స్తన్యం ఉండగా.

**(తవ*ழ్*న్దు తళర్ నదై యిట్టు చ్చెన్ను)** - మొదట దోగాడుతూ పోయి, అదికూడా సాధ్యం కానందువల్ల, తడబడుతూ పోయి.

**(పేయ్ ములై వాయ్ వైత్తు నఞ్జు ఉణ్డు)** – నీపట్ల ప్రేమ లేని పూతన అనే పిశాచిస్తన్యంలో నోటిని పెట్టి, ప్రాణాలు తీసే విషాన్ని ఆరగించి,

**(పిత్తన్ ఎన్లే పిఱర్ ఏశ నిన్ఱాయ్)** – "ఇది అభిలషించి గ్రహించదగినది; ఇది గర్హించి, విడువతగినది"– అని వివేకించి తెలియలేని అజ్ఞాని" అని పామరులు నిందించేటట్లున్నావు. "నేను చిన్న వయస్సులో చేసినది ఉండనివ్వండి, ఇపుడు నేను చేసిన వివేకహీనం అయిన పని ఏమి?" అని అంటే,

**(ఆయ్మికు కాతలొడు యానిరుప్ప యాన్ విడవన్ద ఎన్తూతియోడే నీ మికు పోకత్తు నన్గు ఉకన్దాయ్)** – మిక్కిలి ప్రేమతో నిన్ను ఎదురుచూస్తూ నేనుండగా, నిన్ను పిలుచుకొనిరావడంకోసం నేను పంపిన దౌత్యాన్ని తీసికొని పోయిన పరిచారికతో బాగా సంభోగరసాన్ని అనుభవించావుకదా ! **"ఆయ్"** అనే పదం **"ఆయమ్ పొన్"**ను (అపరంజిని) సూచిస్తుంది. **"ఆయ"** అనే పదంలోని చివరి అక్షరం అకారం లోపించి **"ఆయ్"** అని అయినది. **"ఆయ్ మికు కాతలొడు"**అంటే– నిన్ను పొందాలనే ఆశతో బంగారంవలె రంగు మారే రీతిలోనే ప్రేమను కల్గినదని భావం.

**(యానిరుప్ప... నన్గుకన్దాయ్)** – నేను ఈ విధంగా నిన్ను ఆశపడి, నా మేని ఛాయ మాఱిపోగా, ఆమె నా దూతి కావడంవల్ల నీకు నాలోకంటే కూడా ఎక్కువ ఆశను కలవాడవై, నన్ను తలచి, నాకంటే కోరదగిన ఆమెను తలచి, నీవు మిక్కిలిగా భోగాన్ని ఆమెతో పొందాలని కోరినా, ఆమెకు నీతో కలవాలనే కోరిక లేనందువల్ల ఆమె తడబడుతుందికదా! అయినా, ఆమెను ఆలింగనం చేసికోవడం గొప్ప భోగంగా భావించిన నిన్ను ఏమని అనను?

**(అతువుమ్ ఉన్ కోరమ్బుక్కు ఏఱ్ఱుమన్లే)** – **"కోరమ్బు"** అనే పదం తుంటరితనాన్ని తెలుపుతుంది. ఇందువల్ల నీవు తుంటరితనాన్ని చేసేవాడవు అని తెలుస్తుంది తప్ప నీకు ఏ ప్రయోజనం కలుగదు– అని భావం.

**మిన్నొత్త నుణ్ణిడైయాళై క్కొణ్డు వీజ్గిరుళ్వాయ్ ఎన్దన్ వీతియూడే,**
**పొన్నొత్త వాడై కుక్కూడలిట్టు ప్పోకిన్దపోతు నాన్ కణ్డు నిన్లేన్,**
**కణ్ణు*ఱ్ఱ*వళై నీ కణ్ణాలిట్టు క్కై విళిక్కిన్దతుమ్ కణ్డే నిన్లేన్,**
**ఎన్నుక్కు అవళై విట్టుజ్గువన్దాయ్! ఇన్న మజ్గే నడ నమ్బి! నీయే 5**

మిన్ ఒత్త = మెఱపుతో వంటి, నుణ్ ఇడైయాళై = సన్నని నడుమును కల ఒక కన్యకను, కొణ్డు = ఆలింగనం చేసికొని, వీజ్గు ఇరుళ్వాయ్ = దట్టమైన చీకటిలో, పొన్ ఒత్త ఆడై = బంగారురంగులోని వస్త్రంతో, కుక్కూడల్ ఇట్టు =ముసుగు వేసికొని,

ఎన్‌తన్ వీతి ఊడే = మావీథి మార్గాన, పోకిన్ఱ పోతు = (ఆమె, నీవు కలసి) పోయేటపుడు, నాన్ కణ్డు నిన్ఱేన్ = నేను చూస్తూనే ఉన్నాను, కణ్ణుగ్ఱ్ఱవళై = (ఇంకా) కంటికి కనబడిన ఇంకొక కన్యకను, కణ్ణాల్ ఇట్టు = (నీకే వశం అయేటట్లుగా) కన్ను గీటి, కై విళిక్కిన్ఱతుమ్ = (ఇక్కడికి రా – అని) చేతితో చూపించడాన్ని, కణ్డే నిన్ఱేన్ = చూస్తూనే ఉన్నాను. అవళై విట్టు = (ఏమీ తెలియని) ఆమె కన్యను విడచి, ఇఙ్గు = ఇక్కడికి, ఎన్నుక్కు వన్దాయ్ = ఎందుకోసం వచ్చావు. నమ్బి = కల్యాణగుపూర్ణా!, ఇన్నమ్ = ఇకపై కూడా, నీ అఙ్గే నడ = నీవు ఆమెదగ్గరకే పో.

**వ్యా :– అఙ్ఞామ్బాట్టు. (మిన్నొత్త నుణ్ణిడైయాళై క్కొణ్డు) మిన్ పోలే నుణ్ణియ ఇడైయైయుడైయాళొరుత్తియై అవ్విడై నుడఙ్గాతపడి అణైత్తుక్కొణ్డు. (వీఙ్గిరుళ్ వాయ్) ఉన్నుడైయ మున్నడి తోన్ఱ్రాతే పోకైక్కీడాన మిక్క ఇరుళు ముణ్డాయ్‌త్తితే. (ఎన్తన్ వీతియూడే) కొణ్డు పోకిఱతుతాన్ వేఱొరు తెరువే యన్నో కొణ్డుపోవతు. ఇతు అర్ తెరువు ఎన్టిరున్దాయ్? ఇతెన్న అఙ్ఞామైతాన్! (పొన్నొత్త వాడై కుక్కూడలిట్టు) మఱైత్తు క్కొణ్డు పోకిఱతు ఇరుళుక్కు ప్రకాశత్తై యిట్టన్నో! పోకిఱతు పోకిఱాయ్; తాన్, "ఇన్నాళై క్కొణ్డు పోకానిన్నోమ్, ఇన్నాళ్ తెరువే పోకానిన్నోమ్, ఇన్న కాలత్తిలే పోకానిన్నోమ్" ఎన్నుమ్ తుణుక్కుమిన్టియిలేయన్నో పోయిన్ఱు. (పోకిన్ఱపోతు నాన్ కణ్డు నిన్ఱేన్) ఉన్నైప్పోలే అన్యపరైయన్రే నాన్. నీ పోన విడమెఙ్గుమ్ అడియొత్తుమవళాకైయాలే కణ్డునిన్ఱేన్.**

**(కణ్ణుగ్ఱ్ఱవళై) ఇవళై యణైత్తుక్కొణ్డు పోకానిఱ్కచ్చెయ్‌తే వేఱొరుత్తి కణ్ణుక్కు ఇలక్కానాళ్. (నీ కణ్ణాలిట్టు) కణ్ణాలే అనన్యార్హైయాడి నోక్కినాయ్. (కై విళిక్కిన్ఱతుమ్ కణ్డే నిన్ఱేన్) ఇవళై ఒరు క్కైయాలే యణైత్తు మఱ్ఱై క్కైయాలే ఎతిర్‌ప్పట్టవళై "ఇన్న విడత్తే వా" ఎన్టు అఱ్ఱైత్తుక్కొణ్డు పోకిఱపడియైయుమ్ పార్‌త్తు క్కొణ్డునిన్ఱేన్. (ఎన్నుక్కు అవళై విట్టిఙ్గు వన్దాయ్) అప్పావి ఉన్నై అఱియాతవళాకైయాలే మెయ్యెన్టిరుక్కిఱవళ్ వెఱుక్కుమ్పడి అవళై విట్టు ఇఙ్గే ఎన్ శెయ్య వన్దాయ్? "అఙ్గనే శిల ఉణ్డో ఎనక్కు? అనన్యగతియన్నో!" ఎన్టు అవన్ శొల్ల; (ఇన్న మఙ్గే నడ నమ్బి నీయే) కుఱైవాళరైప్పోలే శిల వార్తై శొల్లక్కడ వీరో? నీర్ పూర్ణరల్లీరో? అఙ్గే నడవీర్.**

**భావదీపిక :– అవ:–** ఇంకొక చిఱుగోపిక ప్రణయకలహం మితిమీరగా "ఇక్కడకు రావద్దు" అని శ్రీకృష్ణుని గెంటివేస్తున్నది– ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :– (మిన్ ఒత్త నుణ్ ఇడైయాళై క్కొణ్డు)** – మెఱుపువలె సన్నని నడుమును కల ఒకతెను, ఆ నడుముకు బాధ కల్గకుండా ఉండేటట్లు ఆలింగనం చేసికొని

**(వీఙ్గిరుళ్ వాయ్)** – నీవు పాదాలను మోపిపోవడం తెలియనట్లుగా చాలా దట్టం అయిన చీకటి నీకు ఘటించింది.

**(ఎన్తన్ వీతియూడే)** – ఆమెను కౌగలించుకొనిపోయేటపుడు ఇంకొక దారిద్వారా పోకూడదా!, ఇది ఎవరి దారి అని అనుకొన్నావు? కొంచెం కూడా జంకకుండా నా వీథి ద్వారా పోయావు!

**(పొన్ ఒత్త ఆదై కుక్కూడలిట్టు ప్పోకిన్డపోతు)** – మఱుగుపఱచుకొని పోయేటపుడు చీకటికికూడా ప్రకాశాన్ని కల్గించే బంగారు వన్నెను కల పీతాంబరాన్ని తీసికొనికదా కప్పుకొని పోయావు! పోయేటపుడు అయితే "ఈమెను తీసికొని పోతున్నాము; నాపట్ల ఎంతో ప్రేమను కల ఈమె వీథి ద్వారా పోతున్నాము; చీకటిగా ఉండే ఈ సమయంలో పోతున్నాము" అనే భయం కొంచెంకూడా లేకుండాకదా పోయావు !

**(పోకిన్డపోతు నాన్ కణ్డునిన్డేన్)** – "నీవలె నేను ఇంకొక విషయాన్ని తలచగల్గినదాననా! "నీవు ఎక్కడికి పోతున్నావు? ఏమి చేస్తున్నావు? అనే దానిని అంతటినీ వెంబడించి తెలిసికొనేదానను కనుక, నీవు ఏమిచేస్తున్నావో దానిని చూస్తూనే ఉన్నాను. ఆమెపట్ల కూడా నీవు నిజమైన ప్రేమను కలవాడవుగా ప్రవర్తించలేదే! అని తర్వాత అంటున్నారు.

**(కణ్ణుఱ్ఱవళై)**– ఈమెను ఆలింగనం చేసికొని పోయేటపుడు యాదృచ్ఛికంగా నీ కంటిలో పడ్డ ఇంకొకతెను.

**(నీ కణ్ణాల్ ఇట్టు)** – ఆమెను కంటితో చూసి, నీకే దాసురాలు అయేటట్లు చేశావు.

**(కై విళిక్కిన్డతుమ్ కణ్డేనిన్డేన్)** – ఈమెను ఒక చేతితో కౌగలించుకొని, ఇంకొక చేతితో అక్కడ ఎదురుపడిన ఆమెను "ఈ చోటికి రా" అని చేతిని చూపి పోయిన రీతిని కూడా చూస్తూనే ఉన్నాను.

**(ఎనుక్కు అవళై విట్టు ఇఙ్గు వన్దాయ్)** – "నీ స్వభావాన్ని తెలియనది కనుక, నిన్ను సత్యవాది అని తలచే ఆ పాపిష్ఠికన్యక నిన్ను గర్వించేటట్లుగా ఆమెను విడచి ఇక్కడకు ఎందుకోసం వచ్చావు?" ఈవిధంగా ఈమె అడుగగానే, "ఆ విధంగా ఉండేవారు ఇంకొకరు నాకున్నారా! నిన్ను విడచి ఇంకెవరినీ నేను తెలియను కదా!" అని శ్రీకృష్ణుడనగా,

**(ఇన్నుమ్ అఙ్గే నడ నమ్బి! నీయే)** – "నీవు పూర్ణుడవుకదా! కొఱత కలవారివలె ఈ విధంగా మాటలను పలుకవచ్చునా? అక్కడికే పో!" అని అంటున్నారు.

**మఱ్ఱొరు తోళుదై వాశుతేవా! వల్విననైయేన్ తుయిల్ కొణ్డవాఱే,**
**ఇఱ్ఱైయి యిరవిడై యేమ త్తెన్నై ఇన్నణై మేలిట్టకన్డు నీ పోయ్,**
**అఱ్ఱై యిరవుమ్ ఓర్ పిఱ్ఱైనాళుమ్ అరివైయరోడుమ్ అణైన్దు వన్దాయ్,**
**ఎఱ్ఱైక్కు నీ ఎన్మరుఙ్గిల్ వన్దాయ్! ఎమ్బెరుమాన్! నీ ఎழுన్దరుళే** 6

మల్ పొరు = మల్లులతో పోరాడిన, తోళ్ ఉడై వాశుతేవా = బాహువులను కల వసుదేవకుమారా!, వల్ వినైయేన్ = మహాపాపాన్ని చేసిన నేను, తుయిల్ కొణ్డవాతే = నిద్రపోవడం ఆరంభించగానే, ఇఱ్ఱై ఇరవు ఇడై ఏమత్తు = ఆరాత్రి నడుజాములో, ఇన్ అణైమేల్ = కలయకకు తగినదిగా ఉండే ఒక శయ్యపై, ఎన్నై ఇట్టు = నన్ను పరుండబెట్టి, నీ అకన్ఱు పోయ్ = నీవు విశ్లేషించి పోయి, అఱ్ఱై ఇరవుమ్ = ఆరాత్రి, ఓర్ పిఱ్ఱై నాళుమ్ = దానికి మఱునాడు, అరివైయరోడుమ్ = (అయిదు లక్షల ఇళ్ళలోని అందఱు) కన్యకలతో, అణైన్దు వన్దాయ్ = సంశ్లేషించి వచ్చావు, నీ= అటువంటి నీవు, ఎన్ మరుఙ్గిల్ = నా దగ్గరకు, ఎఱ్ఱైక్కు వన్దాయ్ = ఎందుకోసం వచ్చావు?, ఎమ్బెరుమాన్= నా స్వామీ!, నీ ఎழுన్దరుళ్ = నీవు ఆవలికి పో.

**వ్యా :– ఆణామ్బాట్టు. (మఱ్పొరు తోళుడై వాశుతేవా) ఉన్ శెయల్కళ్, నీ మూలై యడి నడన్దాయ్ ఎన్నవొణ్ణాతపడి నివారకర్ ఇల్లాత పిఱప్పు. (వల్వినైయేన్ తుయిల్ కొణ్డవాతే) అప్పోతు ఉఱఙ్గాతిరుక్కప్పెఱ్ఱిలేన్. ఉన్ మిడై చ్చెయల్కళెల్లామ్ కాణుమ్బడి; నిద్రైయుమ్ ఎన్నై ప్పకై మీళుమ్బడి పాపత్తై పణ్ణినేన్. (ఇఱ్ఱై యిరవిడై యేమత్తెన్నై) అఱ్ఱైయిరవిల్, నడుచ్చామత్తిలే – భోగయోగ్యమాన కాలత్తిలేయన్నో ఎన్నై విట్టు ప్పోయ్త్తు. (ఇన్నణైమేల్ ఇట్టకన్ఱు నీ పోయ్) భోగయోగ్యమాన కాలత్తిలే, పడుక్కైవాయ్ ప్పాలే ఇవళ్ ఉఱఙ్గుమ్; ఉఱఙ్గినవాతే పోవో మెన్ఱు అకన్ఱు నీ పోయ్.**

**(అఱ్ఱై యిరవు మోర్ పిఱ్ఱై నాళుమ్) ఇఙ్గే నిన్ఱు నినైత్తు ప్పోనాప్పోలే శెయ్యవొణ్ణాతితే అఙ్ఙు. అకన్ఱ అన్ఱిరవుమ్ పిఱ్ఱైనాళుమ్. (అరివైయరోడు మణైన్దు వన్దాయ్) పఞ్చలక్షమ్ కుడియిల్ పెణ్గళెల్లారోడుమ్ సంశ్లేషిత్తువన్దాయ్. "అరివైయరోడు మణైన్దు వన్దాయ్" ఎన్నవాతే "ఇవళై ఆఱ్ఱుమ్బోతు అణైత్తు ఆఱ్ఱవేణుమ్" ఎన్ఱు అవన్ కిట్టప్పుక. (ఎఱ్ఱైక్కు నీ ఎన్ మరుఙ్గిల్ వన్దాయ్) ఆరై త్తీణ్డివన్దా యెన్ఱు తెరియాతు. ఎన్నై త్తీణ్డాతే కడక్క నిల్లు. (ఎమ్బెరుమాన్ నీ యెழுన్దరుళే) పూర్వవాసనైయాలే "వన్దాయ్" ఎన్న విడమ్ తప్పు చ్చొన్నేన్. అత్తై ప్పొఱుత్తు, నీర్ ముతలికళన్నో! ఎழுన్దరుళుమ్.**

***అరు :– ఆణామ్బాట్టు (మఱ్పొరు ఇత్యాది). "ఇఱ్ఱై యిరవు" ఎన్ఱు పాఠమానాలుమ్ అర్థౌచిత్యత్తుక్కాక (అఱ్ఱై యిరవు) ఎన్గిఱతు.***

**భావదీపిక :– అవ :–** ఇంకొక గోపిక తనను విశ్లేషించి పోయి, అన్యకన్యకలతోకూడి తిరిగి వచ్చినవానిని చూచి కోపంతో పలికే సూక్తి – ఈ పాశురం.

**వ్యాఖ్యానం :– (మఱ్పొరు తోళుడై వాశుతేవా)** – నీవు ఇష్టం వచ్చినట్లు నడచుకొంటే దానిని అడ్డుకోలేని వసుదేవుని కుమారుడవుకదా! అడ్డుకొనేవారు లేని కుఱ్ఱవాడవు అయినందున నీ చేష్టలు ఆశ్చర్యాన్ని కల్గించడంలేదని భావం.

**(వళ్ళినైయేన్ తుయిల్ కొణ్డవాతే)** – నీవు నా సమీపంలో ఉన్నపుడు నిన్ను కట్టివేయకుండా నిదురపోయానే! నీ తగని చేష్టలను నీవు వెళ్ళిపోయిన తర్వాతనే తెలిసికొనేటట్లు, దుఃఖంకూడా నాకు శత్రువు అయేటట్లుగా పాపాన్ని చేశానే !

**(ఇఱ్ఱై ఇరవిడై ఏమత్తు ఎన్నై)** – అదే రాత్రిలో నడుజాములో నేను నిన్ను ఆలింగనం చేసికోవలసిన కాలంలోకదా నన్ను విడిచి వెళ్ళిపోయావు.

**(ఇన్నణైమేలిట్టు అకన్టు నీ పోయ్)** – "కౌగలించుకొనే కాలంలో భోగ్యమైన పడుక కనుక ఈమె నిద్రపోతుంది, నిద్రించగానే విడిచి వెళ్ళిపోతాను" అని నిశ్చయించుకొని, నీవు నన్ను విడిచి వెళ్ళావు.

**(అఱ్ఱై ఇరవుమ్ ఓర్ పిఱ్ఱై నాళుమ్)** – ఆనాటి రాత్రి మఱునాడు – అని భావం. పాపిష్ఠిదాన్ని. అయిన నా విషయంలో చేసినట్లు అక్కడ చేయడం వీలు కాదు. అందువల్ల ఆనాటి రాత్రి, మఱునాడు పూర్తిగా అక్కడ ఉన్నావు.

**(అరివైయరోడుమ్ అణైన్దు వన్దాయ్)** – "రేపల్లెలోఉండే గోపకన్యలందఱిని కలసివచ్చావు" అని అన్నది. అపుడు "ఈమె కోపాన్ని తీర్చడానికి ఈమెను కౌగలించు కోవడమే దారి" అని తలచి అతడు కౌగలించు కోవడానికి వచ్చాడు.

**(ఎఱ్ఱైక్కు నీ ఎన్ మరుఙ్గిల్ వన్దాయ్)** – తాకరాని ఎవతెను తాకి వచ్చావో! ఏమో! నాకు అది తెలియదు. నన్ను తాకకుండా నీవు దూరంగా పో.

**(ఎమ్బెరుమాన్! నీ ఎழுన్దరుళే)** – నాతో కొఱతలేకుండా సంశ్లేషించిన పాత అలవాటువల్ల **"వన్దాయ్!"** అని తప్పుగా చెప్పాను. దానిని నీవు క్షమించాలి. నీవు చాలా గొప్ప వాడివికదా! ఇక నీవు లేచివెళ్ళు!

**పైయరవిన్నణై ప్పళ్ళియినాయ్! పణ్డైయోమ్ అల్లోమ్ నామ్, నీ యుకక్కుమ్**
**మైయరి యొణ్ కణ్ణినారు మల్లోమ్ వైకి ఎన్ శేరి వరవొழி నీ,**
**శెయ్య వుడైయుమ్ తిరుముకముమ్ శెఙ్గని వాయుమ్ కుழలుమ్ కణ్డు,**
**పొయ్యొరునాళ్ పట్టతే యమైయుమ్ పుళ్ళువమ్ పేశాతే పోకు నమ్బీ! 7**

పై అరవిన్ అణై పళ్ళియినాయ్ = పడగలను కల ఆదిశేషుడు అనే పడుకలో పరుండి ఉండేవాడా!, నమ్బీ = గుణపూర్ణా !, నామ్ = మేము, పణ్డైయోమ్ అల్లోమ్ = (నీకపటబూటకపు మాటలకు లోబడడానికి) పాత గోపికలం కాము, నీ ఉకక్కుమ్ = నీవు అభిలషించదగినవారై, మై = కాటుక పెట్టుకొని, అరి ఒణ్ = నల్లని తుమ్మెదవలె ప్రకాశాన్ని నిండుగా కల, కణ్ణినారుమ్ అల్లోమ్ = కన్నులను కల కన్యలము కాము, వైకి = ఆకాలంలో, ఎమ్ శేరి = మేముండే చోటికి, వరవు ఒழி నీ = రావణం

మానివేస్తావు గాక !, శెయ్య ఉడైయుమ్ = అందమైన పీతాంబరాన్ని, తిరు ముకముమ్= తిరుముఖమండలాన్ని, శెమ్ కని వాయుమ్ = ఎఱ్ఱని దొండపండువంటి పెదవులను, కుழలుమ్ = అందమైన కేశబంధాన్ని, కణ్డు = చూచి, పొయ్ =నీ అబద్ధపు మాటలను నిజమని నమ్మి, ఒరు నాళ్ పట్టతే అమైయుమ్ = ఒకనాడు పడిన పాట్లు ఒక్కటే చాలునే, పుళ్ళువమ్ = వంచన చేసే మాటలను, పేశాతే పోకు = తిరిగి చెప్పకుండా ఈ చోటును విడిచి వెళ్ళిపో !

**వ్యా :- ఏழாమ్బాట్టు. (పైయరవినణై ప్పళ్ళియినాయ్) "నీ ఎనక్కు నల్లై యల్లై యాకిలుమ్ నాన్ ఉనక్కు నల్లేన్. ఆశైప్పట్టార్క్కు ఉడమ్బు కొడుక్కుమవన్, ఎతిర్త్తై యినుడైయ రక్షణచిన్తై పణ్ణుమవన్ నాన్" ఎన్ఱు అవన్ శొల్ల; (పైయరవినణై ప్పళ్ళి యినాయ్) ఎన్గిఱాళ్. (పణ్డైయో మల్లోమ్ నామ్) అకప్పుదుత్తుకైక్కాక నీ మున్బు శెయ్యుమ్ శెయల్కళ్ అతీన్దవర్కళాకైయాలే పழైయవర్కళల్లోమ్ నాజ్గళ్. "నాకణై మిశై నమ్బిరాన్ శరణే శరణ్ నమక్కు" ఎన్టిరుక్కుమ్ నిలై తవిర్న్దోమ్ నాజ్గళ్. తజ్ఞమాక నినైత్తిరుక్కుమతి లేయుమ్ అతిశజ్కై పణ్ణుమ్బడి అవగాహిత్తార్ కాణుమ్ ఇవర్.**

**"నీజ్గళ్ పణ్డైయవర్కళన్ఱాకిలుమ్ నాన్ఱాన్ పழైయవనాకైయాలే ఉకప్పేనే ఉజ్గళై" ఎన్ఱు అవన్ శొల్ల; (నీ యుకక్కుమ్ మైయరి యొణ్ కణ్ణినారుమల్లోమ్) నీ ఇప్పోతు ఉకక్కిఱనర్కళుమల్లోమ్గాణ్ నాజ్గళ్. మున్నడి తోన్ఱాతే ఉన్నై మూలైయడియే నడక్క ప్పణ్ణుకిఱ అవయవశోభై యుడైయవర్కళల్లోమ్గాణ్ నాజ్గళ్. "ఆనాల్ ఎన్నై చ్చెయ్య చ్చొల్లుకిఱతు ఎన్" ఎన్న, (ఎన్ శేరి వరవొழி నీ) ఎజ్గళుడైయ ఇరుప్పిడజ్గళ్ ఎజ్గళుక్కే ఆజ్ఞై శెల్లువతు. ఎజ్గళిరుప్పిడత్తిల్ వారాతేకొళ్.**

**"ఎల్లారుమ్ పరిమాఱుకిఱ ఉజ్గళిడత్తిల్ నాన్ వారాతొழிకిఱతెన్" ఎన్న; (వైకి ఎన్ శేరి వరవొழி నీ) "ఎల్లారుమ్ వరుమ్బోతిల్ వరవేణ్డా ఎన్గిఱో మన్ఱు. ఆళఱ్ఱపోతాక ప్పోకానిన్ఱాన్; ఇవనుక్కు ఒరు నినైవుణ్డెన్ఱు శంకిక్కుమ్బోతు వరవేణ్డా ఎన్గిఱో మత్తనై యల్లతు, సర్వసాధారణమానపోతు వరవేణ్డా ఎన్టిలోమే" ఎన్న, ఇవర్కళ్ వరవేణ్డా ఎన్నాత పడి ఆశిలే కైవైత్తాన్. ఇవర్కళ్ వార్తైయిలే తాన్ శెయలఱ్ఱపడియాలే ఇవర్కళ్ వాయ్ మాఱుమ్బడి బ్రహ్మాస్త్రప్రయోగమ్ పణ్ణ ప్పార్త్తాన్. (శెయ్య వుడైయుమ్ తిరు ముకముమ్ కుழలుమ్ కణ్డు) తిరుప్పరియట్టత్తై ప్పేణువతు; ఇవర్కళ్ ముకజ్గళిలే ముకత్తై క్కాట్టునతు; స్మితమ్ పణ్ణువతు, తిరుక్కుழలై ప్పేణువతానాన్. ఇప్పడి శెయ్తవాతే ఇఱాయ్త్తాళ్. అతావతు - కణ్ణై చ్చెమ్బుళిత్తాళ్.**

**కణ్ ప్పడైత్త లాభమ్ కాణాతే కణ్ణై చ్చెమ్బుళిక్కిఱతెన్? ఎన్ఱు శొల్ల క్కణ్డు. (పొయ్యొరునాళ్ పట్టతే యమైయుమ్) "ఉన్నుడైయ శెయల్కళెల్లామ్ మెయ్యెన్ఱు ఒరునాళ్ పట్టతే యమైయుజ్గాణ్" ఎన్గిఱాళ్. "అడియేన్", "కుడియేన్" ఎన్ఱు శిల వార్తైకళై చ్చొల్ల.**

**(పుళ్ళువమ్ పేశాతే పోకు) కాట్చిక్కు మున్నే కాణ్ (శవణముమ్. అతువు మెల్లామ్ పణ్డే శెయ్తర్రిత్తు కాణ్. ఇవి నీ శొల్లుకిఅవర్రిక్కు ఒరు ప్రయోజన మిల్లై. పుళ్ళువమావతు వఞ్చనమ్. వఞ్చనఙ్గళెల్లా మఱిన్ద ఎఙ్గళ్ పక్కల్ ప్రయోగియాతే పో. "ఎన్నై 'పో' ఎన్గిఅతెన్? ఉఙ్గళై యొழிయ పుకలిడ ముణ్డో?" ఎన్న. (నమ్బి) పూర్ణరాయిరుక్కిఅనీర్ కుఱైవాళరై ప్పోలే శిల శొల్లక్కడవీరో! ఉమ్ముడైయ శొలవుక్కుమ్, శెయలుక్కుమ్ అడియిల్లై ఎన్నుమ్బడి నిరపేక్షరెన్ఱఱిన్ద పిన్బు శిల సాపేక్షరైప్పోలే శొల్లక్కడవీరో? నడవీర్.**

***అరు :– ఏழ்ழாమ్బాట్టు. (పైయరవిత్యాది). అవన్ నినైవిలే అవతారికై అరుళిచ్చెయ్ కిఱార్. (నీ ఎనక్కిత్యాది) నీ అకప్పుడుత్తుకైక్కు పుణ్ణిన వఞ్చకమన్ఱో! ఎన్ఱు వ్యఙ్గ్యమాక అవన్ నినైవై అనువదిక్కిఱార్ (పైయరవిత్యాది). (పణ్డైయోమ్) ఉన్ కాపట్య మఱియాతే అకప్పడుమ్ పழைయవర్కళల్లో మెన్ఱపడి. మున్బుతాన్ అవనై విశ్వసిత్తిరుప్పార్కళో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (నాకణైమిశై యిత్యాది).***

***(మై అరి) మైయై అపహరిక్కిఱ అழ்కియ కణ్ణెన్నుతల్? మైపోలవుమ్, పణ్డుపోలవు మిరుక్కిఱ అழ்కియ కణ్ణెన్నుతల్.***

***(శవణముమ్) కేట్టు క్కాణ్గిఅతొழிయ కణ్డు కేట్కైయుణ్డో? పేశాతే పోమ్. కాట్చిక్కు పూర్వభావియానతు శ్రవణమ్. కాట్చియిల్లాతపోతే ముతలే శ్రవణము మిల్లై– ఎన్ఱు కరుత్తు.***

**భావదీపిక :– అవ:–** ఇంకొక గోపిక ప్రణయకోపంతో పలికే మాట ఈపాశురం.

**(పై అరవిన్ అణై ప్పళ్ళియినాయ్)** – ఈమె ప్రణయకలహాన్ని చేయడం చూచిన శ్రీకృష్ణుడు, "నీవు నన్ను కోరకపోయినా నేను నిన్ను కోరుతున్నాను. నేను ఆదిశేషునిపై పవళించేవాడను. లోకాలను అన్నిటినీ రక్షించడంకోసం ఆలోచిస్తూ ఉండేవాడను కదా!" అని అనగా, దానిని పురస్కరించుకొని **"పై అరవిన్ అణై ప్పళ్ళియినాయ్"** అని అతనిని సంబోధిస్తున్నది.

**(పణ్డైయోమ్ అల్లోమ్ నామ్)** – "మమ్ములను వశీకరించుకోవడంకోసం నీవు చేసే పనులను ఇపుడు మేము తెలిసికొంటున్నాము. కనుక మమ్ములను పాత గోపికలుగా భావించకు. **"నాకణైమిశై నమ్బిరాన్ శరణే శరణ్ నమక్కు"** (తిరువాయ్–5–10–11) (ఆదిశేషుని శయనంగా కల మనస్వామి శ్రీచరణాలే మనకు శరణం) అని తలచే పాతభావన ఇపుడు విడిచిపెట్టాము సుమా"– అని అంటున్నది. ఆదిశేష పర్యంకంపై పరుండి ఉండే సన్నివేశమే శరణం అని తలచిన ఈమె, అతడు కొంచెం సమయం ఆలస్యం చేశాడనే కారణంచేత, ఆస్థితిలో కూడా సందేహాన్ని పొందడం ఈమె అవగాహాతిశయానికి (గొప్ప అనురాగానికి) సూచకం.

"మీరు పాత గోపికలు కాకపోయినా, నేను పాత గోపాలుణ్ణే. కనుక ఇంతకు ముందు వలెనే మిమ్ములను అభిమానిస్తూనే ఉన్నాను" అని అతడు అనగానే– **(నీ ఉకక్కుమ్ మై అరి ఒణ్ కణ్ణినారుమ్ అల్లోమ్)** – "నీవు ఇపుడు అభిమానించేవారం కాముసుమా మేము" అని అంటున్నది. నేత్రసౌందర్యాన్ని వర్ణించడంవల్ల, "నిన్ను మోహింపజేసి, వారు ఇష్టంవచ్చినట్లు నీవు ప్రవర్తించేటట్లుచేసే నేత్రసౌందర్యాన్ని కలవారం కాము సుమా మేము" అనే భావం స్ఫురిస్తున్నది. **"మై అరి ఒణ్ కణ్"** అనే దానికి "కాటుకను జయించే అందమైన కన్నులు" అని కాని, 'కాటుకవలె, తుమ్మెదవలె ఉండే అందమైన కన్నులు" అని కాని అర్థాన్ని గ్రహించవచ్చు. **"అరి"** అనే పదం విజయాన్ని పొందడాన్ని తెలుపుతుంది. తుమ్మెదలను తెలుపుతుంది. "సరే, నన్నేమి చేయమని అంటున్నారు మీరు ?" అని అతడు ప్రశ్నించగా

**(ఎమ్ శేరి వరవొ*ழி* నీ)** – "మా ఆజ్ఞే చెల్లుబాటు అయేటట్లుగా మేమున్నచోటికి నీవు రాకుండా ఉంటే అంతే చాలు". "అందఱికీ సాధారణం అయిన మీ చోటికి నేను మాత్రం రాకూడదు– అని అనడం ఏమిటి ?" అని అతడు అడుగగా –

**(ఎమ్ శేరి వరవొ*ழி* నీ)** – "అందఱు పోయి వచ్చే కాలంలో నిన్ను రావద్దని అనలేదే ! ఎవరూ లేనపుడు ఇతడు ఇక్కడకు వస్తున్నాడే ! ఇతనికి వీరితో ఏదో సంబంధం ఉన్నది కాబోలు!– అని ఇతరులు సందేహపడతగిన కాలాలలో రాకు అని అంటున్నామే తప్ప; అందఱు వచ్చి వెళ్ళే కాలంలో రావద్దని అనలేదు" అని అన్నది. వీరు తనను రావద్దని చెప్పలేనట్లుగా కొని బ్రహ్మాస్త్రప్రయోగాలను చేయడం ఆరంభించాడు స్వామి. వీరి మాటలవల్ల తాను చేష్టలుడిగినవాడు అయినందువల్ల వీరు ఇక ఏమి మాట్లాడలేనట్లుగా బ్రహ్మాస్త్రప్రయోగంవలె కొన్ని చేష్టలను చేయడం ఆరంభించాడు. వాటిని గుర్తించి ఇక బదులిస్తున్నారు గోపికలు.

**(శెయ్య ఉడైయుమ్ తిరు ముకముమ్ శెజ్కనివాయుమ్ కు*ழ*లుమ్ కణ్డు)** – పీతాంబరాన్ని సరిచేసికోవడం, వారి ముందుకు వచ్చి తన ముఖాన్ని చూపించడం, చిఱునవ్వు నవ్వడం, కేశబంధాన్ని సవరించుకోవడం– మొదలైన వీరిని ఆకర్షించే అస్త్ర ప్రయోగాలను చేశాడు స్వామి. ఈ విధంగా అతడు చేయగానే ఆమె అడ్డుకొన్నది. అంటే, ఆమె కన్నులను మూసికొన్నది. "కన్నులున్నందుకు ఫలాన్ని పొందకుండా కన్నులను ఎందుకు మూసికొంటున్నావు ?" అని అతడు అంటున్నట్లు భావించి, అంటున్నది.

**(పొయ్యొరునాళ్ పట్టతే అమైయుమ్)** – నీ ఇటువంటి చేష్టలు అన్నీ నిజమని నమ్మి పూర్వం ఒకానొకనాడు నేను పడిన పాట్లన్నీ చాలుకదా! "దాసుణ్ణి నేను ఆ విధంగా చేస్తానా !' అని అతడు ఏవో కొన్ని మాటలను పలుకగా,

**(పుళ్ళువమ్ పేశాతే పోకు)** – మొదట నిన్ను చూస్తే కదా మేము నీ మాటను వినే అవకాశం ఉన్నది. చూచిన తర్వాతకదా వినడం. మేము నిన్ను చూడడానికే ఇష్టపడనపుడు, నీమాటను వినే అవకాశం ఎక్కడిది? నీ మాటను విని పడే పాట్లన్నీ ముందే పడ్డాము; చాలు. మేము నిన్ను చూడగానే తొలగిపోయే ఇపుడు నీవు మాటలాడినందువల్ల ఏ భయమూ లేదు. **"పుళ్ళువమ్"** అనే పదం వంచనను తెలుపుతుంది. "నీ వంచనలను అన్నిటినీ తెలిసిన మావద్ద తిరిగి వాటిని చేయవద్దు" అని అన్నది. ఆ తరువాత శ్రీకృష్ణుడు "నన్ను పొమ్మని అంటున్నారే! మీరు తప్ప ఇంకొక చోటు నాకు ఉన్నదా?" అని స్వామి అనగా,

**(నమ్బీ)** – పూర్ణుడవై ఉండే నీవు ఏ కొఱతను కలవానివలె ఏవో ఈ మాటలను పలుక వచ్చునా ? మాటకు, పనికి పొందికలేనట్లు ఎవరినీ ఎదురుచూడని పూర్ణుడవుగా నీవు ప్రవర్తించడాన్ని మేము తెలిసికొన్నాము. ఇపుడు మాకోసం ఎదురుచూసే కొఱత కల్గినవానివలె (అపూర్ణునివలె) కొన్ని మాటలను పల్కడంలో ఏ ప్రయోజనం లేదు. ఇక్కడ నుండి వెళ్ళిపో" అని అన్నది.

**ఎన్నై వరుక ఎన కుఱిత్తిట్టు ఇనమలర్ ముల్లైయిన్ పన్దల్ నీழ்ల్,**
**మన్నియవళై ప్పుణర ప్పుక్కు మற்றైన్నై క్కణ్డు ఉழఱా నెకిழ்న్దాయ్,**
**పొన్నిఱ వాడైయై క్కైయిల్ తాఙ్గి ప్పొయ్యచ్చఙ్గాట్టి నీ పోతియేలుమ్,**
**ఇన్నమ్ ఎన్ కైయకత్తు ఈఙ్గొరునాళ్ వరుతియేల్ ఎన్ శినమ్ తీర్వన్నానే 8**

ఎన్నై వరుక ఎన = నన్ను (ఇక్కడకు) రా అని, కుఱిత్తిట్టు = చోటును నిర్దేశించి, ఇనమ్ మలర్ ముల్లైయిన్ పన్దల్ నీழ்ల్ = మిక్కిలిగా పూవులను కల మల్లిపందిరి నీడలో, మన్నియవళై = గుడిసె కట్టుకొని కాచుకొని ఉండే గోపికను, పుణరప్పుక్కు = సంశ్లేషించడానికి ఆరంభించగానే, మற்ఱు ఎన్నై క్కణ్డు = మళ్ళీ నన్నుచూచి, ఉழ రా నెకిழ்న్దాయ్ = కలత చెంది ఆవైపుకు వెళ్ళావు, పొన్ నిఱమ్ ఆడైయై = పీతాంబరాన్ని, కైయిల్ తాఙ్గి = చేతిలో ధరించి, పొయ్ = అసత్యం అయిన, అచ్చమ్ కాట్టి = నాకు భయపడినట్లుగా నటించి, నీ పోది ఏలుమ్ = నీవు (నాచేతికి అందకుండా) తప్పిపోయినా, ఇన్నమ్ = ఇకపై, ఈఙ్గు = ఇక్కడ, ఎన్ కై అకత్తు = నేనున్నచోటికి, ఒరు నాళ్ వరుతిఏల్ = ఒకనాడయినా వచ్చినట్లయితే, నాన్ ఎన్ శినమ్ తీర్వన్ = నేను నా కోపాన్ని తీర్చుకొంటాను.

**వ్యా :- ఎట్టామ్బాట్టు. (ఎన్నై వరుక వెనకుఱిత్తిట్టు) ప్రణయిత్వత్తాలే ఒరుత్తియై అనన్యార్హైయాక్కినాయ్. అవళై ఇన్నవిడత్తిలే వావెన్ఱు ఇడఙ్గుఱిత్తువిట్టాయ్. (ఇన మలర్ ముల్లైయిన్ పన్దల్‌నీழ்ల్) పరప్పుమాఱ ప్పూత్త ముల్లైపన్దలిన్‌కీழ். (మన్నియవళై**

ప్పుణరప్పుక్కు) ఎక్కాలత్తిలే ఇడఝ్గుతిత్తు విట్టా నెన్ఱు తెరియాతు. అవళ్ అజ్గే కుడిల్ కట్టి క్కాత్తు క్కిడక్కిఱతు. అవళోడే సంశ్లేషిక్కప్పుక్కు. (మఱ్ఱైన్నై క్కణ్డు ఉళాా నెక్కిళ్న్దాయ్) ఒరు మహాభారతత్తై ప్పారిత్తు క్కొణ్డుపుక్కు ఇవళై క్కణ్డవాతే కలజ్గి ఎழுన్దిరున్దాన్.

(పొన్నిఅ వాడైయై క్కైయిల్ తాజ్గి) తిరుప్పరియట్టత్తై క్కైయిలే తాజ్గి. (పొయ్యచ్చజ్గాట్టి నీ పోతియేలుమ్) ఇవళై క్కైకழியప్పోయ్, మెయ్యచ్చమ్ శెయ్‌తత్తై ప్పొయ్యాక్కి చ్చిరిత్తాన్ పోయ్ నిన్ఱు; మెయ్యే అజ్ఞానానాకిల్ కళవుమ్ మెయ్యామితే; కళవు పొయ్యాకైక్కాక ప్పొయ్యే అజ్ఞానాక భావిత్తాన్. (పోతియేలుమ్) అప్పోతైక్కు ఇవళై త్తప్పప్పోమతు వేయితే ఉద్దేశ్యమ్. అప్పడియే కై కழலప్పోనాన్. (ఇన్న మెన్ కైయకత్తీజ్గొరునాళ్ వరుతియేల్) నీ నియతస్వభావ నల్లామైయాలే ఎన్ కైయిలేయుమ్ ఒరు నాళ్ వన్దు అకప్పడక్కూడుమితే, అకప్పట్టాయాకిల్.

(ఎన్ శినమ్ తీర్వన్‌నానే) ఉయ్‌న్దప్పిళై పాదానిఱ్కు, ఎమ్బార్ పార్‌త్తు ఎழுన్దరుళి యిరుక్క ఇవ్విడత్తుక్కు అభినయిక్కిఱార్ కాలాలే పాయ్‌న్దు తళ్ళువతాక్కాట్ట, అత్తై క్కణ్డరుళి, "కెడువాయ్! 'అజ్ఞనే శెయ్‌తాళాకిల్ అవనుక్కు ప్పొల్లాతో! అవనుక్కుమ్ అతన్నో తేట్టమ్? అజ్ఞ నన్ఱు కాణుమ్' ఎన్ఱు, కైయిట్టు ముకత్తై మఱైత్తు త్తిరియవైత్తరుళి క్కాట్టినార్.

*అరు :- ఎట్టామ్బాట్టు. (ఎన్నై యిత్యాది). ఎన్నై వరుక ఎన - ఎన్నై వరచ్చొల్లి ఇడఝ్గుతిత్తిట్టెన్ఱు. ఇవళ్ తన్నైయే ఒరుత్తియై ఎన్ఱుమ్ వ్యాఖ్యాతా వార్తై.*

**భావదీపిక :- అవ :-** ప్రణయరోషంతో పలికే ఇంకొక గోపిక పలుకులు ఈ పాశురం.

**వ్యాఖ్యానం :- (ఎన్నై వరుక ఎన క్కుఱిత్తిట్టు)** - "ఈ చోటికి రా" అని ప్రేమతో నీకే దాసురాలిని అయిన నాకు ఒక చోట నిర్దేశించావు.

**(ఇన మలర్ మల్లైయిన్ పన్దర్ నీழల్)** - ఇంతకు ముందే నీచే స్థలసంకేతం చేయబడ్డ గోపికను, పూర్తిగా పూచిన మొల్లపందిరి నీడలో కింద కౌగలించుకొన్నావు. **"మన్నియవళై"** అని అన్నందువల్ల ఈమెకు ఎపుడు ఏ సమయంలో స్థలసంకేతాన్ని చేశాడు అనే విషయం తెలియదు అని, ఆమె అక్కడే గుడిసె కట్టుకొని చిరకాలంగా వేచి ఉన్నదని స్ఫురిస్తున్నది.

**(మన్నియవళై పుణరప్పుక్కు)** - ఆ విధంగా అక్కడ గుడిసె కట్టుకొని ఉన్న ఆమెను కౌగలించుకోబోయాడు.

**(మఱ్ఱు ఎన్నై క్కణ్డు ఉழలా నెకిழ్న్దాయ్)** - చిరకాలం ఆమెతో సంశ్లేషించాలి అని మనోరథిస్తూ (ఆశపడుతూ) ఆమెతో ఆనందించడం ఆరంభించిన కాలంలో, నన్ను చూడగానే కలత చెంది ఆవైపుకు వెళ్ళాడు. ఒకే చోటిలో ఇద్దఱికీ స్థలసంకేతం

చేసినందువల్ల, ఆ ఇద్దఱు తనను స్మరించి, వెక్కిళ్ళు పెట్టేట్లుగా చేయాలనే ఇతని భావన స్ఫురిస్తున్నది.

**(పొన్నిఱ ఆడైయై క్కైయిల్ తాఙ్గి)** – పైన ధరించే బంగారు రంగులోని ఉత్తరీయాన్ని చేతిలో ధరించి,

**(పొయ్ అచ్చమ్ కాట్టి నీ పోదియేలుమ్)** – అసత్యానికి నీవు భయపడినవానివలె నటించి, నీవు నన్ను విడచి తప్పిపోయినవాడవు అయినా– అని భావం. ఈమెను చూడగానే భయపడినవానివలె ఆవైపుకు పోయిన తర్వాత, అది అబద్ధపు భయమే అని తెలిసేటట్లు ఈమెను చూచి నవ్వాడు– అని స్ఫురిస్తున్నది. వారిని ఇద్దఱిని బాధపెట్టడంకోసం ఈ రీతిలో అసత్యమైన భయాన్ని ప్రదర్శించాడు. నిజానికి ఒకే చోట ఇద్దఱికీ స్థలసంకేతాన్ని చేయకూడదుకదా! ఇద్దఱికీ సత్యవాది కాదు– అనే విషయాన్ని తెలుపడంకోసమే అసత్యంగా భయపడినవానివలె నటించాడు.

**(పోదియేలుమ్)** – అపుడు ఆమెదగ్గరనుండి తప్పించుకొనిపోవడమేకదా ఇతనికి ఉద్దేశ్యం. ఆరీతిలోనే తప్పించుకొనిపోయాడు.

**(ఇన్నమ్ ఎన్ కై అకత్తు ఈఙ్గు ఒరునాళ్ వరుతియేల్)** – నీవు ఒకే విధమైన స్వభావాన్ని కలవాడవై లేనందువల్ల, నా చేతిలో ఒకనాడు ఇక్కడకు వచ్చి పట్టుబడకబోవు. పట్టబడితే–

**(ఎన్ శినమ్ తీర్వన్ నానే)**– నాకిపుడు కల్గిన కోపానికి నిన్ను బదులు తీర్చుకుంటాను.

శ్రీరంగం దివ్యాలయంలో భగవద్రామానుజులకాలంలో ఈ పాశురాన్ని **"ఉయ్న్ద పిళ్ళై"** అనే అరైయర్ అభినయించారు. అపుడు భగవద్రామానుజుల తమ్ముడు, శిష్యులు అయిన ఎమ్బార్ ఆగోష్ఠిలో వేంచేసి ఉన్నారు. అరైయర్ ఈ సందర్భాన్ని అభినయించే టపుడు, **"ఎన్ శినమ్ తీర్వన్ నానే"** అనే చోటకు అభినయం చేస్తూ కాళ్ళతో శ్రీకృష్ణుని తన్ని తోసివేసినట్లుగా అభినయించారు. దానిని చూచిన పరమరసికులైన ఎమ్బార్ – "అయ్యో ! ఈ విధంగా ఆమె కాళ్ళతో తన్నినట్లయితే అది అతనికి అయిష్టమా! ఈమె శరీరస్పర్శపొందాలనే కదా అతడు ఎదురు చూస్తాడు. అందువల్ల కాళ్ళతో తన్నడం బదులు తీర్చుకొన్నట్లు కానేకాదు" అనే భావం తోచేటట్లు, చేతితో ముఖాన్ని దాచుకొని, ముఖాన్ని పక్కకు తిప్పుకొని అభినయించి చూపించారు. అంటే– అతని కోపించి, గర్హించడం స్ఫురించేటట్లు ముఖాన్ని తిప్పుకొని చూపడమే నిజానికి అతనికి బదులు తీర్చుకోవడం అవుతుంది– అని భావం. (దీనిని చూచిన అరైయర్ తర్వాత రెండవ పర్యాయం అభినయం చేసేటపుడు ఎమ్బార్ సూచించిన రీతిలోనే అభినయించి ఉంటారు అన్నది కింపునర్న్యాయసిద్ధం కదా).

**మఙ్గల నల్ వనమాలై మార్విలిలఙ్గ మయిల్ తழైప్పీలి శూడి,**
**పొఙ్గిళవాడై అరైయిల్ శాత్తి పూఙ్గొత్తు క్కాతిల్ పుణర ప్పెయ్‌తు,**
**కొఙ్గు నఱుఙ్గుழలార్‌కళోడు కుழైన్దు కుழలిని తూతి వన్దాయ్,**
**ఎఙ్గళుక్కే ఒరునాళ్ వన్దూత ఉన్‌కుழలిన్నిశై పోతరాతే** **9**

మఙ్గలమ్ = మంగళకరమై, నల్ = అందమైన, వనమాలై = వనమాల, మార్బిల్= వక్షఃస్థలంలో, ఇలఙ్గ = ప్రకాశించేటట్లు, మయిల్ తழై పీలి = విరిసిన నెమలి పింఛాన్ని, శూడి = (కిరీటంలో) అలంకరించుకొని, పొఙ్గు ఇళ ఆడై = చాలా మృదువైన వస్త్రాన్ని, అరైయిల్ శాత్తి = నడుములో కట్టుకొని, పూ కొత్తు = పూలగుత్తులను, కాదిల్= చెవిలో, పుణర ప్పెయ్‌తు= బాగా పొందికగా అలంకరించుకొని, కొఙ్గు నఱుమ్ కుழలార్‌కళోడు= తేనెతో, సువాసనతో కూడిన కేశపాశాన్ని కల కన్యలతో, కుழైన్దు = కలిసి, (అందువల్ల కల్గిన సంతోషానికి వ్యక్తీకరణ రూపంగా) కుழల్ = పిల్లనగ్రోవిని, ఇనితు ఊతి వన్దాయ్= చాలా అందంగా ఊదుతూ వచ్చావు, ఒరు నాళ్ = ఒకనాడైనా, ఎఙ్గళుక్కే = మాకోసంగా, వన్దు ఊత = వచ్చి ఊదేటట్లు, ఉన్ కుழలిన్ ఇశై = నీ పిల్లనగ్రోవి రాగం, పోతరాతు= రాదు!

**ఒన్బతామ్పాట్టు. అవ :- తోల్వి తోన్ఱ చ్చొల్లుకిఱార్‌కళ్.**

**వ్యా :- (మఙ్గల నల్ వనమాలై మార్విలిలఙ్గ) మఙ్గళ మెన్ఱు శొల్లప్పట్టవై ఎల్లా ముడైత్తాయ్, దర్శనీయమాయిరుక్కిఱ వనమాలై. “మైపోల్ నెడువరై వాయ్ తాழ మరువి పోల్ తార్ కిడప్ప” ఎన్నుమాప్పోలే, తిరుమార్విలే విళఙ్గ. (మయిల్ తழైప్పీలి శూడి) తழైత్త పీలియై త్తిరుముడియిలే శుఱ్ఱి. (పొఙ్గిళవాడై అరైయిల్ శాత్తి) మికవుమ్ మెల్లియ ఆడైయై త్తిరువరైయిలే శాత్తి.**

**(పూఙ్గొత్తు క్కాతిల్ పుణర ప్పెయ్‌తు కొఙ్గునఱుఙ్గుழలార్‌కళోడు కుழైన్దు) పూఙ్గొత్తై క్కాతిలే మికవుమ్ పొరున్దవిట్టు, తేనైయుమ్ నఱు నాఱ్ఱత్తైయుముడైయ కుழలై యుడై యవర్‌కళోడే, కుழైన్దు - కలన్దు. (కుழలిని తూతి వన్దాయ్) నెకిழన్దవర్‌కళోడే ఒరు నీరాక క్కలన్దు, అక్కలవియాల్ పిఱన్ద హర్ష మెల్లామ్ తోన్ఱుమ్పడియాక ఇనితాక క్కుழలూతి వన్దాయ్. (ఎఙ్గళుక్కే ఒరు నాళ్ వన్దూత ఉన్‌కుழలిన్నిశై పోతరాతే) నీ సర్వ సాధారణనాన పిన్బు ఉన్ కుழలుమ్ సర్వసాధారణమాయిరుక్క, ఓరో విడఙ్గళిలేయాయ్ నాఙ్గళ్ కేట్క ఊతవేణు మెన్నాల్, నీ ఊతిలుమ్ ఇశై పుఱప్పడాతపడియాయ్‌త్తితే, ఉన్‌కుழలిన్ స్వభావమ్. కుழలోశై ఎన్ఱుమ్ సంశ్లేష మెన్ఱుమ్- పర్యాయమితే. ఎఙ్గళోడు సంశ్లేషమ్ ఉనక్కు ప్పోరున్దాతు- ఎన్గిఱార్‌కళ్.**

**భావదీపిక :- అవ:-** ఈ విధంగా అతనితో ప్రణయకలహమాడిన చిన్న గోపికలు అందఱు అతనితో ప్రణయరోషంతో కలహించినా, చివరలో అతనికి పరాజితలై, తమ పరాజయం స్ఫురించేటట్లు పలికే పాశురం ఇది.

**వ్యాఖ్యానం :- (మజ్గల నల్ వనమాలై మార్బిల్ ఇలజ్గ)** - మంగళకరమైనవిగా ప్రసిద్ధిచెందిన అన్నిటిని తనలో అంతర్భవింపజేసికొన్నదై, చాలా అందంగా ఉండే వనమాల. ఆ మాల- **"మైపోల్ నెడువరైవాయ్ తాழுమ్ అరువిపోల్ తార్ కిడప్ప శూழுమ్ తిరుమామణి వణ్ణన్"** (మూన్ఱామ్‌తిరు-59) (కాటుకవలె నల్లని గొప్ప పర్వతంలో ప్రవహించే ప్రవాహం వలె తులసీమాల ప్రకాశించగా దానికి ఆశపడి నిత్యవాసంచేసే, లక్ష్మీవల్లభుడైన మణివర్ణుడు) అని అంటూ పేయాழ்వార్లు అనుగ్రహించినట్లే వక్షఃస్థలంలో వెలుగగా.

**(మయిల్ తழை పీలి శూడి)** - విరిసిన నెమలి ఈకలతో కూడిన పింఛాన్ని కిరీటంలో అలంకరించుకొని.

**(పొజ్గిళ వాడై అరైయల్ శాత్తి)** - చాలా సున్నితం అయిన పీతాంబరాన్ని నడుమున ధరించి.

**(పూజ్గొత్తు క్కాదిల్ పుణర ప్పెయ్‌దు కొజ్గు నఱుజ్ఞుழలార్‌కళోదు కుழைన్దు)** - పూలగుత్తిని చెవిలో చాలా యుక్తంగా అలంకరించుకొని, తేనెవలె భోగ్యమై, సుగంధాన్ని కల కేశపాశాన్ని కల్గిన గోపికతో సంశ్లేషించి.

**(కుழల్ ఇనితు ఊది వన్దాయ్)** - నీతో ప్రణయకలహమాడి, నిన్ను విడిచి వెళ్ళిపోవాలని అనుకున్నవారితో అందఱితో ఒకటిగా కలిసి, ఆ విధంగా సంశ్లేషించడం వల్ల కల్గిన ఆనందం అంతా వెలిగేటట్లుగా మధురంగా పిల్లనగ్రోవిని ఊది వచ్చావు.

**(ఎజ్గళుక్కే ఒరు నాళ్ వన్దు ఊత ఉన్ కుழల్ ఇన్నిశై పోతరాతే)** - నీవు అందరివాడవు. నీ పిల్లనగ్రోవి కూడా అందఱు సమానంగా విని అనుభవించదగినది. ఈ విధంగా ఉండగా, మేమున్న ప్రతిచోట మేము వినేటట్లుగా నీవు వేణువు ఊదాలని ఆశిస్తే, నీవు ఆవిధంగా ఊదినా, మధురమైన ధ్వనినీ వేణువునుండి వెలువడకుండా ఉండే స్వభావాన్ని కల్గినదికదా దాని స్వభావం. ఈ సూక్తి తాత్పర్యం ఏమంటే- ఇక్కడ వేణుధ్వనిగా చెప్పబడేది శ్రీకృష్ణునితో సంశ్లేషమే. "పిల్లనగ్రోవి ధ్వని వెలువడదు"అని అనడంలో "మా అందఱితో కూడి ఉండడం నీకు తగదు" అని తాత్పర్యం. అందఱికంటే అధికుడవైన నీకు ఏమీ తెలియనివారం అయిన మాతో కలవడం తగదు- అని హృదయం. తమ పరాజయం స్ఫురించేటట్లు గోపికలు (ఆழ்వార్లు) పల్కిన పాశురం ఇది.

అల్లిమలర్ తిరుమఙ్గైకేళ్వన్తన్నై నయన్దు ఇళవాయ్చ్చిమార్కళ్,
ఎల్లిప్పొ*ళు*తినిల్ ఏమత్తూడి ఎళ్కి యురైత్త ఉరైయతనై,
కొల్లినకర్క్కిఱై కూడఱ్కోమాన్ కులశేకరన్ ఇన్నిశైయిన్మేవి,
శొల్లియ ఇన్ తమి*ళ్*మాలై పత్తుమ్ శొల్లవల్లార్క్కు ఇల్లై తున్బమ్ తానే 10

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

ఇళ ఆయ్చ్చిమార్కళ్ = లేత వయస్సులోని గోపికలు, అల్లి మలర్ తిరుమఙ్గై కేళ్వన్తన్నై నయన్దు = తామరపూవులో పుట్టిన లక్ష్మీదేవికి వల్లభుడైన శ్రీకృష్ణుని అభిలషించి, ఎల్లి ఏమ ప్పొ*ళు*దినిల్ = రాత్రి నడుజాములో, ఊడి = ప్రణయకలహం ఆడి, ఎళ్కి = దానితో అభినివేశాన్ని పొంది, ఉరైత్త = పల్కిన, ఉరై అతనై = పాశురాలను, కొల్లి నకర్క్కు ఇఱై = కొల్లినగరానికి ప్రభువు, కూడల్ కోమాన్ = మధురకు అధిపతిఅయిన, కుల శేకరన్ = కులశేఖరా*ళ్వా*ర్లు, ఇన్ ఇశైయిల్ మేవి = తీయని రాగంలో అన్వయించేటట్లుగా, శొల్లియ = పల్కిన, ఇన్ తమి*ళ్* = తీయని ద్రావిడ పాశురాలను, శొల్లవల్లార్క్కు = అభ్యసించగలవారికి, తున్బమ్ తాన్ ఇల్లై = (భగవదనుభవానికి అడ్డు అయిన) దుఃఖం ఏదీ ఉండదు.

**వ్యా :- నిగమత్తిల్. (అల్లిమలర్ తిరుమఙ్గై కేళ్వన్తన్నై నయన్దు) పరమప్రణయియాన శ్రీకృష్ణనైయాశై ప్పట్టు. (ఇళవాయ్చ్చిమార్కళ్) అవనైప్పోలే ఏఱిమఱిన్ద పరువ మన్ఱియే పాడా*ఱ్ఱ*మాట్టాత ఇళవాయ్చ్చిమార్కళ్. (ఎల్లి ప్పొ*ళు*తినిలేమత్తు) విలక్కువార్ ఇల్లాత మధ్యరాత్రత్తిలే. (ఊడి యెళ్కి యురైత్త ఉరైయతనై) ఊడి అత్తాలే ఈడుపట్టు, అవ్వీడు పాడుతాన్ శొల్లాయ్ వ*ళి*న్దు పుఱప్పట్టతు ఎన్నలామ్బడియాన పాశురత్తై. (కొల్లి నకర్క్కిఱై కూడల్ కోమాన్) కొల్లిఎన్ఱు - శో*ళ*న్పడైవీడు. కూడలెన్ఱు - పాణ్డియన్ పడైవీడు. "కో*ళి*క్కోన్" ఎన్ఱు మున్బే శొల్లివైత్తార్. మూన్ఱు రాజ్యత్తుక్కుమ్ కడవరాన శ్రీకులశేఖరప్పెరుమాళ్. శ్రీగోపిమార్తఙ్గళ్ స్త్రీత్వాభిమాన మెల్లామ్ అ*ఱ్ఱు*చ్చొన్నాప్పోలే ఇవరుమ్ పెరియ అభిమానమెల్లా మఱుత్తపడి.**

**(ఇన్నిశైయిల్ మేవి చ్చొల్లియ ఇన్తమి*ళ్*మాలై పత్తుమ్) "పాఠ్యే గేయే చ మధురమ్"- ఎన్నుమ్బడియాన తమి*ళ్*త్తొడై పత్తుమ్. (శొల్లవల్లార్క్కిల్లై త్తున్బన్దానే) ఇవరుడైయ భావబన్ధ మిల్లై యాకిలుమ్ ఇవై క*ఱ్ఱ*వర్కళుక్కు భగవదనుభవత్తుక్కు విచ్ఛేద శఙ్కై పిఱవాతే నిరన్తరానుభవమాయ్, భగవచ్చెల్లప్పెఱువర్కళ్. సమ్భోగమధ్యే పిఱక్కు మతిశే - ఊడలావతు. "ఉన్ తలై పత్తు" "ఎన్ తలై పత్తు" ఎన్ఱు ముడియ ఊడలాయ్ చ్చెల్లు మనుభవత్తై ప్పెఱువర్కళ్.**

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్

**పెరుమాళ్ తిరుమొ*ళి* - ఆఱామ్ తిరుమొ*ళి* వ్యాఖ్యానమ్ ము*ఱ్ఱి ఱ్ఱు***

*అరు :- నిగమత్తిల్. కో{ళి}యాన వుఱైయార్ - శో{ళ}న్ పడైవీడు - అవర్కళ్ శొన్నత్తై ఇవర్క్కు చ్చొల్లవేణ్డువానెన్ ఎన్ ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (శ్రీగోపిమారిత్యాది). అన్ద అవస్థైయాలే గర్వత్తాలే, ఉన్ తలై పత్తో ఎన్ తలై పత్తో- ఎన్ఱు శొల్లుమ్ వార్తై.*



**భావదీపిక :- అవ :-** ఈ దశకాన్ని అనుసంధించేవారికి కలిగే ఫలాన్నిగూర్చి ఈ పాశురంలో పల్కి పూర్తి చేస్తున్నాను.

**వ్యాఖ్యానం :- (అల్లి మలర్ తిరుమఙ్గై కేళ్వన్తన్నై నయన్దు)** - తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి భర్త అయిన శ్రీకృష్ణుని అభిలషించి. **"అల్లిమలర్ తిరుమఙ్గైకేళ్వన్"** అనే విశేషణంవల్ల తన పట్ల ప్రేమను చూపే చిన్ని గోపికలపట్ల గొప్ప ప్రేమను కలవాడితడు- అని స్ఫురిస్తున్నది.

**(ఇళవాయ్చ్చిమార్కళ్)** - అతనివలె పరిణతి చెందిన వయస్సును కలవారు కాకుండా, అతనిని విశ్లేషించి, సహించలేని చిన్నవయస్సును కల గోపికలు.

**(ఎల్లి ప్పొ{ళు}దిల్ ఏమత్తు)** - వీరు కలిసి ఆనందించడాన్ని అడ్డు పెట్టేవారెవరూ లేని ఆ రాత్రి నడిజాములో.

**(ఊడి ఎళ్కి ఉరైత్త ఉరైయతనై)**- కలహించి, అందువల్ల అభినివేశాన్నిపొంది, ఆ అభినివేశమే వాక్కుగా వెలువడింది" అని చెప్పదగిన పాశురాలను

**(కొల్లి నకర్క్కు ఇఱై కూడల్ కోమాన్)** - **"కొల్లి"** అనే పదం చేరదేశరాజధాని అయిన **"తిరువఞ్జిక్కళమ్"**ను తెలుపుతుంది. **"కూడల్"** అనేది పాండ్యదేశ రాజధాని అయిన **"దక్షిణమధుర"**ను తెలుపుతుంది. **"కో{ళి}క్కోన్"** (2-10) అని ఇంతకుముందే అన్నారు. **"కో{ళి}"** అనేపదం చోళ దేశరాజధాని **"ఉఱైయూర్"** ను తెలుపుతుంది. ఈ రీతిలో చేర- పాండ్య- చోళ దేశాలు మూడింటికి ప్రభువు కులశేఖరప్పెరుమాళ్- అని భావం. చిన్ని గోపికలు తమ స్త్రీత్వానికి తగిన అభిమానం అంతా తొలగిపోయిన విషయాన్ని పల్కినట్లే, ఈ విధంగా వీరు మూడు దేశాలకు నాథులై ఉండే తమ అభిమానం అంతా తొలగడాన్నిగూర్చి తెలిపారు- అని స్ఫురిస్తున్నది.

**(ఇన్నిశైయిల్ మేవి చ్చొల్లియ ఇన్ తమి{ళ్} మాలై పత్తుమ్)** - **"పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్, జాతిభి స్సప్తభి ర్బద్ధం తంత్రీలయసమన్వితమ్"** (రామా-బాల-4-8) (పఠించేటపుడు, పాడేటపుడు మధురమైనది, ద్రుత-మధ్యమ-విలంబితాలనే మూడు ప్రమాణాలతో కూడినది, షడ్జ- నిషాద- దైవత- పంచమ-మధ్యమ- గాంధార- ఋషభాలనే ఏడు జాతులతో కూడినది. వీణాతంత్రులతో,

తాళాలతో సమన్వయం కల్గినదైన శ్రీరామాయణకావ్యాన్ని కుశలవులు గానం చేశారు) అని చెప్పబడ్డ శ్రీరామాయణంవలె మధురంగా, రాగంతో సమన్వయించేటట్లుగా అనుగ్రహించిన ద్రావిడ పాశురాలను పదింటిని.

**(శొల్లవల్లార్క్కు ఇల్లై తున్బమ్తానే)** – వీరి నాయకీభావం లేకపోయినా, ఈ పది పాశురాలను అనుసంధించ గల్గినవారు, భగవదనుభవంలో ఆటంకం కల్గుతుందా? అనే భయంవల్ల కలిగే దుఃఖం లేకుండా, నిత్యం భగవదనుభవం సిద్ధించే ప్రయోజనాన్ని పొందుతారు. ఈ దశకంలోవలె భగవానునితో కలిసి, అనుభవించడానికి మధ్యలో కలిగే ప్రణయకలహం లేకుండా, భగవదనుభవమేయాత్రగా కల్గి ఉంటారని తాత్పర్యం.

**ఆఱవదశకం వ్యాఖ్యానానువాదం ముగిసింది**

## ఏழாమ్ తిరుమొழி – ఆలైనీళ్ – ప్రవేశమ్

**అవ :– పిరాట్టి, తిరువడియై క్కణ్డవాతే ప్రణయరోషమ్ తలై ఎడుత్తు, "పితుర్వచన పరిపాలనమ్ పణ్ణప్పోన్దార్ ఎన్గిరే పెరుమాళై ఉజ్గళ్ గోష్ఠియిలే ప్రసిద్ధమా యిరుప్పత్తు; ఇప్పోతు అజ్గనన్ఱు కాణ్. తమ్మై విశ్వసిత్తు క్కైకొదుత్త ఎన్నై విడుకైక్కాక క్కాణ్. "రక్షితా జీవలోకస్య ఎన్గిఱత్తై యుమ్ విట్టారితే" ఎన్ఱు కిలాయ్‌త్తు ప్పోలే కిలాయ్‌త్తార్ ఇవరుమ్– కీழ்ల్ తిరుమొழியిలే. సర్వాత్మాక్కళుక్కుమ్ పిరాట్టిమారోపాతి ప్రాప్తి యుణ్డెన్నుమ్బడి భగవద్విషయత్తిలే అవగాహిత్తవరాకైయాలే ఇవర్ కిలాయ్‌త్తార్.**

**ఇప్పడి కిలాయ్‌క్కైక్కు పాప్తి యుణ్డాయిరుక్కిఱవిషయత్తై అనాదికాలమ్ ఇழన్దో మెన్గిఱ ఇழవు వన్దు తలైయెడుత్తు, మున్బు కృష్ణనై ప్పెఱ్ఱవైత్తు బాల్యావస్థైయిల్ అవన్ శెయల్కళై అనుభవిక్కప్పెఱాతే ఇழన్దిరున్ద కంసవధపర్యన్తమాక మున్బుళ్ళ విరోధికళై ఎల్లామ్ పోక్కి, తజ్గళ్ ముకత్తిలే విழித్త కృష్ణనై క్కణ్డపోతు కీழ் అనుభ విక్కప్పెఱాత ఇழవుకళై చ్చొల్లి క్కూప్పిట్ట దేవకియార్‌పాశురత్తాలే అనాదికాలమ్ తామ్ ఇழన్ద ఇழవై చ్చొల్లుకిఱార్ – ఇత్తిరుమొழியిలే.**

***అరు :– ఆలై ప్రవేశే. "ధర్మాపదేశా త్త్యజత శ్చ రాజ్యం మాఞ్చాప్యరణ్యం నయతః పదాతిమ్, నాసీద్వ్యథా తస్య న భీ ర్న శోకః కచ్చిత్సధైర్యం హృదయే కరోతి" ఎన్గిఱ శ్లోకత్తై ఉట్కొణ్డరుళిచ్చెయ్‌కిఱార్ (పిరాట్టి యిత్యాది.)***

### ఏడవ దశకం – ప్రవేశం – అనువాదం

**భావదీపిక :–** సీతాదేవి అశోకవనంలో ఉన్నపుడు, హనుమానుని చూడగానే "శ్రీరాముడు తన శక్తిని ఉపయోగించి, లంకలోనుండి నన్ను తిరిగి తీసికొనిపోకుండా

ఉన్నాడే" అనే ప్రేమవల్ల కల్గిన కోపం అతిశయించి, **"ధర్మాపదేశా త్త్యజత శ్చ రాజ్యం మాం చాప్యరణ్యం నయతః పదాతిమ్, నాసీత్ వ్యథా తస్య న భీ ర్నశోకః కచ్చిత్ స ధ్యైరం హృదయే కరోతి"** (రామా. సు-36-29) (ధర్మం అనే వ్యాజంతో రాజ్యాన్ని విడచి, నన్ను అరణ్యానికి కాలినడకపై పిలుచుకొని వచ్చినవానికి వ్యథకాని, భయంకాని, శోకం కాని లేదు. అటువంటి ఆ శ్రీరాముడు నన్ను విశ్లేషించిన తరువాత ధైర్యంతో ఉన్నాడే!) అనే శ్లోకంలో, "తండ్రి మాటను రక్షించాలి అనే కారణంతో అతడు అరణ్యానికి వచ్చాడని మీరంతా అనుకుంటున్నారు. అందుకోసం రాలేదని ఇపుడు తెలుస్తున్నది. ఇతనిని నమ్మి, పాణిగ్రహణాన్ని చేసిన నన్ను విడిచిపెట్టడం కోసమే అరణ్యానికి వచ్చాడు. **"రక్షితా జీవలోకస్య స్వజనస్య చ రక్షితా"** (శ్రీరాముడు లోకాలను అన్నిటినీ కాపాడేవాడు, స్వజనాన్ని రక్షించేవాడు) అనే గొప్పతనాన్నికూడా విడిచిపెట్టాడే" అని అంటూ శ్రీరామునిగూర్చి ప్రణయరోషంతో పల్కినట్లే, కులశేఖరులుకూడా నాయకీభావాన్ని పొంది గత దశకంలో భగవానునితో ప్రణయకలహ మాడారు. భగవానునితో దివ్యదేవేరులకు (భర్తృ-భార్యా) సంబంధం ఉన్నట్లే జీవులందఱికి ఉన్నది. అందువల్ల అందఱు పురుషోత్తముడైన అతనికి పత్నులే- అన్నది తెలిసికొని, భగవానుని విషయంలో అభినివేశాన్ని పొందేవారు కనుక, గత దశకంలో వీరు ప్రణయకలహమాడారు. ఈ విధంగా ప్రణయరోషంతో పలుకడానికి తగిన సంబంధాన్ని కల భగవానుని అనాదికాలంగా కోల్పోయామే! అనే కొఱత ఈ ఆழ்వార్లకు తల ఎత్తింది. అందువల్ల వీరు దేవకీదేవి స్థితిని పొంది, శ్రీకృష్ణునిపట్ల తమ ఆశనుగూర్చి పల్కుతూ, దేవకిదేవి విలపించే భావనతో తమ ఆశను ఆవిష్కరించే పాశురంగా ఈ దశకం ఆవిర్భవించింది. దేవకి శ్రీకృష్ణుని కుమారునిగా పొందినా, జన్మించిననాడే అతనిని రేపల్లెకు పంపివేసినది కనుక, చిన్నబిడ్డగా ఉన్నపుడు అతని లీలలను అనుభవించలేక కోల్పోయింది. కంసుని సంహరించి, తన తల్లి పొందడానికి అడ్డుగా ఉండేవాటిని అంతటిని పోగొట్టగా, తమ ముందు సాక్షాత్కరించిన శ్రీకృష్ణుని దర్శించినపుడు, చిన్న వయస్సులో తాను అతని లీలలను అనుభవించలేని కొఱతలను గూర్చిపలికే దేవకి వాక్కులతో ఈదశకంలో ఆழ்వార్లు విలపిస్తున్నారు.



**ఆలైనీళ్ కరుమ్బన్నవన్ తాలో! అమ్బుయ త్తడఙ్గణినన్ తాలో!,**
**వేలైనీర్ నిఱత్తన్నవన్ తాలో! వేழப్పోతక మన్నవన్ తాలో!,**
**ఏలవార్కుழలెన్మకన్ తాలో! ఎన్ఱెన్ఱు ఉన్నై ఎన్ వాయిడై నిఱైయ,**
**త్తాలొలిత్తిడుమ్ తిరువినై ఇల్లా త్తాయరిల్ కడైయాయిన తాయే** 1

ఆలై నీళ్ కరుమ్బు అన్నవన్ = (చెఱకురసం తీసే) యంత్రంలో పెట్టి రసం పిండడానికి తగినట్లు పొడవుగా ఉండే చెఱకువంటివాడా!, తాలో = నీకు జోల, అమ్బుయమ్ = తామరపూవువంటి, తడమ్ కణ్ణినన్ = విశాలమైన తిరునేత్రాలను కలవాడా!, తాలో = నీకు జోల, వేలై నీర్ నిఱత్తు అన్నవన్ = సముద్రజలం వర్ణం వంటి వర్ణాన్ని కలవాడా!, తాలో = నీకు జోల, వేతమ్ పోతకమ్ అన్నవన్ = గున్నఏనుగు లీలలవంటి లీలలను కలవాడా!, తాలో = నీకు జోల, ఏలమ్ వార్ కుழల్= పరిమళం నిండుగా ఉండే కేశపాశాన్ని కల, ఎన్ మకన్ = నా కుమారా!, తాలో = నీకు జోల, ఎన్ఱు ఎన్ఱు = ఈవిధంగా పలు మార్లు పల్కి, ఎన్ వాయిడై నిఱైయ = నా నోరు ఆనందించేటట్లుగా (నోరార), ఉన్నై = నిన్ను, తాల్ ఒలిత్తిడుమ్ తిరు వినై ఇల్లా = జోలపాడే సంపద లేని, తాయరిల్ = తల్లులలో, కడై ఆయిన తాయ్ = తక్కువ తల్లులలో కడపటి తల్లిని.

**వ్యా :- ముతఱ్పాట్టు. (ఆలై నీళ్ కరుమ్బన్నవన్ తాలో) శమైయ వళర్న్ద ఆలైక్కరుమ్బు పోలే రసనేన్ద్రియత్తుక్కు ఇనియనానవనే! (అమ్బుయ త్తడజ్గణ్ణినన్ తాలో) వికాసమ్, శెవ్వి, కుళిర్త్తి, మెన్మైయియుడైయ తామరైప్పూపోలే ఇరుక్కిఱ తిరుక్కణ్గళై క్కొణ్డు ఎన్నై క్కుళిర నోక్కుకిఱవనే! ఎన్ఱు చక్షురిన్ద్రియత్తుక్కు ఇనితాయిరుక్కిఱపడి శొల్లుకిఱార్. (వేలై నీర్ నిఱత్తన్నవన్తాలో) అవయవజ్గళై ప్పిరిత్తు చ్చొల్లవేణుమో? అవయవియాన మేని శ్రమహరమాన కడల్పోలే యిరుక్కిఱవనే! (వేతప్పోతక మన్నవన్ తాలో) ఆనైక్కన్ఱుపోలే వైత్త కణ్ వాజ్గాతే పార్త్తపడియే యిరుక్కుమ్బడియాన చరితజ్గళై యుడైయవనే!**

**(ఏలవార్ కుழలెన్మకన్తాలో) ఇప్పడి ఉపమానజ్గళాల్ శొల్లవొణ్ణామైయాలే "ఎన్మకన్" ఎన్ను మిత్తనై. (ఎన్ఱెన్ఱున్నై యెన్ వాయిడై నిఱైయ త్తాలొలిత్తిడమ్ తిరు వినై యిల్లా) ఇప్పడి పలకాలుమ్ శొల్లి వాయార త్తాలాట్టుమ్ సమ్పత్తిల్లాత. (తాయరిల్ కడైయాయిన తాయే) పెఱుకైక్కు నోన్బు నోఱ్ఱు ప్పెఱ్ఱివైత్తు, అనుభవత్తిల్ కుఱైయ నిఱ్కైయాలే, పిళ్ళైకళై ప్పెఱ్ఱు అనుభవిక్కుమ్ తాయ్మారెల్లారిలుమ్ కడైయానేనితే నాన్!**

**భావదీపిక :- అవ:-** "చిన్న శిశువుగా ఉన్నపుడు నీకు జోలపాట పాడే అదృష్టానికి నోచుకోనిదానను అయ్యానే!" అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (ఆలై నీళ్ కరుమ్బు అన్నవన్ తాలో)** - మరలో (చెఱకురసం తీసే యంత్రంలో) పెట్టి పిండడానికి తగినట్లు దీర్ఘంగా పెరిగిన చెఱకుగడవలె, జిహ్వ అనే ఇంద్రియానికి భోగ్యమై ఉండేవాడా !, నీకు జోల.

**(అమ్బుయ త్తడమ్ కణ్ణినన్ తాలో)** - "వికాసం, కొత్తదనం, చల్లదనం, మెత్తదనం- అనే విశిష్టతలను కల తామరపూవువలె ఉండే తిరునేత్రాలతో నన్ను చల్లగా కటాక్షించే వాడా!" అని కన్ను అనే ఇంద్రియానికి స్వామి భోగ్యుడై ఉండడాన్నిగూర్చి పల్కుతున్నారు.

**(వేలై నీర్ నిఱత్తు అన్నవన్ తాలో)** – ఒక్కొక్క అవయవానికి భోగ్యమై ఉండే స్థితిని ప్రత్యేక ప్రత్యేకంగా చెప్పాలా! ఆ అవయవాలను కల తిరుమేనితో శ్రమను తీర్చే సముద్రంవలె ఉన్నవాడా!

**(వే౧ప్పోతకమ్ అన్నవన్తాలో)** – గున్నఏనుగువలె చూచిన చూపు తిప్పుకోలేనట్లుగా చూస్తూనే ఉండేటట్లుండే లీలలను కలవాడా !

**(ఏలవార్ కు౧ల్ ఎన్ మకన్ తాలో)** – ఈ విధంగా ఎన్ని ఉపమానాలు చెప్పినా చాలనందువల్ల, పరిమళం నిండుగా ఉండే కేశపాశాన్ని కలవాడా ! అని అంటూ శ్రీకృష్ణుని సంబోధిస్తున్నారు.

**(ఎన్రు ఎన్రు ఉన్నై ఎన్ వాయిదై నిఱైయ త్తాల్ ఒలిత్తిడుమ్ తిరువినై యిల్లా)** – ఈ విధంగా పలు రీతులలో పల్కి నోరారా జోలపాడే సంపదను కోల్పోయిన.

**(తాయరిల్ కదై ఆయిన తాయే)** – కొడుకును కనడంకోసం నోము నోచి, కని, ఆనందాన్ని అనుభవించని తల్లులు అందఱిలో చాలా అధమను అయిన దానిని అయ్యానే! నేను– అని ఆ౧్వార్లు వాపోతున్నారు.

**వడిక్కొళఞ్జన మె౧ుతు శెమ్మలర్క్కణ్ మరువి మేలినిత్తొన్డినై నోక్కి,**
**ముడక్కి చ్చేవడి మలర్చ్చిఱు కరున్దాళ్ పొలియుమ్ నీర్ ముకిఱ్కు౧వియే పోల,**
**అడక్కియార చ్చెఞ్జిఱు విరలనైత్తుమ్ అఙ్గైయోడు అణైన్దు ఆనైయిఱ్కిడన్ద,**
**కిడక్కై కణ్డిడ ప్పెఱ్గిలేన్ అన్దో! కేశవా! కెడువేన్ కెడువేనే** **2**

వడి క్కొళ్ = నైశిత్యాన్ని (పదునును) కల్గినదై, అఞ్జనమ్ ఎ౧ుదు = కాటుక పూయబడినదై, శెమ్ మలర్ కణ్ = ఎఱ్ఱ తామరలో సాటి వచ్చే తిరునేత్రాలతో, మేల్ ఒన్డినై = మేలుకట్టులో వేలాడే ఒక క్రీడాపరికరాన్ని, ఇనితు = భోగ్యంగా, మరువి నోక్కి= పొందికగా చూస్తూ, కరు తాళ్ = నల్లని పైపాదాలను, మలర్ శిఱు శే అడి = ఎఱ్ఱ తామరలవంటి ఎఱ్ఱని అరికాళ్ళను కల శ్రీచరణాలను, ముడక్కి = మడచుకొని, నీర్ పొలియుమ్ = ఆ కంఠం నీటిని తాగి ప్రకాశించే, ముకిల్ కు౧వి పోల్ = పిల్ల మేఘంవలె, శెమ్ శిఱు విరల్ అనైత్తుమ్ = అందమైన చిన్ని వేళ్ళను అన్నిటిని, అమ్ కై యోడు = అరచేతిలో, అడక్కి ఆర = అణగి ఉండేటట్లు, అణైన్దు = మడచి పట్టుకొని, ఆనైయిల్ కిడన్ద కిడక్కై = ఏనుగు కూర్చున్నట్లుగా పరుండిన అందరాన్ని, కణ్డిడ పెఱ్గిలేన్= దర్శించి ఆనందిచలేకపోయాను, అన్దో! = అయ్యో !, కేశవా = కేశసౌందర్యాన్ని కలవాడా!, కెడువేన్ కెడువేన్ = ఏ ఒక్కటినీ అనుభవించలేని మహాపాపిని అయ్యాను.

**వ్యా :– ఇరణ్డామ్పాట్టు. (పడిక్కొళఞ్జన మె౧ుతు శెమ్మలర్ క్కణ్) కూర్మైయై యుడైయ శెమ్మలర్క్కణ్ ఎన్నుతల్; తిరుక్కణ్ణుక్కీడాక వడిక్కప్పట్ట అఞ్జనత్తైయుడైయ కణ్ణెన్నుతల్.**

**శెమ్మలర్ - శివన్ద తామరైపోలే ఇరున్దుళ్ళ. (మరువి మేలిని తొన్ఱినై నోక్కి) పిళ్ళైయై త్తొట్టిలిలే వళర్త్తి, అనన్యపరనాయ్ పార్త్తుక్కిడక్కైక్కాక మేలే ఒన్ఱై త్తూక్కి వైప్పార్కళితే, అత్తై ఇవియనాయ్ క్కొణ్డు సదాదర్శనమ్ పణ్ణిక్కిడక్కుమితే. (ముడక్కి చ్చేవడి మలర్చ్చిఱు కరున్దాళ్) అఙ్గు క్కిడక్కుమ్బడి శొల్లుకిఱతుమేల్. పుఱవాయ్ కఱుత్తు అకవాయ్ శివన్ద తిరువడికళై ముడక్కి. (పొలియుమ్ నీర్ ముకిల్ కుழవియే పోల) కழుత్తే కట్టళైయాక నీరై ప్పరుకి*న్ఱ్*నొరు మేఘకన్ఱుపోలే.**

**(అడక్కియార చ్చెఙ్జీఱు విరలనైత్తు మఙ్గైయోడఙైన్దు) శెఱిన్దు, అழకితాన తిరువిరల్కళై ఉళ్ళఙ్గైయిలే అడఙ్గుమ్బడి మడిత్తు ప్పిడిత్తు. (ఆనైయిల్ కిడన్ద కిడక్కై కణ్డిడ ప్పెఱ్ఱిలేనన్దో) ఆనైతన్ అవయవఙ్గళై ప్పొకట్టు స్వైరమాక క్కిడన్దాప్పోలే తొట్టిలిలే కిడక్కుమ్పోతు అనుభవిక్క ప్పెఱ్ఱిలేనెన్ఱు ఐయో! ఎన్గిఱాళ్. (కేశవా! కెడువేన్ కెడువేనే) అప్పోతై త్తిరుక్కుழలழక్కై అనుభవిక్కవుమ్ పెఱ్ఱిలేన్. మున్బు మలదు నిన్ఱు ఇழన్దేన్. పిన్బు పెఱ్ఱువైత్తే అనుభవిక్కప్పెఱాతే ఇழన్దేన్. ఇరణ్డాలుమ్ మహాపాపియితే నాన్.**

*అరు :- ఇరణ్డామ్పాట్టు. (వడిక్కొళిత్యాది). (ఆనైయిల్) ఉపమార్థే పఞ్చమి. ఆనైపోలే ఎన్ఱపడి.*

**భావదీపిక :- అవ :-** నీవు చిన్నబిడ్డగా ఉన్నప్పటి అందాన్ని దర్శించలేని మహాపాపిని అయ్యానే! అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (వడిక్కొళ్ అఞ్జనమ్ ఎழుదు శెమ్మలర్ క్కణ్)** - (పదును కల్గినదై) సూటిగా ఉండేదై, కాటుక పూసినదైన, ఎఱ్ఱతామరతో సాటి వచ్చే తిరునేత్రాలు. వడి- మొనతేలి ఉండడం- అని అర్థం. ఆవిధంగా కాకుండా తిరునేత్రాలకు మంట కలుగకుండా చల్లగా ఉండేటట్లు, వడిగట్టిన కాటుకచూర్ణం పూయబడ్డ తిరునేత్రాలు- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. **"శెమ్మలర్కణ్"** అనే ప్రయోగానికి ఎఱ్ఱని తామరవలె ఉండే నేత్రం- అని అర్థం.

**(మరువి వేల్ ఇనితు ఒన్ఱినై నోక్కి)** - చిన్నబిడ్డను తొట్టిలో పెట్టి, అతడు ప్రేమతో ఏ ఆటవస్తువును అయినా చూస్తూ ఉండడంకోసం పైన ఒక క్రీడాపరికరాన్ని తల్లులు వేలాడదీస్తారు కదా! బిడ్డకూడా ఆనందంతో కేరింతలు కొడుతూ దానిని ఎల్లప్పుడూ చూస్తూ ఉంటాడు. దానినే "పైన ఉండే ఒక వస్తువును ఆనందంగా దృష్టి సారించి చూస్తూ" అని పాశురంలో అన్నారు.

**(ముడక్కి చ్చేవడి మలర్చ్చిఱు కరున్దాళ్)** - అక్కడ శ్రీకృష్ణుడు పరుండి ఉండే అందాన్నిగూర్చి ఇకపై తెలుపబడుతున్నది. పైపాదం నల్లని రంగును కల్గినదై, అరికాలు ఎఱ్ఱని రంగును కల శ్రీచరణాలను మడచుకొని.

**(పొలియుమ్ నీర్ ముకిల్ కు౧్ళవియేపోల)** – గొంతువరకు నీటిని తాగిన మేఘశకలంవలె

**(అడక్కి ఆర చ్చెఙ్జేఱు విరల్ అనైత్తుమ్ అఙ్గైయోడు అణైన్దు)** – నిబిడంగా, అందంగా ఉండే కాలివేళ్ళు అరచేతిలో అణగిఉండేటట్లు మడచి, పట్టుకొని ఉండి.

**(ఆనైయిల్ కిడన్ద కిడక్కై క్కణ్డిడ ప్పెఱ్ఱిలేన్ అన్దో !)** – ఏనుగు తన అంగాలను సాగదీసికొని, కట్టుబాటు లేకుండా స్వతంత్రంగా పరుండి ఉండేటట్లుగా, తొట్టిలో పరుండి ఉండేటపుడు దర్శించలేకపోయానే! అయ్యో! అని తన బాధను వ్యక్తం చేస్తున్నారు. (వెళ్ళగక్కుతున్నారు.)

**(కేశవా! కెడువేన్ కెడువేనే)** – ఇక్కడ కేశవశబ్దం కేశసౌందర్యాన్ని కల్గి ఉండడాన్ని తెలుపుతుంది కనుక, చిన్నబిడ్డగా ఉండేటప్పటి కేశసౌందర్యాన్ని అనుభవించలేకపోయానే!– అని భావం. **"కెడువేన్ కెడువేనే"** అని రెండు మార్లు అనడంద్వారా నిన్ను కనడానికిముందు, పుట్టిన వెంటనే బిడ్డలను బలి ఇచ్చినందువల్ల సంతానహీననై పడి ఉన్నాను; నిన్ను కన్న తర్వాత కూడా వెంటనే నిన్ను రేపల్లెకు పంపించి వేసినందువల్ల నీ బాల్యానుభవాన్ని అనుభవించలేక చెడ్డాను. రెండు సమయాలలోను మహాపాపాన్ని చేసినదానిని అయ్యాను– అని తెలుపుతున్నారు.

**మున్నై నన్ముఱైయన్బుడై మకళిర్ ముఱై ముఱై తన్దఙ్గుఱఙ్గిడై యిరుత్తి,**
**ఎన్నైయే! ఎన్తన్ కులప్పెరుఞ్జుడరే! ఎ౧్ళు ముకిల్ కణత్తె౧్ళిల్కవరేఱే!,**
**ఉన్నై యావన్ ఎన్నురైప్ప నిన్ శెఙ్గే౧్ళ్ విరలినుమ్ కడైక్కణ్ణినుమ్ కాట్ట,**
**నన్దన్ పెఱ్ఱనన్ నల్వినై ఇల్లా నఙ్గళ్‌కోన్ వశుతేవన్ పెఱ్ఱిలనే** 3

అన్బు ఉడై = ప్రేమను కలవారైన, మున్నై నల్ ముఱై మకళిర్ = పరంపరగా ఉండే చక్కని సంబంధబాంధవ్యాలను కల స్త్రీలు, తమ్ తమ్ కుఱఙ్గిడై = తమ తమ తొడలపై, ముఱై ముఱై = ఒకరి తర్వాత ఇంకొకరు, ఇరుత్తి = పెట్టుకొని, ఎన్నైయే = ఓ తండ్రీ, ఎన్‌తన్ కులమ్ పెరుమ్ శుడరే = మా కులానికి గొప్ప దీపం వంటివాడా!, ఎ౧్ళు ముకిల్ కణత్తు = ఏడు విధాలైన మేఘసమూహాల, ఎ౧్ళిల్ కవర్ = అందాన్ని పుణికి పుచ్చుకొన్న, ఏఱే = సింహవంటివాడా! (అని పలు విధాలుగా స్తుతించి), ఉన్నై యావన్ ఎన్ఱు ఉరైప్ప= "నీ తండ్రి ఎవరో చూపించు" అని అనగానే, నిన్ = నీయొక్క, శెమ్ కే౧్ళ్ విరలినుమ్ = ఎఱ్ఱని వర్ణాన్ని కల వేళ్ళతో, కడై కణ్ణినుమ్ = కడగంటి చూపులతోను, కాట్ట = చూపించగా (ఆభాగ్యాన్ని) నన్దన్ పెఱ్ఱనన్ = నందగోపాలుడు పొందాడు, నల్ వినై ఇల్లా నఙ్గళ్ కోన్ = భాగ్యహీనను అయిన నా భర్త, వశుతేవన్ = వసుదేవుడు, పెఱ్ఱిలన్ = పొందలేకపోయాడు.

**వ్యా :- మూన్హామ్బాట్టు. (మున్దై నన్ముత్తె అన్బుడైమకళిర్) తాయ్‌మార్. అవర్‌కళుడైయ తాయ్‌మార్, పాట్టిమారెల్లారుమ్. (ముత్తై ముత్తై తమ్‌తమ్ కుఱఙ్గిడై యిరుత్తి) తన్దమ్ అవ్వో అడైవుకళిలే కుఱఙ్గుకళిలే వైత్తుక్కొణ్డు. (ఎన్దైయే యెన్తన్ కులప్పెరుఙ్జుడరే ఎఴుముకిల్ కణత్తెఴిల్ కవరేఱే) ఎన్తన్ తమప్పనే! ఎఙ్గళ్ కులత్తుక్కు విళక్కానవనే! ఏఴువకైప్పట్ట మేఘసమూహఙ్గళినుడైయ అఴకై క్కవర్న్ద సింహమోలే ఇరుక్కిఱవనే!**

**(ఉన్దైయావ నెన్ఱురైప్ప) ఇప్పడి స్తోత్రఙ్గళై పణ్ణి ఉఙ్గళ్ తమప్పనార్ ఆరెన్ఱు కేట్క. (నిన్ శెఙ్గేఴ్ విరలినుమ్ కడక్కణ్ణినుమ్ కాట్ట నన్దన్ పెఱ్ఱనన్) శివన్ద విరలాలుమ్ కణ్ణాలుమ్ కాట్ట శ్రీనన్దగోపర్ పెఱ్ఱార్. (నల్వినై యిల్లా నఙ్గళ్ కోన్ వశుతేవన్ పెఱ్ఱిలనే) భాగ్యహీనైయాన ఎన్నై క్కైప్పిడిక్కైయాలే శ్రీవసుదేవరుమ్ ఇఴన్దారే.**

***అరు :- మూన్హామ్బాట్టు (మున్దైయిత్యాది). “మున్దై మకళిర్” ఎన్ఱు - పాట్టియారామ్ తాయారుడైయ పాట్టియారై చ్చొల్లుకిఱతు.***

**భావదీపిక :- అవ :-** నేను కోల్పోవడమే కాదు, నన్ను చేపట్టినందువల్ల వసుదేవుడు కూడా కోల్పోయాడు కదా! అని అంటున్నది.

**వ్యాఖ్యానం :- (మున్దై నన్‌ముత్తె అన్బుడై మకళిర్)** - ప్రేమను కలవారై, చక్కని సంబంధాన్ని కల తల్లులు స్త్రీలు, వారి తల్లులు, మాతామహి, పితామహివంటివారు అందరు.

**(ముత్తై ముత్తై తమ్ తమ్ కుఱఙ్గిడై ఇరుత్తి)** - తమ తమ సంబంధాల వరుసకు తగినట్లుగా తమ తమ తొడలపై పెట్టుకొని,

**(ఎన్దైయే ఎన్‌తన్ కులప్పెరుఙ్జుడరే ఎఴు ముకిల్ కణత్తు ఎఴిల్ కవర్ ఏఱే)** - నా తండ్రీ! నాకులానికి గొప్పదీపం వంటివాడా! ఏడు విధాలైన మేఘాల సమూహాల అందాన్ని గెలిచిన సింహంవలె ఉన్నవాడా !

**(ఉన్దై యావన్ ఎన్ఱు ఉరైప్ప)** - ఈ విధంగా పొగడి, “నీ తండ్రి ఎవరు ?” అని ప్రశ్నించగా.

**(నిన్ శెఙ్గేఴ్ విరలినుమ్ కడైక్కణ్ణినుమ్ కాట్ట నన్దన్ పెఱ్ఱనన్)** - ఎఱ్ఱని వేళ్ళతో, కంటితో చూపించే అతిశయాన్ని నందగోపాలుడు పొందాడు.

**(నల్ వినై యిల్లా నఙ్గళ్ కోన్ వశుతేవన్ పెఱ్ఱిలనే)** - భాగ్యం లేనిదానను అయిన నా కరగ్రహణాన్ని చేసినందువల్ల శ్రీ వసుదేవుడు కోల్పోయాడుకదా!

**కళినిలా ఎఴిల్ మతిపురై ముకముమ్ కణ్ణనే! తిణ్ణై మార్వుమ్ తిణ్డోళుమ్,**
**తళిర్ మలర్ క్కరుఙ్గుఴల్ పిఱై యతువుమ్ తడఙ్గొళ్ తామరైక్కణ్గళుమ్ పొలిన్ద,**

**ఇళమైయిన్బత్తై ఇయిన్నైత్తన్ కణ్ణాల్ పరుకు వేత్కివళ్ తాయెన నినైన్ద,**
**అళవిల్ పిళ్ళైమై ఇన్బత్తై ఇழన్ద పావియేన్ ఎనతావి నిల్లాతే** 4

కణ్ణనే = శ్రీకృష్ణా!, కళినిలా = ఆనందాన్ని కల్గించే వెన్నెలయొక్క, ఎழిల్ మతి పురై = పూర్ణచంద్రునితో పోలిన, ముకముమ్ = తిరుముఖం, తిణ్ కై = బలిష్ఠాలైన చేతులు, మార్బుమ్ = వక్షఃస్థలం, తిణ్ తోళుమ్ = దృఢమైన బాహువులు, తళిర్ మలర్ కరు కుழల్ = లేలేత చిగుళ్ళను, పూలను కల, నల్లని కేశపాశం కింద వెలిగే, పిఱై అతువుమ్ = తృతీయాతిథి చంద్రునివంటి ఫాలభాగాన్ని, తడమ్ కొళ్ = విశాలం అయిన, తామరై కణ్గళుమ్ = తామరపూలవంటి తిరునేత్రాలు, (అనే వీటిని), పొలిన్ద ఇళమై ఇన్బత్తై = అందంతో వెలిగేటట్లుండే యౌవనశోభను, ఇన్ఱు = ఇపుడు, ఎన్ తన్ కణ్ణాల్ = నా కళ్ళతో, పరుకువేఱ్కు = పానం చేసే నాకు, ఇవళ్ తాయ్ ఎన నినైన్ద = 'ఈమె నా తల్లి" అని మాత్రం తెలిసేటట్లుగా, ఇన్బత్తై = ఆనందాన్ని, ఇழన్ద = (అనుభవించలేక) కోల్పోయిన, పావియేన్ ఎనతు = పాపి అయిననా, ఆవి = ప్రాణం,నిల్లాతు = ధరించి నిలువలేదు.

**వ్యా :- నాలామ్బాట్టు. (కళినిలా ఎழిల్ మతిపురై ముకముమ్) నిలావై యుడైయ పూర్ణచన్ద్రనైప్పోలే ఇరుక్కిఱ తిరుముకముమ్. (కణ్ణనే తిణ్ణై మార్వుమ్ తిణ్డోళుమ్) కృష్ణనే! శొల్లుకిఱ విలక్షణమాయ్, తిణ్ణితాయిరుక్కిఱ తిరుక్కైయుమ్, తిరుమార్వుమ్, తిరుత్తోళుమ్. (తళిర్ మలర్ క్కరుఞ్గుழల్ పిఱైయతువుమ్) తళిరైయుమ్, మలరైయుముడైత్తాయ్ ఇరుణ్డిరుక్కిఱ తిరుక్కుழలిన్ కీழ் ఉన్నేయమాన పిఱైపోలే విళఙ్గుకిఱ తిరునెర్ర్రియుమ్. (తడఙ్గొళ్ తామరైక్కణ్గళుమ్) ఒరు తామరైప్పూవే తటాక మెల్లామ్ విழుఙ్గుమ్బడి అలర్న్దాప్పోలే, తిరుమేని ఎల్లామ్ పరప్పుమాఱుమ్బడి అలర్న్ద తిరుక్కణ్గళుమ్.**

**(పొలిన్ద యిళమై యిన్బత్తై ఇన్నైత్తన్ కణ్ణాల్ పరుకు వేఱ్కు) ఇవ్వవయవశోభైకళాల్ విళఙ్గానిన్ఱుళ్ళ యౌవనావస్థైయిల్ అழకై ఎన్ కణ్ణాలే అనుభవిక్కిఱ ఎనక్కు. (ఇవళ్ తాయెన నినైన్ద వళవిల్ పిళ్ళైమై ఇన్బత్తై యిழన్ద పావియేన్) తాయొరుత్తియైయుమ్ అల్లతు వేఱొరుత్తరైయు మతియాత అతిశైశవమాయిరుక్కిఱ పరువత్తై అనుభవిక్కప్పెఱామైయాలే ఇప్పోతు కిట్టి అనుభవిక్క చ్చెయ్‌తేయుమ్ ఇழవే తలై ఎడుక్కుమ్బడియాన మహాపాపత్తై పణ్ణినేన్. (ఎనతావి నిల్లాతే) ఎన్ ప్రాణన్ ధరిక్కిఱతిల్లై.**

***అరు :- నాలామ్బాట్టు (కళినిలానిత్యాది). (శొల్లుకిఱ) "ఆయతా శ్చ" ఇత్యాదియాలే శొల్లుకిఱ - ఎన్ఱపడి. కణ్ణనే- సమ్బుద్ధి.***

**భావదీపిక :- అవ :-** నీబాల్యం లోని ఆనందాన్ని కోల్పోయిన పాపి అయిన నా ప్రాణం ఇక నిలువదు- అని అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (కళినిలాఎ*ఱ్రి*ల్ మతిపురై ముకముమ్)** – అందఱు ఆనందించే టట్లుగా నిండైన వెన్నెల వెలుగును కలపూర్ణ చంద్రునివలె ఉండే తిరుముఖం.

**(కణ్ణనే! తిణ్ కై మార్బుమ్ తిణ్ తోళుమ్)** – **"కణ్ణనే!"** అని సంబోధిస్తున్నది. **"ఆయతా శ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః"** (రామా. కి. 3-15) (పొడుగైనవి, గుండ్రంగా ఉన్నవి, పరిఘలవలె ప్రకాశించేవి, అన్ని ఆభరణాలతో అలంకరించదగినవి అయిన శ్రీరాముని బాహువులు ఏ కారణంచేత అలంకరింపబడలేదు) అని పొగడబడే గొప్పతనాన్ని కల్గినదై, దృఢంగా ఉండే చేతులను, వక్షస్సును, బాహువులను,

**(తళిర్ మలర్ క్కరుఙ్కుఴల్ పిఱై అతువుమ్)** – లేలేత చిగుళ్ళను, పూలను అలంకరించుకొన్నదై, చీకటివలె ఉండే నల్లని కేశపాశం క్రింద, "ఇది ఒక బాలచంద్రుడా !" అని అనేటట్లుండే ఫాలభాగాన్ని- అని భావం. ఉపమానం అయిన చంద్రవంకనే ఉపమేయం అయిన ఫాలభాగంగా నిర్దేశిస్తున్నారు.

**(తొడఙ్కొళ్ తామరై క్కణ్కళుమ్)** – ఒక తామరపూవు చెఱువు అంతా వ్యాపించి ఉండే రీతిలో వికసించినట్లుగా, తిరుమేని అంతా కన్నులేనా ? అని అనేటట్లు వికసించిన తిరునేత్రాలు.

**(పొలిన్ద ఇళమై ఇన్బత్తై ఇన్ఱు ఎన్ తన్ కణ్ణాల్ పరుకువేఱ్కు)** – ఈ అవయవ సౌందర్యాలతో ప్రకాశించే యౌవనశోభను ఇపుడు నా కళ్ళతో అనుభవించే నాకు

**(ఇవన్ తాయెన నినైత్త అళవిల్ పిళ్ళమై ఇన్బత్తై ఇ*ఴ*న్ద పావియేన్)** – చిన్నబిడ్డగా, తల్లి ఒక్కతెను తప్ప వేఱెవ్వరినీ తెలియని శైశవాన్ని అనుభవించలేనందువల్ల, ఇపుడు యౌవనదశను దర్శించి అనుభవించినా, దుఃఖమే అతిశయించి ఉండేటట్లుండే మహాపాపాన్ని చేశాను.

**(ఎనతు ఆవి నిల్లాతే)** –అటువంటి నా ప్రాణం ఇక ధరించలేదు.

**మరువి నిన్ తిరునె*ఱ్ఱి*యిల్ శుట్టి యశై తర మణివాయిడై ముత్తమ్**
**తరుతలుమ్, ఉన్దన్ తాతైయై ప్పోలుమ్ వడివు కణ్డుకొణ్డు ఉళ్ళముళ్ కుళిర,**
**విరలై చ్చెఞ్జిఱు వాయిడై చ్చేర్త్తు వెకుళియాయ్ నిన్ఱురైక్కు మవ్వురైయుమ్,**
**తిరువిలేన్ ఒన్ఱుమ్ పెఱ్ఱిలేన్ ఎల్లామ్ తెయ్వనఙ్గై యశోతై పెఱ్ఱాళే 5**

నిన్ తిరునె*ఱ్ఱి*యిల్ = నీ ఫాలభాగంలో, మరువుమ్ = పొందికగా వెలిగే, శుట్టి = చుట్టు ( ఆభరణం), అశై తర = కదలాడేటట్లు, మణి వాయిడై = అందమైన నోటితో, ముత్తమ్ తరుతలుమ్ = ముద్దును ఇవ్వడం, ఉన్తన్ తాతైయై పోలుమ్ = నీ

తండ్రివంటి, వడివు = నీ శరీరసౌందర్యాన్ని, కణ్డుకొణ్డు = నేను దర్శించి ఆనందించి, ఉళ్ళమ్ కుళిర = మనస్సులోపల చల్లబడేటట్లుగా, శెమ్ శిఱు వాయిదై = ఎఱ్ఱని చిన్న నోటిలో, విరలై శేర్‌త్తు = వేళ్ళను పెట్టుకొని, వెకుళియాయ్ నిన్ఱు = (నీవు) కోపంతో నిలచి, ఉరైక్కుమ్ అవ్వురైయుమ్ = పలికే ముద్దుమాటలు, అనే వీనిలో, ఒన్ఱుమ్ = ఏ ఒక్కటినీ, తిరు ఇలేన్ = భాగ్యహీనను అయిన నేను, పెఱ్ఱిలేన్ = అనుభవించలేక పోయాను, తెయ్‌వ నఙ్గై అశోతై = దైవకాంత అనదగిన యశోదా దేవి, ఎల్లామ్ పెఱ్ఱాళే = ఆ బాల్యచేష్టితాలను అన్నిటినీ అనుభవించగల్గింది.

**వ్యా :- అఙ్గామ్బాట్టు. (మరువి నిన్ తిరునెఱ్ఱియిల్ శుట్టి అశైతర) తిరునెఱ్ఱియిలే కూడ ప్పిఱన్దాప్పోలే ఇరుక్కుమ్ తిరుచ్చుట్టియానతు అశైయుమ్బడి. (మణి వాయిదై ముత్తమ్ తరుతలుమ్) అఴకియ వాయిల్ ముత్తమ్ - అధరముత్తమ్ కొడుత్తలుమ్. (ఉన్తన్ తాతైయై ప్పోలుమ్) ఉన్ తమప్పనై ప్పోలే. (వడివు కణ్డు కొణ్డుళ్ళముళ్ కుళిర) వడివఴకై క్కణ్డుకొణ్డు నెఞ్జమానతు ఉళ్ కుళిర.**

**(విరలై చ్చెఞ్జిఱువాయిదై చ్చేర్‌త్తు వెకుళియాయ్ నిన్ఱురైక్కు మవ్వురైయుమ్). శివన్దు కువిన్దిరున్దుళ్ళ తిరుప్పవళత్తిలే తిరువిరలై చ్చేర్‌త్తు చ్చీఱ్ఱత్తోడే నిన్ఱు శొల్లుకిఱ మఴలై చ్చొల్లుకళుమ్. (తిరువిలేనిత్యాది) బాల్యావస్థైయిల్ అనుభవఙ్గళై అనుభవిక్క భాగ్యహీనైయాన నాన్ ఇఴన్దేన్. ఇఴక్కైక్కు నానొరుత్తి యుణ్డానాప్పోలే అనుభవిక్కైక్కు ఇట్టు ప్పిఱన్ద యశోదైప్పిరాట్టి ఎల్లామ్ పెఱ్ఱాళితే.**

**భావదీపిక :- అవ :-** మహాభాగ్యశాలిని అయిన యశోద పొందిన అనుభవాలలో ఏ ఒక్కటినీ పొందలేదు- అని ఈ పాశురంలో అంటున్నది.

**వ్యాఖ్యానం :- (మరువు నిన్ తిరునెఱ్ఱియిల్ శుట్టి అశై తర)** – "ఫాలభాగంతో పాటుగా పుట్టిందా!" అని తలచేటట్లుగా ఉండే చుట్టు అనే ఆభరణం (బాసికం వంటిది) కదలాడేటట్లుగా.

**(మణివాయిదై ముత్తుమ్ తరుతలుమ్)** – అందమైన నోటిలో నా నోటితో ముద్దు ఇవ్వడం.

**(ఉన్‌తన్ తాతైయై ప్పోలుమ్)** – నీ తండ్రి అయిన వసుదేవునివలె.

**(వడివు కొణ్డు ఉళ్ళమ్ ఉళ్ కుళిర)** – రూపసౌందర్యాన్ని దర్శించి మనస్సు నిండుగా చల్లబడేటట్లు.

**(విరలై చ్చెఞ్జిఱు వాయిదై చ్చేర్‌త్తు వెకుళియాయ్ నిన్ఱు ఉరైక్కుమ్ అవ్వురైయుమ్)**– ఎఱ్ఱనిదై, చల్లగా ఉండే పెదవులలో వేళ్ళను చేర్చి, కోపంతో పలికే ముద్దు ముద్దు పలుకులు. అతడు కోపించి పలికే మాటలలోకూడా అందం ఉన్నది- అని భావం.

**(తిరువిలేన్ ఒన్ఱుమ్ పెఱ్ఱిలేన్)** – భాగ్యాన్ని కోల్పోయిన నేను నీ చిఱుప్రాయంలో అనుభవించదగిన అనుభవాలను దేనినీ అనుభవించి, ప్రయోజనాన్ని పొందలేకపోయాను.

**(ఎల్లామ్ దెయ్వ నజ్గై యశోదై పెఱ్ఱాళే)** – కోల్పోవడం కోసమే నేను ఒకతెను పుట్టినట్లుగానే, అనుభవించడానికే పెట్టిపుట్టిన దైవకాంత యశోద నీ దివ్యభవ్యబాల్య లీలలను అన్నిటిని దేనినీ విడువకుండా అనుభవించగల్గింది.

**తణ్ణమ్ తామరై క్కణ్ణనే! కణ్ణా! తవழ్న్దెழున్దు తళర్న్దతోర్ నడైయాల్,**
**మణ్ణిల్ శెమ్బొడి యాడి వన్దు ఎన్దన్ మార్పిల్ మన్నిడ ప్పెఱ్ఱిలేన్ అన్దో!,**
**వణ్ణమ్ శెజ్జీఱు కైవిరలనైత్తుమ్ వారి వాయ్క్కొణ్డ అడిశిలిన్ మిచ్చిల్,**
**ఉణ్ణ ప్పెఱ్ఱిలేన్ ఓ! కొడువినైయేన్ ఎన్నై ఎన్ శెయ్య ప్పెఱ్ఱతు ఎమ్మోయే 6**

తణ్ అమ్ తామరై కణ్ణనే = చల్లని, అందమైన తామరపూలవంటి తిరునేత్రాలను కలవాడా!, కణ్ణా! = శ్రీకృష్ణా!, తవழ్న్దు = నీవు దోగాడుతూ, ఎழున్దు = లేచి, తళర్న్దు ఓల్ నడైయాల్ = తడబాటుతో కూడిన బుడిబుడి నడకలతో, శెమ్ మణ్ పొడియిల్ = ఎఱ్ఱని బూడిదమన్నులో, ఆడి = క్రీడించి, వన్దు = (ఆ సన్నివేశంతోనే) వచ్చి, ఎన్తన్ మార్విల్ = నా వక్షఃస్థలంలో, మన్నిడ పెఱ్ఱిలేన్ = నీవు కౌగలించుకొనే భాగ్యాన్ని పొందలేకపోయాను, అన్దో ! = ఏమి నా దౌర్భాగ్యం!, వణ్ణమ్ శెమ్ శిఱు = అందంతో కూడిన, ఎఱ్ఱని, చిన్న, కై విరల్ అనైత్తుమ్ = వేళ్ళు అన్నిటితోను, వాయ్ క్కొణ్డు = ఆదరంగా తీసికొని నోటిలో పెట్టుకొన్న, అడిశిలిన్ = ప్రసాదంయొక్క, మిచ్చిల్ = శేషాన్ని, ఉణ్ణ పెఱ్ఱిలేన్ = నేను భుజించలేకపోయాను, ఓ= అయ్యో !, కొడు వినైయేన్= మహాపాపిని అయ్యాను, ఎమ్మోయ్ = నాతల్లి, ఎన్నై = నన్ను, ఎన్ శెయ్య = ఎందుకోసం, పెఱ్ఱతు = కన్నదో !

**వ్యా :– ఆఱామ్బాట్టు. (తణ్ణమ్ తామరైక్కణ్ణనే) కుళిర్న్దు అழకితాన తామరైప్పూప్పోలే అలర్న్ద తిరుక్కణ్గళైయుడైయ కృష్ణనే! (తవழ్న్దెழున్దు తళర్న్ద తోర్ నడైయాల్) తవழ్న్దు ఎழున్దిరున్దు నడక్కప్పుకువతు తళ్ళమ్ పాఱువతాన తళర్ నడైయాలే. (మణ్ణిల్ శెమ్బొడి యిత్యాది) నిలప్పణ్బాలే శివన్ద పుழుతియై ఆడి వన్దు అక్కోలత్తోడే ఎన్మార్విలే వన్దు కట్టిక్కొణ్డు కిడక్కప్పెఱ్ఱిలేన్.**

**(వణ్ణ చ్చెజ్జీఱుఇత్యాది) అழకితాయ్, చ్చివన్ద తిరువిరల్ అనైత్తాలుమ్ వారి అముతు శెయ్త శేషత్తై ఉణ్ణ ప్పెఱాత మహాపాపత్తై పణ్ణినేన్. (ఎన్నై యెన్ శెయ్య ప్పెఱ్ఱతు ఎమ్మోయే) రాజమహిషియాయ్, పిళ్ళైకళ్ అళైన్ద ఎచ్చిలుణ్ణామైక్కో ఎజ్గళ్ తాయార్ ఎన్నై ప్పెఱ్ఱతు? "అముతిలు మాఱ్ఱవినితే తమ్మక్కళ్ శిఱుకై యళావియ కూழ్", "మక్కళ్ మెయ్ తీణ్డలుడఱ్కిన్బమ్ మఱ్ఱవర్ తమ్ శొఱ్కేట్టల్ అన్బమ్ శెవిక్కు".**

*అరు :- ఆళామ్బాట్టు. (తణ్ణ మిత్యాది). రాజమహిషికళ్ పెర్ఱవుడనే పుఅమ్బే వళర్క్క విడుకైయాలే ఎచ్చిలుణ్డార్కళ్.*

**భావదీపిక :- అవ :-** ఎందుకోసం నా తల్లి నన్ను కన్నదో! అని తన తల్లిని ఉద్దేశించి పల్కుతున్నది దేవకి.

**వ్యాఖ్యానం :- (తణ్ణమ్ తామరై కణ్ణనే! కణ్ణా!)** - చల్లని, అందమైన, తామరపూవువలె వికసించిన తిరునేత్రాలను కల శ్రీకృష్ణా!

**(తవழ్న్దు ఎழున్దు తళర్న్దతోర్ నడైయాల్)** - దోగాడుతూ పాకుతూ పైకి తేవాలని ప్రయత్నించడం, నడవడానికి ప్రయత్నించడం, తడబడడం- ఈ విధంగా తడబడే గమనంతో.

**(మన్నిల్ శెమ్బొడి ఆడి వన్దు ఎన్దన్ మార్వినిల్ మన్నిడ ప్పెఱ్ఱిలేన్ అన్దో!)** - ఎఱ్ఱని మన్నును కల నేల అయినందువల్ల ఎఱ్ఱని దుమ్మును ఒడలు అంతా పూసికొని వచ్చి, ఆ అలంకారంతోనే నా గుండెలను హత్తుకొనే భాగ్యాన్ని పొందలేకపోయాను.

**(వణ్ణచ్చెఞ్జిరు కైవిరల్ అనైత్తుమ్ వారి వాయ్క్కొణ్డ అడిశిలిన్ మిచ్చిల్ ఉణ్ణ ప్పెఱ్ఱిలేన్ ఓ! కొడు వినైయేన్)** - అందమైనవై, ఎఱ్ఱని వేళ్ళు అన్నిటితో నీవు చేతులారా తీసికొని ఆరగించే ప్రసాద శేషాన్ని భుజించే ఫలాన్ని పొందలేని మహాపాపాన్ని చేశాను. అయ్యో !

**(ఎన్నై ఎన్ శెయ్య పెఱ్ఱతు ఎమ్మోయే!)** - రాజుకు పట్టమహిషిగామాత్రం ఉండి, పిల్లలు భుజించగా విడిచిన శేషాన్ని భుజించే భాగ్యాన్ని పొందకుండా ఉండడం కోసమా నా తల్లి నన్ను కన్నది! **"అముదినిల్ ఆఱ్ఱ ఇనిదే తమ్ మక్కళ్ శిఱుకై అళావియ కూழ్"** (తమ పిల్లలు చిన్న చేతులతో తీసికొని భుజించిన అన్నం తల్లితండ్రులకు అమృతంకంటే తీయనిదికదా) (కుఱళ్) అని, **"మక్కళ్ మెయ్ తీణ్డల్ ఉడఱ్కు ఇన్బమ్ మఱ్ఱు అవర్తమ్ శొఱ్కేట్టల్ ఇన్బమ్ శెవిక్కు"** (కుఱళ్) (సంతానాన్ని కౌగలించుకోవడం శరీరానికి ఆనందాన్ని, ఇంకా వారి మాటలను వినడం చెవులకు ఆనందాన్ని కల్గిస్తుంది) అని అనబడుతున్నది కదా !

**కుழకనే! ఎన్దన్ కోమళప్పిళ్ళాయ్! కోవిన్దా! ఎన్ కుడఙ్గైయిల్ మన్ని,**
**ఒழుకు పేరిళఞ్జిఱు తళిర్పోల్ ఒరు కైయాల్ ఒరుములై ముకమ్ నెరుడా,**
**మழలై మెన్నకై యిడై యిడై యరుళా వాయిలే ములై యిరుక్క ఎన్ ముకత్తే,**
**ఎழில్ కొళ్ నిన్ తిరుక్కణ్ణినై నోక్కన్దన్నైయుమ్ ఇழన్దేన్ ఇழన్దేనే** **7**

కుழకనే = అందఱితో కలిగే స్వభావాన్ని కలవాడా !, ఎన్ తన్ కోమళమ్ = పిళ్ళాయ్ = నా అందంలో సాటి లేని కుమారా!, (నా సుకుమారుడవైన కుమారా !)

కోవిన్దా = గోవిందా !, ఎన్ = నా, కుడమ్ కైయిల్ మన్ని = చేతిలో పొందికగా ఉండి, ఒఱ్ఱుకు పేర్ ఎఱ్ఱిల్ = ఉప్పొంగి ప్రవహించే రీతిలోని అందాన్ని కల్గినది, ఇళ శిఱు తళిర్‌పోల్= చాలా మెత్తని, లేత చిగురువంటిది అయిన, ఒరు కైయాల్ = ఒక శ్రీహస్తంతో, ఒరు ములై ముకమ్ = ఒక చూచుకాన్ని, నెరుడా = ఒత్తుతూ, ములై = ఇంకొక చూచుకం, వాయిలే ఇరుక్క = (నీ) నోటిలో ఉండగా, ఇడై ఇడై = మధ్య మధ్యలో అపుడపుడు, ఎన్ ముకత్తు = నా ముఖాన్ని చూస్తూ, మఱ్ఱలై మెల్ నకై అరుళా= చిఱునవ్వు నవ్వుతూ ఉండే, నిన్ తిరు కణ్ ఇణై ఎఱ్ఱిల్ కొళ్ నోక్కమ్ తన్నైయుమ్ = నీ రెండు తిరునేత్రాలతో నీవు చూచే అందమైన చూపును, ఇఱ్ఱన్దేన్ ఇఱ్ఱన్దేన్ = అయ్యో! కోల్పోయాను! కోల్పోయాను. అయ్యో!

**వ్యా :- ఏఱ్ఱామ్బాట్టు. (కుఱ్ఱకనే ఎన్దన్ కోమళప్పిళ్ళాయ్) లోకయాత్రైయిలే అన్యపరైయాయ్ త్తనక్కు ముకమ్ కొడాతిరున్దాల్ లోకయాత్రైయై క్కైవిట్టు ఉన్నైయే పార్క్కవల్లేనామ్బడి కలక్కవల్లైయాయ్, అతుతాన్ పొఱాత సౌకుమార్యత్తై యుడైయవనే! (కోవిన్దా వెన్ కుడజ్జైయిల్ మన్ని) గోసమృద్ధియై యుడైయవనే! ఎన్ కైయిలే యిరున్దు. (ఒఱ్ఱు కు పేరెఱ్ఱిలిళమ్ శిఱు తళిర్‌పోల్ ఒరు కైయాల్ ఒరు ములై ముకమ్ నెరుడా) అఱ్ఱకు వెళ్ళమ్ పడిన్దోదుమ్బడియాన తళిర్‌పోలే ఇరుక్కిఱ ఒరు తిరుక్కైయాలే ఇవళ్ ఇరజ్గి ములైకొడుక్కుమ్బడి ఒరు ములైక్కణ్ణై నెరుడిక్కొణ్డు.**

**(మఱ్ఱలై మెన్నక యిడై యిడై యరుళా వాయిలే ములై యిరుక్క ఎన్ ముకత్తే) వాయిలే ములై యిరుక్కచ్చెయ్‌తే ములై శురక్కుమ్బడియాక ఎన్ ముకత్తిలే ఇడైయిడైయే మఱ్ఱలై చ్చిరిప్పాక చ్చిరియా. (ఎఱ్ఱిల్ కొళ్ నిన్ తిరుక్కణ్ణిణై నోక్కన్దన్నైయు మిఱ్ఱన్దేనిఱ్ఱన్దేనే) అతుక్కుమ్ ఇరజ్గారుమ్ ఇరజ్గుమ్బడి అఱ్ఱకియ తిరుక్కణ్గళాలే పార్క్కిఱ పార్వైయైయుమ్, పెఱ్ఱ అన్దే పోకవిట్టతుక్కుమేలే ఇవ్వవస్థైయిల్ చేష్టితజ్గళైయుమ్ అనుభవిక్క ప్పెఱ్ఱిలేన్.**

**భావదీపిక :- అవ :-** శైశవదశలోని ఆనందాలను తాను అనుభవించలేక కోల్పోవడాన్ని గూర్చి పల్కి విలపిస్తున్నది దేవకి- ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (కుఱ్ఱకనే! ఎన్దన్ కోమళప్పిళ్ళాయ్!) - "కుఱ్ఱకనే"** అనే పదం అందఱితో కలసి మెలిగే స్వభావాన్ని కల బిడ్డను సూచిస్తుంది. లోకరీతినిబట్టి పెరుగును చిలుకడం మొదలైన కార్యాలలో అభినివేశాన్ని పొంది, బిడ్డను గమనించకుండా ఉన్నపుడు, దానిని అంతా విడిచిపెట్టి నిన్నే చూచే రీతిలో ప్రవర్తించేవాడా!- అని భావం. **"కోమలప్పిళ్ళాయ్"** అనే పదం ఈ విధంగా ప్రవర్తించేటపుడు సైతం ఒడలు కందిపోయేటట్లుగా ఉండే సౌకుమార్యాన్ని కలవాడా! అనే అర్థాన్ని ఇస్తుంది.

**(కోవిన్దా !)** – లేగదూడలను, పశువులను పుట్టినపుడే సమృద్ధిగా పొందినవాడా! **"కోవిన్దా"** అనేది తనకు శైశవప్రాయంలో ఉండే అభినివేశాన్ని తెలుపుతుంది.

**(ఎన్ కుడజ్జైయిల్ మన్ని)** – నాచేతిలో అమరి ఉండి.

**(ఒழுకు పేరెழிల్ ఇళమ్ శిఱు తళిర్‌పోల్ ఒరు కైయాల్ ఇరు ములై ముకమ్ నెరుడా)** – సౌందర్యప్రవాహం కట్టలు తెంచుకొని వెలువడి ప్రవహించే రీతిలోని లేలేత చిగురువలె ఉండే నీశ్రీహస్తంతో, ఈమె మనస్సు ద్రవించిన స్తన్యాన్ని ఇచ్చేటట్లుగా ఒక స్తనచూబుకాన్ని తడవుతూ.

**(మழలై మెన్నకై ఇడై ఇడై అరుళా వాయిలే ములై యిరుక్క ఎన్ ముకత్తే)** – నోటిలో నీ స్తనం ఉన్నపుడే స్తనక్షీరాన్ని స్రవించేటట్లుగా, ముఖంలోకి మధ్య మధ్యలో చూస్తూ ముద్దు ముద్దు చిఱునవ్వును నవ్వుతూ.

**(ఎழிల్ కొళ్ నిన్ తిరు క్కణ్ణినై నోక్కుమ్ తన్నైయుమ్ ఇழన్దేన్ ఇழన్దేనే)** – ఇందులో అభినివేశాన్ని పొందినవారు సైతం అభినివిష్టులు అయేటట్లుగా, అందమైన తిరునేత్రాలతో చూచే చూపును, కన్నపుడే పంపించివేసిన దుఃఖానికి తోడుగా ఈ శైశవదశలో నీ లీలలను అనుభవించలేక కోల్పోయానే! అయ్యో!

**ముழுతుమ్ వెణ్ణె యళైన్దు తొట్టుణ్ణుమ్ ముకిழிళఞ్జిఱు త్తామరైక్కైయుమ్,**
**ఎழிల్‌కొళ్ తామ్బుకొణ్డు అడిప్పతఱ్కు ఎళ్కు నిలైయుమ్ వెణ్డయిర్ తోయ్న్ద శెవ్వాయుమ్,**
**అழுకైయుమ్ అఞ్జినోక్కుమ్ అన్నోక్కుమ్ అణి కొళ్ శెఞ్జిఱు వాయ్ నెళిప్పతువుమ్,**
**తొழுకైయుమ్ ఇవై కణ్డ అశోదై తొల్లైయిన్బత్తు ఇఱుతి కణ్డాళే** 8

వెణ్ణెయ్ = వెన్నను, ముழுతుమ్ = మొత్తం కుండలో ఉన్నదానిని అంతటిని, అళైన్దు = చేతులార పైకితీసి, తొట్టు ఉణ్ణుమ్ = తడవుతూ, తడవుతూ భుజించే, ఇళ ముకిழ் తామరై శిఱు కైయుమ్ = లేలేత చిగురువంటిది, తామరపూవువంటిది అయిన చిన్న చిన్న శ్రీహస్తాలు, ఎழிల్ కొళ్ తామ్బు కొణ్డు = అందమైన దారంతో, అడిప్పదఱ్కు= కొట్టగా (దానికి), ఎళ్కుమ్ నిలైయుమ్ = భయపడి నిలచిన స్థితిని, వెణ్ తయర్ తోయ్న్ద = వెన్న, పెరుగు పూసికొన్న, శెమ్ వాయుమ్ = ఎఱ్ఱని నోరు, అழுకైయుమ్= ఏడుపు, అఞ్జి నోక్కుమ్ అన్నోక్కుమ్ = భయపడి చూచే ఆచూపు, అణి కొళ్ శెమ్ శిఱు వాయ్ నెళిప్పతువుమ్ = అందమైన ఎఱ్ఱని అధరం అదరడం, తొழுకైయుమ్ = అంజలిని చేయడం (అనే), ఇవై = వీనిని, కణ్డ అశోదై = దర్శించి, ఆనందించి గన్గిన యశోదాదేవి, తొల్లై ఇన్బత్తు = అంతు లేని మహానందంయొక్క, ఇఱుతి కణ్డాళ్ = అవధిని చూచింది.

**అవ :– ఎట్టామ్పాట్టు. (ముழுతు మిత్యాది). నానిழన్ద ఇழవెల్లామ్ యశోదైప్పిరాట్టి పెఱ్ఱాళ్– ఎన్గిఱాళ్.**

వ్యా :- (ముழுతుమ్ వెణ్ణె యళైన్దు) వెణ్ణెయిలుణ్డాన ఆదరాతిశయత్తాలే తిరుక్కైకళై వెణ్ణెయ్ క్కుడత్తిలే యిట్టు అళైయుమాయ్త్తు. (తొట్టు ఉణ్ణుమ్) అతిచాపలత్తాలే "మాళుమ్" ఎన్ఱు "విరలొడువాయ్ తోయ్న్ద" ఎన్నుమాపోలే తొట్టుణ్ణుమాయ్త్తు. (ముకిழிళమ్ శిఱు త్తామరైక్కైయుమ్) ఇళన్దళిర్ పోలేయుమ్ నిఱత్తుక్కు, వికాసమ్, శెవ్విక్కు త్తామరైప్పూపోలేయు మిరుక్కిఱ తిరుక్కైకళుమ్. (ఎழிల్ కొళ్ తామ్బు) "స్పర్శిక్కైక్కు ఆశైప్పట్టిరుక్కుమ్ తిరుమేనియై స్పర్శిత్తతితే" ఎన్ఱు "ఎழிల్ కొళ్ తామ్బు" ఎన్గిఱార్. "రాజజన్మమ్ వేణ్డా, అచేతనమాక వమైయుమ్, అఙ్గత్తై స్పర్శమ్ పెఱిల్" ఎన్ఱిరుక్కు మవరితే. (కొణ్డిప్పతఱ్కు ఎళ్కు నిలైయుమ్) ఇవర్ అఙ్గత్తై స్పర్శత్తై నినైత్తు "ఎழிల్ కొళ్ తామ్బు" ఎన్టార్. ఆకిలుమ్ కైక్కొట్టిற்று ఒన్ఱై యిట్టు అవళ్ అడిక్క, అతుక్కు ఈడుపట్టు ప్పైయాన్దు నిఱ్కుమ్ నిలైయుమ్. (వెణ్ తయిర్ తోయ్న్ద శెవ్వాయుమ్) "తయిర్ కళవు కణ్డాయ్" ఎన్ఱు అడిక్క ప్పుక్కవాతే ఇల్లై శెయ్కైక్కాక ముకత్తిలే పూశిక్కొళ్ళుమే. వెళుత్త త్తయిరుమ్ శివన్ద తిరుప్పవళముమాన పరభాగ మిరుక్కిఱపడి.

(అழுకైయుమ్) "ఇల్లై" ఎన్ఱిరుక్కచ్చెయ్తే కళవై నాడువతే నమ్మై, ఎన్ఱழுకైయుమ్, అழுప్పుక్కవాతే "వాయ్ వాయ్" ఎన్నుమే. అత్తాలే భయప్పట్టు అచ్చు మెల్లామ్ తన్నోక్కిలే తోற்றுమ్పడి పార్త్తుక్కొణ్డు నిఱ్కుమ్ నిలైయుమ్. (అణి కొళ్ శెఙ్జిఱువాయ్ నెళిప్పతువుమ్) పిన్నైయుమ్ అழாతిరుక్కవుమ్మాట్టాన్; అழுవుమ్ మాట్టాన్. అழுకియ తిరుప్పవళత్తై నెళిక్కుమిత్తనైయితే. (తొழுకైయుమ్) పోక్కற்றార్ శెయ్యుమ్ శెయలితే. సాపరాధరానార్క్కు అపరాధమ్ పోక్కు మదు అఞ్జలి ఎన్నుమిదమ్ తాన్ అఱిన్దిరుక్కు మతాకైయాలే అఞ్జలియై ప్పణ్ణుమాయ్త్తు. (ఇవై కణ్డ అశోదై) ఇవற்றై ఇఙ్గే సాక్షాత్కరిక్కక్కణ్డ యశోదైప్పిరాట్టి. (తొల్లైయిన్బత్తిఱుతికణ్డాళే) పరమపదత్తిల్ నిరవధియాన అనుభవత్తై సావధియాక్కినవళితే. అఙ్గే శెన్ఱు ఎల్లారుమ్ తొழு ఇరుక్కుమవన్, తాన్ తొழுకైయాలే అపరిచ్ఛిన్నమాన అనుభవమ్ పరిచ్ఛిన్నమాయ్త్తితే.

*అరు :- ఎట్టామ్పాట్టు. (ముழுతు మిత్యాది). వెణ్ణెయై క్కై ముழுతాలు మళైన్దు. (తొల్లై యిన్బమ్) తొల్లైయానతాయ్ - నిరవధికమాన ఇన్బమ్, సావధియానతు ఎప్పడి? ఎన్న్, అరుళిచ్చెయ్కిఱార్ (అఙ్గే శెన్ఱిత్యాది).*

**భావదీపిక :- అవ :-** చిఱుపరువంలోని నీ లీలలను దర్శించి నేను ఆనందించలేని ఆనందాలను అన్నిటిని అనుభవించగల్గిన యశోదాదేవి గొప్ప భాగ్యవంతురాలు- అని ఈ పాశురంలో అంటున్నది. (ఆழ்వార్లు దేవకిగా పల్కుతున్నారు)

**వ్యాఖ్యానం :- (ముழுతుమ్ వెణ్ణెయ్ అళైన్దు)** - వెన్నను భుజించడంలో ఉండే అంతులేని అభినివేశంవల్ల, దానిని పైకి తీయడానికి ఉపయోగపడే ముంజేతిని మాత్రమే కాకుండా శ్రీహస్తాలను అంతటిని వెన్నకుండలో పెట్టి చేతులార పైకి తీయడాన్ని తెలుపుతున్నది.

**(తొట్టు ఉణ్ణుమ్)** – మిక్కిలి అభినివేశంతో దొంగిలించి భుజించేటపుడు చేతిని పూర్తిగా పెడితేనే వెన్నను పూర్తిగా తీయవచ్చు అని అనుకున్నాడు కాబోలు! **"విరలోడు వాయ్ తోయ్న్ద వెణ్ణెయ్ కణ్డు ఆయ్చ్చి ఉరలోడు ఉఱప్పిణిత్త నాన్ఱు, కురలోవాతు ఏఙ్గి నినైత్తు అయలార్ కాణ ఇరున్దిలైయే! ఓఙ్గోత వణ్ణా! ఉరై"** (ముదల్ తిరు–24) (చేతివేళ్ళతో నోటిలో పెట్టుకొన్న వెన్నను చూచి యశోద రోటికి నిన్ను కట్టినపుడు వెన్నను తలచి విడువకుండా ఏడ్చి ఇతరులు చూచేటట్లు నీవులేదా? సముద్రవర్ణా! చెప్పు) అని అంటూ పొయ్కై ఆఴ్వార్లు పల్కినట్లే, తాను దొంగతనం చేసి భుజించడాన్ని అందఱు తెలియాలి అని పెద్ద గొంతుఎత్తి ఏడ్చాడు కదా!

**(ముకిఴ్ ఇళఞ్జిఱు త్తామరై క్కైయుమ్)** – **"ఇళఞ్జిఱు తళిర్ పోల్ ఒరు కైయాల్"** అని గత పాశురంలో శ్రీహస్తంయొక్క వర్ణానికి లేతచిగురును ఉపమానంగా చెప్పారు. ఇక్కడ వికాసాన్ని కల, శ్రీహస్తం అందానికి, అపుడే విరిసిన తామరపూవు ఉపమానంగా చెప్పబడింది.

**(ఎఴిల్ కొళ్ తామ్బు)** – తాము స్పృశించాలని ఆశపడిన తిరుమేనిని తాకిన కారణం చేత **"ఎఴిల్ కొళ్ తామ్బు"** అని దారాన్ని విశేషిస్తున్నారు. "ఈ రాచపుట్టుకకూడా అక్కరలేదు. భగవానుని స్పర్శనుపొందితే ఒక అచేతనంగాకూడా ఉండవచ్చు" అని అన్నారుకదా నాల్గవ దశకంలో.

**(కొణ్డిప్పదఱ్కు ఎళ్కు నిలైయుమ్)** – వీరు శ్రీకృష్ణుని స్పృశించిన దారం అదృష్టాన్ని తలచి **"ఎఴిల్ కొళ్ తామ్బు"** అని అంటున్నారు. అయినా, చేతికి దొరికిన ఒక దారాన్ని తీసికొని ఆమె కొట్టింది. దానికి భయపడి, వణికి నిలచిన శ్రీకృష్ణుని స్థితిలో వీరు అభినివేశాన్ని పొందుతున్నారు.

**(వెణ్ తయిర్ తోయ్న్ద శెవ్వాయుమ్)** – "పెరుగును దొంగిలించావు' అని యశోద కొట్టడం ఆరంభించగానే, తాను దొంగిలించడాన్ని మఱుగుపరచడంకోసం చేతిలో ఉండే పెరుగును ముఖానికి పూసికొన్నాడు శ్రీకృష్ణుడు. అప్పటి తెల్లని పెరుగు, ఎఱ్ఱని నోరు అనే భిన్న వర్ణాల కయికలోని పరభాగశోభలో అభినివేశాన్ని పొందుతున్నారు వీరు. (ఆఴ్వార్లు)

**(అఴుకైయుమ్)** – తాను దొంగిలించ లేదు– అని పల్కినా, తాను దొంగిలించానని పట్టుకొన్నదే! అని ఏడ్చాడు.

**(అఞ్జి నోక్కుమ్ అన్నోక్కుమ్)** – ఏడవడం ఆరంభించగానే "నోరు మూసికో" అని యశోద అదిలిస్తుందికదా ! అందువల్ల భయపడి, ఆ భయం అంతా తన చూపులోనే తెలిసేటట్లుగా చూస్తూ నిలచిన సన్నివేశం.

**(అణి కొళ్ శెజ్జేఱు వాయ్ నెళిప్పతువుమ్)** దొంగిలించాడు అని అనడంవల్ల ఏడవకుండా ఉండడం సాధ్యం కాలేదు. "ఏడవకు" అని బెదరించడంవల్ల ఏడవడం సాధ్యం కాలేదు. అందువల్ల అందంగా ఎఱ్ఱగా ఉండే చిన్ని నోరును (పెదవులను) కంపింపచేశాడు. ఆ సన్నివేశాన్ని ఇక్కడ అనుభవిస్తున్నారు.

**(తొழுకైయుమ్)** – ఆమె దండించడాన్ని అడ్డుకోవడంకోసం, వేఱు గతి లేనివారు చేసే అంజలిని ఘటించాడు. తప్పును తెలిసినవారి దోషాన్ని పోగొట్టేది అంజలి మాత్రమే– అనే విషయాన్ని తాను తెలిసినవాడు కనుక, తన దోషాన్ని పోగొట్టుకోవడం కోసం యశోదను చూచి అంజలిని చేస్తున్నాడు

**(ఇవై కణ్డ అశోదై)** – వీటిని ఇక్కడ నేరుగా దర్శించిన యశోదాదేవి.

**(తొల్లై ఇన్బత్తు ఇఱుతి కణ్డాళే)** – అవధిని చూడడానికి వీలుకాని, పరమపదంలో ఉండే అనుభవంయొక్క ఎల్లను చూడగల్గింది. అవధి చూడడానికి వీలులేనిది– అని ప్రమాణాలలో చెప్పబడేది, పరమపదంలో నిత్యులు, ముక్తులు పొందేదైన పరమానందంలో అతని ఏడుపు, అంజలి **(అழுకై, తొழுకై)** మొదలైనవి దర్శించ వీలులేనివి కనుక, అది (పరమపదానందం) కూడా సావధి– అని తాత్పర్యం. అక్కడకు పోయి అందు నమస్కరించేటట్లుండేవాడు ఇక్కడకు వచ్చి, తాను అంజలిని చేయడంవల్ల, అంతు లేని అనుభవం సావధి అయినది అని చెప్పడంలో కొఱతలేదు కదా !

**కున్ఱినాల్ కుడై కవిత్తతుమ్ కోల క్కురవై కోత్తతుమ్ కుడమాట్టుమ్,**
**కన్ఱినాల్ విళవు ఎఱిన్దతుమ్ కాలాల్ కాళియన్ తలైమితిత్తతుమ్ ముతలా,**
**వెన్ఱి శేర్ పిళ్ళై నల్విళైయాట్టమ్ అనైత్తిలుమ్ అజ్గెన్నుళ్ళ ముళ్ కుళిర,**
**ఒన్ఱుమ్ కణ్డిడ ప్పెఱ్ఱిలేన్ అడియేన్ కాణుమాఱు ఇని ఉణ్డెనిల్ అరుళే. 9**

కున్ఱినాల్ = గోవర్ధనపర్వతాన్ని, కుడై కవిత్తతుమ్ = గొడుగుగా ధరించి నిలచినది, కోలమ్ = అందంగా, కురవై కోత్తతుమ్ = రాసక్రీడను ఆడడం, కుడ మాట్టుమ్ = కుంభనృత్యాన్ని చేయడం, కన్ఱినాల్ విళవు ఎఱిన్దతుమ్ = లేగూడలో ఆవేశించిన అసురునితో వెలగపండులోని అసురుని వధించడం, కాలాల్ = శ్రీచరణాలతో, కాళియన్ తలై = కాళియుని శిరస్సును, మితిత్తతుమ్ ముదలా = అణగతొక్కడం మొదలైన, వెన్ఱి శేర = విజయంతో కూడిన, నల్ పిళ్ళై విళైయాట్టమ్ అనైత్తిలుమ్ = గొప్పదైన బాల్యలీలలు అన్నిటినీ, ఒన్ఱుమ్ = ఏ ఒక్కటినీ, ఎన్ ఉళ్ళమ్ ఉళ్ కుళిర = నామనస్సు ఆనందించి చల్లబడేటట్లుగా, అడియేన్ = నేను, అజ్గు కణ్డిడ పెఱ్ఱిలేన్ = రేపల్లెలో ఉండి దర్శించలేక పోయాను, ఇని = ఇకపై, కాణుమ్ ఆఱు = నేను దర్శించే దారి, ఉణ్డు ఎనిల్ = ఉండే, అరుళ్ = అనుగ్రహించు

**వ్యా :– ఒన్బతామ్బాట్టు. (కున్టినాల్ కుడై కవిత్తతుమ్) ఇడైయరుమ్, పశుక్కళుమ్ తొలైయమ్బడియాక ఇన్ద్రన్ కల్వర్షమాక వర్షిత్తపడియాలే మలైయై ఎడుత్తు క్కుడైయాక ధరితత్తతుమ్. (కోల క్కురవై కోత్తతుమ్) దర్శనీయమాన కురవై క్కూత్తిలే శ్రీగోపిమారోడొక్క త్తన్నైయుమ్ కోత్తతుమ్. (కుడమాట్టుమ్ కన్టినాల్ విళవెఱిన్దతుమ్) ఒరువన్ కన్టాయ్, ఒరువన్ విళావాయ్ వన్ద ఇరువరైయుమ్ శేర ముడిత్తతువుమ్. (కాలాల్ కాళియన్తలై మితిత్తతు ముతలా) నాన్ ఆశైప్పట్టు ప్పెఱాత తిరువడికళై క్కొణ్డు ఆసురప్రకృతియాన కాళియన్తలైయిలే మితిత్తతు ముతలాక.**

**(వెన్టి శేర్ పిళ్ళై నల్విళై యాట్టమ్) వీరప్పాట్టుక్కుమ్, మౌగ్ధ్యత్తుక్కుమ్ శేర్న్దిరుక్కిఱ అతిమనోహరమాన. (అనైత్తిలుమ్ అజ్గెన్నుళ్ళముళ్ కుళిర ఒన్టుజ్గణ్డిడ ప్పెఱ్ఱిలేనడియేన్) ఇవై కాణ్గైయే ప్రయోజనమా యిరుక్కిఱ నాన్ ఒన్టుమ్ కాణప్పెఱ్ఱిలేన్. (కాణుమాఱిని యుణ్డెనిలరుళే) నీ నినైత్తాల్ శెయ్యవొణ్ణాతతిల్లై. నాన్ ఇవై కాణుమ్బడి అరుళవేణుమ్.**

*అరు :– ఒన్బతామ్బాట్టు (కున్టినాలిత్యాది). (మనోహరమాన) వ్యాపార మెన్టు పూరిప్పతు.*

**భావదీపిక :– అవ :–** చిన్నకుఱ్ఱవాడుగా ఉన్నపుడు చేసిన లీలలను వేనినీ దర్శించని కొఱత తీరేటట్లుగా, నాకిపుడు వానిని దర్శింపజేయాలి– అని ఇందులో అంటున్నారు.

**వ్యాఖ్యానం :– (కున్టినాల్ కుడై కవిత్తతుమ్)** – తనకు అర్పించవలసిన అన్నాన్ని శ్రీకృష్ణుని ఆనతిప్రకారం గోవర్ధనగిరికి అర్చించడంచేత కోపించిన ఇంద్రుడు రేపల్లెలోని గొల్లలు, పశువులు బాధపడేటట్లుగా రాళ్ళ (వడగళ్ళ) వర్షాన్ని కురపించడంవల్ల ఆ గోవర్ధనపర్వతాన్ని ఎత్తి, గొడుగుగా చేసివారిని రక్షించడం.

**(కోల క్కురవై కోత్తతుమ్)** – చాలా అందమైన రాసలీల అనబడే **"కురవై క్కూత్తు"**లో ఒక్కొక్క గోపికకు ఒక కృష్ణుని చొప్పున చుట్టి నిలచి నాట్యం చేయడం,

**(కుడ మాట్టుమ్)** – కుంభనృత్యాన్ని చేయడం.

**(కన్టినాల్ విళవు ఎఱిన్దతుమ్)** – ఒక అసురుడు లేగదూడలో, ఇంకొక అసురుడు వెలగపండులో ఆవేశించి, శ్రీకృష్ణుని వధించాలని ప్రయత్నించినపుడు, లేగదూడలో ఉన్నవానిని వెలగపండులో ఉండే అసురుని పైకి విసరి, ఆ ఇద్దరిని ఒకేసారి వధించడం.

**(కాలాల్ కాళియన్ తలై మితిత్తతుమ్ ముదలా)** – నేను ఆశ పడినా పొందడానికి సాధ్యం కాని శ్రీచరణాలతో ఆసురస్వభావాన్ని కల, కాళియుడనే సర్పం తలపై నాట్యం ఆడడం.

**(వెన్టి శేర్ పిళ్ళై నల్వినైయాట్టమ్)** – తన వీర్యానికి, బాల్యానికి తగినవై, అందఱి మనస్సును ఆకర్షించేవైన దివ్యలీలలు.

**(అనైత్తిలుమ్ అఙ్గు ఎన్ ఉళ్ళమ్ ఉళ్ కుళిర ఒన్డుమ్ కణ్డిడ ప్పెఱ్ఱిలేన్ అడియేన్)**– వీటిని దర్శించడమే గొప్ప ప్రయోజనంగా భావించిన నేను వాటిలో దేనిని దర్శించలేక పోయాను.

**(కాణు మాఱు ఇని ఉణ్డేనిల్ అరుళే)** – నీవు తలిస్తే చేయలేనిది ఏదీ లేదు. నేను వీటిని దర్శించేటట్లుగా నీవు కృపజేయాలి– అని వేడుతున్నారు.

**వఞ్జ మేవియ నెఞ్జుడై ప్పేయ్‌చ్చి వరణ్డునార్ నరమ్బెழ క్కరిన్దుక్క,**
**నఞ్జమార్ తరు శుழிములై యన్దో! శువైత్తు నీ అరుళ్ శెయ్‌తు వళర్‌న్దాయ్,**
**కఞ్జన్‌నాళ్ కవర్ కరుముకిలెన్దాయ్! కడైప్పట్టేన్ వెఱితే ములై శుమన్దు,**
**తఞ్జమేల్ ఒన్ఱిలేన్ ఉయ్‌న్దిరున్దేన్ తక్కతే నల్లతాయై ప్పెఱ్ఱాయే 10**

వఞ్జమ్ మేవియ= వంచనతో కూడిన, నెఞ్జు ఉడై = మనస్సును కల్గినదైన, పేయ్‌చ్చి= పూతన అనే పిశాచియొక్క, వరణ్డు ఎழ = (శరీరంలో మాంసం, రక్తం) పాలతో పాటుగా వెలువడేటట్లుగా, నార్ నరమ్బు కరిన్దు ఉక్క = తోలు నరాలు కింద పడేటట్లు, నఞ్జమ్ ఆర్ తరు = మిక్కిలి విషాన్ని కల్గినది, శుழி ములై = తన పట్ల ఆకర్షించేది అయిన స్తనాన్ని, నీ శువైత్తు అరుళ్ శెయ్‌తు = నీవు ఆరగించి, వళర్‌న్దాయ్ = పెరిగావు, అన్దో = ఆశ్చర్యం!, కఞ్జన్ నాళ్ కవర్ = కంసుని ఆయుస్సును అపహరించిన, కరు ముకిల్ ఎన్దాయ్ = నీలమేఘశ్యామా!, వెఱితే ములై శుమైన్దు = (నేను) వ్యర్థంగా స్తనాలను మోసికొని, కడైప్పట్టేన్ = అధమలలో అధమను అయ్యాను, తఞ్జమ్ ఒన్ఱు ఇలేన్ = (నిన్ను తప్ప వేఱు) గతిలేని దాసనుగా ఉన్నాను, ఉయ్‌న్దిరున్దేన్ = (నిన్ను చూడాలని) ప్రాణాలను బిగపట్టుకొని జీవిస్తున్నాను, తక్కతు = నీకు తగిన, నల్ల తాయై= మంచి తల్లిని, పెఱ్ఱాయ్ = పొందావు (ఏ – అయ్యో!).

**వ్యా :– పత్తామ్బాట్టు. (వఞ్జమేవియ నెఞ్జుడై ప్పేయ్‌చ్చి) ఇవనై కృణ్ణాల్ శెవ్వియరా యిరుక్కవితే కడవతు. కణ్డు వైత్తు వఞ్జనత్తిలే పొరున్దిన పూతనై. (వరణ్డు నార్ నరమ్బెழ క్కరిన్దుక్క) మాంసముమ్, ఉళ్ళుణ్డాన ఉతిరముమ్ ములైప్పాలోడే కొழிత్తుక్కొణ్డు పుఱప్పడ. శేషిత్త ఉడమ్బు నార్ నరమ్బుమ్ తోలుమామ్బడి కరిన్దుక్క. (నఞ్జమార్ తరు శుழிములై యన్దో! శువైత్తు నీ యరుళ్ శెయ్‌తు వళర్‌న్దాయ్) కిడన్ద ఆశ్రయత్తైయు మழிక్క వఱ్ఱాయ్, మిక్క నఞ్జైయుడైత్తాయ్, కోపత్తైయు ముడైత్తాయిరుక్కిఱ ములైయై ధారకమాక ఉణ్డరుళి వళర్‌న్దాయ్.**

**(కఞ్జన్ నాళ్ కవర్ కరుముకిల్ ఎన్దాయ్!) కంసనుడైయ ఆయుస్సై అపహరిత్తు, అత్తాలే ఏఱిన పుకరైయుడైయ వడివైయుడైయైయాయ్, అచ్చెయలాలుమ్, వడివழ కాలుమ్ ఎన్నై ఎழுతిక్కొణ్డవనే! (కడైప్పట్టేన్ వెఱితే ములై శుమన్దు) ములై నెఱిత్తపోతు**

**ఉణ్బానొరుపిళ్ళైయై ప్పెఱ్ఱువైత్తు ప్పెఱాతే వ్యర్థమే యిరుక్కైయాలే ఎత్తనైయేనుమ్ తణ్ణియారిలుమ్ తాழ్న్దేన్. (తఞ్జమే లొన్ఱిలేన్ ఉయ్న్దిరున్దేన్) వేఱు ధారకరిల్లామైయాలే ప్రాణఙ్గళై వరున్ది ధరిత్తిరున్దేన్. (తక్కతే నల్లతాయై ప్పెఱ్ఱాయే) ములైప్పాల్ అపేక్షితమానపోతు ఉనక్కు త్తరుకైక్కు నల్ల తాయై ప్పెఱ్ఱాయే.**

*అరు :- పత్తామ్బాట్టు. (నఞ్జ మిత్యాది). కరిన్దు ఉక్క - కరుకిప్పోక. శుழ్రిములై - కోపత్తైయుడైయ ములై. అవళుక్కు ఉణ్డాకైయాలే ములైక్కుమ్ ఉణ్డెన్ఱపడి. తఞ్జమేల్ - తఞ్జమాక. ఉన్నై యొழ్రియ వేఱు తఞ్జమిల్లామైయాలే ఉన్నై క్కాణవేణు మెన్ఱు దరిత్తిరున్దేన్ - ఎన్ఱపడి.*

**భావదీపిక :- అవ :-** దేనికీ సహాయపడకుండా ప్రాణాలను మోస్తున్న నన్నుకూడా ఒక తల్లిగా పొందావే! అని భగవానునితో బాధగా అంటున్నది దేవకీ దేవి.

**వ్యాఖ్యానం :- (వఞ్జమ్ మేవియ నెఞ్జు ఉడై ప్పేయ్చ్చి)** - శ్రీకృష్ణుని చూచిన వారెవ్వరైనా ఋజుత్వాన్ని కలవారుగానే ఉండాలి. అతనిని చూచిన తర్వాతకూడా వంచనను కల్గినదై ఉన్నది ఈ పూతన అనే పిశాచి.

**(వరణ్డు నార్ నరమ్బు ఎழ్రక్కరిన్దు ఉక్క)** - శరీరంలో ఉండే మాంసం, రక్తం ఆమె స్తనక్షీరంతో పాటు వెలువడేటట్లు, మిగిలిన ఒంటిలోని నరాలు అన్నీ నారవలె కృశించేటట్లుగా, కమిలిపోయి, కూలి పోయేటట్లుగా.

**(నఞ్జమ్ ఆర్ తరు శుழ్రి ములై అన్దో! శువైత్తు నీ అరుళ్ శెయ్తు వళర్న్దాయ్)** - పట్టుకొన్నవారి ప్రాణాలు తీయగల్గినది, నశింపజేసే తీవ్రమైన విషాన్ని కల్గినదై, కోపాన్ని కల్గినదైన స్తనాన్ని ధారకంగా ఆస్వాదించి, వర్ధిల్లావు ! ఆశ్చర్యం. పూతనకు కల కోపాన్ని ఆమె స్తనంపై ఆరోపించి పల్కుతున్నారు. **"శుழ్రి"** కోపం.

**(కఞ్జన్ నాళ్ కవర్ కరుముకిల్ ఎన్దాయ్!)** - కంసుని ఆయుస్సును నశింపజేసి, దానితో ప్రకాశించిన తిరుమేనిని కలవాడవై, ఆ లీలతోను, రూపసౌందర్యంతోను నన్ను వశీకరించుకొన్నవాడా !

**(కడైప్పట్టేన్ వెఱితే ములై శుమైన్దు)** - స్తనాలు చేపు చేసినపుడు నిన్ను తనయునిగా పొందినా, స్తన్యాన్ని ఇవ్వలేక వ్యర్థంగా అయినందువల్ల, చాలా అధమలలో అధమను అయ్యాను.

**(తఞ్జమేల్ ఒన్ఱిలేన్ ఉయ్న్దిరున్దేన్)**- ప్రాణాలను ధరించే ఆశ్రయం ఇంకొకటిలేని దానను కనుక నాప్రాణాలను బిగపట్టుకొని ధరించి ఉన్నాను.

**(తక్కతే నల్ల తాయై ప్పెఱ్ఱాయే)** - నీకు స్తన్యం అవసరం అయినపుడు ఇవ్వడానికి యోగ్యతను కల యశోదను నీవు మంచి తల్లిగా పొందావు- అని భావం. లేక,

అవతారికలో చెప్పిన రీతిలో నన్నుకూడా ఒక తల్లిగా పొందావే ! అని బాధగా అంటున్నట్లుగా కూడా చెప్పవచ్చు.

**మల్లై మానకర్క్కు ఇఱైయవన్తన్నై వాన్ శెలుత్తి వన్దీఙ్గనమాయత్తు,**
**ఎల్లైయిల్ పిళ్ళై శెయ్వన కాణా త్తెయ్వ త్తేవకి పులమ్బియ పులమ్బల్,**
**కొల్లి కావలన్ మాలడిముడిమేల్ క్కోలమామ్ కులశేకరన్ శొన్న,**
**నల్లిశై త్తమిౙ్మాలై వల్లార్కళ్ నణ్ణువార్ ఒల్లై నారణనులకే** 11

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

మల్లై = మిక్కిలి ఐశ్వర్యాన్ని కల, మా నకర్క్కు = నగరం అయిన శ్రీమధురకు, ఇఱైయవన్ తన్నై = అధిపతి అయిన కంసుని, వాన్ శెలుత్తి = వీరస్వర్గానికి పంపి, వన్దు = రేపల్లెకు వచ్చి, ఈఙ్గనమ్ = ఈ విధంగా, ఎల్లైయిల్ మాయ్త్తు పిళ్ళై = అంతు లేని ఆశ్చర్యచేష్టితాలను చేసిన శ్రీకృష్ణుని, శెయ్వన కాణా = లీలలను దర్శించలేని, తెయ్వ త్తేవకి = దివ్యత్వాన్ని నిండుగాకల దేవకీదేవి, పులమ్బియ పులమ్బల్ = ఇలపించిన విలాపరూపం అయిన సూక్తులను, అడి ముడి మేల్ కోలమ్ ఆమ్ = సర్వేశ్వరుని శ్రీచరణాలను తమ తలలో అలంకారంగా అలంకరించుకొన్న, కుల శేకరన్ = కులశేఖరాౙ్వార్లు, శొన్న = పల్కిన, నల్ ఇశై = తీయని రాగాలనుకల, తమిౙ్ మాలై = ద్రావిడపాశురాలను, వల్లార్= అభ్యసించగల్గినవారు, ఒల్లై = శీఘ్రంగా, నారణన్ ఉలకు = పరమపదాన్ని, నణ్ణువార్ = పొందగలరు.

**వ్యా :- నిగమత్తిల్. (మల్లై మానకర్క్కిఱైయవన్తన్నై) మిక్క సమ్పత్తైయుడైయ శ్రీమధురైక్కు నిర్వాహకనాన కంసనై త్తాన్ కైతోట్టు ముడిక్కైయాలే వీరస్వర్గత్తిలే పొకట్టు. (వన్దు ఈఙ్గనమాయత్తిత్యాది) కంసవధమ్ పణ్ణి ఇఙ్గే వన్దు కిట్టిన ఆశ్చర్యచేష్టితఙ్గళుక్కు అవధి యన్ఱియిలే యిరుక్కిఱ కృష్ణనుడైయ బాలచేష్టితఙ్గళై క్కాణామైయాలే. (తెయ్వ త్తేవకి పులమ్బియ పులమ్బల్) ఇవన్ చేష్టితఙ్గళై అనుభవిక్కప్పెఱాత ఇౘవైయ ముడైయళాయ్ ఇవనై ప్పిళ్ళైయాక ప్పెఱుకైక్కీడాన భాగ్యత్తై ప్పణ్ణిన దేవకియార్ పులమ్బియ పాశురత్తై. "కొల్లి" ఎన్గిఱ పడైవీట్టుక్కు నిర్వాహకరానవర్. (మాలడి ముడిమేల్ కోలమామ్ కుల శేకరన్) సర్వేశ్వరన్తిరువడికళై త్తమక్కు ముడిమేల్ మాలైయాక వుడైయ పెరుమాళ్. (శొన్న నల్లిశై త్తమిౙ్మాలై వల్లార్కళ్) అౘకియ ఇశైయోదే కూడిన తమిౙ్త్తొడై వల్లవర్కళ్. (నణ్ణువారొల్లై నారణనులకే) ఇఙ్గే ఇరున్దు అవతారత్తిల్ ఏకదేశత్తై అనుభవిక్క ఆశైప్పట్టు అదుకిడైయాతే ఇరున్దు పులమ్బాతే, ఉభయవిభూతినాథనై ప్పరమపదత్తిలే నిత్యానుభవమ్ పణ్ణప్పెఱువర్కళ్.**

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.

పెరుమాళ్ తిరుమొౙి ఏౘామ్ తిరుమొౙి వ్యాఖ్యానమ్ ముౙ్ఱిౙ్ఱు.

**భావదీపిక :- అవ :-** ఈ దశకాన్ని అభ్యసించగల్గినవారికి కలిగే ఫలాన్నిగూర్చి తెల్పుతూ నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (మల్లై మానకర్క్కు ఇఱైయవన్తన్నై వాన్ శెలుత్తి)** - నిండైన సంపదను కల ఉత్తరమధురానగరానికి ప్రభువు అయిన కంసుని తన శ్రీహస్తంతో వధించడంద్వారా వీరస్వర్గానికి పంపి.

**(వన్దు ఈఙ్గనమ్ మాయ్త్తు ఎల్లైయిల్ పిళ్ళై శెయ్వన కాణా)** - కంసుని సంహరించి, రేపల్లెకు వచ్చి, ఈ రీతిలో అంతు లేని ఆశ్చర్యకరలీలలను చేసిన శ్రీకృష్ణుని బాల్యలీలను దర్శించలేకపోవడంచేత

**(దెయ్వ త్తేవకి పులమ్బియ పులమ్బల్)** - ఇతని లీలలను దర్శించలేని కొఱతను కల్గినది అయినా, ఇతనిని కుమారునిగా పొందే భాగ్యానికి నోచుకొన్న దేవకి విలపించిన మాటలను. బాల్యలీలలను అనుభవించినందువల్ల యశోదాదేవిని **"దెయ్వ నఙ్గై"** అని అన్నారు. అతనిని కుమారునిగా కన్న భాగ్యాన్ని పొందినందువల్ల ఇక్కడ **"తెయ్వ త్తేవకి"** అని అంటున్నారు. **"ఒరుత్తి మకనాయ్ పిఱన్దు ఓరిరవిల్ ఒరుత్తి మకనాయ్ ఒళిత్తు వళర"** (తిరుప్పావై-25) (ఒకతెకు కుమారుడై పుట్టి, అదేరాత్రిలో ఇంకొకతెకు కుమారుడవై రహస్యంగా వృద్ధి చెందగా) అని గోదాదేవి ఈ ఇద్దరు సాటిలేనివారని అన్నది కదా!

**(కొల్లి కావలన్)** - **"కొల్లి"** అనే చేరదేశం రాజధానిలో ఉండి రాజ్యపాలనను చేసినవారు.

**(మాలడి ముడిమేల్ కోలమామ్ కులశేకరన్)** - అందఱికంటే గొప్పవాడు కనుక **"మాల్"** అనే పేరును పొందిన భగవానుని శ్రీచరణాలను తమ శిరస్సుపై పూమాల వలె అలంకారంగా ధరించిన కులశేఖరప్పెరుమాళ్

**(శొన్న నల్ ఇశై తమిழ్మాలై వల్లార్కళ్)** - కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన, చక్కని స్వరంతో కూడిన ద్రావిడ పాశురాలు అనే ఈ దశకాన్ని అభ్యసించినవారు.

**(నణ్ణువార్ ఒల్లై నారణన్ ఉలకే)** - కులశేఖరుడనే నావలె ఇక్కడే ఉండి అవతారాలలో ఒకటి అయిన శ్రీకృష్ణుని అనుభవించాలని ఆశపడి, దానిని పొందలేనందువల్ల బాధపడి క్లేశపడి, విలపించకుండా, ఉభయవిభూతికి అధిపతి కనుక నారాయణుడనే పేరును పొందిన సర్వేశ్వరుని పరమపదంలో నిలకడగా ఉండి సదా అనుభవించే ఫలాన్ని పొందుతారు.

**ఏழாమ్తిరుమొழி - వ్యాఖ్యానానువాదం ముగిసింది.**



## ఎట్టామ్ తిరుమొ*ழ్*ఝి - మన్ను పుక*ழ్* - ప్రవేశమ్

**అవ :- దేవకియార్ ఇ*ழ*న్ద ఇ*ழ*వు మాత్రమేయో, శ్రీకౌసలైయారాయ్‌త్తాన్ పెఱ్ఱిలేనో? ఎన్ఱు అన్తిమకాలత్తిల్ తామి*ழ*క్కైయాలే అవళనుభవత్తై త్తిరుక్కణ్ణపురత్తిలే పేశి అనుభవిక్కిఱార్.**

*అరు :- మన్నుపుక*ழ్* ప్రవేశే. దేవకియార్ ఇ*ழ*న్దమాత్రమేయో, శ్రీకౌసలైయార్ అనుభవిత్తాప్పోలే తాననుభవిక్క ప్పెఱ్ఱిలేనో వెన్ఱపడి.*

### ఎనిమిదవ దశకం - ప్రవేశం - అనువాదం

**భావదీపిక :-** దేవకీదేవివలె శ్రీకృష్ణావతారాన్ని అనుభవించలేక కోల్పోవడం మాత్రమేనా! శ్రీకౌసల్యాదేవివలె శ్రీరామావతారాన్ని అయినా దర్శించలేకపోయానే! అని ఆ శ్రీరాముని కాలంలో ఉండి అనుభవించలేని కొఱత తీరేటట్లుగా, కౌసల్య శ్రీరామునకు జోలపాడిన అనుభవాన్ని తిరుక్కణ్ణపురంలో అనుభవిస్తూ ఈ దశకాన్ని ఆ*ழ*్వార్లు అనుగ్రహిస్తున్నారు.



**మన్ను పుక*ழ్* క్కౌశలైతన్ మణివయిఱు వాయ్‌త్తవనే!,**
**తెన్నిలజ్గై క్కోన్ ముడికళ్ శిన్దువిత్తాయ్! శెమ్బొన్ శేర్,**
**కన్నినన్ మామతిళ్ పుడైశూ*ழ్* కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎన్నుడైయ ఇన్నముతే! ఇరాకవనే! తాలేలో! 1**

మన్ను పుక*ழ్* = స్థిరంగా నిలచి ఉండే కీర్తిని కల, కౌశలైతన్ = కౌసల్యయొక్క, మణి వయిఱు = అందమైన గర్భంలో, వాయ్‌త్తవనే = కుమారుడుగా అవతరించినవాడా, తెన్ ఇలజ్గై కోన్ = దక్షిణదిక్కులో ఉండే లంకకు అధిపతి అయిన రావణుని, ముడికళ్= పది తలలను, శిన్దువిత్తాయ్ = (బాణాలతో) చెదఱిపడేటట్లు చేసినవాడా!, శెమ్ పొన్ శేర్ = ఎఱ్ఱని బంగారంతో చేయబడినదై, కన్ని = నాశరహితమై, నల్ = అందమైనదై, మా = పెద్దది అయిన, మదిళ్ = కోటలతో, పుడై శూ*ழ్* = చుట్టూ ఆవరింపబడి ఉండే, కణపురత్తు = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉన్నవాడవై, ఎన్ కరు మణియే = నాకంటి నల్లని కనుగుడ్డువంటివాడా! ఎన్నుడైయ ఇన్ అముతే = నాకు భోగ్యమైన అమృతమా!, ఇరాకవనే = శ్రీరామా!, తాలేలో = నీకు జోల.

**వ్యా :- ముతఱ్పాట్టు. (మన్ను పుక*ழ్* క్కౌశలైతన్ మణివయిఱు వాయ్‌త్తవనే!) "సర్వేశ్వరనై ప్పిళ్ళైయాక ప్పెఱ్ఱాళ్" ఎన్ఱ నిలైనిన్ఱ పుక*ழై* యుడైయ శ్రీకౌసలైయారుడైయ**

**అழ்ழకియ వయిఱ్ఱిలే అవళుక్కు ప్పిళ్ళైయాక ప్పెఱ్ఱవనే! (తెన్నిలజ్గై క్కోన్ ముడికళ్ శిన్దువిత్తాయ్!) లజ్కైక్కు నిర్వాహకనాన రావణనుడైయ ముడికళ్ పత్తైయుమ్ తిరుచ్చరజ్గళా లే శితఱ ప్పణ్ణినవనే! ఇత్తిరుమొழ்ழియిలే రామావతారత్తిల్ మిక్కైయాక్కైయాలే ఇచ్చన్దై. (శెమ్బొన్ శేర్ కన్నినన్మామతిళ్ పుడై శూழ்ழ் కణపురత్తెన్ కరుమణియే! అழ்ழవిల్లాత మతిళాలే శూழ్ழన్ద తిరుక్కణ్ణపురత్తిలే ఎనక్కు దృష్టిక్కు నిర్వాహకనాయ్ నిఱ్కిఱవనే! (ఎన్నుడైయ ఇన్నముతే) దేవర్కళమృతమ్బోలన్ఱియే ఎనక్కు అమృతమానవనే! (ఇరాకవనే! తాలేలో) దేవర్కళుడైయ అమృతమ్ ఉప్పుచ్చాఱితే. అతన్ఱితే ఇవరుడైయ అమృత మిరుక్కిఱపడి.**

*ముతఱ్పాట్టు. (మన్నిత్యాది). ఇత్తిరుమొழ்ழియిల్ రామగుణమ్ మిక్కిరుక్కైయాలే ప్రధాన ప్రయోజనమ్ రావణవధమాకైయాలుమ్ "తెన్నిలజ్గైక్కోన్" ఎన్గిఱ ఇచ్చన్దైయై మున్దుఱ చ్చొల్లుకిఱతు. ఇతుక్కు, "తిరువవతరిత్తవుడనే రావణవధత్తై చ్చొల్లువానేన్?" ఎన్ఱు శఙ్కై కణ్డు కొళ్వదు. అదిన్మేలే (ఇత్తిరుమొழ்ழియితే) ఎన్గిఱ వాక్యమ్. కన్నియాకైయాలే (అழ்ழవిల్లాత మతిళెన్ఱిఱతు).*

**భావదీపిక :– అవ:–** కౌసల్యాదేవికి కుమారుడై అవతరించి, రావణుని వధించిన శ్రీరామునకు జోలపాడుతున్నారు. ఈ పాశురంలో

**వ్యాఖ్యానం :– (మన్ను పుకழ்ழ் కౌశలైతన్ మణివయిఱు వాయ్త్తివనే!)** – లోకానికి అంతటికీ ఈశ్వరుడైన భగవానునే పుత్రునిగా పొందినది– అనే స్థిరమైన కీర్తిని కల కౌసల్యయొక్క అందమైన గర్భంలో ఆమెకు కుమారుడవై అవతరించినవాడా !

**(తెన్నిలజ్గై క్కోన్ ముడికళ్ శిన్దు విత్తాయ్!)** – లంకకు ప్రభువైన రావణుని శిరస్సులు పదింటిని బాణాలతో చెదఱి చిందిపడేటట్లు చేసినవాడా ! శ్రీరామావతారాన్ని ప్రస్తావించడానికి ముఖ్యకారణం రావణవధయే కనుక, శ్రీరాముని అవతారాన్నిగూర్చి పల్కిన వెంటనే రావణవధనుగూర్చి పల్కుతున్నారు.

**(శెమ్బొన్ శేర్ కన్ని నల్ మా మదిళ్ పుడై శూழ்ழ் కణపురత్తు ఎన్ కరు మణియే!)–** మిక్కిలి శ్రేష్ఠం అయిన అందమైన బంగారంతో చేయబడి, నాశరహితమై, అందమైనదై, పెద్దదైన కోటలతో చుట్టూ పరివేష్ఠింపబడి ఉండే తిరుక్కణ్ణపురంలో నా కంటికి ముఖ్యమైన కనుగుడ్డువలె ఉంటూ, నన్ను నడిపించేవాడా! **"కన్ని"** అనే పదం నాశరహిత్యాన్ని తెలుపుతుంది.

**(ఎన్నుడైయ ఇన్నముతే!)** – కేవలం ఉప్పుచారువంటి దేవతల అమృతంవలె కాకుండా నాకు కంటికి, భావనకు అమృతంవలె భోగ్యమైన వాడా!,

**(ఇరాకవనే! తాలేలో)** – దేవతల అమృతంవలె సారహీనమై ఉండేది కాదు నా అమృతం. చాలా గొప్ప రఘువంశంలో జనించిన రాఘవుడే నా అమృతం – అని అంటున్నారు.

**పుణ్డరీక మలరతన్మేల్ ప్పువని ఎల్లామ్ పడైత్తవనే!,**
**తిణ్డిఱలాళ్ తాడకైతన్ ఉర మురువ చ్చిలై వళైత్తాయ్!,**
**కణ్డవర్తమ్ మనమ్ వ*ழ*ఙ్గుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎణ్డిశైయుమ్ ఆళుడైయాయ్! ఇరాకవనే! తాలేలో!** **2**

పుణ్డరీకమ్ మలర్ అతన్మేల్– (తిరునాభిలో అవతరించిన), పువని ఎల్లామ్ పడైత్తవనే = లోకాలను అన్నిటినీ సృష్టించినవాడా !, తిణ్ తిఱలాళ్ తాటకైతన్ = దృఢమైన, బలాన్ని కల తాటకయొక్క, ఉరమ్ ఉరువ = వక్షస్సు భగ్నం అయేటట్లుగా, శిలై వళైత్తాయ్ = వింటిని వంచి బాణాలను ప్రయోగించినవాడా !, కణ్డవర్ = దర్శించినవారు, తమ్ మనమ్ వ*ழ*ఙ్గుమ్ = తమమనస్సును తామే అంగీకరించి, అర్పించడానికి తగిన, కణపురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నా నీలమాణిక్యమా !, ఎణ్ తిశైయుమ్ = ఎనిమిది దిక్కులలో ఉన్నవారని, ఆళ్ ఉడైయాయ్=దాసులుగా కల్గినవాడా!, ఇరాకవనే = రాఘవా!, తాలేలో = (నీకు) జోల.

**వ్యా :– ఇరణ్డామ్పాట్టు. (పుణ్డరీక మిత్యాది) తిరునాభీకమలత్తిలే లోక మెల్లామ్ సృష్టిత్తవనే! (తిణ్డిఅలిత్యాది) సృష్టిక్కుమతన్ఱియే, పయిరైచ్చెయ్తు కళై పిడుఙ్గుమాపోలే అసురవర్గత్తై ప్పోక్కినపడి. తిణ్ణియ తిఱలైయుడైయళాన తాటకైయురత్తై మఱుపాడురువ విల్లై వళైత్తవనే! (కణ్డవర్తమ్ మనమ్ వ*ழ*ఙ్గుమ్ కణపురత్తెన్ కరుమణియే) – కణ్డవర్కళ్ నెఞ్జుకళై తాఙ్గళుమ్ తిరుక్కణ్ణపురత్తిలే నిత్యఱవనే! (ఎణ్డిశైయు మాళుడైయా యిరాకవనే తాలేలో) అవతారత్తిల్ పిఱ్పాడరాన ఎట్టు దిక్కిలుళ్ళారుమ్ వన్దు వ*ழ*ిపడుమ్పడి నిన్ఱవనే!**

*అరు :– ఇరణ్డామ్పాట్టు. (పుణ్డరీక మిత్యాది). ఉరమ్ – ఉరస్సు.*

**భావదీపిక :– అవ :–** నాభీపద్మంలో లోకాలను అన్నిటినీ సృష్టించి, శ్రీరాముడవై అవతరించి, తాటకను సంహరించినవానిని తాలాట్టు (జోల) పాడుతున్నారు–ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :– (పుణ్డరీక మలర్తన్ మేల్ పువని ఎల్లామ్ పడైత్తవనే!)** – తిరునాభీ కమలంలో బ్రహ్మను ఆవిర్భవింపజేసి, అతనిద్వారా సమస్తలోకాలను సృష్టింపజేసినవాడా!

**(తిణ్ తిఱలాళ్ తాటకైతన్ ఉరమ్ ఉరువ చ్చిలై వళైత్తాయ్)**– ఈవిధంగా సృష్టించడంతో విడువకుండా, పైరును పెంచేవాడు కలుపును తీసి వేసినట్లుగా, తాటక మొదలైన అసుర– రాక్షసులు నశింపజేసిన తీరునుగూర్చి పల్కుతున్నారు. తాటకను

గూర్చి పల్కడం సుబాహువు మొదలైనవారికి ఉపలక్షణం. దృఢమైన బలాన్ని కల తాటకయొక్క వక్షస్సు రూపుమాసి పోయేటట్లుగా వింటిని వంచి బాణాలను వేసినవాడా !

**(కణ్డవర్ తమ్ మనమ్ వళ్గుజ్గుమ్ కణపురత్తు ఎన్ కరు మణియే!)** – దర్శించినవారు తమ మనస్సును తామే అంగీకరించి అర్పించే రీతిలో తిరుక్కణ్ణపురంలో నీలవర్ణాన్ని కల మాణిక్యంవలె ఉన్నవాడా!

**(ఎణ్ తిశైయుమ్ ఆళుడైయాయ్ ఇరాకవనే తాలేలో)** – శ్రీరామావతారానికి వెనుకబడినవారుకూడా ఎనిమిది దిక్కులనుండి వచ్చి సేవించి ఉజ్జీవించేటట్లుగా వేంచేసి ఉన్నవాడా! నీకు జోల.

**కొజ్గు మలి కరుఙ్గుళ్గలాళ్ కౌశలైతన్ కులమతలాయ్!,**
**తజ్గు పెరుమ్ పుకళ్గ్ చ్చనకన్తిరుమరుకా! తాశరతీ!,**
**కజ్గైయిలుమ్ తీర్త్తమలి కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎజ్గళ్ కులత్తిన్నముతే! ఇరాకవనే! తాలేలో!** 3

కొజ్గు మలి = పరిమళం అతిశయించి ఉండే, కరు కుళ్గలాల్ = నల్లని కేశాలను కల, కౌశలైతన్ = కౌసల్యాదేవియొక్క, కులమ్ మతలాయ్ = కులానికి ఉత్తారకా!, తజ్గు పెరు పుకళ్గ్ = గొప్ప కీర్తిని పొందికగా కల, శనకన్ = జనకమహారాజుకు, తిరు మరుకా = అల్లుడవైనవాడా!, మలి తీర్త్తమ్ = పరిశుద్ధత మిక్కిలిగా కల్గిన తీర్థాలను కల, కణపురత్తు = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, ఎన్ కరు మణియే = నా నీల మాణిక్యమా!, ఎజ్గళ్ కులమ్= మా రాజవంశానికి అంతటికీ, ఇన్ అముతే = పరమభోగ్యం అయిన అమృతం వంటివాడా!, ఇరాకవనే = రాఘవా!, తాలేలో = జోల.

**వ్యా :– మూన్ఱామ్పాట్టు. (కొజ్గు మలి కరుమ్ కుళ్గలాల్ కౌశలైతన్ కులమతలాయ్) మిక్క పరిమళత్తై ప్పూఅప్పడ విడుకిఱ ఇరుణ్డ కుళ్గలైయుడైయ శ్రీకౌసలైయారుడైయ కులత్తుక్కు ఉత్తారకనానవనే! (తజ్గు పెరుమ్ పుకళ్గ్చ్చనకన్తిరుమరుకా) పుకళ్గెన్టు పిఱన్దవై ఎల్లామ్ తజ్గుమ్పడి పెరియ పుకళ్గైయుడైయ శ్రీజనకరాజనుక్కు మరుమకనానవనే! (తాశరతీ) అవనోడే సదృశసమ్బన్ధమ్ పణ్ణలామ్పడియాన పుకళ్గైయుడై యవనే!**

**(కజ్గైయిలుమ్ తీర్త్త మలి కణపురత్తెన్ కరుమణియే) కాదాచిత్కసమ్బన్ధత్తాల్ వరుమ్ శుద్ధియోగమిఱే గజ్గైక్కుళ్ళతు, సమ్బన్ధమ్ నిత్యమాకైయాలే అతిలుమ్ శుద్ధిమిక్కిరుక్కిఱ తిరుప్పొయ్కైయై యుడైయ తిరుక్కణ్ణపురత్తిలే సులభనానవనే! (ఎజ్గళ్ కులత్తిన్నముతే ఇరాకవనే తాలేలో) రాజవంశత్తుక్కాక భోగ్యభూతనానవనే!**

*అరు :– మూన్ఱామ్పాట్టు. (కొజ్గు మలి యిత్యాది). మతలై – పిళ్ళై.*

**భావదీపిక :- అవ :-** కౌసల్యకు కుమారుడై పుట్టి, జనకచక్రవర్తికి అల్లుడైనవానికి తాలాట్టు (జోల) పాడుతున్నారు- ఈ దశకంలో

**వ్యాఖ్యానం :- (కొఙ్గుమలి కరుఙ్కుழలాళ్ కౌశలైతన్ కులమతలాయ్!)** – మిక్కిలి సువాసనను వెలువరించే, నల్లని కేశాలను కల కౌసల్యాదేవియొక్క కులాన్ని ఉద్ధరించిన వాడా.

**(తఙ్గు పెరుమ్ పుకழ్ చ్చనకన్ తిరుమరుకా!)** – కీర్తి అనే పేరును కల్గినదానికి అంతటికి ఆకరం అనే రీతిలో గొప్ప కీర్తిని కల శ్రీజనకచక్రవర్తికి అల్లుడవైనవాడా !

**(తాశరతీ!)** – జనకరాజు దగ్గరనుండి కన్యను స్వీకరించడానికి తగినట్లుగా దశరథునకు పుత్రుడవై అవతరించినవాడా!

**(కఙ్గైయిలుమ్ తీర్త్త మలి కణపురత్తెన్ కరుమణియే!)** – గంగకంటే శుద్ధిని మెండుగా కల్గిన తీర్థాలను కల తిరుక్కణ్ణపురంలో మాకు సులభుడవై వేంచేసిఉన్నవాడా! భగవానుడు త్రివిక్రముడై లోకాలను కొలిచినపుడు సత్యలోకానికి వ్యాపించిన శ్రీచరణాన్ని శోధించిన తీర్థం- అనే కారణంవల్ల పుట్టిన కాలంలో కల్గిన శుద్ధిని మాత్రమే కల్గినది గంగానది. సదా భగవానునితో సంబంధాన్ని కల్గినది కనుక తిరుక్కణ్ణపురంలోని నిత్యపుష్కరిణి మొదలైనతీర్థాలు గంగకంటే శుద్ధిని మెండుగా కల్గిఉంటాయికదా!

**(ఎఙ్గళ్ కులత్తు ఇన్నముతే! ఇరాకవనే! తాలేలో)** – మా రాజకులానికి అంతటికీ అమృతంవలె భోగ్యుడవై ఉండే రఘుకుమారా!

**(తాలేలో)** – నీకు తాలాట్టు (జోల)

**తామరైమేల్ అయనవనై ప్పడైత్తవనే!, తయరతన్తన్**
**మామతలాయ్! మైతిలితన్ మణవాళా!, వణ్డినఙ్గళ్**
**కామరఙ్గళ్ ఇశై పాడుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఏమరు వెఞ్జిలై వలవా! ఇరాకవనే! తాలేలో!** **4**

తామరై మేల్ = తిరునాభీపద్మంలో, అయన్ అవనై = బ్రహ్మను, పడైత్తవనే = సృష్టించివనాడా ! తయరతన్ తన్ = దశరథుని, మా మదలాయ్ = జ్యేష్ఠకుమారా! మైతిలితన్ మణవాళా = సీతాదేవికి వల్లభుడా!, వణ్డు ఇనఙ్గళ్ ఇశై పాడుమ్ = **"కామరమ్"** అనే రాగాలను పాడే రీతిలో, కణపురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నా నీలమాణిక్యమా!, ఏమరు = పట్టుకొన్నవారు ఎవరైనా వారిని బాణప్రయోగంలో ప్రేరేపించే, వెమ్ శిలై వలవా = భయంకరం అయిన శ్రీశార్ఙ్గం అనే వింటిని పాలించగలవాడా !, ఇరాకవనే = రాఘవా, తాలేలో = నీకు తాలాట్టు.

**వ్యా :- నాలామ్బాట్టు. (తామరైమేల్ అయనవనై ప్పడైత్తవనే!) కీழ్ చ్చొన్న సృష్టి పిన్నాట్టినపడి. (తయరతన్తన్ మామతలాయ్) అఖుపతినాయిరమాణ్డు మలడునిన్ర చక్రవర్తియినుడైయ మలడు తీర ప్పిఅన్దవనే! (మైతిలితన్ మణవాళా!) పిళ్ళై పెఱ్ఱ ఏఱ్ఱత్తుక్కుమ్ పిఅప్పిల్ వన్ద ఏఱ్ఱత్తుక్కుమ్ మేలే, "యస్య సా జనకాత్మజా" ఎన్ను పిరాట్టియై ఉనక్కెన్నిట్టు ప్పిఅన్ద మేన్మైయైయుడైయవనే! (వణ్డినఙ్గళ్ కామరఙ్గళిశైపాడుమ్ కణపురత్తెన్ కరుమణియే!) వణ్డినఙ్గళ్ "కామరమ్" ఎన్గిఅ పణ్ణిలే ఇశైపాడుకిఅ తిరుక్కణ్ణపురత్తిలే సన్నిహితనానవనే! (ఏమరు వెఞ్జిలై వలవా! ఇరాకవనే తాలేలో!) ఆరేనుమ్ పిడిక్కిలుమ్ ఏవిలే మీట్టుమ్ శ్రీశార్ఙ్గత్తై ఉన్నినైవిలే వరుమ్బడి శెలుత్తవల్లవనే!**

*అరు :- నాలామ్బాట్టు. (తామరై యిత్యాది). (పిళ్ళై పెళ్ళై) బ్రహ్మావై ప్పెఱ్ఱ. (ఏవిలే) ఎయ్కైయిలే.*

**భావదీపిక :- అవ :-** నాభీకమలంలో బ్రహ్మను సృష్టించినవాడు, దశరథునకు జ్యేష్ఠ కుమారునిగా పుట్టినవాడు, మైథిలికి వల్లభుడైన భగవానునకు ఇందులో తాలాట్టును పాడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (తామరైమేల్ అయన్ అవనై ప్పడైత్తవనే)** - రెండవ పాశురంలో పల్కిన సృష్టికార్యం బ్రహ్మకేకదా ఉన్నది ! అని అంటే, ఆ బ్రహ్మనుకూడా నాభీపద్మంలో అవతరింపజేసిన వాడితడే ! అని అంటున్నారు.

**(తయరతన్ తన్ మామతలాయ్!)** - అరవై వేల ఏళ్ళు సంతానం లేకుండా నిస్సంతువుగా ఉన్న దశరథచక్రవర్తికి ఆ కొఱత తీరేటట్లుగా కుమారునిగా పుట్టినవాడా!

**(మైతిలితన్ మణవాళా!)** - బ్రహ్మను కుమారునిగా పొందిన అతిశయం కంటే దశరథచక్రవర్తికి కుమారునిగా ఉండే వైలక్షణ్యం కంటే, **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా, న త్వం సమర్థస్తం హర్తుం రామచాపాశ్రయాం వనే"** (రామా. అర-37-19) (ఏ తేజస్సు జనకప్రభువుకుమార్తె అయిన సీతాదేవికి చెందినదో, ఆ రామతేజస్సు ఇంతటిది అని లెక్కకట్టలేనిది. రాముని వింటిని ఆశ్రయించిఉండే ఆమెను అపహరించడం నీవల్ల సాధ్యమే కాదు) అని స్త్రీకుల తిలకం అయిన సీతాదేవిని తనకోసం పుట్టిన గొప్పతనాన్ని కలవాడా!

**(వణ్డినఙ్గళ్ కామరఙ్గళ్ ఇశై పాడుమ్ కణపురత్తు ఎన్ కరు మణియే!)** - తుమ్మెదల గుంపులు **"కామరమ్"** అనే రాగంలో సంగీతం పాడే తిరుక్కణ్ణపురంలో నాకు సులభుడవై ఉన్నవాడా! **(ఏమరు వెమ్ శిలై వలవా ఇరాకవనే! తాలేలో)** - ఎవరు పట్టుకొన్నా, వారిని బాణాలను ప్రయోగించడంలో ప్రేరేపించే శార్ఙ్గమనే వింటిని నీ ఇష్ట ప్రకారంగా పాలించగల రాఘవా! నీకు తాలాట్టు.

**పారాళుమ్ పడర్ శెల్వమ్ పరతనమ్బిక్కే అరుళి,**
**ఆరావన్బిళైయవనోడు అరుజ్గానమ్ అడైన్దవనే!,**
**శీరాళుమ్ వరైమార్పా! తిరుక్కణ్ణపురత్తరశే!,**
**తారారుమ్ నీణ్ ముడి! ఎన్ తాశరతీ! తాలేలో!** 5

పార్ ఆళుమ్ పడర్ శెల్వమ్ = భూమిని అంతటినీ పరిపాలించడం అనే గొప్ప రాజ్యలక్ష్మిని, పరతన్ నమ్బిక్కే = సద్గుణాలు నిండిన భరతాళ్వాన్‌కే, అరుళి = అనుగ్రహించి, ఆరా అన్బు ఇళైయవనోడు = కొఱతలేని ప్రేమనుకల లక్ష్మణునితో పాటు, అరు కానమ్ అడైన్దవనే = ఎవరికీ ప్రవేశించడానికి సాధ్యం కాని అరణ్యానికి పోయినవాడా !, శీర్ ఆళుమ్ వరై మార్బా = వీరలక్ష్మికి నివాసస్థానం అయిన పర్వతం వంటి వక్షఃస్థలాన్ని కలవాడా !, తిరు క్కణ్ణపురత్తు అరశే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే ప్రభూ!, తార్ ఆళుమ్ నీళ్ ముడి = పూమాలికలతో కూడిన దీర్ఘమైన కిరీటాన్ని కల, ఎన్ తాశరతీ ! = నా శ్రీరామా!, తాలేలో = నీకు తాలాట్టు.

**వ్యా :- అఙ్జామ్బాట్టు. (పారాళుమ్ పడర్ శెల్వమ్ పరతనమ్బిక్కే యరుళి) భూమిప్పరప్పడైయ ఆళక్కడవతాన పెరియసమ్పత్తై, పారతన్త్ర్యగుణజ్గళాల్ పూర్ణనాయిరుక్కిఱ శ్రీభరతాళ్వానుక్కే అరుళి. (ఆరావన్బిళైయవనొడు అరుజ్గాన మడైన్దవనే!) అవనైప్పోలే నియమిత్త విడత్తిల్ పిరిన్దిరుక్కమాట్టాతే, "కురుష్వ మామ్" ఎన్నుమ్ ఇళైయ పెరుమాళోడేకూడ ఒరువరాలుమ్ ఇయజ్గవొణ్ణాత దుష్టసత్త్వప్రచురమాన కాట్టిలే ప్రవేశిత్తవనే! (శీరాళుమ్ వరైమార్పా!) వీరశ్రీక్కు నిర్వాహకనానతువుమ్. (తారాళుమ్ నీణ్ ముడి యెన్ తాశరతీ! తాలేలో) ఆధిరాజ్యసూచకమాన మాలైయోడు కూడిన ముడియైయుడైయ చక్రవర్తితిరుమకనే!**

**భావదీపిక :- అవ :-** భరతునకు రాజ్యాధికారాన్ని అప్పగించి, లక్ష్మణునితో వనానికి వెడలిన శ్రీరామునకు తాలాట్టు (జోల) పాడుతున్నారు ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (పారాళుమ్ పడర్ శెల్వమ్ పరతనమ్బిక్కే అరుళి)** - చక్రవర్తులు కనుక భూమిని అంతటినీ పాలించే గొప్ప ఐశ్వర్యాన్ని, భగవానుని అధీనంలో ఉండడం అనే పారతంత్ర్యం మొదలైన స్వభావసిద్ధగుణాలతో నిండి ఉండే భరతాళ్వాన్‌కే అనుగ్రహించి.

**(ఆరా అన్బు ఇళైయవనోడు అరుమ్ కానమ్ అడైన్దవనే!)** - భరతునివలె తాను ఆజ్ఞాపించిన చోటనే విశ్లేషించి ఉండడానికి ఇష్టపడనివాడై, **"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"** (రామా-అయో-31-24) (నన్ను దాసునిగా పరిగ్రహించు. ఇందులో తప్పు ఏమీ లేదు. దీనివల్ల

నేను కృతార్థుణ్ణి అవుతాను. నీ కార్యంకూడా సిద్ధిస్తుంది) అనే రీతిలో వెంటనే ఉండి, దాస్యాన్ని చేసేవాడైన లక్ష్మణునితో చేరి, ఎవరు సంచరించడానికి సాధ్యం కాని, దుష్టమృగాలు నిండిన అరణ్యాలకు పోయినవాడా!

**(శీరాళుమ్ వరై మార్పా!)** – వీరలక్ష్మికి స్థానం అయిన, పర్వతంవంటి వక్షః స్థలాన్ని కలవాడా!

**(తిరు క్కణ్ణపురత్తు అరశే!)** – తిరుక్కణ్ణపురానికి స్వామీ ! లోకానికి అంతటికీ ప్రభవు అనే విషయాన్ని చూపే విజయంతో కూడిన దీర్ఘమైన కిరీటాన్ని కల చక్రవర్తి కుమారా! నీకు తాలాట్టు.

**శుర్ఱమెల్లామ్ పిన్ తొడర త్తొల్ కాన మడైన్దవనే!,**
**అర్ఱవర్కట్కు అరుమరున్దే! అయోత్తినకర్క్కు అతిపతియే!,**
**కర్ఱవర్కళ్ తామ్ వాழుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**శిర్ఱవైతన్ శొల్కొణ్డ శీరామా! తాలేలో!** **6**

శుర్ఱమ్ ఎల్లామ్ పిన్ తొడర = బంధువులందఱు వెంబడించి రాగా, తొల్ కానమ్ అడైన్దవనే = ప్రాచీనమైన అడవికి వేంచేసినవాడా!, అర్ఱవర్కట్కు = నీకు విధేయులైన భక్తులకు, అరు మరున్దే = అరుదైన మందువంటివాడా !, అయోత్తినకర్క్కు అతిపతియే = అయోధ్యకు అధిపతీ!, కర్ఱవర్కళ్తామ్ వాழుమ్ = వేదశాస్త్రాలను అభ్యసించి, తెలిసిన జ్ఞానులు నివసించే, కణపురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణ పురంలో వేంచేసి ఉండే నాకు భోగ్యమైన నీల మాణిక్యమా!, శిర్ఱవైతన్ = చిన్నతల్లి అయిన కైకేయియొక్క, శొల్ కొణ్డ శీరామా = మాటను పరిగ్రహించిన శ్రీరామా!, తాలేలో = (నీకు) జోల.

**వ్యా :– ఆఱాయ్యాట్టు. (శుర్ఱ మెల్లామ్ పిన్ తొడర త్తొల్ కాన మడైన్దవనే!) "ఎల్లారుమ్ పోనార్కళో? శితితిడమ్ పోయ్ మీణ్డతెన్నన్నో శొల్లిర్ఱు" ఎన్న, "అహం సర్వమ్ కరిష్యామి" ఎన్ఱు శొన్న ఎల్లా అడిమైయుమ్ శెయ్యు మిళైయపెరుమాళ్ కూడ ప్పోకైయాలే ఎల్లా బన్ధుక్కళుమ్ కూడప్పోనార్కళాయ్త్తితే" ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్ తరుళినార్. (అర్ఱవర్కట్కరుమరున్దే!) "గర్భభూతా స్తపోధనాః" ఎన్గిరుక్కు మవర్కళుక్కు అరుమరున్దే! "అప్యహం జీవితం జహ్యామ్" ఎన్గిరుక్కుమ్ అరుమరున్దాన వనే! (అయోత్తినకర్క్కతిపతియే!) పరమపదమ్బోలే అయోధ్యైయితే ఇతుక్కుమ్ పేర్. అప్పడిప్పట్ట పడైవీట్టుక్కు అధిపతియానవనే!**

**(కర్ఱవర్కళ్తామ్ వాழుమ్ కణపురత్తెన్కరుమణియే!) కణ్బతు ఒరు దేశత్తిలే ఇరున్దు ఒరు కాలత్తిలేయాయ్ ప్రాప్యవస్తువై క్కిట్టి అనుభవిప్పతు ఒరు దేశవిశేషత్తిలే**

**యాకామే, ప్రాప్యవస్తు తెఱ్కుదిక్కిలే కాణలామ్బడి తిరుక్కణ్ణపురత్తిల్ నిన్దవనే! (*శిగ్ర్ర*వైతన్ శొల్ కొణ్డ శీరామా! తాలేలో) పెగ్ర్ర తాయాన నాన్ ఉమ్మై ప్పిరియిల్ తరియే నెన్ఱు శ్రీకౌసలైయార్ పిన్ తొడరచ్చెయ్‌తేయుమ్ మాగ్ర్రాత్తాయాన కైకేయి శొల్లు మాఱాతే వనత్తే పోన్దవనే!**

*అరు :- ఆఱామ్బాట్టు. (శుగ్ర్ర మిత్యాది) అయోత్తినకరక్కు త్తెఱ్కాకైయాలుమ్, తిరుక్కణ్ణపురత్తై మణ్డలన్దార్ తెన్‌మణ్డలమాకైయాలుమ్ తెఱ్కుదిక్కెన్ఱు వ్యాఖ్యాతా వార్తై. అవై-తాయార్.*

**భావదీపిక :- అవ :-** బంధువులు అందఱు వెంటరాగా అరణ్యానికి వెళ్ళి, అక్కడ ఉండే మునులను అనుగ్రహించిన అయోధ్యాధిపతికి తాలాట్టు పాడుతున్నారు- ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (శుగ్ర్రమ్ ఎల్లామ్ పిన్ తొడర త్తొల్‌కానమ్ అడైన్దవనే!)** - బంధువుల అంతా వెంబడించి రాగా అరణ్యాలకు పోయినవాడా ! "అందఱు అరణ్యాలకు పోలేదే! కొంచెం దూరం పోయి, తర్వాత వెనుతిగిరి వచ్చారు" అని కదా శ్రీరామాయణంలో చెప్పబడింది.- అనే సందేహం రాగా, **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే"** (రామా. అయో-31-25) (నీవు సీతాదేవితోపాటు కొండచరియలలో విహరిస్తావు. అపుడు నేను, నీవు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు అన్ని విధాలైన కైంకర్యాలను చేస్తాను) అనే రీతిలో అన్ని సేవలను చేసే లక్ష్మణుడు వెంటగా వెళ్ళడంవల్ల బంధువులంతా వెంటవెళ్ళారు అని అనడంలో అడ్డు లేదుకదా! అని భగవద్రామానుజులు అనుగ్రహించిన ఐతిహ్యం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో ఉట్టంకింపబడింది.

**(అగ్ర్రవర్‌కట్కు అరు మరున్దే!)** - **"న్యస్తదండా వయం రాజన్ ! జితక్రోధా జితేంద్రియాః, రక్షితవ్యా స్త్వయా శశ్వత్ గర్భభూతా స్తపోధనాః"** (రామా. ఆర. 1-21) (ప్రభూ! రాక్షసులను శపించడం మొదలైన దండనలను విడిచివేసినవారమై, కోపాన్ని జయించినవారమై, ఇంద్రియాలను జయించినవారమై, తపస్సునే ధనంగా కల్గినవారమై, నీకు గర్భంవంటివారమై ఉండే మేము నీచే ఎల్లప్పుడు రక్షింపబడవలసిన వారము) అని పల్కిన మునులకు **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** (రామా-ఆర-10-19) (సీతా! నేను నా జీవితాన్ని, లక్ష్మణునితో పాటుగా సీతాదేవిని అయినా విడిచివేస్తాను తప్ప, చేసిన ప్రతిజ్ఞను, అందులోను విశేషించి బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞను ఎంతమాత్రం విడువను) అనే రీతిలో అరుదైన మందువలె ప్రాణాలను కాపాడేవాడై ఉండేవాడా!

**(అయోత్తినకర్క్కు అతిపతియే!) – "తద్విష్ణోః పరమం పదమ్"** అని, **"అయోధ్య"** అని వేదంలో మోక్షలోకం నిర్దేశింపబడింది. అదే రీతిలో అయోధ్య అనే పేరును కల రాజధానిలో ఉండి పాలించేవాడా!

**(కఱ్ఱవర్కళ్తామ్ వాழுమ్ కణపురత్తుఎన్ కరు మణియే!)** – వేదాదులను అధ్యయనం చేసి, తెలిసిన జ్ఞానులు నిత్యవాసం చేసే తిరుక్కణ్ణపురంలో నీలమణివలె భోగ్యమైనవాడా ! ఉపాసకులు ఈ లోకంలో ఒకచోట ఒక సమయంలో పరమపురుషుని ఉపాసించి, పొందదగినవాడైన అతనిని (భగవానుని) పరమపదానికి చేరిన తర్వాతే అనుభవించాలి. ఆ రీతిలో కాకుండా, మనం నివసించేటట్లున్న, దక్షిణదేశంలోని దివ్యదేశం అయిన తిరుక్కణ్ణపురంలోనే ఆశ్రయించదగినవాడై అనుభవించదగినట్లుగా నిలచిఉన్నవాడా!

**(శిఱ్ఱవైతన్ శొల్ కొణ్డ శీరామా ! తాలేలో)** – "కన్నతల్లి అయిన నేను మిమ్ములను విడిస్తే ప్రాణాలను విడువలేను' అనే కౌసల్యాదేవి వెంట వచ్చినా, పినతల్లి అయిన కైకేయి మాటను శిరసా వహించి అరణ్యానికి చేరినవాడా ! నీకు తాలాట్టు.

**ఆలినిలై ప్పాలకనాయ్ అన్ఱులకమ్ ఉణ్డవనే!,**
**వాలియై క్కొన్ఱు అరశు ఇళైయ వానరత్తుక్కు అళిత్తవనే!,**
**కాలిన్ మణికరై అలైక్కుమ్ కరణపురత్తు ఎన్ కరుమణియే!,**
**అలినకర్క్కు అతిపతియే! అయోత్తిమనే! తాలేలో!** 7

అన్ఱు = ప్రళయం వచ్చిన ఆ సమయంలో, ఆలిన్ ఇలై = ఒక మఱ్ఱి చిగురులో, పాలకన్ ఆయ్ = బాలకుని రూపంలో, ఉలకమ్ = అన్ని లోకాలను, ఉణ్డవనే = ఉదరంలో పెట్టుకొని రక్షించినవాడా!, వాలియై కొన్ఱు = వాలిని వధించి, ఇళైయ వానరత్తుక్కు = అతని తమ్ముడైన సుగ్రీవునకు, అరశు అళిత్తవనే = రాజ్యాన్ని ఇచ్చినవాడా!, కాలిన్ = వాయువు, మణి కరై అలైక్కుమ్ = (సముద్రంలో ఉండే) మణులను తీరానికి తీసికొనివచ్చి పోగు చేసే, కణపురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భోగ్యమైన నల్లని మాణిక్యమా !, ఆలినకర్క్కు = తిరువాలినగరానికి, అతిపతియే = నిర్వాహకుడా !, అయోత్తిమనే = అయోధ్యానగరాధిపా!, తాలేలో = నీకు తాలాట్టు.

**వ్యా :- ఏழாమ్పాట్టు. (ఆలినిలైప్పాలకనాయ్ అన్ఱులకముణ్డవనే!) లోకత్తై ఎల్లామ్ తిరువయిఱ్ఱిలే వైత్తు ఒరుపవనాన ఆలిలైయిలే అతుతాన్ విఙ్గ మెన్నుమ్పడి కణ్వళర్ న్దరుళిన అఘటితఘటనాసామర్థ్యత్తై యుడైయవనే! (వాలియై క్కొన్ఱరశు ఇళైయ వానరత్తు క్కళిత్తవనే!) వాలితన్నై, ఆరైత్తుణైయాక నీ విజయమ్బణ్ణిన రావణనై వాలిలే కట్టివైత్తాన్.**

**అవ్వాలియై క్కొన్టు అవనుక్కిడైన్దు పర్వతగుహైకళిలే కిడక్కిఱ మహారాజర్క్కు వానరరాజ్యత్తై క్కొడుత్తవనే! (కాలిన్ మణి యిత్యాది) కాఱ్ఱ్రాలే ఉళ్ళు క్కిడక్కిఱ రత్నఙ్గళై క్కరైయిలే యేఱిడు మెన్నుతల్; కాల్వాయ్‌కళిల్ మణికళై క్కొడువన్దు కరైయిలే యేఱిడు మెన్నుతల్. (ఆలినకర్క్కతిపతియే!) తిరువాలిక్కు నిర్వాహకనానవనే! (అయోత్తిమనే! తాలేలో) తిరువయోధ్యైక్కు నిర్వాహకనానవనే! వాలియై క్కొన్టు ఆలితన్నై త్తుణైయాక క్కొళ్ళప్పెఱ్ఱతే.**

*అరు :- ఏఙ్గామ్బూట్టు. (ఆలినిలై). (ఆరై త్తుణైయాక) ఎన్గతుక్కు త్తాత్పర్యమ్. "ఒరుతుణై యిన్ఱిక్కే రావణనై వాలిలే కట్టిన వాలియై క్కొన్ఱ దేవరీర్ రావణవధార్థమాక వాలిక్కిడైన్ద మహారాజరై తుణైయాక వరిత్తతెన్" ఎన్ను ఈడుపాదు. (ఉళ్ళుక్కిడక్కిఱ) సముద్రత్తుక్కుళ్ళే కిడక్కిఱ. (కాల్వాయ్) సముద్రక్కృళి. (వాలితన్నై) తిరువాలితన్నై త్తుణైయాక ఎన్ను రపోక్తి.*

**భావదీపిక :- అవ :-** వటపత్రశాయి బాలకుడై, లోకాలను అన్నిటిని ఆరగించినవాడై, వాలిని వధించి, సుగ్రీవునకు రాజ్యాన్ని ఇచ్చినవాడైన శ్రీరామునకు తాలాట్టు పాడుతున్నారు ఈపాశురంలో.

**వ్యాఖ్యానం :- (ఆలిలై ప్పాలకనాయ్ అన్ఱు ఉలకమ్ ఉణ్డవనే!)** - ప్రళయం వచ్చినపుడు లోకాలను అన్నిటినీ అపుడే విరిసిన ఒక మఱ్ఱి చిగురుటాకుపై చిన్నశిశువుగా పరుండి, తన బొజ్జలో పెట్టుకొని రక్షించినపుడు కూడా **"ఏఙ్గులకు ముఙ్గుమ్ ఇడైముడైత్తాయ్"** (పెరియ.తిరు. 11-5-3) అనే రీతిలో బొజ్జలోని ఒక మూలలో అవి ఒదిగి సరిపోయేటట్లుగా, రక్ష్యవస్తువుయొక్క పరిమితిలో లేని (మించిన) రక్షకుని అభినివేశం మించి ఉన్నది అని చెప్పదగినట్లుగా ఉండి, నిద్రించిన అఘటితఘటనాసామర్థ్యాన్ని కలవాడా !

**(వాలియై క్కొన్టు అరశు ఇళైయ వానరత్తుక్కు అళిత్తవనే!)-** వాలి, ఎవరినీ సహాయంగా గ్రహించకుండా నీవు జయించిన రావణుని తోకతో కట్టివేశాడు. ఆ వాలిని, అతడు శరణాగతుడైన తమ్ముని రక్షించనందువల్ల వధించి, అతనికి భయపడి పర్వతగుహలలో దాగి నివసించి, నిన్ను రక్షకునిగా ఆశ్రయించిన సుగ్రీవునకు వానరరాజ్యాన్ని ఇచ్చినవాడా!

**(కాలిన్ మణికరై అలైక్కుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!)** - సమీపంలో ఉండే సముద్రంలోపల ఉన్న రత్నాలను గాలి తీరానికి కొనివచ్చి పోగు చేసే తిరుక్కణ్ణపురం- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"కాల్"** -గాలి లేక, **"కాల్"** అంటే పిల్లకాలువ అని అర్థంచెప్పి, సముద్రంనుండి ప్రవహించే ఉప్పుకాలువలను ఈ పదం నిర్దేశిస్తుందని భావిస్తే, వాటిలో ఉండే మణులను తీరంలోకి చేర్చే గొప్పతనాన్ని పొందిన తిరుక్కణ్ణపురం- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(ఆలినకర్క్కు అతిపతియే!)** – తిరువాలి తిరునగరికి అధిపతీ ! "వాలిని వధించి, ఆలిని (తిరువాలి నగరాన్ని) నివాసంగా పొందడమా!" అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలోని రసోక్తి.

**మలైయతనాల్ అణై కట్టి మతిళిలఙ్గై అ*ళ్ళి*త్తవనే!,**
**అలైకడలై క్కడన్దు అమరర్క్కు అముతరుళిచ్చెయ్‌వనే!,**
**కలైవలవర్‌తామ్ వా*ళ్ళు*మ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**శిలైవలవా! శేవకనే! శ్రీరామా! తాలేలో! 8**

మలై అతనాల్ అణై కట్టి = పర్వతాలతో సేతుబంధాన్ని చేసి, మతిళ్ ఇలఙ్గై అ*ళ్ళి*త్తవనే = అగడ్తలను కల లంకను నాశనం చేసినవాడా!, అలై కడలై క్కడైన్దు = అలలు ఎగిసిపడే క్షీరాబ్ధిని చిలికి, అమరర్క్కు = దేవతలకు, అముతు అరుళిచ్చెయ్‌తవనే= అమృతాన్ని అనుగ్రహించినవాడా!, కలై వలవర్‌తామ్ వా*ళ్ళు*మ్ = అన్ని శాస్త్రాలను అధ్యయనం చేసిన విజ్ఞులు నివసించే, కణ పురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణపురం లోని నాకు భోగ్యుడవైన ఓ నీలమాణిక్యమా!, శిలై వలవా = శ్రీశార్ఙ్గమనే వింటిని వంచడంలో సామర్థ్యాన్ని కలవాడా!, శేవకనే = వీరా!, శీరామా = శ్రీరామా! తాలేలో = నీకు తాలాట్టు.

**వ్యా :- ఎట్టామ్పాట్టు. (మలైయతనాల్ అణై కట్టి మతిళిలఙ్గై య*ళ్ళి*త్తవనే!) నిలత్తిలే వర మలైయై క్కొణ్డు జలత్తిలే ఆ*ళ్ళు*క్కడవ మలైయై క్కొణ్డు అరణాన కడలై అణైయాక క్కట్టి, నీర్ తానుమ్ మికై ఎన్నుమ్పడియాన అరణైయుడైత్తాన లఙ్కైయై మూలైయడి వ*ళ్ళి* పోక్కినవనే! (అలైకడలై క్కడైన్దమరర్క్కు అముతరుళిచ్చెయ్‌తవనే!) అగాధమాన సముద్రత్తై క్కడైన్దు అమృతత్తై వాఙ్గి, అసురర్‌కళ్‌క్కైయిలే దేవర్‌కళ్ శావాతపడి అవర్‌కళుక్కు క్కొడుత్తవనే! (కలైవలవర్‌తామ్ వా*ళ్ళు*మ్ కణపురత్తెన్ కరుమణియే!) సకల విద్యాస్థలఙ్గళుమ్ కైవన్దిరుక్కు మవర్‌కళ్ ఉన్నై అనుభవిక్కుమ్ తిరుక్కణ్ణపురత్తిలే సన్నహితనానవనే! (శిలై వలవా!) శ్రీశార్ఙ్గమ్ కైవన్దిరుక్కుమవనే! (శేవక నిత్యాది) అతుతాన్ మికై ఎన్నుమ్పడియాన వీరప్పట్టై యుడైయవనే!**

*అరు :- ఎట్టామ్పాట్టు. (మలై యిత్యాది). (నిలత్తిలే వర) నిలత్తోడొక్క.*

**భావదీపిక :- అవ :-** శ్రీరామావతారంలో లంకను నశింపజేసి, క్షీరాబ్ధిని చిలికినపుడు దేవతలకు అమృతాన్ని ఇచ్చిన భగవానునకు తాలాట్టు పాడుతున్నారు– ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (మలైయతనాల్ అణై కట్టి మదిళ్ ఇలఙ్కై అ*ళ్ళి*త్తవనే!)** – నీటిలో మునిగిపోయే పర్వతాలతో లంకకు నీటి అగడ్తగా ఉండే సముద్రంలో వారధిని కట్టి.

సముద్రజలం అనే నీటి అగడ్తతో పాటు కోటలు అనే రక్షణను కల లంకను నశింపజేసినవాడా !

**(అలై కడలై క్కడైన్దు అమరర్క్కు అముతు అరుళిచ్చెయ్‌తవనే!)** – చాలా లోతును కల సముద్రాన్ని చిలికి, అమృతాన్ని వెలికి తీసి అసురులచేత దేవతలకు మరణం కలుగకుండా ఉండేటట్లు వారికి ఇచ్చినవాడా !

**(కలైవలవర్‌తామ్ వాౙుమ్ కణపురత్తు ఎన్ కరు మణియే!)** – నాల్గు వేదాలు, ఆఱు అంగాలు, పూర్వోత్తరమీమాంసలు, న్యాయశాస్త్రం, ఇతిహాసపురాణాలు, ధర్మశాస్త్రం– అనే పదునాల్గు విద్యాస్థానాలలో సమర్థులై ఉండేవారు నిన్ను అనుభవిస్తూ నిత్యవాసం చేసే తిరుక్కణ్ణపురంలో. కొంగులో మూటకట్టుకొని యథేష్టంగా వినియోగించుకొనేటట్లు సౌలభ్యాన్ని కల నీలమాణిక్యంవలె సులభుడవై ఉండేవాడా !

**(శిలై వలవా!)** – శార్‌ఙ్గమనే వింటిని పాలించేవాడా !

**(శేవకనే! తాలేలో)** – ఈ విల్లుకూడా అవసరం లేదు అనేటట్లుగా వీర్యాన్ని కలవాడా! నీకు తాలాట్టు.

**తళై యవిౙుమ్ నఱుఙ్గుఞ్జి త్తయరతన్తన్ కులమతలాయ్!,**
**వళైయ ఒరు శిలైయతనాల్ మతిళిలఙ్గై అౙిత్తవనే!,**
**కళై కౙునీర్ మరుఙ్గలరుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే,**
**ఇళైయవర్‌కట్కు అరుళుడైయాయ్! ఇరాకవనే! తాలేలో!** 9

తళై అవిౙుమ్ నఱు కుఞ్జి = కట్టు తెంచుకొని వెలువడేది, సువాసనను కల కేశ బంధంతో కూడినదై, తయరతన్‌తన్ = దశరథ చక్రవర్తియొక్క, కులమ్ మతలాయ్= కులానికి ఉత్తారకుడైనవాడా!, ఒరు శిలై వళైయ = సాటి లేని విల్లు వంచగా, అతనాల్= ఆ వింటితో, మతిళ్ ఇలఙ్గై అౙిత్తవనే = కోటలను కల లంకను నాశనం చేసినవాడా!, కళై కౙు నీర్ కలుపువలె తీసివేయబడ్డ ఎఱ్ఱ తామర పూలు, మరుఙ్గు అలరుమ్ = చుట్టూ వికసించే, కణపురత్తు ఎన్ కరుమణియే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భోగ్యుడవైన నీలమాణిక్యమా!, ఇళైయవర్ కట్కు= తమ్ముల విషయంలో, అరుళ్ ఉడైయాయ్ = చాలా ప్రేమను పొందికగా కలవాడా!, ఇరాకవనే = రాఘవా !, తాలేలో= నీకు జోల.

**వ్యా:– ఒన్బతామ్పాట్టు. (తళై యవిౙుమిత్యాది) కట్టవిౙుమ్బడియాన నఱునాఱ్ఱత్తై యుడైయ మయిర్ ముడియైయుడైయ చక్రవర్తికులత్తుక్కు ఉత్తారకనానవనే! (వళైయ వొరు శిలై యిత్యాది) బ్రహ్మాస్త్రాదికళుమ్ వాయ్ మడియు మూరై మనుష్యత్వత్తుక్కు ఏకాన్తమాన విల్లాలే అవనుడైయ ఊరై అౙియచ్చెయ్‌తవనే! (కళైకౙునీరిత్యాది) కళైయాక**

**ప్పతిత్తు క్కరైయిలే పొకట్ట శెఙ్గ౸ునీర్కళ్, పొకట్ట విడఙ్గళిలే కిడన్దు తన్నిలత్తిల్ అలరుమాపోలే శెవ్వి పెఱ్ఱు అలరుమ్ తిరుక్కణ్ణపురమ్. (ఇళైయవర్కళిత్యాది) తమ్బిమార్క్కు ఉఱుప్పాకాత పోతు ఎన్ ప్రాణఙ్గళుమ్ ఎనక్కు వేణ్డా ఎన్ను మవరితే.**

**భావదీపిక :- అవ :-** దశరథుని వంశానికి నాథుడై, లంకను నశింపజేసిన విలుకాడు అయిన శ్రీరామునకు తాలాట్టును ఈ పాశురంలో పాడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (తళై అవి౸ుమ్ నఱుఙ్కుఞ్జి త్తయరతన్తన్ కులమతలాయ్!)** ఎంతగా ఎత్తి ముడివేసినా కట్టు తెంచుకొని వచ్చే రీతిలోని సమృద్ధిని, సాంద్రతను కల్గినదై, సుగంధాన్ని కల్గినదైన కేశపాశాన్ని కలవాడై, దశరథ చక్రవర్తి కులాన్ని ఉద్ధరించినవాడా!

**(వళైయ ఒరు శిలై అతనాల్ మదిళ్ ఇలఙ్గై అ౸ిత్తవనే!)**- బ్రహ్మాస్త్రం మొదలైన చాలా గొప్ప అస్త్రాలు నిర్వీర్యాలు అయ్యే బలిమిని కల లంకను మానవుడే చేతబట్టే (మనుష్యత్వానికే తగిన) వింటితో నాశనం చేసినవాడా!

**(కళైక౸ు నీర్ మరుఙ్గు అలరుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!)** - పొలాలలో ధాన్యానికి కలుపుగా ఉన్నందువల్ల వెలికితీసి గట్టుపై పడవేసిన ఎఱ్ఱ తామరపూలు, ఆవిధంగా పడవేసిన చోట్లలో పడి ఉండి, తమకు తగిన ఆ ప్రదేశాలలో వికసించి, రేకులను విరిసే తిరుక్కణ్ణపురంలో నాకు సులభుడవై ఉండేవాడా! **"కళైకళు నీర్ మరుఙ్గు అలరుమ్"** అనే ప్రయోగం నీటి సమృద్ధిని సూచిస్తుంది.

**(ఇళైయవర్కట్కు అరుళుడైయాయ్!)** - "తమ్ములకు సహాయపడనపుడు, నా ప్రాణాలకు నాకు అక్కర లేదు" అనే రీతిలో తన తమ్ములకు, తమ్ములుగా భావించిన గుహుడు, సుగ్రీవుడు, విభీషణుడు మొదలైనవారికి కృపను వర్షించినవాడా!

**(ఇరాకవనే! తాలేలో)** - శ్రీరాఘువా ! నీకు తాలాట్టు.

**తేవరైయుమ్ అశురరైయుమ్ తిశైకళైయుమ్ పడైత్తవనే!,**
**యావరుమ్ వన్దు అడి వణఙ్గ అరఙ్గనకర్ తుయిన్గవనే!,**
**కావిరి నన్నతి పాయుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఏవరి వెఞ్జిలై వలవా! ఇరాకవనే! తాలేలో!** 10

తేవరైయుమ్ = దేవతలను, అశురరైయుమ్ (వారికి ఆగర్భశత్రువులైన) అసురులను, తిశైకళైయుమ్ పడైత్తవనే = పలు దిక్కులలో ఉండే లోకాలను సృష్టించిన వాడా!, యావరుమ్ వన్దు అడి వణఙ్గ = జీవరాసులంతా వచ్చి శ్రీచరణాలలో సేవించేటట్లుగా, అరఙ్గమ్ నకర్ = శ్రీరంగనగరంలో, తుయిన్గవనే = కన్నులు మూసికొని తూగేవాడా !,

కావిరి నల్ నది పాయుమ్ = శ్రేయస్సును కల్గించే కావేరీనది ప్రవహించే, కణపురత్తు ఎన్ కరు మణియే = తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నాకు భవ్యమైన నీలమాణిక్యమా, ఏవరి వెమ్ శిలై వలవా = బాణప్రయోగంలో ప్రేరేపించేదై, అందమైనదై, (శత్రువులకు) భయాన్ని కల్గించేదైన వింటిని పాలించగలవాడా !, ఇరాకవనే తాలేలో = రాఘువా ! నీకు జోల.

**వ్యా :- పత్తామ్బాట్టు. (తేవరైయు మశురరైయుమ్ తిశైకళైయుమ్ పడైత్తవనే!) సహజశత్రుక్కళాన దేవాసురర్ ముతలాన పదార్థఙ్గళైయుమ్, ఇవర్కళుక్కు అవకాశ ప్రదానమ్ పణ్ణుమ్ దేశఙ్గళైయుమ్ సృష్టిత్తవనే! (యావరుమ్ వన్దడి వణఙ్గ అరఙ్గనకర్ తుయిన్దవనే!) సృష్టిప్రయోజన మెల్లామ్ తన్నై ఆశ్రయిక్కైక్కిఱే. అతుక్కాక కోయిలిలే వన్దు కణ్వళర్న్దరుళినవనే! (కావిరి నన్నతి పాయుయుమ్ కణపురత్తెన్ కరుమణియే!) ఒరువర్ ఏఱ్ఱ్ప్పాయ్చ్చవేణ్డాతపడి తానే వన్దు ఎఙ్గుమ్ పరక్కుమ్ కావేరియైయుడైయ తిరుక్కణ్ణపురత్తిలే సులభనానవనే! (ఏవరి వెఞ్జిలైవలవా! ఇరాకవనే!) ఏవిలే మూట్టక్కడవతాయ్, దర్శనీయమాయ్ ప్పిడిత్త పిడియిల్ శత్రుక్కళ్ మణ్ణుణ్ణుమ్బడియాన శ్రీశార్ఙ్గత్తై ఉన్ కరుత్తిలే నడత్తవల్లవనే!**

**భావదీపిక :- అవ:-** దేవతలు, అసురులు మొదలైన జీవులతో కూడిన సమస్తలోకాలను సృష్టించడమే కాకుండా, చేతనులు అందఱు వచ్చి సేవించేటట్లుగా శ్రీరంగంలో పరుండి ఉండే స్వామికి తాలాట్టును ఈ పాశురంలో పాడుతున్నారు.

**వ్యాఖ్యానం :- (తేవరైయుమ అశురర్కళైయుమ్ తిశైకళైయుమ్ పడైత్తవనే!) –** సహజంగానే శత్రువులైన దేవాసురులు మొదలైన సమస్తజీవులను సృష్టించి, వారు జీవించడానికి తగిన స్థలాలలను పది దిక్కులలోను సృష్టించినవాడా!

**(యావరుమ్ వన్దు అడి వణఙ్గ అరఙ్గనకర్ త్తుయిన్దవనే!) –** ఈ విధంగా సృష్టించడానికి ప్రయోజనం అందఱు తనను శరణంగా పొందాలనేకదా ! అందుకోసంగా శ్రీరంగంలో అర్చావతారంగా వేంచేసి పరుండిఉండేవాడా!

**(కావిరి నల్ నతిపాయుమ్ కణపురత్తు ఎన్ కరు మణియే!) –** ఎవరూ ఆనకట్టను కట్టి మరల్చి, ప్రవహింపజేయవలసిన అక్కఱ లేకుండా తానే వచ్చి సస్యక్షేత్రాలలో ప్రవహించే కావేరీనదిని కల తిరుక్కణ్ణపురంలో అందఱికీ సులభుడవై ఉండేవాడా !

**(ఏవరి వెమ్ శిలై వలైవా! ఇరాకవనే!) –** ఎవరు ఈ వింటిని పట్టుకొన్నా వారిని విలుకాడుగా చేసేదై, అందమైనదై, పట్టుకొన్న సన్నివేశంలోనే శత్రువులను మట్టుబెట్టగల్గే శార్ఙ్గమనే వింటిని నీ ఇష్టానుసారంగా పాలించగలవాడా!

**(ఇరాకవనే! తాలేలో) –** రాఘువా! నీకు తాలాట్టు.

కన్నినన్ మామతిళ్ పుడై శూழ் కణపురత్తు ఎన్ కాకుత్తన్
తన్నడిమేల్, తాలేలో ఎన్లురైత్త తమిழ்మాలై,
కొన్న విలుమ్ వేల్ వలవన్ కుడై క్కులశేకరన్ శొన్న,
పన్నియ నూల్ పత్తుమ్ వల్లార్ పాఙ్గాయ పత్తర్కళే 11

**కులశేఖర ప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్**

ఎన్ కాకుత్తన్ తన్ అడిమేల్ = నా శ్రీరాముని శ్రీచరణాల విషయంలో, తాలేలో ఎన్లు ఉరైత్త = కౌసల్యాదేవి జోలపాడినట్లుగా పల్కిన పాశురాలను, కొల్ నవిలుమ్ వేల్ వలైవన్ = (శత్రువులను) వధించడంలోఅభినివేశాన్ని కల వేలాయుధాన్ని కల్గిన, కుడై కులశేకరన్ = అధికారచిహ్నం అయిన శ్వేతచ్ఛత్రాన్ని కల కులశేఖరాழ்వార్లు, కన్ని నల్ మా మదిళ్ పుడై శూழ் కణపురత్తు = నశించనివి, గొప్పవి, అందమైనవి, పెద్దవి అయిన కోటలచే నాల్గు వైపుల చుట్టబడిన తిరుక్కణ్ణపురంలో, శొన్న= అనుగ్రహించిన, పన్నియ = సర్వత్ర వ్యాపించిన, నూల్ = విలక్షణమైన, తమిழ் మాలై = ద్రావిడంలో అనుగ్రహింపబడ్డ మాలిక అయిన, పత్తు = పది పాశురాలను, వల్లార్ = అభ్యసించ గలవారు, పాఙ్గు ఆయ పత్తర్ = అతనిని అనుభవంచదగిన భక్తులు కాగలరు.

**వ్యా :- నిగమత్తిల్. (కన్నినన్ మామతిళ్ పుడై శూழ்ఇత్యాది) అழிయాత పెరియ తిరుమతిళ్ శూழ்న్ద తిరుక్కణ్ణపురత్తిలే నిన్దరుళిన కృష్ణనైయన్యియిలే చక్రవర్తి త్తిరుమకనై యాయ్త్తు క్కవిపాడిற்ரு. (తన్నడిమేలిత్యాది) చక్రవర్తిమకనుడైయ బాల్యావస్థైయిల్ శ్రీకౌసలైయార్ శొన్న పాశురత్తై త్తిరుక్కణ్ణపురత్తిలే శొన్న తమిழ் త్తొడై.**

**(కొన్న విలుమ్ వేల్ వలవన్ కుడై క్కులశేకరన్ శొన్న) వేలై ప్పిడిత్త పిడియిలే ఎల్లారుమ్ "వేలిన్ కొడుమైయే!" ఎన్లు శొల్లానిన్ద వేలైయుమ్, ఐశ్వర్యప్రకాశకమాన వెణ్కొற்ற కుడైయైయుముడైయ శ్రీకులశేఖరప్పెరుమాళ్ అరుళిచ్చెయ్త. (పన్నియ నూల్ పత్తుమ్ వల్లార్) పరమ్బిన లక్షణత్తాల్ కుఱైవற்ற ఇప్పత్తుమ్ వల్లవర్కళ్, తిరుత్తాయారాయుమ్, అడియారాయుమ్ అనుభవిక్కప్పెఱువర్కళ్.**

**పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.**
**పెరుమాళ్ తిరుమొழி ఎట్టామ్తిరుమొழி వ్యాఖ్యానమ్ ముற்றிற்ற.**

---

**భావదీపిక :- అవ :-** ఈ దశకాన్ని అభ్యసించేవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కి, ఈ దశకాన్ని ముగిస్తున్నారు ఈ పాశురంలో.

**వ్యాఖ్యానం :- (కన్నినన్ మా మదిళ్ పుడై శూழ் కణపురత్తు ఎన్ కాకుత్తన్) -** నశించని అందమైన పెద్ద కోటలచే పరివేష్ఠింపబడ్డ తిరుక్కణ్ణపురంలో నిలచిన

సన్నివేశంలో వేంచేసి ఉండే స్వామి, తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండేవాడు శ్రీకృష్ణుడే అయినా, వీరు శ్రీకృష్ణునిగా కాకుండా శ్రీరామునిగానే భావించి కీర్తించారు.

**(తన్నడిమేల్ తాలేలో ఎన్ఱు ఉరైత్త తమి*ழ்* మాలై)** – శ్రీరామునకు శైశవ ప్రాయంలో తల్లి అయిన కౌసల్యాదేవి జోలపాటను పాడడాన్ని, తిరుక్కణ్ణపురం స్వామి విషయంలో అన్వయించి పాడిన ద్రావిడమాలిక.

**(కొల్ నవిలుమ్ వేల్ వలవన్ కుడై క్కులశేకరన్ శొన్న)** – వీరు వేలాయుధాన్ని పట్టుకొన్న తీరును చూచిన అందఱు "శత్రువులను వధించడంలో ఎంత క్రూరంగా ఉంటుందో వీరి వేలాయుధం!" అని అనేటట్లుండే వేలాయుధాన్ని **"ముడి వేన్దర్ శికామణి"** (కిరీట ధారులైన క్షత్రియులలో గొప్పవారు) అనే విషయాన్ని వ్యక్తం చేసే శ్వేతచ్ఛత్రాని కల కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన.

**(పన్నియ నూల్ పత్తుమ్ వల్లార్)** – ద్రావిడదేశం అంతటా వ్యాపించినదై, పాశురలక్షణాలలో ఏలోటు లేని గ్రంథంలోని ఈ దశకాన్ని అభ్యసించగల్గినవారు.

**(పాఙ్గాయ పత్తర్కళే)** – కౌసల్యాదేవివలె తల్లిగా, కులశేఖరప్పెరుమాళ్ వలె దాసులుగా ఉండి ఆనందాన్ని అనుభవించగల్గుతారు.

**ఎట్టామ్ తిరుమొ*ழி* వ్యాఖ్యానానువాదం ముగిసింది**

## ఒన్బతామ్ తిరుమొ*ழி* – వన్దాళినిళై – ప్రవేశమ్.

**అవ :- శ్రీకౌసలైయార్ పెఱ్ఱ పేఱ్ఱై అనుభవిత్తార్ కీ*ழ*ిల్ తిరుమొ*ழ*ియిలే. బాల్యావస్థై ఎల్లామ్ అనుభవిత్తు, ప్రాప్తయౌవనరానవాఱే అనుభవిక్కప్పెఱాతే యి*ழ*న్దే నెన్ఱు అవన్ శొల్లుకిఱ పాశురత్తాలే తమ్మి*ழ*వై ప్పేశుకిఱార్ ఇతిల్.**

### తొమ్మిదవ దశకం – ప్రవేశం – అనువాదం

**భావదీపిక :-** శ్రీకౌసల్యాదేవివలె తాలాట్టును పాడి గత దశకంలో ఆనందించారు ఆ*ழ*్వార్లు. చిన్న బిడ్డగా, శిశువుగా ఉన్నపుడు అనుభవించి, పట్టాభిషేకానికి తగిన యౌవన ప్రాయాన్ని పొందగానే అనుభవించలేక కోల్పోయిన దశరథచక్రవర్తి భావనను పొంది, తమకు కూడా అనుభవించడంలో యోగ్యత సమానం కనుక, దశరథుడు అనుభవించలేక కోల్పోయానే!" అని పలికే పాశురాలలో తాము కోల్పోయిన విషయాన్నిగూర్చి ఆ*ழ*్వార్లు ఈ దశకంలో పలుకుతున్నారు.

**వన్తాళినిణై వణఙ్గి వళనకరమ్ తొ*ఴు*తేత్త మన్ననావాన్**
**నిన్తాయై, అరియణై మేలిరున్దాయై నెడుఙ్గానమ్ పడరప్పోకు**
**వెన్తాళ్, ఎమ్మిరామా! వో! ఉనై ప్పయన్ద కైకేశితన్ శొల్కేట్టు,**
**నన్తాక నానిలత్తై యాళ్విత్తేన్ నన్మకనే! ఉన్నై నానే** **1**

ఎమ్ ఇరామా వో = మా శ్రీరామా !, వల్ తాళిన్ ఇణై వణఙ్గి =(శరణు పొదినవారిని చేయి విడువక, రక్షించే) బలిమిని నిండుగా కల నారాయణుని రెండు శ్రీచరణాలలో నీవు వాలి ఆశ్రయించి, వళమ్ నకరమ్ = బలాన్ని కల అయోధ్యాపుర జనులు, తొ*ఴు*దు ఏత్త = చేతులను జోడించి స్తుతించిన తీరును, మన్నన్ ఆవాన్ నిన్తాయై = ప్రభువై పట్టాభిషేకాన్ని చేసికొనేటట్లుగా ఉన్నవాడవు, అరి అణై మేల్ ఇరున్దానై = సింహాసనంపై అధిరోహించడానికి సిద్ధంగా ఉన్నవాడవు అయిన నిన్ను, నెడుమ్ కానమ్ పడర పోకు నిన్తాళ్ = "దుర్గమం అయిన అరణ్యానికి పో" అను కైకేయి పల్కింది, నల్ మకనే = నా మాటను జవదాటని ఓ కుమారా !, నాన్ = దశరథుణ్ణి అయిన నేను, ఉన్నై పయన్ద కైకేయి తన్ శొల్ కేట్టు = నిన్ను పొందిన కైకేయి మాటను విని, నన్తాక ఉన్నై నా నిలత్తై ఆళ్విత్తేన్ = చాలా అందంగా నిన్ను ఈ భూమిని పాలించేటట్లుగా చేశాను. (అయ్యో!)

**వ్యా :- ముతల్పాట్టు. (వన్తాళినిణై వణఙ్గి) తానుమ్ రాజ్యప్పరప్పై ఎల్లామ్ ఆణ్డానాయిరుక్కచ్చెయ్తే, అవ్వళవన్తియే "వణ్ పుక*ఴ్* నారణన్ తిణ్ క*ఴ*ల్" ఎన్నుమాప్పోలే ఆశ్రితరై ఎల్లా అవస్థైయిలుమ్ విడే నెన్నుమ్ తిరువడికళై వ*ఴి*ప్పట్టు. (వళ నకరమ్ తొ*ఴు*తేత్త) తిరువభిషేకత్తుక్కు అలఙ్కరిత్తిరుక్కిఱ తిరునగరియితే. అప్పడి ఇరుక్కిఱ తిరునగరి తొ*ఴు* తేత్త. (మన్ననావాన్ నిన్తాయై) తిరువభిషేకత్తుక్కు మున్బుళ్ళ కర్తవ్యఙ్గళెల్లామ్ తలైక్కట్టి త్తిరువభిషేకమ్ పణ్ణుకైక్కు త్తిరుక్కాప్పు నాణ్ శాత్తి నిఱ్కిఱ ఉన్నై. (అరియణై మేలిరున్దాయై) సింహాసనత్తిలే పదస్థనాయిరున్దానెన్నుమ్బడి తో*గ్ఱ*చ్చ మైన్దిరుక్కిఱ ఉన్నై. (నెడుఙ్గానమ్ పడర ప్పోకు వెన్తాళ్) ఇప్పడి రాజాక్కళల్లాతారుమ్ పుకర మాట్టాత కాట్టై "తే వనేన వనం గత్వా" ఎన్నుమా పోలే ఇవ్వూరిల్ నిన్నుమ్ పుఱప్పట్టు వ*ఴి*యే పోయ్ క్కాట్టిలే పుకుమతన్తియే కాట్టిల్ నిన్నుమ్ కాట్టిలేయే పోమ్బడియాయ్, నెడియ కాట్టిలేయితే పోక చ్చొల్లి*గ్ఱ*.**

**(ఎమ్మిరామా వో) నినైక్కవుమ్, శొల్లవుమ్, కాణవుమ్ తాపమ్ పోమ్బడియాన ఉమ్మైయితే పోకచ్చొల్లి*గ్ఱు*. (ఉనై ప్పయన్ద కైకేశితన్ శొల్ కేట్టు) తిరువభిషేకకల్యాణవార్తై శ్రీకౌసలైయారిలుమ్కాట్టిల్ తనక్కు నాన్ శెన్టు శొల్లి ప్రీతి కాణ వేణుమెన్నుమ్బడి పె*గ్ఱ* తాయాయ్ ప్పోన్ద కైకేయి వార్తై కేట్టు. (నన్తాక నానిలత్తై యాళ్విత్తేన్) వఞ్చనపరై ఎన్తటియాతే తాయెన్టు ఇవళుక్కు వార్తై శొల్లప్పుకున్దు ఇవళ్! వార్తైయిలే అకప్పట్టు భూమిప్పరప్పై**

**ఎల్లా మఴ్కితాక ఉన్నై ఆళ్విత్తేన్. (నన్మకనేయున్నై నానే) నాన్ ఇప్పడి శెయత విడత్తిలుమ్ నీర్ గుణాధికరామ్బడినిన్టీర్! నాన్ నానామ్బడి శెయ్తేనితే.**

*అరు :- ముతఱ్పాట్టు. (వన్తాళిత్యాది). (వన్తాళినై) వలితాన తిరువడికళ్.*

**భావదీపిక :- అవ :-** "పట్టాభిషేకసమయంలో కైకేయి నిన్ను అరణ్యానికి పోయేటట్లు చేసిందే! అయ్యో !" అని ఈ పాశురంలో విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (వన్ తాళినిణై వణఙ్గి)** - పట్టాభిషేకానికి అంగంగా **"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"** (రామా అయో-6-1) (విశాలమైన నేత్రాలను కల సీతాదేవితోపాటు నారాయణుని శ్రీరాముడు సేవించాడు) అనే రీతిలో శ్రీరంగనాథుని సేవించడాన్ని ఇది తెలుపుతుంది. దశరథచక్రవర్తి భూమిని అంతటిని ఒక గొడుగు కింద పరిపాలించినవాడై ఉన్నా, తండ్రి అయిన అతనికి నమస్కరించడంతో నిలువకుండా, తాను లోకానికి అంతటికీ నాథుడు కనుక **"వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్"** (తిరువాయ్-1-2-10) (కల్యాణగుణాలను కల శ్రీమన్నారాయణుని దృఢమైన శ్రీచరణాలను) అనే రీతిలో "నా భక్తులను ఏదశలోను విడువను" అని పలికే శ్రీరంగనాథుని దృఢమైన శ్రీచరణాలను శ్రీరాముడు సేవించడాన్ని తెలుపుతుంది.

**(వళ నకరమ్ తొழுతు ఏత్త)** - పట్టాభిషేకాన్ని పురస్కరించుకొని అలంకరింపబడ్డ అయోధ్యానగరంలో, ఆ నగరంలోని జనులు అందఱు. నమస్కరించి, స్తుతించేటట్లుగా.

**(మన్ననావాన్ నిన్రాయై)** - పట్టాభిషేకానికి ముందు తదంగంగా చేయవలసిన క్రియాకలాపాలను అన్నిటిని చేసి ముగించి. పట్టాభిషేకంకోసం మంగళసూత్రాన్ని (కంకణాన్ని) చేతిలో కట్టుకొని ఉన్న నిన్ను.

**(అరియణైమేల్ ఇరున్దాయై)** - ప్రభువులకు తగిన సింహాసనంలో అధిరోహించడం కోసం పాదం మోపాడు- అని పలికేటట్లుగా పూర్వాంగం అయిన దానిని అంతటిని చేసి ముగించిన నిన్ను.

**(నెడుఙ్గానమ్ పడర ప్పోకు ఎన్రాళ్)** - ఈవిధంగా రాజులు కాని సామాన్యులు ప్రవేశించలేని అరణ్యాన్ని **"తే వనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః"** (రామా బాల-1-30) (ఆ సీతారామలక్ష్మణులు ఒక వనంనుండి ఇంకొక అరణ్యానికి కాలినడకతో పయనించి, నీరు నిండుగాఉండే నదులను దాటి చిత్రకూటాన్ని చేరారు) అన్నట్లు ఒక ఊరినుండి బయలుదేరి కొంచెం దూరం మంచి మార్గంలో ప్రవేశించినవారు కాకుండా, ఒక అరణ్యంనుండి అంతకంటే దట్టమైన ఇంకొక అరణ్యానికి పోయేటట్లుగా- అని భావం. దట్టమైన అరణ్యానికికదా కైకేయి పొమ్మని పల్కింది.

**(ఎమ్ ఇరామా! వో!) – "రమయతీతి రామః"** (అందరినీ ఆనందింప జేస్తున్నాడు కనుక శ్రీరాముడు అనబడుతున్నాడు) అనే వ్యుత్పత్తినిబట్టి భావించినా, పేరును అనుసంధించినా,కంటితో చూచినా అన్ని బాధలను తీర్చి ఆనందింపజేసే నిన్నుకదా పొమ్మని పల్కింది.

**(ఉనై ప్పయన్ద కైకేశితన్ శొల్ కేట్టు)– "రామే వా భరతే వాஉహం విశేషం నోప లక్షయే, తస్మా త్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యేஉభిషేక్ష్యతి"** (రామా. అయో. 7–35) (రాముని, భరతుని మధ్యలో నేను తారతమ్యాన్ని చూడడం లేదు. ఇద్దఱూ నాకు సమానమే. అందువల్ల శ్రీరామునకు రాజు పట్టాభిషేకం చేయబోతూ ఉండడాన్ని గూర్చి నేను చాలా ఆనందిస్తున్నాను) అని పలికేటట్లుగా, కన్నతల్లి అయిన కౌసల్యకంటే రామునిపట్ల ప్రీతిని కల్గినదై, అందువల్లనే దశరథుడనైన నాచే పట్టాభిషేకకల్యాణ శుభవార్తను, కౌసల్యకుముందే నేను ఆమెకు తెల్పి, ఆమె ఆనందాన్ని చూచే రీతిలో కన్నతల్లిగా ప్రవర్తించిన కైకేయి యొక్క మాటను విని.

**(నన్గాక నా నిలత్తై ఆళ్విత్తేన్)** – సాధువై ఉన్న కైకేయి గూని మంధర మాటతో వంచిస్తుంది అని గ్రహించలేక, తల్లి అని భావించి, ఆమెకు పట్టాభిషేకవార్తను చెప్పబోయి ఆమె అడిగిన వరాలలో చిక్కుకొని, భూమిని అంతటినీ వాగ్దానం చేసిన రీతిలో నిన్ను బాగా అందంగా రాజ్యాన్ని పరిపాలించేటట్లు చేశాను!

**(నల్ మకనే! ఉన్నై నానే)** – నేను ఈవిధంగా చేసినా తల్లి తండ్రి చెప్పిన మాట కనుక, దానిని జవదాటకూడదు అనే ధర్మంలో నిలచావు నీవు. నేను నీకు పట్టాభిషేకం చేస్తానని మాట ఇచ్చి కైకేయిపట్ల కలిగన మోహం చేత ఆమె అడిగిన వరాన్ని కాదనలేక నీకు ఇచ్చి మాటను తప్పానే ! అయ్యో !

**వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు ఇరు నిలత్తై వేణ్డాతే విరైన్దు, వెన్రి**
**మైవాయ కళిఱొౘిన్దు తేరొౘిన్దు మా వొౘిన్దు వనమే మేవి,**
**నెయ్ వాయ వేల్ నెడుఙ్గణ్ నేరిౙైయుమ్ ఇళఙ్గోవుమ్ పిన్బు పోక,**
**ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా! వో! ఎమ్బెరుమాన్! ఎన్ శెయ్కేనే.** 2

ఎమ్ ఇరామా వో = మా శ్రీరామా !, వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు = కఠినమైన వాక్కును కల నా కఠినోక్తులను విని, ఇరు నిలత్తు వేణ్డాతే = విశాలమైన భూమిని పాలించడాన్ని కోరకుండా విడిచిపెట్టి, విరైన్దు = చాలా వేగంగా, వెన్రి మైవాయ కళిఱు ఒౘిన్దు = విజయాన్ని ఇచ్చేవి, కాటుక కొండవలె గొప్ప రూపాన్ని కల్గినవి అయిన ఏనుగులను విడిచి, తేర్ ఒౘిన్దు = రథాలను విడిచి, మా ఒౘిన్దు = అశ్వాలను విడిచి, వనమే మేవి = అరణ్యాన్ని చేరి, నెయ్ వాయ్ వేల్ నెడుమ్ కణ్ నేరిౙైయుమ్ = నేతిని

పూసిన మొనలను కల వేలాయుధవంటి విశాలమైన నేత్రాలను, తగిన ఆభరణాలను కల సీతాదేవి, ఇళఙ్గోవుమ్ = లక్ష్మణుడు, పిన్బు పోక = వెంబడించి రాగా, ఎవ్వాఱు నడన్దనై = (కాలినడక తెలియని) నీవు ఏ రీతిలో నడచివెళ్ళావో !, ఎమ్బెరుమాన్ = నా స్వామీ!, ఎన్ శెయ్‌కేన్? = నేను ఏమి చేయను?

**వ్యా :- ఇరణ్డామ్బాట్టు. (వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు) అనలాస్యనాన ఎన్నుడైయ, "కాట్టేఱ పోప్పేమ్, రాజ్యత్తై త్తవిరుమ్" ఎన్ఱ వార్త్తైయై క్కేట్టు. (ఇరు నిలత్తై వేణ్డాతే) "ఉమ్మై ప్పిరియిల్ ముడివోమ్" ఎన్ఱు వళైప్పు క్కిడక్కిఱ నగరజనఙ్గళై ఎల్లామ్ ఒళిత్తు అవర్‌కళై క్కైవిట్టు. (విరైన్దు) "పోకిఱోమ్" ఎన్ఱు విళమ్బి ప్పోమాకిల్ "రాజ్యత్తిల్ నశైయాలే నిన్ఱో మెన్ఱు కైకేయి నినైక్కుమ్" ఎన్ఱు విరైన్దు. (వెన్ఱి మైవాయ కళిఱొళ్ళిన్దు) వెన్ఱియై విళైప్పతాయ్ అఞ్జనగరిపోలే పెరియ వడివైయుడైత్తా యిరుక్కిఱ ఆనై ఎన్న, తేరెన్న, కుతిరై ఎన్న, ఇవర్‌ఱై ఒళ్ళిన్దు. (వనమే మేవి) ఇవర్‌ఱై ఒళ్ళిన్దాల్ ఇన్ద దేశత్తుక్కు ప్పోలియాన దేశత్తిలే పోయ్ ప్పుకాతే, వనమే మేవి.**

**(నెయ్ వాయ వేల్ నెడుఙ్గణ్ నేరిళ్ళైయు మిళఙ్గోవుమ్ పిన్బు పోక) నీర్ పోయ్ ప్పుక్కాలుమ్ పుకుకైక్కు త్తకాతవర్‌కళై క్కూడక్కొణ్డు. (ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా! ఓ! ఎమ్బెరుమాన్! ఎన్ శెయ్‌కేనే) కాల్‌నడై నడన్దఱియాత నీర్ ఇవర్‌కళైయుఙ్గూట్టి క్కొణ్డుపొల్లాత కాట్టిలే పోనీర్. ఎన్నాయనే! నా నెన్ శెయ్‌కేన్?**

**భావదీపిక :- అవ :-** సమస్తసంపదలను విడచి పెట్టి, సీత, లక్ష్మణుడు వెంటరాగా, కఠినమైన వనాలకు నీవు ఏవిధంగా నడచి వెళ్ళావో కదా !- అని ఈ పాశురంలో దశరథుని భావనతో ఆళ్ళ్వార్లు విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు)** - నిప్పులను కక్కే నోటిని కల్గిన నేను. "నీవు అరణ్యాలకు పోవాలి. రాజ్యాన్ని విడచి పెట్టాలి" అని పల్కిన నా మాటను విని.

**(ఇరు నిలత్తై వేణ్డాతే)** - "నిన్ను విడిస్తే మేము ప్రాణాలను ధరించలేము" అని నీవు వనానికి పోయేటపుడు నిన్ను వెంబడించి వచ్చిన నగరజనులను అందఱిని మోసపుచ్చి, వారిని విడచి.

**(విరైన్దు)** - "అరణ్యానికి పోతున్నాను" అని పల్కి ఆలస్యం చేస్తే, రాజ్యాన్ని పొందవచ్చు- అనే ఆశతో రాముడు ఆలస్యం చేస్తున్నాడు- అని కైకేయి తలుస్తుందేమో! అని వేగంగా.

**(వెన్ఱి మైవాయ కళిరొళ్ళిన్దు తేరొళ్ళిన్దు మావొళ్ళిన్దు)** విజయాన్ని సంపాదించేవి, కాటుకకొండలవలె పెద్ద పెద్ద రూపాన్ని కల్గినవి అయిన గజసైన్యం, రథసైన్యం, అశ్వసైన్యం- అనే వాటిని విడచిపెట్టి.

**(వనమే మేవి)** –"ఈ విధంగా సైన్యాన్ని అంతటినీ విడిచిపెట్టినా, కోసల రాజ్యంవంటి ఇంకొక దేశానికి పోయినా, అక్కడనుండి సైన్యంతో దండెత్తి వస్తాడో ! ఏమో !" అని కైకేయి సందేహిస్తుంది కనుక, నేరుగా వనానికే పోయి.

**(నెయ్ వాయ వేల్ నెడుఙ్కణ్ నేరిழையుమ్ ఇళఙ్కోవుమ్ పిన్బు పోక)** – "నీవే పోయావు" అని అంటే, అది చాలదన్నట్లు అరణ్యానికి పోవడానికి యోగ్యతలేని నేత్ర సౌందర్యాన్ని, ఆభరణాల సొబగును కల సీతాదేవిని, నీకంటే చిన్నవాడైన తమ్ముని పిలుచుకొని కదా పోయావు.

**(ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా! ఓ! ఎమ్బెరుమాన్! ఎన్ శేయ్కేన్)** – కాలినడకను నడవడం తెలియని రాజకుమారుడవైన నీవు వీరినికూడా తీసికొని కఠినమైన అరణ్యంలో ఏవిధంగానోకదా నడచివెళ్ళావు ! నా తండ్రీ ! నేనేమి చేయను!

**కొల్లణైవేల్ వరి నెడుఙ్గణ్ కౌశలైతన్ కులమతలాయ్! కుని విల్లేన్దుమ్,**
**మల్లణైన్దవరైత్తోళా! వల్వినైయేన్ మనమురుక్కుమ్ వకైయే కఱ్ఱాయ్!,**
**మెల్లణైమేల్ మున్ తుయిన్ఱాయ్! ఇన్ఱిని ప్పోయ్ వియన్ కాన మరత్తిన్ నీழల్,**
**కల్లణైమేల్ కణ్డుయిల క్కఱ్ఱనైయో! కాకుత్తా! కరియకోవే! 3**

కొల్ అణై = వధించే వృత్తిలో అభినివేశాన్ని కల, వేల్ = వేలాయుధంవంటిది, వరి నెడుమ్ కణ్ = ఎఱ్ఱని, నల్లని రేఖలను, వైశాల్యాన్ని కల నేత్రాలను కల్గిన, కౌశలైతన్= కౌసల్యాదేవియొక్క, కుల మతలాయ్ = కులానికి ఉత్తారకుడైనవాడా!, కుని విల్ ఏన్దుమ్= వంచిన వింటిని ధరించిన, మల్ అణైన్ద వరైతోళా = బలం నిండుగా కల పర్వతాలవంటి బాహువులను కలవాడా! వల్ వినైయేన్ = మహాపాపి అయిన నాయొక్క మనమ్ ఉరుక్కుమ్ వకైయే కఱ్ఱాయ్ = మనస్సును (నీ ఆయుధసౌందర్యంతో, బాహుసౌందర్యంతో) కఱిగేటట్లు చేసినవాడా!, కాకుత్తా = కకుత్థ్సవంశంలో జన్మించినవాడా!, కరియ కోవే = నీలమేఘ వర్ణుడవైన స్వామీ !, మెల్ అణైమేల్ మున్ తుయిన్ఱాయ్ = మృదువైన శయ్యలో పూర్వం పరుండి నిద్రించే నీవు, ఇన్ఱు ఇని పోయ్ = ఇప్పటినుండి ఇక రాబోయే కాలం అంతా అరణ్యానికి పోయి, వియన్ కానమ్ మరత్తిన్ నీழల్= కఠినమైన అరణ్యంలో ఉండే (ఆకులు లేని) చెట్లనీడలలో, కల్ అణైమేల్ = శిలలనే శయ్యలుగా చేసికొని, కణ్ తుయిల్ కఱ్ఱనైయో = నిద్రించడం నేర్చావా!

**వ్యా :– మూన్ఱామ్పాట్టు. (కొల్లణై వేల్ వరి నెడుఙ్గణ్ కౌశలైతన్ కులమతలాయ్) కొలైయిలే అణైన్ద వేల్పోలే పుకరైయుడైత్తాయ్, శెవ్వరి కరువరియైయు ముడైత్తాయ్ ప్పరప్పైయ ముడైత్తాన కణ్ణైయుడైయ శ్రీకౌసలైయారుడైయ కులత్తుక్కు ఉత్తారకనానవనే! (కునివిల్లేన్దుమ్ మల్లణైన్ద వరైత్తోళా) వీరర్కళ్ విల్ ఒరు కాలమ్ నాణి ఇఱక్కిడామై**

**యాలే వళైన్దపడియే యిరుక్కుమితే! అన్దవిల్తానుమ్ మిగై ఎన్నుమ్బడి, మలైపోలే పెరియ మిడుక్కైయుడైయ తోళైయుముడైయవనే! (వల్ వినైయేన్ మర మురుక్కుమ్ వకైయే కఱ్ఱాయ్) ఆయుధవழகాలుమ్, తోళழకాలుమ్ ఎన్నెఞ్జై ఆழிక్కవే కఱ్ఱవనే!**

**(మెల్లణైమేల్ మున్ తుయిన్డాయ్) అழகియ పడుక్కైయిలే ముఱ్కాల మెల్లామ్ కణ్వళర్న్ద నీర్. (ఇన్ఱిని ప్పోయ్) పల మాళికైకళిలే పల పడుక్కైకళిలే కణ్వళర్న్ద నీర్ ఇన్ఱాక ఇని ప్పోయ్. (వియన్ కాన మరత్తిన్ నీழల్) కాట్టిల్ వర్తిప్పార్ తాజ్గళుమ్ వెరువుమ్బడి కాట్టిలే ఇలై యిల్లాత మరత్తిన్ నిழలిన్ కీழ். (కల్లణైమేల్ కణ్ తుయిల క్కఱ్ఱనైయో) పాఱైకళై యణైయాకక్కొణ్డు కణ్వళరుమ్బడి కఱ్ఱీరో? (కాకుత్తా! కరియకోవే!) ఇచ్చెయల్కళ్ ఉమ్ముడైయ కుడిప్పిఱప్పుక్కుమ్ శేరాతు. ఉమ్ముడైయ వడివழకుక్కుమ్ పోరాతు.**

**భావదీపిక :- అవ :-** మెత్తని పంచశయనంలో నిద్రించే నీవు అరణ్యంలో శిలాశయ్యపై నిద్రించడం నేర్చావా !, స్వామీ ! అని అంటూ ఈ పాశురంలో ఆழ்వార్లు దశరథునివలె పల్కుతూ విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (కొల్ అణైవేల్ వరి నెడుఙ్గణ్ కౌశలైతన్ కులమతలాయ్) –** శత్రువులను వధించే వృత్తిని కల వేలాయుధంవలె కాంతిని కల్గినవై, ఎఱ్ఱని, నల్లని రేఖలను కల్గిన, విశాలమైన కన్నులను కల్గిన శ్రీకౌసల్యయొక్క కులాన్ని ఉద్ధరించినవాడా!

**(కుని విల్ ఏన్దుమ్ మల్ అణైన్ద వరై త్తోళా!)** – వీరుల విల్లు ఎల్లప్పుడు నారి ఎక్కుపెట్టబడి, బాణాలను సంధిస్తూ ఉంటుంది కనుక, వంచబడే ఉంటుంది కదా!, దానినే **"కుని విల్ ఏన్దుమ్"** అని చూపుతున్నారు. **"మల్లణైన్ద వరై త్తోళా!"** అని అన్నందువల్ల ఆ విల్లుకూడా అక్కర లేదు అనే రీతిలో పర్వతాలవలె పెద్ద బలిమిని కల బాహువులను కలవాడా! అని తెలుపబడింది.

**(వల్ వినైయేన్ మన మురుక్కుమ్ వకైయే కఱ్ఱాయ్!)** – ఆయుధంయొక్క అందంచేత, బాహుసౌందర్యంచేత నామనస్సును కరిగేటట్లు చేయడమే స్వభావంగా కలవాడా!

**(మెల్ అణైమేల్ మున్ తుయిన్డాయ్!)** – అందమైన పడుకలో అయోధ్యలో ఉండే సమయంలో అంతా నీవు పరుండి ఉన్నావు.

**(ఇన్ఱు ఇని ప్పోయ్)** కన్నతల్లి మేడలలో గొప్ప ప్రదేశాలలో అందమైన శయ్యలలో తూగే నీవు ఈ నాటినుండి ప్రారంభించి ఇక రాబోయే కాలం అంతా,

**(వియన్ కాన మరత్తిన్ నీళ్ఴల్)** - కఠినమైన వనంలో ఉండే ఆకులు లేని చెట్ల నీడలలో. **"వియన్ కాన మరమ్"** అని అన్నందువల్ల అరణ్యంలనే స్థిరంగా నివసించే వారు కూడా గర్హించే వనవాసం- అని తెలుపబడింది.

**(కల్లణైమేల్ కణ్ తుయిల క్కఱ్ఱనైయో)** - శిలాఫలకాలను శయ్యగా చేసికొని నిద్రపోవడం నేర్చావా!

**(కాకుత్తా! కరియ కోవే)** - ఈ లీలలు నీ ఆభిజాత్యానికి తగవు. నీ తిరుమేని అందానికీ తగవు.

**వా పోకు వా ఇన్నమ్ వన్దొరు కాల్ కణ్డు పో మలరాళ్కూన్దల్,**
**వేయ్ పోలు మెళ్ఴిల్ తోళితన్ పొరుట్టా విడైయోన్ఱన్ విల్లై చ్చెఱ్ఱాయ్!,**
**మాపోకు నెడుఙ్గానమ్ వల్వినైయేన్ మన మురుక్కుమ్ మకనే!, ఇన్ఱు**
**నీ పోక ఎన్నెఞ్జమ్ ఇరు పిళవాయ్ ప్పోకాతే నిఱ్కుమాఱే! 4**

వా = ఇక్కడకు కొంచెం రా, పోకు = ఇక నీవు వెళ్ళు, వా = తిరిగి ఇక్కడకు రా, ఇన్నమ్ వన్ద ఒరు కాల్ కణ్డు పో = (వచ్చిపోయేటపుడు) తిరిగి ఒకసారి నన్ను చూచి పో, మలర్ ఆళ్ కూన్దల్ = పూలను ఎల్లప్పుడూ అలంకరించుకొన్న కేశాలను కల్గినది, వేయ్ పోలుమ్ = వెదుళ్ళవంటి, ఎళ్ఴిల్ తోళితన్ పొరుట్టు ఆ = అందమైన బాహువులను కల సీతాదేవి కోసంగా, విడైయోన్‌తన్ విల్లై = శివుని ధనస్సును, శెఱ్ఱాయ్ = విఱిచిన వాడా! వల్ వినైయేన్ మనమ్ ఉరుక్కుమ్ మకనే = మహాపాపి అయిన నా మనస్సును ద్రవీకరింపజేసే కుమారా!, ఇన్ఱు = ఇపుడు, నీ = నీవు, మా పోకు నెడుమ్ కానమ్ పోక= ఏనుగులు సంచరించే మహారణ్యానికి పోగా, ఎన్ నెఞ్జమ్ = నా మనస్సు, ఇరు పిళవు ఆయ్ పోకాతే నిఱ్కుమ్ ఆఱే = రెండుగా పగిలి పోకుండా ఉన్నదే! ఆశ్చర్యం!

**వ్యా :- నాలామ్పాట్టు. (వా పోకు విత్యాది) శఱ్ఱుప్పోతు కాణావిట్టవాఱే వరుమ్పడి కాణ్గైక్కాక సుమన్ద్రనై విట్టు అழைప్పిక్కుమ్. (పోకు) పిన్బుమ్ పిఱకు వాళియుమ్ కాణ్గైక్కాక ప్పో ఎన్నుమ్. పిన్నైయుమ్ కణ్మఱైయ ప్పోనవాఱే వా ఎన్నుమ్. (ఇన్నమ్ వన్దొరు కాల్ కణ్డు పో) వన్దవాఱే ఇన్నమ్ పోమ్బోతు ఒరు కాల్ కణ్డు పో ఎన్నుమ్. ఇప్పడియాయితే ఇవన్ యాత్రైతానిరుప్పతు. (మలరాళిత్యాది) పూమాఱాతే యాళుమ్ మయిర్ ముడియై యుమ్. (వేయ్పోలు మెళ్ఴిల్ తోళితన్పొరుట్టా) పశుమైక్కుమ్, శుఱ్ఱుదైమైక్కుమ్, ఒழుకు నీట్చిక్కుమ్ వేయ్పోలే యిరుక్కిఱ అழకియ తోళైయుముడైయళా యిరుక్కిఱ పిరాట్టినిమిత్తమాక. (విడైయోన్ఱన్ విల్లై చ్చెఱ్ఱాయ్!) పెరు మిడుక్కనాన రుద్రనుడైయ విల్లై ముఱిత్తవనే!**

**(మా పోకు నెడుజ్ఞానమ్) ఆనైకళ్ సఞ్చరిక్కుఱ కాడు. (నల్విూనైయేన్ మన మురుక్కుమ్ మకనే!) బాల్యవస్థై తొడఙ్గి ప్రతినాలాణ్డు ఉన్ సౌన్దర్యాదిచేష్టితఙ్గళాలే మహాభోగఙ్గళై ఎన్నై అనుభవిప్పిత్త ఉన్నై ముడియ అనుభవిక్కప్పెఱాతే మహాపాపత్తై ప్పణ్ణిన ఎన్నుడైయ హృదయత్తై శిథిలమాక్కుమవనే! (ఇన్ఱు నీ పోక ఎన్నెఞ్జమ్ ఇరు పిళవాయ్ ప్పోకాతే నిఱ్కుమాఱే!) ఉన్ సన్నిధియిల్ ఉరుకికిఱ ఎన్నెఞ్జానతు నీ పోనవాఱే శిథిలమాకాతే వలిత్తిరా నిన్ఱతీ! ఇతుక్కు హేతు అఱికిఱిలేన్.**

**భావదీపిక :- అవ:-** శివుని వింటిని విఱచి, సీతను వివాహమాడిన నీవు క్రూర మృగాలు సంచరించే అడవిలో తిరగడాన్ని చూచి నా మనస్సు రెండుగా పగలకుండా ఉన్నదే ! - అని ఇందులో విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (వా పోకు వా)** - ఇది శ్రీరామునిపట్ల దశరథుడు కల్గి ఉండే పుత్రపాశాన్ని తెలుపుతుంది. శ్రీరాముని కొంచెం సేపు చూడకపోతే, అతని ముందుభాగంలోని అందాన్ని దర్శించడంకోసం, తన మంత్రి అయిన సుమంత్రునిద్వారా దశరథుడు శ్రీరాముని పిలిపించేవాడు. ముందు అందాన్ని దర్శించిన తరువాత అంబులపొదిని, విల్లును ధరించి ఉండే అతని వెనుక సౌందర్యాన్ని దర్శించడం కోసం తిరిగి "పో" అని అనేవాడు. పోయిన తరువాత మళ్ళీ "రా" అని అనేవాడు.

**(ఇన్నుమ్ వన్దు ఒరు కాల్ కణ్డు పో)** - రాగానే, తిరిగిపోయేటపుడు ఒకసారి చూచి పో అని అనేవాడు. ఈ విధంగానే మాటిమాటికి చేసేటట్లుగా ఉన్నది రాముని పట్ల దశరథుడు కలిగి ఉండే గొప్ప ప్రేమ- అని భావం.

**(మలరాళ్ కూన్దల్)** - ఎడతెగకుండా ఎల్లప్పుడూ పూలతో అలంకరింపబడ్డ కేశబంధాన్ని, **(వేయ్ పోలుమ్ ఎழிల్ తోళితన్ పొరుట్టా)** - పచ్చదనానికి, గుండ్రంగా, పొడుగుగా ఉండడానికి వెదుళ్ళు ఉపమానంగా చెప్పేటట్లుండే అందమైన బాహువులను కల సీతాదేవి కోసం

**(విడైయోన్‌తన్ విల్లై చ్చెఱ్ఱాయ్!)** - గొప్ప బలిమిని కలవాడై, ఋషభవాహనుడైన శివుని వింటిని విఱిచినవాడా!

**(మా పోకు నెడుజ్కానమ్)** - అడవి ఏనుగులు, సింహాలు, పులులు మొదలైన క్రూరమృగాలు తిరిగే పెద్ద అడవి. **"మా"** అనే పదం ఏనుగులు మొదలైన మృగాలను తెలుపుతుంది.

**(వల్విూనైయేల్ మనమ్ ఉరుక్కుమ్ మకనే!)** - చిన్న బిడ్డగాను, చిన్న కుఱ్ఱవానిగాను ఉండే పరువాల కంటే పదునాల్గు సంవత్సరాల నీ యౌవన పరువంలోనే నీ అందం,

వీర్యం మొదలైన గుణాలను, పరశురాముని అణచడం మొదలైన లీలలను దర్శించి గొప్ప ఆనందాలను పొందేటట్లు చేసిన నిన్ను ఇంకా అనుభవించలేని రీతిలో మహాపాపాన్ని చేసిన నా మనస్సు కఱగేటట్లు చేసే కుమారా !

**(ఇన్ఱు నీ పోక ఎన్ నెఞ్జు ఇరు పిళవాయ్ ప్పోకాతే నిఱ్కుమాతే)** – నిన్ను చూచేటపుడు కఱగే నా మనస్సు, నీవు కన్నులకు కన్పించకుండా మఱుగుపడిన తరువాత పగిలిపోకుండా ఇంకా బలంగా ఉన్నదే ! ఇది ఏవిధంగా సాధ్యం ! అన్నది తెలియలేను.

**పొరున్దార్ కైవేల్ నుతిపోల్ పరల్ పాయ మెల్లడిక్కళ్ కురుతి శోర,**
**విరుమ్బాత కాన్ విరుమ్బి వెయిలుఱైప్ప వెమ్బశినోయ్ కూర, నిన్ఱు**
**పెరుమ్బావియేన్ మకనే! పోకిన్ఱాయ్ కేకయర్కోన్మకళాయ్ ప్పెఱ్ఱ,**
**అరుమ్బావి శొల్కేట్ట అరువినైయేన్ ఎన్ శెయ్కేన్! అన్దో! యానే** 5

పొరున్దార్ కై వేల్ నుతిపోల్ = శత్రువుల హస్తాలలో ఉండే, పదును కల వేలాయుధం యొక్క అగ్రంవలె, పరల్ పాయ = గులకరాళ్ళు కాలిలో నాటుకోగా (గుచ్చుకోగా), మెల్ అడిక్కళ్ = మృదువైన పాదాలనుండి, కురుతి శోర = రక్తం కారగా, వెయిల్ ఉఱైప్ప = ఎండ పైన తపించగా, వెమ్ పశి నోయ్ కూర = క్రూరమైన ఆకలి బాధ కత్తిరించగా (పీడించగా), పెరుమ్ పావియేన్ మకనే = మహాపాపిని అయిన నాకు పుట్టిన కుమారా!, ఇన్ఱు = ఇపుడు, విరుమ్బాద కాన్ విరుమ్బి పోకిన్ఱాయ్ = కోరదగని అరణ్యానికి (నేను పొమ్మన్నాను అని అన్నందున) కోరి వెడుతున్నావు, కేకయర్ కోన్ మకళ్ ఆయ్ పెఱ్ఱ = కేకయరాజుకు కుమార్తెగా పుట్టిన, అరుమ్ పావి = మహాపాపి అయిన కైకేయియొక్క, శొల్ కేట్ట అరువినైయేన్ యాన్ = మాటను విన్న క్రూరపాపాన్ని చేసినవాడను, అన్దో! ఎన్ శెయ్కేన్ = అయ్యో! దీనికి ఏమి పరిహారాన్ని చేయను?

**వ్యా :- అఞ్జామ్బాట్టు. (పొరున్దార్ కైవేల్ నుతిపోల్ పరల్ పాయ) శత్రుక్కళ్ కైయిల్ వేల్మునైయై ఇట్టీర్న్దాప్పోలే పరఱ్కళానవై పాయ. (మెల్లడిక్కళ్ కురుతి శోర) ఇఙ్గు త్తరైయిల్ మితిక్క సహియాత సుకుమారమాన తిరువడికళ్ పరఱ్కళ్ మేలే మితిక్కైయాలే రక్తత్తై ప్పుఱ ప్పడవిడ. (విరుమ్బాత కాన్ విరుమ్బి) సుకుమారరల్లాతారుమ్ విరుమ్బాత కాట్టై నాన్ పోకచ్చొన్నే నెన్నుమత్తాలే విరుమ్బి.**

**(వెయిలుఱైప్ప వెమ్బశి నోయ్ కూర) మేలే వెయ్యిలానతు ఉఱైప్ప. నినైత్తపోతు అముతు శెయ్య క్కిడైయామైయాలే వెవ్వియ పశియాన నోయ్ మిక.**

**(ఇన్ఱు పెరుమ్ పావియేన్ మకనే! పోకిన్ఱాయ్) మహాపాపియాన ఎన్ వయిఱ్ఱిలే పిఱక్కైయితే సుకుమారరాన నీర్ కాడేఱప్పోకిఱతు. (కేకయర్కోన్ మకళాయ్ ప్పెఱ్ఱ అరు మ్బావి శొల్ కేట్ట) కేకయరాజన్ మకళాయ్ప్పెఱ్ఱతు ఒరు మహాపాపత్తైయాయ్త్తు.**

**అవళ్ వార్తైయిలే అకప్పట్ట. (అరువినైయే నెన్ శెయ్‌కే నన్దో యానే) ప్రతిక్రియై యిల్లాత శెయలై చ్చెయ్‌త ఎన్నాల్ శెయ్యలామ్ పరిహార మిల్లైయే!**

**భావదీపిక :- అవ :-** మహాపాపి అయిన కైకేయి మాటను విన్న, పాపిష్ఠివాణ్ణి అయిన నాకు పుట్టినందువల్ల ఎవరూ పోకూడని కఠినమైన అరణ్యానికి ఆదరంతో వెళ్ళిపోయావే! అని ఇందులో విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (పొరున్దార్ కైవేల్ నుతిపోల్ పరల్ పాయ)** – శత్రువుల చేతిలో ఉండే వేలాయుధం మొనతో ఖండించినట్లుగా అరణ్యంలోని గులకరాళ్ళు గుచ్చుకోగా.

**(మెల్లడిక్కళ్ కురుతి శోర)** – ఇక్కడ చక్కని నేలపై కాలు మోపి నడవడాన్ని సైతం సహించలేని చాలా మృదువైన శ్రీచరణాలు గులకరాళ్ళపై నడవడంవల్ల రక్తం కారేటట్లుగా.

**(విరుమ్బాద కాన్ విరుమ్బి)** – కఠినం అయిన కాళ్ళను కలవారు సైతం కోరని అరణ్యాన్ని నేను పొమ్మన్నాను, అనే కారణంతోనే నీవు ఆశపడి.

**(వెయిల్ ఉఱైప్ప వెమ్ పశి నోయ్ కూర)** – శ్రీచరణాలలో రాళ్ళు గుచ్చుకోవడం మాత్రమే కాకుండా, పైన ఎండకుండా తపింపజేసేటట్లుగా, ఆయా కాలాలలో అన్నం భుజించడానికి లభించదు కనుక, తీవ్రమైన ఆకలి అనే బాధ మితిమీరేటట్లు- అని భావం. **"పోకిన్దాయ్"** అనే దానితో కలిపి అర్థాన్ని చెప్పాలి.

**(ఇన్ఱుమ్ పెరుమ్ పావియేన్ మకనే పోకిన్దాయ్)** – మహాపాపిని అయిన నా కడుపున పుట్టినందువల్లకదా చాలా సుకుమారుడవు అయిన నీవు అరణ్యాలకు పోవలసి వచ్చింది.

**(కేకయర్‌కోన్ మకళాయ్ ప్పెఱ్ఱ అరుమ్ పావి శొల్ కేట్ట)** కేకయదేశానికి ప్రభువు కుమార్తె అనే పేరుతో ఒక పాపరాశినే పొందాడు. ఆమె మాటలో చిక్కుకొన్న.

**(అరు వినైయేన్ ఎన్ శెయ్‌వేన్ అన్దో! యానే )** – ప్రాయశ్చిత్తమే లేని పాపపు పనిచేసిన నాచే దీనికి ఏమి పరిహారం చేయడానికి వీలున్నది.

**అమ్మా! ఎన్ఱుకన్దఴైక్కుమ్ ఆర్వచ్చొఱ్కేళాతే అణిశేర్ మార్వమ్,**
**ఎన్మార్వత్తిడై అఴున్దత్తఴువాతే ముఴుశాతే మోవాతుచ్చి,**
**క్కైమ్మావిన్ నడైయన్న మెన్నడైయుమ్ కమలమ్పోల్ ముకమ్ కాణాతు,**
**ఎమ్మానై ఎన్మకనై ఇఴన్దిట్ట ఇఴితకైయేన్ ఇరుక్కిన్ఱేనే** 6

అమ్మా ఎన్ఱు ఉకన్దు అఴైక్కుమ్ = "అయ్యా!" అని ఆనందంతో పిలిచే రీతిలోని, ఆర్వమ్ శొల్ = ప్రేమ నిండిన మాటను, కేళాతే = వినలేక పోవడం, అణి శేర్

మార్వమ్ = ఆభరణాలు అలంకరించుకొన్న వక్షఃస్థలాన్ని, ఎన్ మార్వత్తిడై అழுన్ద = నా వక్షస్సులో హత్తుకొనేటట్లుగా, తழுవాతే = గాఢంగా కౌగలించుకోలేకపోవడం, ముழுశాతే= ఆ ఆనందసముద్రంలో మునగక పోవడం, ఉచ్చి మోవాతే = శిరస్సును ఆఘ్రాణించలేకపోవడం, కైమ్మావిన్ నడై అన్న మెల్ నడైయుమ్ = ఏనుగుయొక్క నడకవంటి మృదువైన నడకలోని హొయలును, కమలమ్ పోల్ ముకముమ్ = తామరపూవుతో సాటి వచ్చే తిరుముఖసౌందర్యాన్ని, కాణాతు = దర్శించలేకపోవడం, ఎమ్మానై ఎన్ మకనై ఇழన్దిట్ట = నన్ను తన నడక సొబగుతో వ్యామోహపఱచిన నా కుమారుని కోల్పోయిన, ఇழி తకైయేన్ = అధమాధమకృత్యాన్ని చేసిన నేను, ఇరుక్కిన్ఱేనే= ఇంకా ప్రాణాలతో ఉన్నానే!

**వ్యా :- ఆఱామ్బాట్టు. (అమ్మా ఎన్ఱుకన్దழைక్కు మార్వచ్చొల్ కేళాతే) వేఱొన్ఱై క్కణిశియాతే కారియప్పాడఱ "ఐయర్" ఎన్ఱழைక్కుమ్ ప్రేమమ్ వழிన్ద పుఱప్పట్ట శొల్లై క్కేళాతే. (అణి శేర్ మార్వమ్ ఎన్మార్వత్తిడై యழுన్ద త్తழுవాతే) ఆభరణఙ్గళాలే అలఙ్కృతమాన తిరుమార్వై క్కొణ్డు, "సుగాఢం పరిషస్వజే" ఎన్నుమ్బడి ఏకతత్వ మెన్నుమ్బడి తழுవి ముழுశాతే. (మోవాతుచ్చి) ముழுశి అనన్తరమ్ ఉచ్చియై మోన్దు కొళ్ళాతే.**

**(కైమ్మావిన్ నడై యన్న మెన్నడైయుమ్) "మత్తమాతఙ్గగామినమ్" ఎన్నుమ్బడి అమైన్దిరుక్కిఱ నడైయழகుమ్. (కమలమ్బోల్ ముకముమ్ కాణాతు) వికాసమ్, శెవ్విక్కు త్తామరై ఒరు పోలియాన తిరుముకత్తై క్కాణాతు. (ఎమ్మానై ఎన్మకనై) నడైయழకాలే ఎన్నై ఎழுతికొణ్డ ఎన్మకనై. (ఇழన్దిట్ట ఇழிత్తకైయేనిరుక్కిన్ఱేనే) ఇప్పడి తణ్ణియ శెయలై చ్చెయ్తక్కాల్ ముడియవుమాకాతే యిరుక్కవుమ్ వేణుమో నాన్!**

**భావదీపిక :- అవ :-** నీ మాటను విని, నిన్ను తడవి, శిరస్సును ముద్దాడి, నేను ఇంతవరకు పొందుతూ వచ్చిన ఆనందాలు అన్నిటినీ కోల్పోయిన తరువాత ఇంకా ప్రాణాలతో నిలచి ఉన్నానే !- అని అంటూ ఈ పాశురంలో విలపిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (అమ్మా ఎన్ఱు ఉకన్దు అழைక్కుమ్)** - ఏ పని లేనపుడుకూడా ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా "అయ్యా!" అని నీవు పిలిచే ప్రేమ నిండిన మాటను వినకుండా.

**(అణి శేర్ మార్వమ్ ఎన్ మార్వత్తిడై అழுన్ద త్తழுవాతే ముழுశాతే) -** ఆభరణాలతో అలంకరింపబడ్డ నీ వక్షస్సుతో- **"సోఽ ప్యేనం ధ్వజవజ్రాబ్జకృతచిహ్నేన పాణినా, సంస్పృశ్యాకృష్యచ ప్రీత్యా సుగాఢం పరిషస్వజే"** (వి.పు. 5-18-2) (ఆ శ్రీకృష్ణుడు ఈ అక్రూరుని ధ్వజం, వజ్రం, తామరపూవు- అనే వీనిచే చిహ్నితమైన తన

శ్రీహస్తంతో స్పృశించి, దగ్గరకు తీసికొని ప్రేమతో బాగా కౌగలించుకొన్నాడు) అనే రీతిలో ఒకే శరీరమా! అనేటట్లుగా స్పృశించి ఆనందసముద్రంలో మునగకుండా.

**(మోవాతు ఉచ్చి)** - ఈ విధంగా కౌగలించుకొన్నతరువాత ఉచ్చిని (శిరస్సు పైభాగాన్ని) ఆఘ్రాణించి ఆనందించకుండా.

**(క్రైమ్మావిన్ నదై యన్న మెన్నడైయుమ్)** - **"మత్తమాతంగగామినమ్"** (రామా. అయో. 3-28) (మత్తగజంవలె నడిచేవానిని) అని అనబడే ఏనుగువలె గంభీరంగా ఉండే నడక, అందం.

**(కమలమ్పోల్ ముకముమ్ కాణాతు)** - వికాసం, చల్లదనం మొదలైన గుణాలకు తామరపూవును ఉపమానంగా చెప్పదగిన తిరుముఖాన్ని దర్శించకుండా.

**(ఎమ్మానై ఎన్ మకనై)** - నడకహొయలుతో నన్ను వశీకరించుకొన్న నా కుమారుని.

**(ఇళ్ఱన్దిట్ట ఇళ్ఱి తకైయేన్ ఇరుక్కిన్దేన్)** - ఈ విధంగా చాలా అధమమైన కృత్యాన్ని చేసి, నశించిపోకుండా నేను ఇంకా ప్రాణాలతో ఉండవలసిన అక్కర ఉన్నదా అయ్యో! అని విలపిస్తున్నారు.

**పూమరువు నఱుఙ్గుఞ్జి పున్శడైయా ప్పునైన్దు పూన్దుకిల్ శేరల్కుల్,**
**కామరెళ్ఱిల్ విళ్ఱలుదుత్తు క్కలనణియాతు అఙ్గఙ్గళళ్ఱకు మాతి,**
**ఏమరుతొళెన్ పుతల్వన్ యాన్ ఇన్దు శెలత్తక్క వనమ్తాన్ శేర్తల్,**
**తూ మఱైయోర్! ఇతు తకవో! శుమన్దిరనే! వశిట్టనే! శొల్లీర్ నీరే** 7

తూ మఱైయోర్ = పరిశుద్ధమైన వేదాన్ని అధ్యయనం చేసే బ్రాహ్మణులారా !, శుమన్దిరనే = (మంత్రివి అయిన) ఓ సుమంత్రా !, వశిట్టనే = (గురువు అయిన) ఓ వశిష్ఠమహర్షీ!, పూ మరువుమ్ నఱు కుఞ్జి = పూలను ఎల్లప్పుడు కల్గినది, పరిమళం నిండుగా కల్గినది అయిన కేశాలను, పున్ శడై ఆ పునైన్దు = వికారమైన జడగా అల్లి, పూ తుకిల్ శేర్ అల్కుల్ = అందమైన పట్టుబట్టను కట్టేటట్లున్న నడుములో, కామర్ ఎళ్ఱిల్ విళ్ఱల్ ఉడుత్తు = చూచేవారు కామించదగిన అందమైన విశ్వామిత్రాన్ని దారంగా మడచి ధరించి, కలన్ అణియాతు = ఆభరణాలను అలంకరించుకోకుండా, అఙ్గఙ్గళ్ అళ్ఱకు మాతి = అందువల్ల తిరుమేనికి వచ్చే అందం లేకుండా, ఏమరుతోళ్ ఎన్ పుతల్వన్ = శత్రువులు భయపడతగిన బాహువులను కల నా కుమారుడు, యాన్ ఇన్దు శెల తక్క = అరణ్యానికి, తాన్ శేర్తల్ ఇతు = భోగాలను అనుభవించవలసిన తాను పోవడం, తకవో = ధర్మమా!, నీరే శొల్లీర్ = (ధర్మాన్ని తెలిసిన) మీరే చెప్పండి.

**వ్యా :- ఏర్ప్రామ్పాట్టు! (పూమరువు నఱుఙ్గుఞ్జి పున్ శడైయా ప్పునైన్దు) పూమాలాతే ఇరుప్పతాయ్, పరిమళత్తై ప్పుఅప్పడవిడానిఱ్కుమ్ తిరుక్కుళ్ఱలై, మనుష్యర్క్కు**

**ప్పార్క్కవొణ్ణాతపడి జటైయాక్కి. (పూన్దుకిల్ శేరల్కుల్ కామరెళ్ళిల్ విళ్ళలుదుత్తు) అఋపతినాయిరమాణ్డు తేడిన తిరుప్పరియట్టజ్గళిల్ నల్లవై ఎల్లామ్ శాత్తక్కడవ తిరువరైయిలే, కణ్డార్ విరుమ్బుమ్బడి విశ్వామిత్రత్తై క్కయిఱాక ముఋక్కి చ్చాత్తి. (కలనణి యాత అజ్గజ్గళ్ అళ్ళకుమాఱి) స్వాభావికమాన అళ్ళకొళ్ళియ త్తిరువాభరణజ్గళ్ శాత్తా మైయాలే అత్తాల్ వరుమళ్ళకిన్ఱియే.**

**(ఏమరుతోళెన్ పుతల్వన్) విఘ్నమ్ పణ్ణినారై అళ్ళియచ్చెయ్తు అభిషేకమ్ పణ్ణవల్ల ఎన్ మకన్. (యానిన్ఱు శెలత్తక్క వనమ్తాన్ శేర్తల్) అఋపతినాలాయిరమాణ్డు భోగజ్గళై భుజిత్తు, వీతరాగనాన నాన్ పోకక్కడవ కాట్టిలే సుకుమారరాయ్, భోగయోగ్యరాన తామ్ పోకై. (తూయ్మఱైయో రితు తకవో) "పతిం విశ్వస్య" ఎన్ఱు ఓతియిరుక్కిఱ బ్రాహ్మణరే! నీజ్గళ్ ఇతు శొల్లికోళ్, ఇతు ధర్మమో? (శుమన్దిరనే! వశిట్టనే! శొల్లీర్ నీరే) రాజధర్మత్తై ప్పళ్ళక అఱిన్దు నడత్తిప్పోన్ద సుమన్త్రనే! శొల్లాయ్. ఇవ్వంశత్తుక్కు గురువాయ్, రాజధర్మజ్గళై ఉపదేశిత్తు పోరుకిఱ శ్రీవసిష్ఠభగవానే! శొల్లాయ్.**

*అరు :- ఏళ్ళామ్బాట్టు, (పూమరువిత్యాది) ఏమరుతోళ్ - ఎయ్కైయిలే పొరున్దిన తోళ్.*

**భావదీపిక :- అవ :-** నేను ఇపుడు పోవలసిన అరణ్యానికి నా కుమారుడు పోవడం న్యాయమా? అనే విషయాన్ని మీరే చెప్పండి- అని సుమంత్రుని, వశిష్ఠుని ఉద్దేశించి అడుగుతూ దశరథుని మాటలతో విలపిస్తున్నారు ఈ పాశురంలో

**వ్యాఖ్యానం :- (పూ మరువుమ్ నఋఙ్కుఙ్జి పున్ శడైయా పునైన్దు)** - ఇంతవరకు విడువకుండా పూలను ముడుచుకొన్నదై, సువాసన వీచేటట్లుగా ఉండే కేశాలను, మానవులు ఎవరూ కన్నులతో చూడడానికి సాధ్యం కానట్లు జడగా అల్లి.

**(పూన్తుకిల్ శేర్ అల్కుల్ కామర్ ఎళ్ళిల్ విళ్ళల్ ఉడుత్తు)** - అరవై వేల ఏండ్లుగా నేను వెదకి వెదకి, నీవు ధరించడంకోసం చేర్చిపెట్టిన వస్త్రాలలో చాలా మంచిది అయిన, అందమైన పట్టుబట్టను కట్టుకోవలసిన నడుములో, చూచేవారే ఆశ పడతగిన పరిశుద్ధిని కల దర్భలను (విశ్వామిత్రాన్ని) బాగా మడచి ధరించి. ఇది చూడడానికి అందంగా ఉంటుందే తప్ప నడుములో ధరిస్తే ఒత్తుకొంటుందని భావం.

**(కలన్ అణియాతు అజ్గజ్గళ్ అళ్ళకు మాఱి)** - సహజం అయిన అందానికి మించి తిరువాభరణాలు ధరించినందువల్ల కలిగే అందం లేకుండానే

**(ఏమరు తోళ్ ఎన్ పుతల్వన్)** - సత్కార్యాలకు విఘ్నాలను కల్గించేవారిపై బాణాలను ప్రయోగించి వధించేవాడు, పట్టాభిషేకం చేయడానికి తగిన గొప్పతనాలను యోగ్యతలను కల నాకు కుమారుడైన శ్రీరాముడు.

**(యాన్ ఇన్హు శెలత్తక్క వనమ్ తాన్ శేర్తల్)** – అరవై వేల ఏళ్ళు అన్ని సుఖాలను అనుభవించి, ఆశలను విడచిన నేను పోవలసిన అడవికి, అత్యంతసౌకుమార్యాన్ని కలవాడై, సుఖాలను అనుభవించదగినవాడైన నా కుమారుడు పోవడం.

**(తూ మఱైయోర్! ఇతు తకవో!)** – **"పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతం నారాయణమ్"** (తైత్తి. నారా–11) (లోకానికి అంతటికీ పతి, తనకు తానే ప్రభువు, నిత్యుడు, పరిశుద్ధుడు, భక్తులను చేయి విడువనివాడు అయిన నారాయణుని) అని మొదలైన వేదవాక్యాలను అధ్యయనంచేసిన బ్రాహ్మణులారా ! మీరు దీనిని గూర్చి చెప్పండి. ఇది ధర్మమేనా !

**(శుమన్దిరనే! వశిట్టనే! శొల్లీర్ నీరే)** – చిరకాలంగా నడిచే రాజధర్మాన్ని తెలిసి, దానిని రాజులకు ఉపదేశించి, నడిపించే ఓ సుమంత్రా ! నీవు చెప్పు. ఈ సూర్యవంశానికి ఆచార్యుడవై, రాజధర్మలను ఉపదేశిస్తున్న ఓవశిష్ఠమహర్షీ ! మీరు చెప్పండి. ఇది ధర్మమేనా!

**పొన్ పెఱ్ఱార్ ఎழிల్ వేత ప్పుతల్వనైయుమ్ తమ్బియైయుమ్ పూవైపోలుమ్,**
**మిన్బఱ్ఱా నుణ్ మరుఙ్గుల్ మెల్లియలెన్ మరుకియైయుమ్ వనత్తిల్ పోక్కి,**
**నిన్బఱ్ఱా నిన్మకన్మేల్ పழி విళైత్తిట్టు ఎన్నైయుమ్ నీళ్వానిల్ పోక్క,**
**ఎన్ పెఱ్ఱాయ్? కైకేశీ! ఇరునిలత్తిల్ ఇనితాక ఇరుక్కిన్ఱాయే** **8**

కైకేశీ = కేకయరాజపుత్రీ!, పొన్ పెఱ్ఱార్ ఎழிల్ వేదమ్ పుతల్వనైయుమ్ = విద్యాసంపదను కల ఆచార్యులవద్దనుండి అందమైన అన్ని వేదాలను, శాస్త్రాలను అభ్యసించిన శ్రీరాముని, తమ్బియైయుమ్ = (అతనికి) తమ్ముడైన లక్ష్మణుని, పూవై పోలుమ్= పూవై అనే పక్షివంటిదై, మిన్ పఱ్ఱా నుణ్ మరుఙ్గుల్ = మెఱపు కూడా సాటి రాని సన్నని నడుమును, మెల్ ఇయల్ ఎన్ మరుకియైయుమ్ = మృదువైన స్వభావాన్ని కల్గినది అయిన నా కోడలు సీతాదేవిని, వనత్తిల్ పోక్కి = వనానికి పంపి, నిన్ పఱ్ఱు ఆమ్ = నీ పట్ల ప్రేమను కల, నిన్ మకన్ మేల్ = నీ కుమారుడైన భరతునిపై, పழி విళైత్తిట్టు = నిందను కలిగేటట్లుచేసి, ఎన్నైయుమ్ నీళ్ వానిల్ పోక్క = (పుత్ర శోకంతో) నన్నుకూడా చాలా దూరంలో ఉండే పైలోకానికి పోయేటట్లుగా చేసినందువల్ల, ఎన్ పెఱ్ఱాయ్ = నీవు ఏ ప్రయోజనాన్ని పొందావు? ఇరు నిలత్తిల్ = ఆ విశాలమైన భూమిలో, ఇనితు ఆక = సుఖంగా, ఇరుక్కిన్ఱాయే = ప్రాణంతో జీవించి ఉన్నావే !

**వ్యా :- ఎట్టామ్పాట్టు. (పొన్ పెఱ్ఱార్ ఎழிల్ వేత ప్పుతల్వనైయుమ్ తమ్బి యైయుమ్) ధన్యరెన్హు ఎల్లారుమ్ శొల్లుమ్బడి ఇరుక్కిఱ ఉపాధ్యార్కళ్ కీழే యిరున్దు అழకియ సకలవేదశాస్త్రఙ్గళైయుమ్ ఓతియిరుక్కిఱ పెరుమాళైయుమ్, అవరై**

అల్లతఱియాత తమ్బియారైయుమ్. (పూవై పోలుమ్ మిన్బற்ற నుణ్ మరుఙ్గుల్ మెల్లియల్ ఎన్మరుకియై యుమ్) పూవైపోలే ఇరుప్పాళుమాయ్, మిన్నుక్కు ఒప్పాన ఇడైయైయు ముడైయళుమాయ్, మృదుస్వభావైయుమాన ఎన్ మరుమకళాన పిరాట్టియైయుమ్. (వనత్తిల్ పోక్కి) కాట్టిలే పోక విట్టు.

(నిన్బற்ற నిన్మకన్మేల్ పழி విళైత్తిట్టు) ఉన్నై యల్లతు వేఱొరువరై త్తాయ్ ఎన్ఱిరాత శ్రీభరతాழ்వాన్మేలే "భ్రాతృద్రోహి" ఎన్గిఱ పழிయై ఏఱిట్టు. (ఎన్నైయుమ్ నీళ్ వానిల్ పోక్క ఎన్ పెற்றాయ్ కైకేశీ!) ఇచ్చెయల్కళెల్లామ్ శెయ్తు నీ పెற்ற ప్రయోజనమెన్? (ఇరునిలత్తిలినితాక విరుక్కిన్దాయ్) సంసారసుఖమాకిఱతు - పుత్రర్కళోడుమ్ భర్తావోడు ఙ్గూడి ఇరుక్కైయాయ్త్తు, ఉనక్కు పుత్రరాన పెరుమాళైక్కాట్టిలే పోక్కి, ఎన్నైయుమ్ స్వర్గత్తిలే పోక్కుకైయాలే సంసారసుఖమ్ అழிకితాక అనుభవిక్కక్కడవైయితే!

*అరు :- ఎట్టామ్బాట్టు. (పొన్నిత్యాది). పూవైపోలుమ్. "పూవై పైఙ్గిళి" ఎన్గిఱ పడియే, పూవై ఎన్ఱు - పక్షివిశేషమ్. పెణ్గళై, అழகుక్కు "కిళిపోలే" ఎన్నుమాపోలే పూవైపోలేయు మెన్నక్కడవతు.*

**భావదీపిక :- అవ :-** సీతారామలక్ష్మణులను అరణ్యాలకు పంపివేసి, భరతునకు కూడా లోకాపవాదాన్ని కల్గించి, నన్ను సైతం పైలోకాలకు పంపి, నీవు ఏ ప్రయోజనాన్ని పొందావు? అని కైకేయిని ఉద్దేశించి దశరథుడు నిందించే మాటలతో ఆழ்వార్లు ఈ పాశురంలో పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (పొన్ పెற்றార్ ఎழிల్ వేద పుతల్వనైయుమ్ తమ్బియైయుమ్)-** గొప్ప సంపదను కలవారు- అని అందఱు చెప్పేటట్లుండే ఆచార్యుల సన్నిధిలో ఉండి, అందమైన అన్ని వేదశాస్త్రాలను అధ్యయనం చేసిన శ్రీరాముని, అతనిని ఏనాడూ విడిచిపెట్టని తమ్ముడైన లక్ష్మణుని.

**(పూవై పోలుమ్ మిన్ పற்றా నుణ్ మరుఙ్గుల్ మెల్లియల్ ఎన్ మరుకియైయుమ్)- "పూవై"** అని చెప్పబడే పక్షివలె (గోరువంక) ఉండేది, మెఱపుతో సాటి వచ్చే సూక్ష్మమైన నడుమును కల్గినది, సౌకుమార్యాదిగుణాలను కల్గినది అయిన నా కోడలు సీతాదేవిని **(వనత్తిల్ పోక్కి)** -అరణ్యాలకు పోయేటట్లుగా చేసి.

**(నిన్ పற்றా నిన్ మకన్మేల్ పழி విళైత్తిట్టు)** - నిన్ను తప్ప వేఱెవ్వరినీ తల్లి అని తలవని భరతునిపై "అన్నకు ద్రోహాన్ని చేసినవాడు" అనే నింద కలిగేటట్లుచేసి.

**(ఎన్నైయుమ్ నీళ్ వానిల్ పోక్క ఎన్ పెற்றాయ్ కైకేశీ!)** నన్ను సైతం పైలోకాలకు పోయేటట్లుగా చేసి ఇంతచేసి నీవు పొందే ఫలం ఏమి?

**(ఇరు నిలత్తిల్ ఇనితాక ఇరుక్కిన్దాయే)** - ఈ విశాలసంసారంలో ఉండి పొందే గొప్ప ఆనందం- పిల్లలతో, భర్తతో కలసి జీవించడమే కదా! నిన్ను తల్లిగా తలచిన నీ

కుమారుడైన శ్రీరాముని అడవులకు పోయేటట్లుచేసి, భర్తను అయిన నన్ను పైలోకాలను పోయేటట్లు చేసిన నీవు ఈ లోకంలో ఆనందాన్ని చాలా గొప్పగా అనుభవిస్తున్నావులే? - అని నిందిస్తున్నారు.

**మున్నొరు నాళ్ మழுవాళి శిలై వాఙ్గి అవన్తవత్తై ముఱ్ఱుమ్ శెఱ్ఱాయ్,**
**ఉన్నైయుమ్ ఉన్నరుమైయైయుమ్ ఉన్ మోయిన్ వరుత్తముమ్ ఒన్టాక క్కొళ్ళాతు,**
**ఎన్నైయుమ్ ఎన్ మెయ్యురైయుమ్ మెయ్యాక క్కొణ్డు వనమ్బుక్క ఎన్దాయ్!,**
**నిన్నైయే మకనాక ప్పెఱప్పెఱువేన్ ఏழ் పిఱప్పుమ్ నెడున్దోళ్ వేన్దే! 9**

మున్ ఒరు నాళ్ = పూర్వం ఒకానొక సమయంలో, మழு ఆళి శిలై వాఙ్గి = పరశువును ఆయుధంగా కల పరశురాముని వింటిని గ్రహించి, అవన్ తవత్తై ముఱ్ఱుమ్ శెఱ్ఱాయ్ = అతని తపోబలాన్ని పూర్తిగా (నీ బాణానికి లక్ష్యంచేసి) నశింపజేసిన వాడా!, ఉన్నైయుమ్ = నీ పరత్వాన్ని, ఉన్ అరుమైయైయుమ్ = నిన్ను పుత్రునిగా పొందిన నేను పొందిన క్లేశాన్ని, ఉన్ మోయిన్ వరుత్తముమ్ = నీ తల్లి కౌసల్యకు (నీ విశ్లేషంవల్ల) కల్గిన దుఃఖాన్ని, ఒన్టు ఆక కొళ్ళాతు = ఒక విషయంగా లెక్కించకుండా, ఎన్నైయుమ్ =నన్ను, ఎన్ మెయ్ ఉరైయుమ్ = నా సత్యవాక్కును మెయ్ ఆక = నిజమని తలచి, వనమ్ పుక్క ఎన్దాయ్ = అరణ్యానికి పోయిన నా తండ్రీ!, నెడుమ్ తోళ్ వేన్దే = (రక్షణకోసం అని ఏర్పడిన) గొప్ప బాహువులును కల ప్రభూ!, ఏழ் పిఱప్పుమ్ = ఇక జన్మించే జన్మలు అన్నిటిలో, నిన్నైయే మకన్ ఆక పెఱ ప్పెఱువేన్ = నిన్నే కుమారునిగా పొందుతాను.

**వ్యా :- ఒన్బతామ్బాట్టు. (మున్నొరునాళ్ మழுవాళి శిలై వాఙ్గి) మున్బొరు కాలత్తిలే మழுవై ఆయుధమాకవుడైయ శ్రీపరశురామన్కైయిల్ శ్రీశార్ ఙ్గత్తిరువిల్లై వాఙ్గి. (అవన్ తవత్తై ముఱ్ఱుమ్ శెఱ్ఱాయ్) అవన్ లోకాన్తరఙ్గళై ప్రాపిక్కక్కడవతాక ఆర్జిత్త తపస్సై అవ్వమ్బాలే అழித్తుప్పోకట్టాయ్. (ఉన్నైయు మున్నరుమైయైయుమ్) ఉన్ శ్లాఘ్యతైయుమ్, "మహతా తపసా రామ" ఎన్ఱు - నాన్ ఉన్నై ప్పెఱప్పట్ట అరుమైయైయుమ్. (ఉన్ మోయిన్ వరుత్తము మొన్టాక క్కొళ్ళాతు) "ఉన్నై ప్పిరియల్ తరియేన్" ఎన్ఱు పిన్దొడర్న్ద శ్రీకౌసలైయార్ వ్యవసత్తైయుమ్ ఒన్టాక క్కొళ్ళాతు.**

**(ఎన్నైయు మెన్ మెయ్యురైయుమ్ మెయ్యాక క్కొణ్డు వనమ్బుక్క ఎన్దాయ్!) ఉన్బక్కల్ ఎనక్కుణ్డాన భావబన్ధత్తై మెయ్యాక అఱియాతే, ఎన్నై ప్పితా ఎన్ఱే నినైత్తు, "నెడునాళ్ సత్యమ్ శొల్లి పోన్దవనై నాన్ తోన్టి అసత్యప్రతిజ్ఞనాక్క వొణ్ణాతు" ఎన్ఱు ఎన్ అసత్యత్తై సత్యమాక్క వేణు మెన్ఱు నెఞ్జిలే కొణ్డు కాడేఱప్పోన ఎన్నాయనే!. (నిన్నైయే మకనాక ప్పెఱ ప్పెఱువే నేழ் పిఱప్పుమ్ నెడున్దోళ్ వేన్దే!) అనేక జన్మఙ్గళ్ పిఱన్దు, పిఱన్ద**

**జన్మన్దోఱుమ్ నీ ఎనక్కు ప్పిళ్ళైయాయ్ ప్పిఱక్కుమ్పడి పెఱ్రుదైయేనావేన్. (నెడున్దోళ్ వేన్దే) రక్ష్యవర్గత్తిన్ అళవల్లాత కావల్ తుడిప్పుడైయ తోళైయుడైయవనే!**

**భావదీపిక :– అవ :–** నీ తల్లి, తండ్రి అనుభవించబోయే శోకాన్ని లెక్కించకుండా, నా మాటనే సత్యవాక్కుగా చేయడంకోసం అరణ్యాలకు వెళ్ళిన నా తండ్రీ! నిన్నే నేను ఏడేడు జన్మలలోను కుమారునిగా పొందుతాను– అని పితృవచనపరిపాలనాన్ని చేసిన శ్రీరాముని ఈ పాశురంలో కీర్తిస్తున్నారు.

**వ్యాఖ్యానం :– (మున్నొరు నాళ్ మழு వాళి శిలై వాఙ్గి)** – పూర్వం ఒకానొక సమయంలో సీతావివాహానంతరం తిరిగి అయోధ్యకు ప్రయాణమైనపుడు "పరశువు" అనే ఆయుధాన్ని కల పరశురాముని చేతిలో ఉండే శ్రీశార్ఙ్గమ్ అనే వింటిని అతని చేతిలో నుండి గ్రహించి.

**(అవన్ తవత్తై ముఱ్రుమ్ శెఱ్రాయ్!)** – అతడు స్వర్గం మొదలైనలోకాలను పొందడంకోసం ఆర్జించిన తపస్సు బలిమిని అంతటినీ నీ బాణంతో కూలగొట్టినవాడా!

**(ఉన్నైయుమ్ ఉన్ అరుమైయైయుమ్)**– నీ గొప్పతనాన్ని, **"మహతా తపసా రామ! మహతా చాపి కర్మణా, రాజ్ఞా దశరథేనాఽసి లబ్ధోఽమృత మివామరైః"** (రామా. అర– 66–3) (రామా! గొప్ప తపస్సును చేసి, గొప్ప కర్మలను చేసి, దేవతలచే పొందబడ్డ అమృతంవలె, రాజు అయిన దశరథునిచే నీవు పొందబడ్డావు) అనే రీతిలో నిన్ను పుత్రునిగా పొందడంకోసం నేను పడిన శ్రమలన్నిటినీ.

**(ఉన్ మోయిన్ వరుత్తముమ్ ఒన్రాక క్కొళ్ళాతు)** – "నిన్ను విశ్లేషిస్తే ప్రాణాలను ధరించలేను" అని నిన్ను వెంబడించాలని ప్రయత్నించిన నిన్ను కన్నతల్లి అయిన కౌసల్య యొక్క దుఃఖాన్ని ఒక విషయంగా లెక్కించకుండా.

**(ఎన్నైయుమ్ ఎన్ మెయ్యురైయుమ్ మెయ్యాక క్కొణ్డు వనమ్ పుక్క ఎన్దాయ్)** – నీపట్ల నాకుండే ప్రేమ. నిజమైనది అని తెలియక, నన్ను తండ్రి అనే భావించి, "చిరకాలంగా సత్యాన్నే పలికే తండ్రి తాను అతనికి పుట్టిన తరువాత అసత్యప్రతిజ్ఞను చేశాడు అని అనబడకూడదు" అని మనస్సులో తలచి, అరణ్యానికి వెళ్ళిన నా తండ్రీ !

**(నిన్నైయే మకనాక ప్పెఱ ప్పెఱువేన్ ఏழ் పిఱప్పుమ్ నెడున్తోళ్ వేన్దే!)** –"పలు జన్మలను పొంది, ఆ విధంగా పుట్టిన ప్రతిజన్మలోను నీవు నాకు పుత్రునిగా జన్మించే భాగ్యాన్ని నేను పొందాలి".

**(నెడున్తోళ్ వేన్దే!)** – రక్షింపబడే రాజ్యాన్ని రక్షించడానికి ఆవశ్యకం అయిన దానికంటే అధికం అయిన బాహుబలిమిని కలవాడా!

**తేనకు మామలర్ క్కూన్దల్ కౌశలైయుమ్ శుమిత్తిరైయుమ్ శిన్దై నోవ,**
**క్కూనురువిల్ క్కొడున్దొ*ழு*త్తై శొల్ కేట్ట కొడియవళ్తన్ శొల్కొణ్డు, ఇన్డు**
**కానకమే మిక విరుమ్బి నీ తుఱన్ద వళనకరై త్తుఱన్దు, నానుమ్**
**వానకమే మిక విరుమ్బి ప్పోకిన్ఱేన్ మనుకులత్తార్తజ్గళ్ కోవే!** **10**

మను కులత్తార్ తజ్గళ్ కోవే = వైవస్వత మనువుకులంలో పుట్టిన రాజులలో గొప్పవాడా!, తేన్ నకు= తేనె వెలువడే, మా మలర్ = గొప్ప పూలతో కూడిన, కూన్దల్= కేశాలను కల, కౌశలైయుమ్ శుమిత్తిరైయుమ్ = కౌసల్య, సుమిత్ర అనే ఇద్దఱియొక్క, శిన్దై నోవ = మనస్సు బాధను పొందేటట్లు, కూన్ ఉరువిన్ కొడుమ్ తొ*ழு*త్తై = వక్రమైన (గూని అయిన) శరీరంవలెనే మనస్సుకూడా వక్రంగాకల పరిచారిక గూనియొక్క, శొల్ కేట్ట కొడియవళ్తన్ = మాటను విన్న కఠినురాలైన కైకేయియొక్క, శొల్ కొణ్డు = మాటకు కట్టుబడి, కానకమే = మిక విరుమ్బి ఇన్డు నీ తుఱన్ద = అరణ్యానికే చాలా ఆదరించి ఇపుడు నీవు విడిచిన, వళమ్ నకరై = నీ పట్టాభిషేకం కోసం అలంకరింపబడ్డ ఈ అయోధ్యానగరాన్ని, నానుమ్ తుఱన్దు = నేను కూడా వీడి, వానకమే మిక విరుమ్బి ప్పోకిన్ఱేన్ = పైలోకాన్నే మిక్కిలిగా ఆశపడి వెళ్ళిపోతున్నాను.

**వ్యా :- పత్తామ్బాట్టు. (తేనకు మామలర్ క్కూన్దలిత్యాది) తేనై ప్పుఱప్పడవిడుకిఱ మలరోడే కూడిన మయిర్ ముడియైయుడైయ శ్రీకౌసలైయారుమ్, సుమిత్రైయారుమ్ నెఞ్జు నోవ. (కూనురువిత్యాది) వడివిల్ వక్రమ్బోలే నెఞ్జుమ్ వక్రమాయ్, త్తిణ్ణితాన కూని యుడైయ వార్త్తైయై క్కేట్ట కైకేయియుడైయ వార్త్తైయిలే అకప్పట్టు.**

**(కానకమే మిక విరుమ్బి నీ తుఱన్ద వళనకరై త్తుఱన్దు) "నాన్ పోక చ్చొన్నేన్" ఎన్నుమత్తైయే కొణ్డు ఒరువర్క్కుమ్ సఞ్చరిక్క అరితాన కాట్టై విరుమ్బి, తిరువభిషేకత్తుక్కు అలఙ్కరిత్తిరుక్కిఱ ఊరై నీ కైవిట్టాయెన్డు, నానుమ్ తిరువయోధ్యైయై త్తుఱన్దు. (వానకమే మిక విరుమ్బి ప్పోకిన్ఱేన్) నీ ఇల్లాత నగరియిఱే. అత్తాలే స్వర్గమేయాకిలుమ్ నీ ఇల్లాత ఊరై విట్టుప్పోకిన్ఱేన్. (మనుకులత్తార్ తజ్గళ్కోవే!) మనుకులోద్భవనానవనే!**



**భావదీపిక :- అవ :-** "కౌసల్య, సుమిత్ర చాలా బాధపడేటట్లుగా గూనియొక్క మాటను విని, నాదగ్గర వరాన్ని కోరిన కఠినురాలైన కైకేయి మాటకు చిక్కుపడి, అయోధ్యను విడచి నీవు అరణ్యాలకు వెళ్ళినట్లే, నేనుకూడా ఈ నగరాన్ని వీడి స్వర్గానికి వెళ్ళిపోతు న్నాను" అని అంటూ శ్రీరాముని మనస్సులో ఉద్దేశించి ఆ*ழ்*వార్లు విలపిస్తున్నారు- ఈ పాశురంలో దశరథుని మాటలతో.

**వ్యాఖ్యాణం :- (తే నకు మామలర్ కూన్దల్ కౌశలైయుమ్ శుమిత్తిరైయుమ్ శిన్దై నోవ)** – తేనె స్రవించే పూలతో కూడిన కేశపాశాన్ని కల కౌసల్యాదేవి, సుమిత్రాదేవి మనస్సులో చాలా దుఃఖాన్ని పొందేటట్లుగా.

**(కూనురువిన్ కొడున్తొ౻ుత్తై శొత్కేట్టు కొడియవళ్తన్ శొత్కొణ్డు ఇన్స్టు)** – శరీరంలో వక్రతవలె మనస్సులోకూడా వక్రతను కల్గినదై, స్థిరమైన గూనితనాన్ని కల మంథర వార్తను విన్న కైకేయి మాటలోనే చిక్కుకొని.

**(ఇన్టు కానకమే మిక విరుమ్బి నీ తుఱన్ద వళ నకరై త్తుఱన్దు నానుమ్)** – "నేను అరణ్యానికి పో అని అన్నాను" అనే వార్తనే గొప్పగా భావించి, ఎవరికి ప్రవేశించడానికి వీలు కాని అడవిని కోరి, నీకు పట్టాభిషేకాన్ని చేయాలి– అని అలంకరించిన అయోధ్యను ఇపుడు నీవు వదలి పెట్టావు– అనే కారణంచేత, నేను కూడా ఆ నగరాన్నివిడచి.

**(వానకమే మిక విరుమ్బి ప్పోకిన్టేన్)** – స్వర్గంవంటి అయోధ్యానగరాన్ని నీవు విడచిపోయినందువల్ల, దానినే నగరంగా తలచి నేనుకూడా స్వర్గలోకాన్ని మిక్కిలిగా ఆశపడి వెడుతున్నాను.

**(మనుకులత్తార్ తజ్గళ్ కోవే!)** – మనువంశంలో పుట్టిన ప్రభువులలో గొప్పవాడా!

**ఏరార్న్ద కరునెడుమాల్ ఇరామనాయ్ వనమ్బుక్క అతనుక్కు ఆ౯్రా,**
**త్తారార్న్ద తడవరైత్తోళ్ తయరతన్టాన్ పులమ్బియ అప్పులమ్బల్తన్నై,**
**క్కూరార్న్ద వేల్వలవన్ కో౻ియర్ కోన్ కుడైక్కులశేకరన్ శొల్శెయ్త,**
**శీరార్న్ద తమి౻్మాలై ఇవై వల్లార్ తీనెఱిక్కణ్ శెల్లార్ తామే** 11

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్.**

ఏర్ ఆర్న్ద = సకలకల్యాణగుణాలతో పూర్ణుడై, కరు నెడు మాల్ = నీలవర్ణుడైన సర్వేశ్వరుడు, ఇరామన్ ఆయ్ = శ్రీరాముడుగా అవతరించి, వనమ్ పుక్క = అడవులకు పోగా, అదనుక్కు ఆ౯్రా = ఆ లీలను సహించలేక, తార్ ఆర్న్ద తడవరై తోళ్ = విజయమాలిక అలంకరించుకొన్న, బలిష్ఠమైన, పర్వతంవంటి బాహువులను కల, తయరతన్ తాన్ పులమ్బియ = దశరథచక్రవర్తి శోకించి విలపించిన, అప్పులమ్బల్తన్నై= ఆ విలాపాన్ని, కూర్ ఆర్న్ద = మిక్కిలి సూటి అయిన, వేల్ వలవన్ = వేలాయుధాన్ని ప్రయోగించడంలో సమర్థుడు, కో౻ియర్ కోన్= ఉఱైయూర్‌కు అధిపతి, కుడై కులశేకరన్= శ్వేతచ్ఛత్రాన్ని కలవాడైన కులశేఖరా౻్వార్లు, శొల్ శెయ్త = అనుగ్రహించిన, శీర్ ఆర్న్ద= గొప్పతనం నిండిన, తమి౻్ మాలై ఇవై = ద్రావిడమాలిక అయిన పది పాశురాలను, వల్లార్ తామ్ = అభ్యసించగలవారు, తే నెఱి క్కణ్ శెల్లార్ = చెడ్డదారిలో పోరు.

వ్యా :- నిగమత్తిల్. (ఏరార్న్ద కరునెడుమాలిత్యాది) ఎల్లా ప్రకారత్తాలుమ్ పూర్ణనాయ్, సర్వాధికనాన సర్వేశ్వరన్ కర్మవశ్యరోడే ఇతరసజాతీయనాయ్ వన్దవతరిత్తు, "కర్మవశ్యరుమ్ పోకాత కాట్టిల్ పుక్కాన్" ఎన్గతుక్కు ఆఱ్ఱమాట్టాత. (తారార్న్ద విత్యాది) అఱుపతినాయిర మాణ్డు రాజ్యమ్ పణ్ణుకైయాలే మాలై మాఱాత, తిణ్ణితాన మలైపోలే ఇరుక్కిఱ తోళైయుడైయ చక్రవర్తి ప్రలాపిత్త పాశురత్తై.

(కూరార్న్ద విత్యాది) కూర్మై మిక్క వేలైయుడైయరుమాయ్, ఉఱైయూర్క్కు నియామక రుమాయ్, ఐశ్వర్యప్రకాశకమాన వెణ్ కొఱ్ఱక్కుడైయై యుడైయరుమాన శ్రీకులశేఖర ప్పెరుమాళ్ అరుళిచ్చెయ్త. (శీరార్న్ద తమిழ்మాలై యివై వల్లార్) "పాఠ్యే గేయే చ మధురమ్" ఎన్గు ఇవై పూర్ణమాన తమిழ்త్తొడై వల్లవర్కళ్. (తీ నెఱిక్కణ్ శెల్లార్తామే) భగవద్విషయత్తై క్కాఱ్ఱడై క్కొణ్డు విషయప్రవణర్ ఆకార్కళ్.

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్

పెరుమాళ్ తిరుమొழி - ఒన్బతామ్ తిరుమొழி వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు.

---

**భావదీపిక :- అవ :-** ఈ దశకానికి ఫలాన్నిగూర్చి పల్కుతూ ఈ పాశురంలో నిగమిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (ఏరార్న్ద కరు నెడుమాల్ ఇరామనాయ్ వనమ్ పుక్క అతనుక్కు ఆఱ్ఱా) -** "అన్ని విధాలుగా పూర్ణతను కలవాడై, అందరికంటే అధికుడైన, సర్వేశ్వరుడైన శ్రియఃపతి కర్మవశ్యులైన మానవులలో ఒకడుగా- శ్రీరామునిగా అవతరించి, కర్మకు వశమై మానవులు కూడా వెళ్ళడానికి వీలులేని అడవిలోకి వెళ్ళాడు" అనే విషయాన్ని సహించలేక.

**(తారార్న్ద తడవరై త్తోళ్ తయరతన్ తాన్ పులమ్బియ అప్పులమ్బల్ తన్నై) -** అరవైవేల సంవత్సరాలపాటు రాజ్యపాలనను చేయడంవల్ల విజయమాలికను ఎల్లప్పుడు కల్గినవై, స్థిరమైనవై, పర్వతాలవంటివి అయిన బాహువులను కల దశరథ చక్రవర్తి ఏడ్చి విలపించిన ఆ విలాపాన్ని

**(కూరార్న్ద వేల్ వలవన్ .... శెఱ్చెయ్త) -** మిక్కిలి పదును కల్గిన వేలాయుధాన్ని కలవారు, చోళరాజ్యానికి రాజధాని అయిన **"కోழி"** అనబడే ఉఱైయూర్ కల ప్రభువు, తన సంపదను వ్యక్తంచేసే శ్వేతచ్ఛత్రానికి కలవారు అయిన కులశేఖరాழ்వార్లు అనుగ్రహించిన.

**(శీరార్న్ద తమిழ்మాలై ఇవై వల్లార్) - "పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్, జాతిభి స్సప్తభి ర్బద్ధం తంత్రీలయసమన్వితమ్"** (రామా. బాల. 4-8)

(పఠించేటపుడు, గానం చేసేటపుడు మధురంగా ఉండేది, ద్రుత-మధ్యమ- విళంబితా లనే మూడు ప్రమాణాలను కల్గినది, షడ్జ -నిషాద- దైవత- పంచమ- మధ్యమ- గాంధార- విషాద -ఋషభాలనే ఏడు జాతులతో (స్వరాలతో) కూడినది, వీణాతంత్రుల తోను, తాళాలతోను పొసగేది అయిన శ్రీరామాయణకావ్యాన్ని కుశలవులు గానం చేశారు) అనే రీతిలో పాటకు తగిన లక్షణాలు అన్నీ నిండి ఉండే ఈ ద్రావిడపాశురమాలను అభ్యసించగలవారు.

**(తీ నెఱి క్కణ్ శెల్లార్ తామే)** - భగవద్విషయాన్ని ఒక విషయంగా లెక్కించకుండా, శబ్దాదిలౌకికప్రాకృత విషయాలలో అభినివేశాన్ని కల్గి ఉండడమనే చెడ్డదారిలో ప్రయాణం చేయరు.

**ఒన్బతామ్ తిరుమొழி - వ్యాఖ్యానానువాదం ముగిసింది.**

---

## పత్తాన్దిరుమొழி- అఙ్గణెడుమతిళ్ - ప్రవేశమ్

**అ :- అనాదికాలమ్తామ్ ఇழన్ద ఇழవై దేవకీదేవియార్ పెఱ్ఱువైత్తు కృష్ణనుడైయ బాలచేష్టితఙ్గళై అనుభవిక్కప్పెఱాతే ఇழన్దవళ్ పాశురత్తాలే- పేశినార్ ఆలైనీళ్ కరుమ్బిల్. మన్ను పుకழిల్ - శ్రీకౌసలైయార్ పెఱ్ఱ పేఱ్ఱై అనుభవిత్తార్. బాల్యావస్థైయిలే ఎల్లామను భవిత్తు, ప్రాప్తయౌవనరానవాతే అనుభవిక్కప్పెఱాతే ఇழన్ద చక్రవర్తియోపాతి తమక్కు ప్రాప్తియుణ్డాకైయాలే అవన్ పాశురత్తాలే తమ్మిழవై ప్పేశినార్ - వన్తాళిల్.**

**ఇత్తిరుమొழியిల్ - కీழిల్ పిఱన్ద ఇழవుకళెల్లామ్ తీర చక్రవర్త్తిరుమకన్ నిత్యవాసమ్పణ్ణకిఱ తిరుచ్చిత్తిరకూడమాకిఱ తిరుప్పతియిలే, తిరువవతారన్దొడఙ్గి అన్ద అవతారవృత్తాన్తత్తై శ్రీవాల్మీకి భగవాన్ పేశి అనుభవిత్తాప్పోలే, తమ్ముడైయ జ్ఞానవైశద్యత్తాలే సమకాలత్తిల్పోలే అనుభవిక్కిఱార్.**

### పదవ దశకం - ప్రవేశం - అనువాదం

**భావదీపిక :-** అనాదికాలంగా భగవానుని అనుభవించలేక కోల్పోయిన నష్టాన్ని ఆழ్వార్లు దేవకీదేవి శ్రీకృష్ణుని కుమారునిగా పొందినా, అతని బాల్యలీలలను అనుభవించలేక కోల్పోయిన ఆమె సూక్తుతో **"ఆలైనీళ్ కఱుమ్బు"** అనే ఏడవ దశకంలో పలికారు. తరువాతి దశకం అయిన **"మన్ను పుకழ்"** అని ప్రారంభం అయే ఎనిమిదవ తిరుమొழிలో (దశకంలో) కౌసల్యాదేవిగా తమను భావిస్తూ, ఆమె తాలాట్టును పాడి పొందిన ఆనందాన్ని తాము అనుభవించారు. ఆ తరువాత గల **"వన్ తాళినై"** అని

మొదలైన తొమ్మిదవ దశకంలో శ్రీరాముని బాల్యలీలలను అన్నిటినీ అనుభవించి, అతడు యౌవనాన్ని, పొందిన తర్వాత అతని అరుదైన లీలలను దర్శించలేక ఆ ఆనందాన్ని కోల్పోయిన దశరథచక్రవర్తివలె తమకు భగవానునితో సంబంధం ఉన్నది కనుక, ఆ చక్రవర్తిగా తనను భావిస్తూ, అతడు విలపించే మాటలతో తమ నష్టాన్నిగూర్చి పలికారు. చివరిది అయిన ఈ పదవ దశకంలో గత దశకాలో కల్గిన క్లేశం అంతా తీరేటట్లుగా, ఆ శ్రీరాముడు అర్చారూపంలో నిత్యం వేంచేసి ఉండే **"తిరుచ్చిత్తిర కూడమ్"** అనే దివ్యదేశంలో శ్రీరాముని అవతారంనుండి ప్రారంభించి, అతడు శ్రీవైకుంఠానికి చేరేవరకు జరిగిన అవతారలీలలను, శ్రీవాల్మీకి భగవానుడు శ్రీరామునికాలంలో శ్రీరామాయణంలో పల్కి ఆనందించినట్లే, తమ జ్ఞానవైశద్యంతో పల్కి ఆనందిస్తున్నారు.



**అఙ్గణెడు మతిళ్ పుదై శూழ் అయోత్తి యెన్నుమ్**
**అణినకరత్తులకనైత్తుమ్ విళఙ్గుఞ్జోతి,**
**వెఙ్గతిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కాయ్ త్తోన్ఱి**
**విణ్ ముழுతుమ్ ఉయ్యక్కొణ్డ వీరన్దన్నై,**
**చ్చెఙ్గణెడుమ్ కరుముకిలై ఇరామన్దన్నై**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిర కూడన్దన్నుళ్,**
**ఎఙ్గళ్ తనిముతల్వనై ఎమ్బెరుమాన్దన్నై**
**ఎన్ఱుకొలో కణ్ కుళిర క్కాణునాళే** **1**

అమ్ కణ్ = అందమైన ప్రదేశాలను కల్గినది, నెడు మదిళ్ = ఎత్తైన కోటలచే, పుదై శూழ்= చుట్టు పరివేష్ఠింపబడినది, అయోత్తి ఎన్నుమ్ =అయోధ్య అనే ప్రసిద్ధిని పొందినది అయిన, అణి నకరత్తు = అందమైన నగరంఅలో, ఉలకు అనైత్తుమ్ = లోకాలను అన్నిటిని, విళఙ్గుమ్ శోతి = ప్రకాశింపజేసే పరంజ్యోతి అయిన నారాయణుడు, వెమ్ కతిరోన్ కులత్తుక్కు = సూర్యవంశానికి, ఓర్ విళక్కు ఆయ్ తోన్ఱి = సాటిలేని ఒక దీపంగా వచ్చి అవతరించి, విణ్ ముழுదుమ్ = నిత్యసూరులందఱిని, ఉయ్యక్కొణ్డ = (దుఃఖం తీర్చి) ఉజ్జీవింపచేసిన, వీరన్ తన్నై = మహావీరుని, శెమ్ కణ్ = ఎఱ్ఱని నేత్రాలను కల, నెడు కరు ముకిలై = గొప్ప కాలమేఘాలతో పోలిన రూపాన్ని కలవాడు, ఇరామన్‌తన్నై = అందఱినీ రూపసౌందర్యంతో, నేత్రసౌందర్యంతో ఆనందింపజేసినవాడు, తిల్లై నకర్ తిరు చ్చిత్తిరకూడమ్‌తన్నుళ్ = తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండే, ఎఙ్గళ్ తని ముదల్‌వనై = మా సాటిలేని జగత్కారణభూతుడు, ఎమ్బెరుమాన్‌తన్నై= మాకు నాయకుడు అయిన సర్వేశ్వరుని, కణ్ కుళిర కాణుమ్ నాళ్ = నేత్రాలు తృప్తితో దర్శించగలిగేవాడు, ఎన్ఱుకొలో = ఏనాడో?

అవ :- ముతఱ్పాట్టు. దేవర్‌కళెల్లారుమ్ కృతార్థరామ్బడి వన్దు తిరువవతారమ్ పణ్ణినపడి శొల్లుకిఱతు.

వ్యా :- (అఙ్గణిత్యాది) భోగ్య - భోగోపకరణ- భోగస్థానఙ్గళైయుడైత్తాయ్, అకాశావ కాశమెల్లామ్ తానే యామ్బడి నిమిర్న్ద మతిళాలే శూழప్పట్ట అయోధ్యై. "అయోధ్యై" ఎన్నుమ్, "అపరాజితై" ఎన్నుమ్ శొల్లప్పడుకిఱ పరమపదమ్బోలే శత్రుక్కళుక్కు క్కణిశిక్క ఒణ్ణాత ఊర్. (ఎన్నుమ్) పరమపదమ్బోలే శిలర్ అఱిన్దు, శిలరఱియాతిరుక్కైయన్ఱిక్కే సర్వలోక ప్రసిద్ధమాయిరుక్కై. (అణి నకరమ్) అలఙ్కారఙ్గళాల్ కుఱైవఱ్ఱ ఊరెన్నుతల్; లీలావిభూతిక్కు ఆభరణమాన ఊరెన్నుతల్. (ఉలకనైత్తుమ్ విళఙ్గుఞ్జోతి) సర్వలోకఙ్గళై యుమ్ తన్ తేజస్సాలే, "నారాయణః పరో జ్యోతిః ఎన్గిఱపడియే - పరం జ్యోతిస్సా యుళ్ళతు.

(వెఙ్గతిరోనిత్యాది) జగత్తిన్ అన్ధకార మెల్లామ్ నీక్కక్కడవ ఆదిత్యన్‌వంశత్తిలే అవనైప్పోలే ఇరవు కలశాతే అద్వితీయమాన తేజస్సాయ్ వన్దుతిత్తు. (విణ్ ముழుతు ముయ్యక్కొణ్డ వీరన్ఱన్నై). తన్ వీర్యగుణత్తాలే దేవజాతియైయుడైయ ఉజ్జీవిప్పిత్తవనై. (శెఙ్గణెడుఙ్గరు ముకిలై) దేవజాతియే యన్ఱిక్కే జగత్తైయడైయ ఉజ్జీవిక్కుమ్బడియాక, కడలిల్ మణలే శేషమాక ప్పరుకిన కాళమేఘత్తినుడైయ వడివైయుమ్, సర్వేశ్వరత్వలక్షణమాన పుణ్డరీకాక్ష త్వత్తైయు ముడైయవనై (ఇరామన్ఱన్నై) వడివழకాలుమ్, కణ్ణழకాలుమ్, అభిరామతై యాలుమ్ అనుకూలప్రతికూల విభాగమిన్ఱియే తోఱ్పిక్కుమవనై. కీழిల్, "వీరన్" ఎన్గిఱతై ఇఙ్గుమ్ అన్వయిక్కక్కడవతు. "సత్యేన" ఇత్యాదివత్.

(తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్) అవ్వవతారత్తిల్ సమకాలత్తిల్ అనుభవిక్కప్పెఱాత ఇழవు తీర, పిఱ్పట్టకాలత్తిల్ ఉళ్ళార్‌క్కుమ్ ఉతవలామ్బడి సన్నిహితనానవనై. (ఎఙ్గళ్ తని ముతల్వనై) అక్కాలత్తిల్ అనుభవిక్కప్పెఱాత ఎఙ్గళై ఉజ్జీవిప్పిక్కైక్కు ఒప్పిల్లాత కారణభూతనానవనై. (ఎమ్బెరుమాన్ఱన్నై) వకుత్త శేషియానవనై. (ఎన్ఱుకొలో కణ్ కుళిర క్కాణునాళే) ఇన్ద రాజ్యధురన్ధరతైయిలే అకప్పట్టిరుక్కిఱ నాన్ ఎన్ఱో? అవనై క్కాణప్పెఱాతే విడాయ్‌త్త కణ్గళానవై కణ్డు విడాయ్ తీర్‌న్దు కణ్ పడైత్త ప్రయోజనమ్ పెఱలావతు ఎన్ఱో? ఎన్గిఱార్. "ఎన్ఱుకొలో" ఎన్ఱతు-కాలత్తుక్కు ఒరు అవధి పెఱ్ఱానాకిల్ ఇన్ఱు కణ్డతోడొక్కుమ్ కిడీర్.

*అరు :- ముతఱ్పాట్టు. (అఙ్గణిత్యాది). "తోఱ్పిక్కుమ్" ఎన్గైక్కు శబ్ద మేతు? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్ (కీழిలిత్యాది). రామనాన వీరన్ఱన్నై ఎన్ఱాయ్ - వడివழకాలే జయిత్తా రెన్గిఱతు. రూపగుణత్తాలే జయిక్కప్పోమో? ఎన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ (సత్యే నిత్యాదివత్) ఎన్ఱు.*

*(అవధి పెఱ్గ్రారాకిల్) ఎన్గతు-పెఱుక్కదవ నాళ్ ఇన్న నాళెన్గు అవధియిడ ప్పెఱ్గ్రారాకిల్-ఎన్గపడి.*

**భావదీపిక :- అవ :-** ఇంద్రాదిదేవతలు అందఱి దుఃఖాలను తీర్చి ఆనందించి, ఉజ్జీవించేటట్లుగా భగవానుడు శ్రీరామునిగా అవతరించడాన్నిగూర్చి ఈ పాశురంలో పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (అజ్గణ్ నెదు మదిళ్ పుదై శూழ் అయోత్తి)** - భోగ్యాలుగా చెప్పబడే తీయని విషయాలు వాటిని అనుభవించే సాధనాలైన భోగోపకరణాలు, వాటిని అనుభవించే స్థానాలు అయిన భోగస్థానాలు- అనే వాటిని కల్గినదై, ఆకాశంవరకు ఉన్నతంగా ఉండే ఎత్తైన కోటలచే పరివేష్ఠింపబడ్డ అయోధ్య. **"దేవానాం పూ రయోధ్యా"** (తైత్తి-ఆర) (నిత్యసూరులదేశం అయోధ్య అనే పేరును కల్గినది), **"పురీం హిరణ్మయీం బ్రహ్మే వివేశాపరాజితామ్"** (తైత్తి- ఆర) (హిరణ్మయమైనది, అపరాజిత అనే పేరును కల్గినది అయిన నగరాన్ని పరబ్రహ్మ ప్రవేశించాడు) అని వేదంలో చెప్పబడే పరమపదంవలె శత్రువులు ఏమాత్రం చేయి పెట్టలేని ఊరు.

**(ఎన్నుమ్)** పరమపదంవలె జ్ఞానాన్ని కల కొందఱు మాత్రమే తెలియగల్గి, మిగిలినవారు తెలియలేకుండా ఉండే ఊరువలెకాకుండా, అన్ని లోకాలలో ఉండేవారు తెలిసిన, ప్రసిద్ధమైన ఊరు.

**(అణి నకరత్తు)** - అందమైన ఊరు అని కాని, అలంకారాలచేత లోటు లేని ఊరు అని కాని చెప్పవచ్చు.

**(ఉలకు అనైత్తుమ్ విళఙ్గుమ్ శోతి)**- అన్ని లోకాలను తన కాంతితో ప్రకాశింపజేసేదై, అక్కడ అవతరించిన **"నారాయణం పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః"** (తైత్తి-నారా-11) (పరంబ్రహ్మ అనబడేవాడు నారాయణుడే; పరంజ్యోతికూడా నారాయణుడే; పరమాత్మకూడా నారాయణుడే) అని కీర్తింపబడే భగవానునివలె గొప్పజ్యోతిస్సును కల్గినదై ఉన్నది.

**(వెఙ్కతిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కాయ్ త్తోన్రి)** - లోకంలో ఉండే చీకటి అంతటిని పోగొట్టగల సూర్యునివంశంలో, రాత్రి-పగలు వచ్చే ఆ సూర్యునివలె కాకుండా, సాటి లేని జ్యోతిగా వచ్చి అవతరించి.

**(విణ్ ముழுతుమ్ ఉయ్యక్కొణ్డ వీరన్తన్నై)** - తన వీర్యంతో ఇంద్రుడు మొదలైన దేవతలు అందఱిని దుఃఖాన్ని తీర్చి, ఆనందింపజేసే అద్వితీయవీరుడు.

**(శెజ్గణెడుజ్కరుముకిలై)** - దేవతలనుమాత్రం కాకుండా లోకాలను అన్నిటినీ కాపాడడంకోసం, సముద్రంలోని నీటిని అంతటినీ తాగిన కాలమేఘంవంటి తిరుమేనిని, ఇతడే సర్వేశ్వరుడు అనే విషయాన్ని తెలిపే తామరపూవువంటి నేత్రాల జంట కలవానిని.

**(ఇరామన్‌తన్నై)** - తన రూపసౌందర్యంతో, నేత్రసౌందర్యంతో అందఱినీ రక్షించే గుణసౌందర్యంతో, ప్రేమను కలవారు, (భక్తులు), శత్రువులు అనే తారతమ్యం ఏమీలేకుండా అందఱినీ తనకు పరాజితలయేటట్లు చేసేవానిని. "గుణసౌందర్యం" అన్నది **"వీరన్‌తన్నై"** అనేచోట చెప్పబడ్డ అద్వితీయవీరుడై ఉండే స్వభావం మొదలైన గుణాలను తెలుపుతుంది. **"సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః, గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్"** (రామా- అయో-12-29) (వీరుడైన శ్రీరాముడు సత్యాన్ని పల్కడంద్వారా లోకాలను వశం చేసికొంటాడు. దరిద్రులను దానం ద్వారా జయిస్తాడు. ఆచార్యులను శుశ్రూషతో జయిస్తాడు. శత్రువులను వింటితో యుద్ధంలో జయిస్తాడు.) అని శ్రీరామాయణంలోకూడా చెప్పబడింది కదా !

**(తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్తన్నుళ్)** - శ్రీరామావతారకాలంలో అనుభవించలేని కొఱత తీరేటట్లుగా, తర్వాత కాలంలో ఉన్నవారు అనుభవించేటట్లుగా తిరుచ్చిత్తిర కూడమ్‌లో వేంచేసి ఉన్నవానిని.

**(ఎజ్గళ్ తనిముదల్వనై)** ఆ కాలంలో ఉండి అనుభవించలేని మమ్ములను అనుభవింపజేయడానికి సాటి లేని కారణంగా ఉన్నవానిని.

**(ఎమ్బెరుమాన్ తన్నై)** - మాకు సహజస్వామియై ఉన్నవానిని.

**(ఎన్ఱుకొలో కణ్ కుళిర క్కాణుమ్ నాళే)** - "ఈరాజ్యపాలనాభారంలో చిక్కుకొన్న నేను అపుడు అతనిని దర్శించలేక క్లేశపడిన కన్నులు, దర్శించి ఆ క్లేశం తీరి, కన్నులున్నదానికి తగిన ప్రయోజనాన్ని పొందదం ఎపుడో? అని అంటున్నారు. **"ఎన్ఱుకొలో"** అని అనడంద్వారా, "ఈ కాలంలో నీవు దర్శనమిస్తావు" అని ఒక దినాన్ని నిర్దేశిస్తే, అది ఈనాడు దర్శించినదానితో సమానం అనే అర్థం స్ఫురిస్తున్నది.

**వన్దెతిర్న్ద తాడకైతన్ ఉరత్తై క్కీఱి**
**వరు కురుతి పొழி తర ఉన్‌కణై యొన్ఱేవి,**
**మన్దిరజ్గొళ్ మఱైమునివన్ వేళ్వి కాత్తు**
**వల్లరక్కర్ ఉయిరుణ్డ మైన్దన్ కాణ్మిన్,**
**శెన్దళిర్ వాయ్ మలర్ నకై శేర్ శెழுన్దణ్ శోలై**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**

**అన్దణర్కళ్ ఒరు మూవాయిరవర్ ఏత్త**
**అణిమణియాశనత్తిరున్ద అమ్మాన్తానే** **2**

వన్దు ఎదిర్న్ద = కోపించి వచ్చి ఎదిరించిన, తాటకైతన్ = తాటకయొక్క, ఉరత్తై క్కీఱి = వక్షస్సును చీల్చి, వరు కురుతి పొఙ్గొతర = రక్తం (ప్రవాహంవలెల) వెలువడి ప్రవహించేటట్లుగా, వల్ కణై ఒన్దు ఏవి = బలిమిలో సాటి లేని ఒక బాణాన్ని విడచి, మన్దిరమ్ కొళ్ మఱై మునివన్ = అన్ని మంత్రాలను తమలో కల్గినవారు, వేదాలను తెలిసినవారు అయిన విశ్వామిత్రమునియొక్క, వేళ్వి కాత్తు = యుగాన్ని రక్షించి, వల్ అరక్కర్ = (యాగానికి ఆటంకం కల్గించిన) బలమైన మారీచ సుబాహులనే రాక్షసుల, ఉయిర్ ఉణ్డ = ప్రాణాలను గ్రసించిన, మైన్దన్ = కుఱ్ఱవాడు, శెమ్ తళిర్ వాయ్ = ఎఱ్ఱని చిగురుమధ్యలో, నల్ మలర్ శేర్ = వికసించిన పూలను కల్గినది, శెఙ్గు తణ్ శోలై = అందమైన, చల్లని తోటలను కల్గినదైన, తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడమ్ తన్నుళ్= తిల్లైనగరంలో ఉండే తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండేవాడు, అన్దణర్కళ్ ఒరు మూవాయిరవర్ ఏత్త = అనన్యప్రయోజనులైన మూడు వేలమంది శ్రీవైష్ణవులు స్తుతించగా, అణి మణి ఆశనత్తు ఇరున్ద = సాటి లేని రత్నాలు పొదగబడ్డ సింహాసనంలో వేంచేసి ఉండే, అమ్మాన్‌తానే = సర్వేశ్వరుడే కదా, కాణ్మిన్ = తెలిసికోండి.

**అవ :- ఇరణ్డామ్పాట్టు. (వన్దెతిర్న్దు) రాక్షసవధత్తుక్కెల్లామ్ అడియాకవుమ్, ఋషి యుడైయ అభిమతమ్ తలైక్కట్టుకైక్కుమ్ తాటకాతాటకేయరై నిరసిత్తపడి శొల్లుకిఱతు.**

**వ్యా :- (వన్దెతిర్న్ద) తాన్ మికైత్తు వన్దు మేలిట్ట తాటకై. నికృతిక్కొప్పిల్లాతవళ్. "తన్నికర్ ఒన్డు ఇల్లాత"తాటకైయితే. (తన్నురత్తై క్కీఱి) పెరుమాళ్‌పక్కల్ పొల్లాఙ్గు నినైత్త నెఞ్జై మలై పిళన్దాప్పోలే పిళన్దు. (వరు కురుతి పొఙ్గొతర) శెమ్పాట్టుత్తరైయిలే మలైయరువికళ్ విழున్దాప్పోలే రుధిరమ్ వన్దు కొఙ్గిక్క. (వన్ కణై ఒన్డేవి) వలిక్కు ఒప్పిలాత తిరుచ్చరత్తై నడత్తి. (మన్దిరఙ్గొళ్ మఱై మునివన్) ఋషి తుణుక్కు త్తుణక్కెన్నాతపడి, నిర్భయనాయ్ త్తన్నుడైయ అనుష్ఠానఙ్గళెల్లామ్ అడైవే అనుష్ఠిత్తు యాగత్తై త్తలెక్కట్టుమ్పడి పణ్ణి. (వల్లరక్కరుయిరుణ్ణ) యజ్ఞవిఘ్నకరరాన మారీచసుబాహుక్కళై ముడిత్త పిళ్ళైత్తనత్తై యుడైయవనై. మారీచన్ పట్టానో? ఎన్నిల్, పిన్నై ఇరున్ద ఇరుప్పు మృతప్రాయ మెన్డు కరుత్తు.**

**(శెన్దళిర్ వాయ్ మలర్ నకై శేర్) శివన్ద తళిర్కళ్ నడువే వికసియానిన్డుళ్ళ పుష్పఙ్గళై యుడైత్తాయ్, దర్శనీయముమాయ్, శ్రమహారముమాన శోలైయాలే అలఙ్కృతమాన ఊరిలే. (అన్దణర్కళొరుమూవాయిరవర్) అనన్యప్రయోజనరాన బ్రాహ్మణర్ మూవాయిర మ్బేర్. (ఏత్త) తిరణ్డు మఙ్గళాశాసనమ్ పణ్ణ. (అణి మణి యాశనత్తిరున్ద) "కోప్పుడైయ**

**శీరియ శిఙ్గాశనమ్" ఎన్నుమ్పడియే మహార్ఘఙ్గళాన రత్నఙ్గళై యుడైత్తాన సింహాసనత్తిలే తన్ మేన్మై తోన్ఱ్ఱ ఇరున్ద సర్వేశ్వరన్ కిడీర్- ఎన్గిఱార్.**

*అరు :- ఇరణ్డామ్పాట్టు. (వన్దెర్న్దవిత్యాది). (నికృతి) సన్నివేశమ్ తోన్ఱ్ఱరవు ఎన్గపడి. (శెమ్పాట్టుత్తరరై)- శెమ్మణ్తరై.*

**భావదీపిక :- అవ :-** రాక్షసులను సమూలంగా నాశనం చేయడంకోసం, విశ్వామిత్ర మహర్షియొక్క మనోరథం నెరవేర్చడం కోసం, తాటకను, ఆమె పుత్రులైన మారీచ, సుబాహులను సంహరించడాన్నిగూర్చి ఆళ్వార్లు ఈపాశురంలో పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (వన్దెదిర్న్ద తాటకై)** - రామలక్ష్మణులు విశ్వామిత్రునితో యాగసంరక్షణార్థం వెళ్ళేటపుదు స్వయంగా ఎదిర్చివచ్చిపోరాడిన తాటకను **"తన్నికర్ ఒన్ఱిల్లాత తాటకై"** (పెరియ తిరుమడల్) అని తిరుమఙ్గైయాళ్వార్ అనుగ్రహించిన రీతిలో వంచనలో, కాఠిన్యంలో సాటి లేనిది అయినందువల్ల తానే ఎదిర్చి వచ్చి పోరాడింది.

**(తన్ ఉరత్తై క్కీఱి)** శ్రీరామచంద్రునకు హాని తలపెట్టిన ఆమె గుండెలను పర్వతాన్ని బద్దలు చేసినట్లు బ్రద్దలు చేసి.

**(వరు కురుతి పొళ్ళితర)** ఎఱ్ఱనిమట్టి నేలపై కొండవాగు పడినట్లుగా ఆమె రక్తం పెల్లుబికి పరుగెత్తగా.

**(వన్ కణై యొన్ఱు ఏవి)** - సాటి లేని బలాన్ని కల్గిన బాణాన్ని ప్రయోగించి

**(మన్దిరఙ్గళ్ మఱై మునివన్ వేళ్వి కాత్తు)** - మంత్రాలను వశం చేసికొన్నవాడు, వేదాన్ని తెలిసినవాడు అయిన విశ్వామిత్రమహర్షి యాగం చేసేటపుడు అంతా, ఆ ముని నిర్వహించే యాగం నిష్ఫలం అయేటట్లుగా ఈమె, ఈమె పుత్రులు దానిని పాడుచేస్తూ వచ్చారు. యాగాన్ని చేసేటపుడు కోపానికి వశులు కాకూడదు కనుక ముని వారిని శపించలేకపోయాడు. అందువల్ల యాగం చేసే సమయంలో అంతా వీరు వస్తారో! ఏమో! అని భయపడుతూనే ముని చేస్తూ వచ్చాడు. ఆ విధంగా భయపడకుండా ఉండేటట్లుగా వారి యాగాలను అన్నిటినీ సక్రమంగా అనుష్ఠింపబడి, నెఱవేరేటట్లుగా చేసి.

**(వేళ్వి కాత్తు వల్లరక్కర్ ఉయిరుణ్డ మైన్దన్ కాణ్మిన్)** - యాగానికి ఆటంకం చేస్తూ వచ్చిన మారీచుని, సుబాహుని, చిన్న కుఱ్ఱవాడుగా ఉన్నపుడే సంహరించినవాడు. మారీచుడు అపుడు చావలేదుకదా! అంటే, అతడు ప్రాణాలతో నిలచి ఉన్నా, **'ర'** అనే శ్రీరాముని నామంలో గల మొదటి అక్షరంతో ప్రారంభం అయేమాటలను విన్నపుడు అంతా పడరాని పాట్లను పడినవాడు కనుక, అతడు జీవించి ఉన్నా లేనివాడే అయ్యాడు.

గాయత్రీ మంత్రద్రష్టకనుక విశ్వామిత్రుని **"మన్దిరజ్కొళ్ మత్తై మునివన్"** అని ఆళ్వార్లు అన్నారు.

**(శెన్దళిర్ వాయ్ మలర్ నకై శేర్ శెళ్లునన్దణ్ శోలై త్తిల్లై త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్)** – ఎఱ్ఱని చిగుళ్ళమధ్యలో వికసించిన పూలను కల్గినదై, అందమైనదై, దర్శించిన వారి శ్రమను తీర్చగల్గిన తోటలచే అలంకరింపబడ్డ ఈ దివ్యదేశంలో.

**(అన్దణర్కళ్ ఒరు మూ ఆయిరవర్)** – భగవత్కైంకర్యం తప్ప వేఱు ప్రయోజనాన్ని ఆశించని **"తిల్లై మూవాయిరవర్"** అని అనబడే బ్రాహ్మణులు– అని భావం. దీనివల్ల ఆళ్వార్ల కాలంలో **"తిల్లై మూవాయిరవర్"** భగవత్కైంకర్యపరులు గానే వేంచేసి ఉన్నారని తెలుస్తున్నది. తరువాతి కాలంలోవారు క్రిమికంఠచోళునిచే శైవులుగా మార్చబడ్డారు– అనేది ఇతిహాసం తెలిపే యథార్థం. ప్రాచీనమైన గోవిందరాజప్పెరుమాళ్ కోయిల్ శైవులచేత ఆక్రమింపబడ్డ ఈ కాలంలోను భగవానుడు కాలును చాచుకొని పరుండి ఉండడం, నటరాజు అధఃస్థానంలో ఉండి నాట్యమాడి భగవానుని ఆనందింపజేయడం గమనించదగినవి.

**(ఏత్తే)** ఒకటిగా కలిసి పల్లాణ్డు పాడగా.

**(అణిమణి యాశనత్తిరున్ద అమ్మాన్‌తానే)** – **"కోప్పుడైయ శీరియ శిజ్గాశనత్తు ఇరున్దు"** (తిరుప్పావై–23) అనే రీతిలో చాలా గొప్ప రత్నాలు పొదగబడ్డ సింహాసనంలో తన పరత్వం స్ఫురించగా వేంచేసిఉండే సర్వేశ్వరుడే కదా !– అని అంటున్నారు.

**శెవ్వరి నల్ కరు నెడుజ్గణ్ శీతైక్కాకి**
**చ్చినవిడైయోన్ శిలై యిఱుత్తు మళ్లువాళేన్ది,**
**వెవ్వరి నచ్చిలై వాజ్గి వెన్ఱి కొణ్డు**
**వేల్‌వేన్దర్ పకై తడిన్ద వీరన్తన్నై,**
**తెవ్వరఞ్జ నెడుమ్పురిశై ఉయర్న్ద పాజ్గర్**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఎవ్వరి వెఞ్జిలై త్తడక్కై ఇరామన్తన్నై**
**ఇఱైఞ్జువార్ ఇణై యడియే ఇఱైఞ్జినేనే** 3

శెవ్వరి = ఎఱ్ఱని రేఖలను కల్గిన, నల్ = అందమైన, కరు =నల్లని, నెడు = దీర్ఘమైన, కణ్ = నేత్రాలను కల, శీతైక్కు ఆకి = సీతాదేవిని పరిణయం చేసికోవడంకోసం, శినమ్ విడైయోన్ = కోపాన్ని కల, వృషభవాహనుడైన శివుని, శిలై ఇఱుత్తు = వింటిని భగ్నం చేసి (మిథిలనుండి వచ్చేదారిలో) మళ్లు వాళ్ ఏన్ది = పరశువు (గండ్రగొడ్డలి)

అనే ఆయుధాన్ని కల పరశురాముని, వెవ్వరి నల్ శిలై = భయంకరమైన, సుందరమైన, గొప్ప వింటిని, వాజ్గి = వంచి (గ్రహించి), వెన్టికొణ్డు = (అతనిని) జయించి, వేల్ వేన్దర్ పకై తడిన్ద = మర్యాదను పాలించే ప్రభువుల విరోధిని పోగొట్టిన, వీరన్ తన్నై = వీర్యాన్ని కలవాడై, తెవ్వర్ అఞ్జ = శత్రువులు భయపడేటట్లున్న, నెడు పురిశై = గొప్ప కోటను, ఉయర్న్ద పాజ్గర్ = ఉన్నతాలైన అంతస్థులను కల, తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడమ్ తన్నుళ్ = తిల్లై తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండే, ఎవ్వరి వెమ్ శిలై తడ కై ఇరామన్ తన్నై = ఇతరులచే ప్రయోగించడానికి అరుదైన, భయంకరమైన వింటిని ఎత్తిన గొప్ప బాహువులను కలవాడైన శ్రీరాముని, ఇఱైఞ్జువార్ = స్తుతించే భక్తుల, ఇణై అడియే = శ్రీపాదద్వంద్వాన్నే, ఇఱైఞ్జినేన్ = నమస్కరిస్తాను.

**అవ :- మూన్ఱామ్పాట్టు. (శెవ్వరి నల్) పిరాట్టియోట్టై క్కలవిక్కు విరోధియై ప్పోక్కినపడి శొల్లుకిఱతు.**

**వ్యా :- (శెవ్వరి యిత్యాది) "అసితేక్షణా" ఎన్గిఱపడియే కణ్ణழకిలే తోఱ్ఱు, శినత్తైయుడైయ ఋషభత్తై త్తనక్కు వాహనమాకవుడైయ రుద్రనుడైయ విల్లాయ్, ఒరువరాల్ కిట్టవొణ్ణాతే ఇరుక్కిఱ విల్లై అనాయాసేన ముఱిత్తు, అచ్చెయలిలే తోఱ్ఱ పిరాట్టియై త్తిరుమణమ్ పుణర్ న్దైழున్దరుళానిఱ్క, వழియిలే వన్దు తోఱ్ఱిన, తన్ క్రౌర్యత్తుక్కు త్తక్క మழు వాకిఱ ఆయుధత్తైయుడైయ శ్రీపరశురామாழ్వానుడైయ, వెమ్మైయై యుడైత్తాయ్ దర్శనీయమానవిల్లై వాజ్గి, అవనై వెన్టు, తాన్ తిరువవతారమ్పణ్ణిన క్షత్రియకులత్తుక్కు ప్పకై తీర్న్ద వీరత్తై యుడైయవనై.**

**(తెవ్వరఞ్జ నెడుమ్ పురిశై యిత్యాది) శత్రుక్కళ్ అఞ్జుమ్పడియాన ఉయర్న్ద మతిళైయుమ్, అట్టాలైకళైయుముడైత్తాన ఊరిలే వర్తిక్కిఱ. (ఎవ్వరి యిత్యాది) "అవష్టభ్య మహద్ధనుః" ఎన్టు - వేఱొరుత్తరాల్ అడక్కియాళవొణ్ణాతే, కాణవే ప్రతిపక్షమ్ ముడియుమ్పడియాన శ్రీశార్ఙ్గత్తైయుడైయ చక్రవర్తిత్తిరుమకనై. (ఇఱైఞ్జువారిణైయడియే) చక్రవర్త్తిత్తిరుమకనుడైయ వీరత్తుక్కుమ్, అழకుక్కుమ్ తోఱ్ఱియిరుక్కుమ్ శ్రీవైష్ణవర్ కళుక్కు త్తోఱ్ఱి అవర్కళ్ తిరువడికళిలే. (ఇఱైఞ్జినేనే) శ్రీభరతాழ్వాన్ గుణజ్గళుక్కు త్తోఱ్ఱిన శ్రీశత్రఘ్నாழ్వానైప్పోలే.**

*అరు :- మూన్ఱామ్పాట్టు. (శెవ్వరి). కరువరియై యుడైయ కణ్గళ్. పురిశై - మతిళ్. అట్టాలై - దుర్గశవరణై. ఎవ్వరి - ఎయ్య వరియ శిలై.*

**భావదీపిక :- అవ :-** సీతాదేవితో కలిసి జీవించడానికి అడ్డుగా ఉండే పరశురాముని జయించి, అడ్డును పోగొట్టిన రీతినిగూర్చి ఈ పాశురంలో పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (శెవ్వరి నఱ్కరు నెడుజ్కణ్ .... పకై తడిత్త వీరన్తన్నై) - "తుల్యశీల వయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (రామా. సుంద- 16-5) ఒకేవిధం అయిన గుణాలు, వయస్సు, నడత- అనే వీటిని కల్గినది, సమానమైన కులాన్ని, లక్షణాలను కల్గినది అయిన వైదేహిని పొందడానికి రాఘవుడే తగినవాడు; నల్లని నేత్రాలను కల ఈమెకూడా అతనిని పొందడానికి తగినది) అనే రీతిలో **"మైయ కణ్ణాళ్"** (తిరువాయ్-4-5-2) అనే సీతాదేవియొక్క నల్లని నేత్రాల అందంలో అభినివేశాన్ని పొంది, కోపాన్ని కల వృషభాన్ని తనకు వాహనంగా కల రుద్రుని యొక్క ఎవరిచేత కదపడానికి వీలుకాని ఆ వింటిని అనాయాసంగా విఱిచి, ఆ లీలను దర్శించి, శ్రీరాముడు తన అభినివేశాన్ని పొందిన సీతాదేవిని పరిణయం చేసికొని, అయోధ్యకు తిరిగి వచ్చేటపుడు, దారిలో ఎదురై ఎదిరించినవాడు, తన కాఠిన్యానికి తగిన పరశువు అనే ఆయుధాన్ని కలవాడైన పరశురామునిచేత ధరింపబడినదై, ఇరవై ఒక్క మార్లు క్షత్రియులను నిర్మూలించిన కాఠిన్యాన్ని కల్గినదై, అందమైన శార్ఙ్గమనే వింటిని అతని దగ్గరనుండి గ్రహించి, అతనిని జయించి, అతని దగ్గరనుండి శ్రీవైష్ణవాంశను తానే గ్రహించి, తాను అవతరించిన రాజకులానికి శత్రువులను నిర్మూలించిన వీర్యాన్ని కలవాడు.

**(తెవ్వర్ అఞ్జు... తిరు చ్చిత్తిరకూడన్దన్నుళ్)-** శత్రువులు భయపడేటట్లుండే ఎత్తైన కోటను, కోటను రక్షించే అగడ్తలను కల దివ్యదేశంలో నివసించే.

**(ఎవ్వరి వెఞ్జిలై తడక్కై ఇరామన్ తన్నై) - "స దదర్శ తతో రామం తిష్ఠంత మపరాజితమ్, ఆలిఖంత మివాకాశ మవష్టభ్య మహద్ధనుః"** (రామా. యుద్ధ-100-12) (జయించడానికి సాధ్యం కానివాడు, ఆకాశాన్ని తాకుతూ ఉండే వింటిని బాగా పట్టుకొని నిలుచున్నవాడు అయిన శ్రీరాముని అతడు చూచాడు) అని వేఱెవ్వరివల్ల నియంత్రించి, పాలించడానికి సాధ్యం కానిదై, చూచేటపుడే శత్రువులను నశింపజేసేదైన **"శార్ఙ్గమ్"** అనబడే శ్రీవైష్ణవధనుస్సునుకల శ్రీరాముని.

**(ఇఱైఇఞ్జువార్ ఇణై యడియే)** - ఆ శ్రీరాముని అందానికి, వీర్యానికి జితులై, దాసులై ఉండే శ్రీవైష్ణవులకు జితులై, వారి శ్రీచరణాలలో.

**(ఇఱైఞ్జినేనే)** - శ్రీభరతుని గుణాలకు ఓడిన శ్రీశత్రుఘ్నునియొక్క స్థితి వంటిది తమయొక్క స్థితి- అని అంటున్నారు. **"ఎవ్వరి వెఞ్జిలై"** అనే ప్రయోగానికి ఇక ఎవరివల్ల ప్రయోగించడానికి వీలు కానిదై, కాఠిన్యాన్ని మిక్కిలిగా కల విల్లు- అని భావం.

**తొత్తలర్ పూఞ్జురికుழల్ కైకేశిశొల్లాల్**
**తొన్నకరమ్ తుఱన్దు తుఱైక్కఙ్గై తన్నై,**

పత్తియుడై క్కుకన్ కడత్త వనమ్బోయ్ ప్పుక్కు
పరతనక్కు ప్పాతుకముమ్ అరశు మీన్దు,
శిత్తిరకూడత్తు ఇరున్దాన్ఱన్నై ఇన్ఱు
తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,
ఎత్తనైయుమ్ కణ్ కుళిర క్కాణ ప్పెఱ్ఱ
ఇరునిలత్తార్క్కు ఇమైయవర్ నేరొవ్వార్ తామే. 4

తొత్తు అలర్ = గుత్తులు గుత్తులుగా పూచిన, పూ = పూలను కల, శురి కు౹ఴల్ = గుండ్రని, అందమైన కేశాలను కల, కైకేశి శొల్లాల్ = కైకేయియొక్క మాటను అనుసరించి, తొల్ నకరమ్ తుఱన్దు = ప్రాచీనమైన రాజ్యాన్ని (నగరాన్ని) విడచి, తుఱై కజ్గైతన్నై =గంగానది రేవును, పత్తి ఉడై కుకన్ కడత్త = మిక్కిలి భక్తిని కల గుహుడు దాటించగా, వనమ్ పోయ్ పుక్కు = అరణ్యాలను ప్రవేశించి, పరతనుక్కు = (చిత్రకూటంలో) భరతునకు, పాతుకముమ్ అరశుమ్ ఈన్దు = పాదుకలను, రాజ్యాన్ని ఇచ్చి, శిత్తిరైకూడత్తు ఇరున్దాన్ తన్నై = చిత్రకూటపర్వతంలో వేంచేసి ఉండే శ్రీరాముని, ఇన్ఱు = ఈకాలంలో, తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడమ్‌తన్నుళ్ = తిల్లైనగరంలోని తిరు చ్చిత్తిరకూడమ్ దివ్యదేశంలో, కణ్ కుళిర = కళ్ళు చల్లబడేటట్లు దర్శించి అనుభవించిన, ఇరు నిలత్తార్క్కు = గొప్ప (విశాలమైన) ఈ భూమిలో ఉండేవారికి, ఇమైయవర్ = నిత్యసూరులు, ఎత్తనైయుమ్ నేర్ ఒవ్వార్ = కొంచెం కూడా సాటిరారు.

**వ్యా :- నాలామ్బాట్టు. (తొత్తలర్) కొత్తుక్కొత్తాక అలరుకిఱ పూక్కళైయుడైయ, శురుణ్డు అ౹ఴకితాన కు౹ఴలైయుడైయ కైకేయి. ఇత్తాల్ - తన్నొప్పనైయాలుమ్, అ౹ఴ కాలుమ్ చక్రవర్తియై త్తానిట్ట వ౹ఴక్కామ్బడిపణ్ణి భ్రమిప్పిక్కవల్లళాన. (కైకేయిశొల్లాల్) చక్రవర్తి వాయ్ తిఱక్కమాట్టాతిరుక్క, "పిళ్ళాయ్! ఉజ్గళైయర్, ఉన్నై క్కాడేఱ ప్పోకచ్చొల్లా నిన్టార్" ఎన్ఱు కై కేయి శొన్న వార్తైయాలే. (తొన్నకరమ్ తుఱన్దు) కులక్రమాగత మాయ్ వరుకిఱ పదైవీట్టై సన్న్యసిత్తు ఇవళ్ శొన్నాళెన్ఱు పోకైక్కు ప్రాప్తి యిల్లామైయై క్కాట్టుకిఱతు. (తుఱై క్కజ్గైతన్నై) కజ్గైయిన్ తుఱైతన్నై. (పత్తియుడై క్కుకన్ కడత్త) తమ్బిమారై క్కాట్టిలుమ్ స్నేహత్తైయుడైయనాయ్, పిరియిల్ ధరియాతపడియాయ్, పెరుమాళ్ నియమిక్కైయాలే నిన్ఱవనుమాయ్, శ్రీభరతా౹ఴ్వానైయుజ్గాడ అశిర్క్కుమ్బడియాన శ్రీగుహప్పెరుమాళ్ గజ్గైయై క్కడత్త. (వనమ్బోయ్ ప్పుక్కు) మనుష్యసఞ్చారమిన్ఱియే దుష్ట మృగజ్గళేయాన కాట్టిలే పోయ్ ప్పుక్కు.**

**(పరతనుక్కు ప్పాతుకము మరశు మీన్దు శిత్తిరకూడ త్తిరున్దాన్ఱన్నై) శిత్తిరకూడత్తిలే, ఎ౹ఴున్దరుళియిరుక్కిఱ ఇరుప్పుత్తాన్ కాణప్పెఱాతే పిఱ్పట్టార్క్కు మి౹ఴవు తీర సర్వకాల**

**త్తిలుమ్ అనుభవిక్కైక్కాక త్తిరుచ్చిత్తిరకూడత్తిలే వర్తిక్కిఱవనై. (ఎత్తనైయుమ్ కణ్ కుళిర) ఇవనై క్కాణప్పెఱాతే విడాయ్త్త కణ్ కుళిరుమ్బడి. (కాణప్పెఱ్ఱ) కేట్టే పోకైయన్రిక్కే, కణ్డనుభవిక్కప్పెఱ్ఱ. (ఇరు నిలత్తార్క్కు) ఊకన్దరుళిన దేశజ్గళైయుడైయ శ్లాఘ్యమాన భూమియిలుళ్ళార్క్కు, "సదా పశ్యన్తి" పణ్ణియిరుక్కైయే స్వభావమాన నిత్యసూరికళుమ్ ఒవ్వార్. ఇజ్గు, కణ్ణుక్కు విషయమ్ పుఱమ్బే యుణ్డా యిరుక్కచ్చెయ్తే అత్తై త్యజిత్తు క్కాణ్గిఱవర్కళ్, అవర్కళ్ అతువే యాత్రైయాక ఇరుక్కిఱవర్కళితే.**

***అరు :- నాలామ్బాట్టు. (తొత్తు) - కొత్తు. తొన్మైయై ప్పఱ్ఱ అరుళిచ్చెయ్కిఱార్ (ఇవళ్ శొన్నాళెన్జిత్యాది). ఒవ్వామైక్కు ఇవర్కళుక్కు వాశి యేతు? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (ఇజ్గుక్కణ్ణు క్కిత్యాది). (కాణ్గిఱవర్కళెన్జితే ఇవర్కళెన్ను) (ఇరుక్కిఱవర్ కళితే అవర్కళెన్ను) పూరిప్పతు.***

**భావదీపిక :- అవ:-** కైకేయి మాటను విని, అయోధ్యను విడిచి, వనానికి పోయి, వెంబడించి వచ్చిన భరతునకు పాదుకలను అనుగ్రహించడాన్నిగూర్చి ఈ పాశురంలో ఆళ్వార్లు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (తొత్తలర్ పూఞ్జురికుழల్ కైకేయి)** గుత్తులు గుత్తులుగా వికసించే పూవులను కల్గినదై, ఉంగరాలుగా చుట్టుకొని, అందంగా ఉండే కేశపాశాన్ని కల కైకేయి- అని భావం. ఈ ప్రయోగంతో తన అలంకారంతోను, అందంతోను దశరథచక్రవర్తిని తన పట్ల చాలా అభినివేశాన్ని కలవానినిగా చేసి, వ్యాముగ్ధుని చేయగల్గినది - అని తెలుపబడింది.

**(కైకేయిశొల్లాల్)** - వరాన్ని ఇచ్చిన దశరథుడు మైకాన్ని (వ్యామోహాన్ని) పొంది, నోరు తెరవలేకుండా ఉన్నపుడు "కుమారా ! నీ తండ్రి నిన్ను, అరణ్యానికి పొమ్మని అన్నాడు" అని కైకేయి పల్కిన మాటచేత.

**(తొన్నకరమ్ తుఱన్దు)** - కులక్రమానుగతంగా ఇతనికి ప్రాప్తించిన అయోధ్యానగరాన్ని విడచి పెట్టి- అని భావం. కులక్రమాన్ని మీఱి, కైకేయి వరాన్ని పొందినందువల్ల, కులక్రమానుసారం ఇతనికి ప్రాప్తించిన రాజ్యాధికారాన్ని వదలిపెట్టవలసిన ఆవశ్యకత లేకపోయినా, రాజ్యసంపదను త్యాగం చేయడాన్ని తెలుపుతున్నది.

**(తుఱై క్కజ్గైతన్నై)** - అరణ్యానికి పోవడానికి ముందు దాటవలసిన గంగానది రేవును.

**(పత్తియుడై క్కుకన్ కడన్ద)** - తమ్ములకంటే శ్రీరామునిపట్ల ఎక్కువ ప్రేమను కలవాడై, శ్రీరాముని విడచి బ్రతుకలేనివాడై, శ్రీరాముని ఆజ్ఞానుసారం అతనిని వెంబడించకుండా గంగానది తీరంలోనే నిలచినవాడై, శ్రీరాముని పిలుచుకొని పోవడంకోసం వచ్చిన భరతుని

విషయంలోకూడా సందేహాన్ని పొందే రీతిలోని రామప్రేమను కలవాడైన గుహుడు గంగను తన పడవతో దాటించగా.

**(వనమ్ పోయ్ పుక్కు)** – మానవులు సంచరించనిదై, సింహాలు, పులులు మొదలైన క్రూరమృగాలు నిండిన వనంలోకి పోయి ప్రవేశించి.

**(పరతనుక్కు పాతుకముమ్ అరశు మీన్దు శిత్తిరకూడత్తు ఇరున్దాన్‌తన్నై)** – వెంబడించి వనానికి వచ్చి, శ్రీరాముని తిరిగి రాజ్యానికి పిలుచుకొని పోవాలని వచ్చిన భరతునకు తన పాదుకలను, తాను తిరిగి వచ్చే వరకు అయోధ్యాపరిపాలనను ఇచ్చి, చిత్రకూటంలో వేంచేసి ఉన్నవానిని– అని భావం. చిత్రకూటపర్వతంలో ఇతడు వేంచేసి ఉన్న స్థితిని దర్శించలేని, తరువాత కాలానికి చెందినవారికి ఆ కొఱత తీరేటట్లుగా సర్వకాలాలలో ఉండేవారు దర్శించి, ఆనందం అనుభవించడంకోసంగా తిల్లై తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉన్నవానిని.

**(ఎత్తనైయుమ్ కణ్ కుళిర)** – ఇతనిని దర్శించలేక, "దర్శించాలి" అనే ఆశను పొందిన కన్నులు చల్లబడేటట్లుగా.

**(కాణ ప్పెற்ற)** – శ్రీరామాయణకథనువలె వినడం మాత్రమే కాకుండా, నేరుగా కళ్ళార దర్శించి, అనుభవించగల్గిన.

**(ఇరు నిలత్తార్క్కు)** – భగవానుడు అభిమానించి వేంచేసి ఉండే దివ్య దేశాలను కల ఈ గొప్ప భూమండలంలో ఉండే వారికి.

**(ఇమైయవర్ నేర్ ఒవ్వార్‌తామే)** – **"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః"** (ఋగ్వేదం) (విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు సదా దర్శిస్తారు) అనేటట్లుగా ఎల్లప్పుడూ భగవానుని దర్శిస్తూ ఉండడమే స్వభావంగా కల నిత్యసూరులు సైతం సాటి రారు. ఈలోకంలో దర్శించగల విషయాలు అనేకం ఉన్నా, వాటిని విడచిపెట్టి భగవానునే దర్శించేవారైన ఈ లోకంలోనివారు ఎల్లప్పుడు భగవానుని దర్శించడమే స్వభావంగా కల నిత్యసూరులకంటే గొప్పవారే కదా !

**వలి వణక్కు వరై నెడున్దోళ్ విరాతై క్కొన్ఱు**
**వణ్డమిழ் మాముని కొడుత్త వరివిల్ వాఙ్గి,**
**క్కలై వణక్కు నోక్కరక్కి మూక్కై నీక్కి**
**క్కరనోడు తూడణన్ఱన్ ఉయిరై వాఙ్గి,**

**చ్చిలై వణక్కి మాన్ మరియ ఎయ్తాన్తన్నై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**తలై వణక్కి క్కైకూప్పి ఏత్తవల్లార్**
**తిరితలాల్ తవ ముదైత్తు త్తరణితానే 5**

వలి వణక్కు = (శత్రువుల) బలాన్ని ఓడించే రీతిలోని, వరై నెడు తోళ్ = పర్వతాలవంటి గొప్ప బాహువులను కల, విరాతై = విరాధుడనే రాక్షసుని, కొన్ఱు = సంహరించి, వణ్ తమిౖళ్ మా ముని కొడుత్త = సులభమైన ద్రావిడ భాషను సంస్కరించిన గొప్ప ముని అయిన అగస్త్యుడు ఇచ్చిన, వరి విల్ వాజ్గి = గొప్ప వింటిని పొంది, కలై వణక్కు నోక్కి అరక్కి = జింక చూపులను ఓడించే రీతిలోని చూపులను కల శూర్పణఖయొక్క, మూక్కై నీక్కి = ముక్కును ఖండించి, కరనోడు తూడణన్తన్ ఉయిరై వాజ్గి = ఖరదూషణుల ప్రాణాలను గ్రహించి, (తీసి), మాన్ మఱియ = మాయామృగంగా వచ్చిన మారీచుడు చచ్చేటట్లు, శిలై వణక్కి ఎయ్తాన్తన్నై = వింటిని వంచి, బాణాన్ని ప్రయోగించిన శ్రీరాముని, తిల్లైనగర్ తిరుచ్చిత్తిరకూడమ్తన్నుళ్ = తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో, తలై వణక్కికై కూప్పి ఏత్త వల్లార్ = శిరస్సుతో అభివాదం చేసి, అంజలిని ఘటించి, నోటితో స్తుతించగల్గినవారు, తిరితలాల్ = సంచరించినందువల్ల, తరణి = ఈ భూమి, తవమ్ ఉడైత్తు = భాగ్యాన్ని చేసినదిగా అవుతున్నది.

**వ్యా :- అఞ్జామ్బాట్టు. (వలి వణక్కు) ఎతిరికళ్ వలియై త్తోఱ్పిక్కక్కడవతాయ్, మలైపోలే తిణ్ణితాన తోళ్కళైయుముడైయ విరాధనై క్కొన్ఱు. (వణ్ తమిౖళ్ మాముని కొడుత్త వరి విల్ వాజ్గి) అగస్త్యన్ కొడుత్త దర్శనీయమాన విల్లై వాజ్గి. (కలై వణక్కు నోక్కరక్కి) కలై నోక్కై త్తోఱ్పిక్కు మ్పడియాన నోక్కత్తైయుడైయ శూర్పణఖియుడైయ మూక్కై వాజ్గి. (కరనోడు తూడణన్తనుయిరై వాజ్గి) ఇవళుడైయ రూపవైరూప్యజ్గణ్డు పొఱుక్క మాట్టాతే వన్ద ఖరదూషణర్కళై ప్రాణజ్గళై హరిత్తు.**

**(శిలై వణక్కి మాన్ మరియ వెయ్తాన్తన్నై) అతు కేట్టు ప్పొఱాత రావణనాలే ప్రేరితనాయ్ వద్ద మారీచనాన మాయామృగత్తై ఎయ్తు కొన్ఱవనై. (తిల్లైనకరిత్యాది) అక్కాలత్తిల్ కాణప్పెఱాత ఇౙవు ఎల్లామ్ తీర, తలైయుణ్డాన ప్రయోజనమ్ పెఱ వణజ్గి. కైయుణ్డాన ప్రయోజనమ్ పెఱ త్తొౙుతు, వాయుణ్డాన ప్రయోజనమ్ పెఱ ఏత్తవల్లార్ తిరితలాల్. (తవ ముదైత్తు త్తరణితానే) ఇవర్కళుడైయ సఞ్చారత్తుక్కు విషయమాకైయాలే భూమియానతు భాగ్యత్తైయుడైయతు.**

**భావదీపిక :- అవ :-** విరాధవధ, శూర్పణఖ అంగభంగం, ఖరదూషణులవధ, మారీచవధ- అనే వీనిని ఇందులో ఆళ్వార్లు అనుభవిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (వలి వణక్కు వరై నెడున్దోళ్ విరాదై క్కొన్ఱు)**- శత్రువుల బలాన్ని అడ్డగించ గల్గిన, పర్వతాలవలె (అవిచాల్యమైనవి) దృఢమైనవి అయిన బాహువులను కల విరాధుని వధించి.

**(వణ్ తమిழ் మాముని కొడుత్త వరి విల్ వాఙ్గి)** - ద్రావిడభాషను దర్శించినవారైన అగస్త్యముని ఇచ్చిన అందమైన వింటిని పొంది.

**(కలై వణక్కు నోక్కరక్కి మూక్కై నీక్కి)**- జింక చూపును జయించే రీతిలోని, అందమైన చూపును కల్గి, అందమైన రూపాన్ని ధరించి వచ్చిన శూర్పణఖయొక్క ముక్కును ఖండించి.

**(కరణోడు దూడణన్తన్ ఉయిరై వాఙ్గి)** - శూర్పణఖ ముక్కును ఖండించడాన్ని సహించలేక యుద్ధానికి వచ్చిన ఖరదూషణాల ప్రాణాలను తీసి.

**(శిలై వణక్కి మాన్ మఱియ ఎయ్తాన్తన్నై)** - ఖరదూషణుల వధను విని సహించలేని రావణునిచే ప్రేరేపింపబడి వచ్చిన మారీచుడనే మాయామృగాన్ని బాణాన్ని ప్రయోగించి వధించినవానిని.

**(తిల్లై నకర్ తిరు చ్చిత్తిరకూడన్తన్నుళ్ తలై వణక్కి క్కై కూప్పి ఏత్తవల్లార్ తిరితలాల్)**- శ్రీరామావతారకాలంలో జరిగిన ఈ సంఘటనలను అన్నిటినీ దర్శించలేని కొఱత అంతా తీరేటట్లుగా, తిల్లై త్తిరుచ్చిత్తిరకూడమ్‌లో శిరస్సు ఉన్నందుకు ప్రయోజనాన్ని పొందేటట్లుగా శిరసా అభివాదం చేసి, చేతలు పొందినందులకు ఫలం కలిగేటట్లుగా చేతులతో అంజలిని ఘటించి, జిహ్వను కల్గి ఉన్నందులకు ఫలం కలిగేటట్లుగా నోటితో స్తుతించగల్గినవారు సంచరించడంవల్ల.

**(తవ ముడైత్తు త్తరణితానే)** - వీరు సంచరించడానికి తగిన చోటుగా అయినందువల్ల ఈ భూమి గొప్ప ప్రయోజనాన్ని పొందింది.

**తన మరువు వైతేకి పిరియలుఱ్ఱు**
**త్తళర్వెయ్తి చ్చడాయువై వైకున్దత్తేఱ్ఱి,**
**వన మరువు కవియరశన్ కాతల్ కొణ్డు**
**వాలియై క్కొన్ఱు ఇలఙ్గైనకరరక్కర్ కోమాన్,**
**శిన మడఙ్గ మారుతియాల్ శుడువిత్తానై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఇనితమర్న్ద అమ్మానై ఇరామన్దన్నై**
**ఏత్తువార్ ఇణైయడియే యేత్తినేనే** 6

తనమ్ మరువు = (శ్రీరామునకు) సంపదగా వెలిగేటట్లున్న, వైతేకి పిరితల్ ఉఱ్ఱు= సీతాదేవిని విశ్లేషించి, తళర్వు ఎయ్‌తి = అందువల్ల మనస్సులో కలత చెంది, శడాయువై= (సీతాదేవి కోసం రావణునితో పోరాడిన) జటాయువును, వైకున్దత్తు ఏఱ్ఱి = పరమ పదానికి పంపి, వనమ్ మరువు = (వాలికి భయపడి) అరణ్యంలో దాగి నివసించే, కవి అరశన్ = వానరప్రభువైన సుగ్రీవునితో, కాతల్ కొణ్డు = స్నేహాన్ని పొంది, వాలియై క్కొన్డు = వాలిని సంహరించి, ఇలఙ్గై నకర్= లంకాపట్టణాన్ని, అరక్కర్ కోమాన్ శినమ్ అడఙ్గ = రాక్షసులకు అధిపతి అయిన రావణుని కోపం తీరేటట్లుగా, మారుతియాల్ శుడువిత్తానై = హనుమానుని ద్వారా జ్వలింపజేసినవాడు, తిల్లైనకర్ తిరు చ్చిత్తిర కూడమ్ తన్నుళ్ = తిల్లైనగరంలోని తిరు చ్చిత్తిరకూడమ్‌లో, ఇనితు అమర్న్ద = భోగ్యంగా వేంచేసి ఉన్న, అమ్మానై = సర్వస్వామి అయిన, ఇరామన్ తన్నై = శ్రీరాముని, ఏత్తువార్= స్తుతించేవారి, ఇణై అడియే = శ్రీచరణాల జంటనే, ఏత్తినేన్ = స్తుతించగలిగాను.

**వ్యా :– ఆఱామ్బాట్టు. (తన మరువు) తిరుములైత్తడత్తిన్ అழகాలుమ్, ఆభిజాత్య త్తాలుమ్ పిరియత్తకాత పిరాట్టి పిరివాలే పెరుమాళ్ తమ్మళవిలే నోవుపట్టు, పిరాట్టిక్కాక రావణనోడే యుద్ధమ్ పణ్ణి ప్రాణనై విట్ట పెరియవుడైయారై ప్పరమపదత్తేఱ పోక్కవిట్టు. "తన మరువు వైదేకి" ఎన్ఱు "విష్ణోః శ్రీః" ఎన్గిఱపడియే పెరుమాళుక్కు ధనమాన పిరాట్టి ఎన్ఱుమామ్. (వన మరువు కవియరశన్) వాలిక్కు అఞ్జి క్కాట్టిలే మఱైన్దు కిడక్కిఱ కురఙ్గుకళుక్కు రాజావాన సుగ్రీవనై స్నేహపూర్వకమాక క్కాట్టిక్కొణ్డు, అవర్క్కాక అతిబల పరాక్రమనాన వాలియై నిరసిత్తు. (ఇలఙ్గైనకర్) లఙ్కైక్కు నిర్వాహక నెన్ఱుమ్, రాక్షసేశ్వర నెన్ఱుమ్ మోహిత్తిరుక్కిఱవనుడైయ అభిమానముమ్ శీఱ్ఱడఙ్గుమ్బడి, తిరువడివాలిలే నెరుప్పై యిట్టు చ్చుడువిత్తవనై. (తిల్లై నకరిత్యాది) అక్కాలత్తిల్ అనుభవిక్క ప్పెఱ్ఱిలోమ్ ఎన్నుమ్ ఇழవు తీర ఇఙ్గే నిత్యసన్నిహితనాయ్ వర్తిక్కిఱ సర్వేశ్వరనాన చక్రవర్తిత్తిరుమకనై. (ఏత్తువార్) అవనుడైయ వడివழకిలుమ్, సౌలభ్యత్తిలు మీదుపట్టేత్తుమవర్కళ్ తిరువడికళై ఏత్తినేనే.**

**భావదీపిక :– అవ :–** సీతాదేవిని విశ్లేషించడం, జటాయువుకు మోక్షాన్ని ఇవ్వడం సుగ్రీవునితో సఖ్యం చేయడం, వాలిని వధించడం, లంకను దహింపజేయడం– మొదలైన లీలలనుగూర్చి ఇందులో ఆழ్వార్లు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :– (తన మరువు వైతేకి పిరియలుఱ్ఱుత్తళర్వెయ్‌తి చ్చడాయువై వైకున్దత్తేఱ్ఱి) – "తవమ్"** అంటే స్తవం అని అర్థం. స్తనతటసౌందర్యంతోను, విదేహరాజుకు పుత్రికగా జన్మించిన ఆభిజాత్యంతోను విశ్లేషించతగని సీతాదేవిని విశ్లేషించినందువల్ల శ్రీరాముని మనస్సు చాలా బాధపడి, సీతాదేవిని కాపాడడంకోసం

రావణునితో యుద్ధం చేసి ప్రాణాలను విడచిన పక్షిరాజు అయిన జటాయువును పరమపదానికి పంపి– అని భావం. ఇక, **"తనమ్"** అనే పదానికి ధనమనే అర్థాన్ని గ్రహించి, **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ, యథా సర్వగతో విష్ణు స్తథైవేయం ద్విజోత్తమ"** (వి.పు. 1-8-17) (లోకాలకు అన్నిటికి తల్లి, భగవానుని విడిచి ఉండనిది, విష్ణువుకు ధనమై ఉన్నది అయిన లక్ష్మి నిత్యమైనదే. విప్రోత్తమా! సర్వవ్యాపి అయిన విష్ణువు ఎటువంటివాడో ఈమె కూడా అటువంటిదే) అనే రీతిలో భగవానునకు సంపదగా ఉండే సీతాదేవి అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(వన మరువు కవి యరశన్ కాతల్ కొణ్డు వాలియై క్కొన్ఱు)** – వాలికి భీతిల్లి, అరణ్యంలో దాగుకొని నివసించే వానరరాజు సుగ్రీవునితో ప్రేమతో స్నేహం చేసి, ఆ సుగ్రీవుని కోసం గొప్ప బలాన్ని వీర్యాన్ని కల వానిని వధించి.

**(ఇలజ్గైనకర్ అరక్కర్ కోమాన్ శిన మడజ్గ మారుతియాల్ శుడువిత్తానై)** – లంకకు ప్రభువు అని, రాక్షసులకు ప్రభువు అని మదించి ఉండే రావణుని అహంకారం, కోపం అణగేట్లుగా హనుమానుని తోకలో ముట్టించిన అగ్నితో లంకను మండేటట్లుగా చేసినవానిని.

**(తిల్లై నకర్ తిరు చ్చిత్తిరకూడన్తన్నుళ్ ఇనితు అమర్న్ద అమ్మానై ఇరామన్ తన్నై)** – ఆ కాలంలో వీటిని (లీలలను) అన్నిటినీ అనుభవించని కొఱత తీరేటట్లుగా ఈకాలంలో తిల్లై త్తిరుచ్చిత్తిర కూడమ్‌లో నిత్యవాసాన్ని చేసే సర్వస్వామి అయిన శ్రీరాముని.

**(ఏత్తువార్ ఇణై యడియే ఏత్తినేనే)** – అతని రూపసౌందర్యంలోను, సౌలభ్యంలోను అభినివేశాన్ని పొంది స్తుతించే వారి శ్రీచరణాలను నేను స్తుతిస్తున్నాను.

**కుఱై కడలై అడలమ్బాల్ మఱుక ఎయ్‌తు**
**కులై కట్టి మఱుకరైయై అతనాలేఱి,**
**ఎరినెడువేల్ అరక్కరోడుమ్ ఇలజ్గై వేన్దన్**
**ఇన్నుయిర్ కొణ్డువన్దమ్బిక్కరశు మీన్దు,**
**తిరుమకళోడు ఇనితమర్న్ద శెల్వన్దన్నై**
**త్తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**అరశమర్న్దాన్ అడి శూడుమ్ అరశైయల్లాల్**
**అరశాక ఎణ్ణేన్ మఱ్ఱరశుతానే. 7**

కుఱై కడలై = ధ్వనించే (ఘోషించే) సముద్రాన్ని, అడల్ అమ్బాల్ = కఠినమైన బాణంతో, మఱుక ఎయ్‌తు = కలత చెందేటట్లుగా ప్రయోగించి, కులై కట్టి = అందులో

వారధిని కట్టి, అతనాల్ = ఆ వారధి మార్గంద్వారా, మఱు కరైయై ఏఱి = సముద్రంయొక్క ఆవలి తీరాన్ని చేరి, ఎరి నెడు వేల్ అరక్కరొడుమ్ = (శత్రువులను) దహించేటట్లుగా ఉన్న, దీర్ఘమైన వేలాయుధాన్ని కల రాక్షసులు, ఇలజ్గై వేన్దన్ = లంకాధిపతి అయిన రావణుడు– అనే వీరియొక్క ఇన్ ఉయిర్ కొణ్డు = భోగ్యమైన ప్రాణాలను గ్రహించి, (తీసి), అవన్ తమ్బిక్కు = ఆరావణుని తమ్ముడైన విభీషణునకు, అరశుమ్ ఈన్దు = రాజ్యాన్ని అనుగ్రహించి, తిరు మకళోదు = శ్రీదేవియొక్క అవతారం అయిన సీతాదేవితో పాటు, ఇనితు అమర్న్ద = భోగ్యంగా అమరి ఉండే, శెల్వన్తన్నై = సమస్తైశ్వర్యాలను కలవాడై, తిల్లై నకర్ తిరు చ్చిత్తిరకూడమ్ తన్నుళ్ = తిల్లై నగరంలోని తిరుచ్చిత్తిర కూడమ్‌లో, అరశు అమర్న్దాన్ = రాజ్యాన్ని చేసేవానియొక్క, అడి శూడుమ్ = శ్రీచరణాలను తలపై ధరించడం అనే, అరశు అల్లాల్ = రాజ్యాధికారాన్ని తప్ప, మఱ్ఱు అరశు = దానికంటే వేఱయిన రాజ్యాధికారాన్ని, అరశు ఆక ఎణ్ణేన్ = ఒక విషయంగా నేను లెక్కించను.

**వ్యా :– ఏఴ్రామ్బాట్టు. (కురై కడలై) ఘోషత్తైయుడైత్తాన కడలై, శత్రుక్కళైన్వాల్ ఎప్పోతో ఎన్ను మేల్ విఴుక్కడవతాన అమ్బై విట్టు మఱుకుమ్బడియాక ఎయ్‌తు. (కులై కట్టి) అజ్ఞనకడలానతు ఎన్మేలే తూర్‌త్తుక్కొళ్ళీర్ ఎన్ను, అతిన్ మేలే మలైకళై యిట్టు త్తూర్ త్తువఴిశెయ్‌తు అన్ద క్కరైయిలే పోయ్. (ఎరి నెడు వేల్) శతుక్రళై ఎరిక్కక్కడవతాయ్, నెడితాన వేలైయుడైయ రాక్షసరోడేకూడ, లఙ్కాధిపతియాన రావణనై అవనుకన్ద ప్రాణనై హరిత్తు, అవన్ తమ్బిక్కు రాజ్యత్తై క్కొడుత్తు, పిరాట్టియోడేకూడ, పిరిన్ద పిరివెల్లామ్ మఱఉక్కుమ్బడి ఇనితు అమర్న్దరుళియ ఐశ్వర్యముడైయవన్నై. (తిల్లై నకరిత్యాది) రాజ్యమ్ పణ్ణియిరుక్కిఱ తిరువడికళై చ్చూడుకైయాకిఱ రాజ్యమొఴియ అతుక్కెతిర్ త్తట్టాక స్వాతన్త్ర్యత్తై ప్పార్‌క్కుమ్ రాజ్యత్తై రాజ్యమాక ఎణ్ణేన్.**

**భావదీపిక :– అవ :–** సేతుబంధం, రావణసంహారం, విభీషణపట్టాభిషేకం– మొదలైన వానిని చేసి, సీతాదేవితో కూడి వేంచేసిన శ్రీరాముని శ్రీపాదాలను శిరస్సుపై అలంకరించు కొనే రాజ్యాధికారం తప్ప వేఱొక అధికారం నాకు అక్కఱలేదు– అని ఈ ఆఴ్వార్లు పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానం :– (కురై కడలై అమ్బాల్ మఱుక ఎయ్‌తు)** – అలల ఘోషలను కల్గిన సముద్రాన్ని, శత్రువుల పైకి వ్యాపించే, క్రూరమైన బాణాలను విడచి, వారిని కలత చెందేటట్లు చేసి.

**(కులై కట్టి మఱు కలైయై అతనాల్ ఏఱి)** – శ్రీరామశరానికి భయపడ్డ సముద్రరాజు “నాపై ఆనకట్టను కట్టి వెళ్ళండి” అని అంగీకరించగా, ఆ సముద్రంపై పర్వతాలతో వారధిని కట్టి, లంకను చేరడానికి దారిని కల్పించి, దానిద్వారా ఆవలి తీరాన్ని చేరి

**(ఎరి నెదు వేల్ అరక్కరొడుమ్ ఇలజ్ఞై వేన్దన్... ఇనితమర్న్ద శెల్వన్‌తన్నై)** – శత్రువులను దహించగలిగే, పొడుగైన వేలాయుధాన్ని కల రాక్షసులతో– అని భావం. లంకకు ప్రభువైన రావణుని, అతడు అభిమానించిన అతని ప్రాణాలను తీసి, అతని తమ్ముడైన విభీషణునకు లంకారాజ్యాధికారాన్ని ప్రసాదించి, సీతాదేవితో కూడ ఆమెను విశ్లేషించిన దుఃఖం అంతా మఱచేటట్లుగా పుష్పకవిమానంలో వేంచేసి ఉండే సంపదను కలవానిని.

**(తిల్లై నకర్ తిరు చ్చిత్తిరకూడమ్ తన్నుళ్..... మ*గ్గ్రు*రశుతానే)**–అయోధ్యకు చేరి, రాజ్యపాలనను చేసిన శ్రీరాముని శ్రీచరణాలను తాము తమ శిరస్సులపై అలంకరించు కోవడం అనే రాజ్యాధికారాన్ని తప్ప, దానికి వేఱయిన స్వాతంత్ర్యాన్ని, కల్గించే కిరీటాన్ని ధరించే రాజ్యాధికారాన్ని ఒక అధికారంగా నేను లెక్కించనే లెక్కించను.

**అమ్పొనెదు మణిమాడ అయోత్తి యెయ్‌తి**
**అరశెయ్‌తి అకత్తియన్‌వాయ్ త్తాన్ మున్ కొన్హాన్**
**తన్, పెరున్దొల్ కతై కేట్టు మితిలైచ్చెల్వి**
**ఉలకుయ్య త్తిరువయిఱు వాయ్‌త్త మక్కళ్,**
**శెమ్బవళత్తిరళ్వాయ్ తన్ శరితై కేట్టాన్**
**తిల్లై నకర్ త్తిరుచ్చిరకూడన్దన్నుళ్,**
**ఎమ్బెరుమాన్హన్ శరితై శెవియాల్ కణ్ణాల్**
**పరుకువోమ్ ఇన్నముతమ్ మతియో మన్దే** 8

అమ్ పొన్ నెదు మణి మాడమ్ = (పట్టాభిషేకంకోసం అలంకరింపబడ్డ) అందమైనవి, ఉన్నతమైనవి, రత్నాలు పొదిగినవి అయిన మిద్దెలను, మేడలను కల్గిన, అయోత్తి ఎయ్‌తి= అయోధ్యకు తిరిగి చేరి, అరశు ఎయ్‌తి = రాజ్యభారాన్ని పొంది, తాన్ మున్ కొన్హాన్ తన్ = తనచే పూర్వం వధింపబడ్డ రావణుని, పెరు తొల్ కతై = గొప్ప పూర్వవృత్తాంతాలను అన్నిటినీ, అకత్తియన్ వాయ్ కేట్టు = అగస్త్యమహర్షి చెప్పగా విని, మితిలై ఎయ్‌తి = శ్రీజనకరాజుకుమార్తె అయిన సీతాదేవి, ఉలకు ఉయ్య = లోకం అంతా ఉజ్జీవించేటట్లుగా, తిరు వయిరు వాయ్‌త్త = పొందిన, మక్కళ్ =పుత్రులు అయిన కుశలవుల, శెమ్ పవళమ్ తిరళ్ వాయ్ = గాఢమైన ఎఱ్ఱని పగడంవంటి నోటితో, తన్ శరితై = తన చరిత్ర అయిన శ్రీరామాయణాన్ని, కేట్టాన్ = ఆలకించిన, తిల్లై నకర్ తిరు చిత్తిరకూడమ్ తన్నుళ్ = తిల్లై నగరంలోని తిరు చ్చిత్తిర కూడమ్‌లో వేంచేసి ఉండే, ఎమ్బెరుమాన్‌తన్= నా స్వామియొక్క, శరితై = చరిత్రను, శెవియాల్ కణ్ణాల్ పరుకువోమ్ = చెవులతో విని, కన్నులతో దర్శించి అనుభవించగల మేము, ఇన్ అముతమ్ = భోగ్యమైన దేవతల అమృతాన్ని, ఇన్ను మతియోమ్ = ఇక ఒక పదార్థంగా గౌరవించము.

**వ్యా :- ఎట్టామ్బాట్టు. (అమ్ పొన్) తిరువభిషేకత్తుక్కీదాక అలఙ్కరిత్తు, దర్శనీయ మాయ్, ఓక్కత్తై యుడైత్తాయ్ నల్లరత్నఙ్గళాలే శమైక్కప్పట్ట మాడఙ్గళైయుడైయ తిరువయోధ్యైయాలే, జగత్తు ఎల్లామ్ ఉకక్కుమ్బడి మీణ్డెళ్హున్దరుళి ప్పుకున్దు. (అరశెయ్‌తి) "రాజ్యం పున రవాప్తవాన్" ఎన్నుమ్బడియే జగత్తెల్లామ్ వాళ్హుమ్బడి సామ్రాజ్యత్తిలే అధికరిత్తు. (అకత్తియన్) వేఱు కృత్యాంశ మిల్లామైయాలే పోతు పోక్కాక, తాన్ మున్ కొన్ఱ రావణనుడైయ పూర్వవృత్తానఙ్గళై యడైయ అగస్త్యభగవాన్ విణ్ణప్పమ్ శెయ్య క్కేట్టు.**

**(మితిలైచ్చెల్వి యిత్యాది) శ్రీజనకరాజన్తిరుమకళ్, జగత్తై అడైయ ఉజ్జీవిక్కుమ్బడి పెఱ్ఱ కుశలవర్‌కళ్ పేశ, తమ్ముడైయ వృత్తమాన శ్రీరామాయణకథైయై క్కేట్టరుళి నవనాయ్ తిరుచ్చిత్తిరకూడత్తిలే నిత్యవాసమ్ పణ్ణుకిఱ, ఎన్నుడైయ నాథనుడైయ వృత్తాన్తత్తై తిరువడియైప్పోలే సర్వేన్ద్రియఙ్గళాలుమ్ అనుభవిక్కప్పెఱ్ఱ నామ్ దేవజాతి అనుభవిక్కుఱ అమృతత్తై ఒన్హాక మతియోమ్.**

*అరు :- ఎట్టామ్బాట్టు. అగస్త్యభగవాన్ శొల్లుకిఱ ఉత్తరశ్రీరామాయణత్తిలే ఉపోద్ఘాతత్తిలే రావణవృత్తాన్తఙ్గళైయుమ్ శొన్నాన్. (శెమ్బవళ త్తిరళ్‌వాయ్) తిరణ్డ శెమ్బవళమ్‌పోలే ఇరుక్కుఱ వాయాలే తన్ శరితై కేట్టాన్- ఎన్గపడి.*

**భావదీపిక :- అవ :-** శ్రీరాముడు అయోధ్యానగరానికి తిరిగి వచ్చి పట్టాభిషేకాన్ని చేసికొని, తనచే వధింపబడ్డ రావణుని వంశచరిత్రనుగూర్చి అగస్త్యమహర్షి చెప్పగా విని, సీతాదేవి కన్న కుశలవుల మూలంగా తన చరిత్ర అయిన శ్రీరామాయణాన్ని ఆలకించినవాని ఇతిహాసాన్ని అనుభవించడం తప్ప వేఱు దేనినీ గౌరవించము- అని ఈ పాశురంలో ఆళ్వార్లు అంటున్నారు.

**వ్యాఖ్యానం :- (అమ్మాన్ నెడు మణి మాడ అయోత్తి ఎయ్‌తి)** - పట్టాభిషేకానికి తగినట్లుగా అలంకరింపబడ్డది, చాలా అందమైనది, ఉన్నతమైన రత్నాలతో పొదగబడ్డ ఎత్తైన మిద్దెలను, మేడలను కల్గినదైన అయోధ్యానగరంలో లోకం అంతా ఆనందిచేటట్లు తిరిగి వేంచేసి ప్రవేశించి.

**(అరశు ఎయ్‌తి) - "నందిగ్రామే జటాం హిత్వా భ్రాతృభి స్సహితోఽనఘః, రామః సీతా మనుప్రాప్య రాజ్యం పున రవాప్తవాన్"** (రామా.బాల. 1-89) (నందిగ్రామంలో జటలను విడచివేసి, సోదరులతోపాటు కూడినవాడై, దోషరహితుడైన శ్రీరాముడు, సీతాదేవిని పొంది రాజ్యాన్ని తిరిగి పొందాడు) అనే రీతిలో లోకం అంతా ఉజ్జీవించేటట్లుగా రాజ్యపాలనను చేసి.

**(అకత్తియన్ వాయ్ త్తాన్మున్కొన్హాన్ తన్ పెరున్తొల్ కతై కేట్టు)** – చేయవలసిన కార్యం ఏదీ లేనందువల్ల కాలక్షేపంకోసంగా, తాను పూర్వం వధించిన రావణుని వంశ చరిత్రను అంతటినీ అగస్త్యమునిద్వారా అతడు చెప్పగా విని.

**(మితిలై చ్చెల్వి.... మతియోమ్ ఒన్రే)** – శ్రీజనకరాజు పుత్రిక అయిన సీతాదేవి లోకం అంతా ఉజ్జీవించేటట్లుగా పొందిన కుశలవులు గానం చేయగా, తన చరిత్ర అయిన శ్రీరామాయణగాథను వినిన శ్రీరాముడు ఇపుడు తిల్లై తిరు చ్చిత్తిరకూడమ్‌లో నిత్యవాసం చేస్తున్నాడు. నాస్వామి అయిన అతని చరిత్రను హనుమానునివలె అన్ని ఇంద్రియాలతో అనుభవించగల్గిన మనం దేవతలు అనుభవించే అమృతాన్ని ఒక పదార్థంగా గౌరవించము.

**శెఱితవ చ్చమ్బుకన్తన్నై చ్చెన్రుకొన్రు**
**శె*ళ్ళు* మఱైయోన్ ఉయిర్ మీట్టు త్తవత్తోనీన్ద,**
**నిఱై మణిప్పూణ్ అణియుఙ్గొణ్డు ఇలవణన్తన్నై**
**త్తమ్బియాల్ వానే*ర్ర్*ి మునివన్ వేణ్డ,**
**త్తిఱల్ విళఙ్గుమ్ ఇలక్కుమనై ప్పిరిన్దాన్తన్నై**
**త్తిల్లై నకర్ త్తిరుచ్చిరకూడన్దన్నుళ్,**
**ఉఱైవానై మఱవాత ఉళ్ళన్దన్నై**
**యుడైయోమ్ మ*ర్ర్*ుఱు తుయరమ్ అడైయోమన్రే 9**

శెఱి తవమ్ = మిక్కిలి గొప్పతపస్సును కలవాడైన, శమ్బుకన్తన్నై = శంబూకుడనే శూద్రుని, శెన్రు కొన్రు = (అతడు ఉండే చోటను వెదకి) చేరి, అతని శిరస్సును ఖండించి, శె*ళ్ళు* మఱైయోన్ ఉయిర్ మీట్టు = ఉత్తముడైన బ్రాహ్మణుని కుమారుల ప్రాణాలను తిరిగి తీసికొని వచ్చి, తవత్తోన్ ఈన్ద = అగస్త్యభగవానుడిచ్చిన, నిఱై మణి పూణ్ అణియుమ్ కొణ్డు = గొప్ప వెలను కల్గిన రత్నాలచే పొదగబడ్డ హారాన్ని అలంకరించుకొని, ఇలవణన్ తన్నై = లవణాసురుని, తమ్బియాల్ = తమ్ముడైన శత్రుఘ్నునిద్వారా, వాన్ ఏ*ర్ర్*ి = వీరస్వర్గానికి పంపించి, మునివన్ వేణ్డ = దుర్వాసముని శాపంవల్ల, తిఱల్ విఙ్గు ఇలక్కుమనై పిరిన్దాన్ తన్నై = పరాక్రమంతో ప్రకాశించే లక్ష్మణుని విశ్లేషించినవాడు, తిల్లై నకర్ తిరుచ్చిత్తిర కూడమ్ తన్నుళ్ =తిల్లై నగరంలోని తిరుచ్చిత్తిర కూడమ్ అనే దివ్యదేశంలో, ఉఱైవానై = నిత్యవాసాన్ని చేసేవాడైన శ్రీరాముని, మఱైవాత ఉళ్ళమ్తన్నై ఉడైయోమ్ = ఏనాడూ మఱవని మనస్సును కల మేము, మ*ర్ర్*ు ఉఱు తుయరమ్ అడైయో మన్రే = "భగవానుని అనుభవించలేకపోయాము" – అనే క్లేశాన్ని పొందము.

**వ్యా :- ఒన్బతామ్బాట్టు. (శెతీత వచ్చుమ్బుకనిత్యాది) మిక్క తపస్సైయుడైయనాయ్, శూద్రనాన శమ్బుకనై త్తలై యఱుత్తు. (శెళ్లమతైయోనుయిర్ మీట్టు) విలక్షణనాన బ్రాహ్మణనుడైయ పుత్రన్ ప్రాణనై మీట్టు, అగస్త్యభగవాన్ కొడుత్త పెరు విలైయనాన హారత్తైయుమ్ శాత్తియరుళి, త్తిరువయోధ్యైయిలే పుకున్దు, లవణాసురనై శ్రీశత్రఘ్నాళ్వానై ఇడువిత్తు వీరస్వర్గత్తిలే కుడియేఱ్ఱువిత్తు.**

**(మునివనిత్యాది) దూర్వాసావినుడైయ శాపత్తాలే. "ద్వితీయం మేఽన్తరాత్మానమ్" ఎన్గిఱ పడియే తమ్మిడైయ ప్రాణభూతరాన ఇళైయపెరుమాళుక్కు ఇడై కొడుత్తు, అప్పడిప్పట్ట తన్నై ప్పిన్బుళ్ళార్ కాణప్పెఱాత ఇళవు తీర త్తిరుచ్చిత్తిరకూడత్తిలే నిత్యవాసమ్బణ్ణుకిఱవనై. (మఱవాత వుళ్ళన్దనైయుడైయోమ్) ఇప్పడిప్పట్ట సౌలభ్యత్తై అనవరతభావనై పణ్ణియిరుక్కిఱ నమక్కు "ఎమ్బెరుమానై అనుభవిక్క ప్పెఱ్ఱిలోమ్" ఎన్గిఱ ఇళవు ఇని యిల్లై.**

*ఒన్బతామ్బాట్టు. (శాపత్తాలే). శపిక్కప్పోకిఱానో? ఎన్గిఱ భయత్తాలే. (ఎమ్బెరుమాన్) చక్రవర్త్తిరుమకన్.*

**భావదీపిక :- అవ :- (శెతి తవ చ్చుమ్బుకన్‌తన్నై చ్చెన్ఱు కొన్ఱు)** – తన జన్మకు తగని తపస్సును చేసే, నాల్గవ వర్ణానికి చెందినవాడైన శంబూకుడనే వాని శిరస్సును ఖండించి.

**వ్యాఖ్యానం :- (శెళ్ల మఱైయోన్ ఉయిర్ మీట్టు .... తమ్బియాల్ వానేఱ్ఱి)** – గొప్ప వేదాన్ని అధ్యయనం చేసిన ఒక బ్రాహ్మణుని పుత్రులు పుట్టిన వెంటనే మరణించారు. వారిని పరమపదంనుండి తిరిగి తీసికొని వచ్చి ఇచ్చి, అగస్త్యముని ఇచ్చిన గొప్ప మహిమను కల హారాన్ని అలంకరించుకొని, అయోధ్యకు చేరి, తమ్ముడైన శత్రుఘ్నుని ద్వారా లవణాసురుని వధింపజేసి, అతనిని వీరస్వర్గానికి పంపి.

**(మునివన్ వేణ్డ ... ఉఱైవానై)** – దుర్వాసుని శాపంతో **"లక్ష్మణే మాం మయా సార్ధం ప్రశాధి త్వం వసుంధరామ్, ద్వితీయం మ్యేఽంతరాత్మానం త్వా మియం శ్రీ రుపస్థితా"** (రామా. అయో. 4-43) (లక్ష్మణా! ఈ భూమిని నీవు నాతో కలిసి ఉండి పాలించు. నా రెండవ అంతరాత్మ అయిన నిన్ను ఈ రాజ్యశ్రీ పొందింది.) అనే రీతిలో తనకు ప్రాణసమానుడైన లక్ష్మణుని, తనకు ముందే పరమపదానికి చేరేటట్లు నియమించి అతనిని విశ్లేషించి, అటువంటి తనను అవతారానికి తరువాతి కాలంలోనివారు సాక్షాత్తు దర్శించలేని కొఱత తీరేటట్లుగా తిరు చ్చిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలో ఈనాటికీ నిత్యావాసం చేసేవానిని.

**(మత్తైవాత ఉళ్ళన్నై యుడైయోమ్ మఱ్ఱు ఉఱు తుయరమ్ అడైయోమన్రే) –** ఇటువంటి సౌలభ్యగుణాన్ని సదా ధ్యానించే మనకు "శ్రీరాముని అనుభవించలేక పోయామే" అనే కొఱత ఇక ఏనాడూ లేదు.

**అన్రు శరాశరజ్గళై వైకున్దత్తేఱ్ఱి**
**అడలరవ ప్పకై యేఱి అశురర్‌తమ్మై**
**వెన్రు, ఇలజ్గు మణినెడున్దోళ్ నాన్గుమ్ తోన్ఱ**
**విణ్ ముழுతు మెతిర్ వర త్తన్దామ మేవి,**
**చ్చెన్రు ఇతు వీఱ్ఱిరున్ద అమ్మాన్తన్నై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఎన్రుమ్ నిన్రాన్ అవనివన్ ఎన్రేత్తి**
**నాళుమ్ ఇఱైఞ్జుమినో ఎప్పొழுతుమ్ తోణ్డీర్! నీరే 10**

అన్రు = (తన దివ్యస్థానానికి వేంచేసిన) ఆనాడు, శర అశరజ్గళై (అయోధ్యలో ఉండే) అన్ని చరాచరాలను, వైకున్దత్తు ఏఱ్ఱి = పరమపదానికి చేర్చి, అడల్ అరవమ్ పకై ఏఱి = బలిమిని పొందికగా కల ఆదిశేషునకు విరోధి అయిన గరుడునిపై ఎక్కి, అశురర్ తమ్మై వెన్రు = రాక్షసజాతిని జయించి, ఇలజ్గుమ్ మణి నెడుమ్ తోళ్ నాన్గుమ్ తోన్ఱ = ఆ వీరలక్ష్మి ప్రకాశించేటట్లుగా, విణ్ ముழுతుమ్ = పరమపదంలో ఉండే అందఱు, ఎదిర్ వర = ఎదురువచ్చి స్వాగతం పలుకగా, తన్ తామమ్ మేవి శెన్రు = తన నివాసస్థానం అయిన వైకుంఠానికి వేంచేసి, ఇనితు వీఱ్ఱిరున్ద = తన పరత్వం అంతా ప్రకాశించేటట్లుగా వేంచేసి ఉన్న, అమ్మాన్‌తన్నై = సర్వేశ్వరుని, తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడమ్ తన్నుళ్ = తిల్లై నగరంలోని తిరు చిత్తిరకూడమ్‌లో, ఎన్రుమ్ నిన్రానై= నిత్యవాసాన్ని చేసేవానిని, అవన్ ఇవన్ ఎన్రు ఏత్తి = అటువంటివాడు, ఇటువంటివాడు– అని స్తుతించి, తొణ్డీర్ నీర్ = అనన్యప్రయోజనులైన మీరు, నాళుమ్ ఎప్పొழுతుమ్ = ప్రతిదినం నిరంతరం ఎడతెగక, ఇఱైఞ్జుమినే = స్తుతించి ఉజ్జీవించండి.

**వ్యా :– పత్తామ్పాట్టు. (అన్రు శరాశరాశరజ్గళై) "అపి వృక్షాః పరిమ్లానాః" ఎన్రు – వ్యతిరేకత్తిలే అవై పట్టతు అతిన్దరుఱుకైయాలే "నోచ్ఛ్వసత్ తదయోధ్యాయాం సుసూక్ష్మ మపి దృశ్యతే, తిర్యగ్యోనిగతా శ్చాన్యే సర్వే రామ మనువ్రతాః" ఎన్గిఱపడియే ఇళైయ పెరుమాళోపాతి పరమపదత్తుక్కు ప్పోకవిట్టు.**

**(అడలరవ ప్పకై యేఱి) సర్పజాతిక్కు జన్మశత్రువాన పెరియతిరువడియై మేత్కొణ్డు, అసురవర్గత్తై వెన్రు, అన్ద వీరశ్రీ విళఙ్గుకిఱ తిరుత్తోళ్‌కళ్ నాలోడుమ్‌కూడ అఙ్గుళ్ళారు**

**కక్కుమ్పడి ఎ౹ౢున్దరుళి పరమపదత్తిలే పోయ్పుక్కు, తన్ మేన్మై ఎల్లామ్ తోన్ఱుమ్పడి యాన ఈశ్వరనై. (తిల్లైనకరిత్యాది) అవ్విరుప్పిలొన్ఱుమ్ కుఱైయామే కాలతత్త్వ ముళ్ళత నైయుమిజ్గే నమక్కాక నిత్యవాసమ్ పణ్ణుకిఱవనై అనన్యప్రయోజనరాన నీజ్గళ్ అవనై ఆశ్రయిత్తు కృతార్థరాకుజ్గోళ్.**

**భావదీపిక :- అవ :-** శ్రీరామావతారం చివరలో అయోధ్యలో ఉండే అన్ని స్థావరజంగ మాలను పరమపదానికి చేర్చి, తాను, నిత్యసూరులు ఎదురురాగా, పరమపదానికి చేరిన వృత్తాంతాన్ని ఇందులో ఆఴ్వార్లు అనుభవిస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (అన్ఱు శరాశరజ్గళై వైకున్దత్తేఱ్ఱి) - "విషయే తే మహారాజ ! రావ్యసనకర్శితాః, అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః"** (రామా.అయో. 59-4) (మహారాజా ! నీ దేశంలోని పూలు, మొగ్గలు,చిగుళ్ళు మొదలైనవానితో కూడిన చెట్లు సైతం రామ విరహంవల్ల కల్గిన క్లేశంతో వాడిపోయాయి) అని, **"నోచ్ఛ్వసత్ తదయోధ్యాయాం సుసూక్ష్మ మపి దృశ్యతే, తిర్యగ్యోగగతా శ్చాన్యే సర్వే రామ మనువ్రతాః"** (రామా. ఉత్త- 109-22) (అయోధ్యలోని ప్రాణం ఉండే ఏ చిన్న వస్తువు కన్పించ లేదు. తిర్యక్కులు, మిగిలిన అన్ని జీవులు రాముని అనుసరించాయి) అని చెప్పే రీతిలో తనను విడిచిపెడితే అయోధ్యలో ఉండే స్థావరాలు, జంగమాలు అయిన ప్రాణులు అన్నీ బతుకలేవు అని తెలిసినందువల్ల, తనను విశ్లేషించి ధరించలేని లక్ష్మణునివలె జీవులకు అన్నిటిని పరమపదానికి చేరేటట్లుగా చేసి.

**(అడలరవ ప్పకై ఏఱి .... అమ్మాన్ తన్నై)** - బలిమిని నిండుగా కల ఆదిశేషునకు సహజంగా శత్రువైన గరుడునిపై అధిరోహించి, అసురకులాన్ని జయించి, ఆ వీరలక్ష్మి వెలిగేటట్లుగా తనకు సహజంగా ఉండే చతుర్భుజాలతో, అక్కడ పరమపదంలో ఉండే నిత్యసూరులు సంతోషించి ఎదురురాగా, పరమపదానికి చేరి, తన పరత్వం అంతా ప్రకాశించేటట్లుగా ఉండే సర్వేశ్వరుని.

**(తిల్లై నకర్... తొణ్డీర్ నీరే)** - పరమపదంలో ఉండే సన్నివేశంలో ఏ కొఱత లేకుండా ఉండేటట్లుగా ఇక్కడ మనకోసం అన్ని సమయాలలోను తిల్లై త్తిరుచ్చిత్తిర కూడమ్‌లో నిత్యవాసం చేసేవానిని. వేఱు ఏ ప్రయోజనాన్ని కోరని మీరు అతని గుణవైభవాలను అన్నిటినీ పల్కి స్తుతించి, శరణంగా ఆశ్రయించి, జన్మ ఎత్తినందులకు తగిన ప్రయోజనాన్ని పొందండి- అని భక్తులను ఉద్దేశించి ఆజ్ఞాపిస్తున్నారు.

**తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్**
**తిఱల్ విళజ్గు మారుతియోడు అమర్న్దానైన్నై,**

**ఎల్లైయిల్ శీర్ తయరతన్తన్మకనాయ్**
**త్తోన్ఱిఱ్ఱతు ముతలా త్తన్నులకమ్పుక్క తీఱా,**
**క్కొల్లియలుమ్ పడైత్తానై క్కొఱ్ఱ వొళ్వాళ్**
**కోழியర్కోన్ కుడై క్కులశేకరన్ శొఱ్చెయ్త,**
**నల్లియలిన్తమిழ்మాలై పత్తుమ్ వల్లార్**
**నలన్దికழ் నారణన్ అడికీழ் నణ్ణువారే**

**పెరుమాళ్ తిరుమొழி ముఱ్ఱిఱ్ఱు**

**కులశేఖరప్పెరుమాళ్ తిరువడికళే శరణమ్.**

తిల్లై నకర్ తిరు చ్చిత్తిరైకూడమ్ తన్నుళ్ = తిల్లై నగరంలోని తిరు చ్చిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలో, తిఱల్ విళఙ్గుమ్ = పరాక్రమంతో ప్రకాశించే, మారుతియోడు = హనుమానునితో, అమర్న్దాన్ తన్నై = నిత్యవాసం చేసే శ్రీరామునిగూర్చి, ఎల్లై ఇల్ శీర్ తయరతన్తన్ = అంతు లేని కల్యాణగుణాలను కల దశరథచక్రవర్తికి, మకన్ ఆయ్ తోన్ఱిఱ్ఱు అతు ముతల్ ఆ = కుమారునిగా పుట్టినది మొదలుగా, తన్ ఉలకమ్ పుక్కతు ఈఱు ఆ = తన దివ్యస్థానానికి చేరేవరకు (ఉండే శ్రీరామాయణ గాథను), కొల్ ఇయలుమ్ పడైత్తానై = (శత్రువులను) వధించడంలో అభినివేశాన్ని కల ఆయుధాలను కల సైన్యాన్ని, కొఱ్ఱమ్ ఒళ్ వాళ్ కోழியర్ కోన్ = విజయాన్ని, సౌందర్యాన్ని కల ఖడ్గాన్ని కలవారు, ఉఱైయూర్‌కు అధిపతి, కుడై కులశేకరన్ శొన్న = అధికారచిహ్నం అయిన తెల్లని గొడుగును కలవారు అయిన కులశేఖరాழ்వార్లు, శొల్ శెయ్త = అనుగ్రహించిన, నల్ ఇయల్ = గొప్ప **"ఇయల్"** (పాటలు) అనే ద్రావిడలక్షణాలను పొందికగా కల్గిన, ఇన్ తమిழ் మాలై పత్తుమ్ = మధురమైన ద్రావిడ పాశురమాలికలో ఉండే పది పాశురాలను, వల్లవర్ = అభ్యసించగల్గినవారు, నలమ్ తికழ் = పరమపదంలో ప్రకాశించే, నారణన్ = సర్వేశ్వరుని, అడి కీழ் నణ్ణువారే = శ్రీచరణాలను పొందగలరు.

**వ్యా:- నిగమత్తిల్. (తిల్లై నకరిత్యాది) "భావో నాన్యత్ర గచ్ఛతి" ఎన్ఱు "అఙ్గు ప్పోకేన్" ఎన్ఱ తిరువడియై విడమాట్టామే ఇఙ్గే వన్దు నిత్యవాసమ్పణ్ణుకిఱవనై. (ఎల్లైయిల్ శీరిత్యాది) బహుగుణనాన చక్రవర్తిక్కు "పితరం రోచయామాస" ఎన్ఱు పిళ్ళైయాయ్ ప్పిఱన్దతు తొడక్కమాక ప్పరమపదమ్ పుక్కతు ముడివాక నడువుణ్డాన శ్రీరామాయణకథైయై.**

**(కొల్లియలుమ్ పడైత్తానై) కొలైయై ముయలానిన్ఱుళ్ళ వేలైయుడైయ పడైయైయు ముడైయరాయ్. (కొఱ్ఱ వొళ్ వాళ్) వెఱ్ఱియైయుమ్, అழకై యుముడైయ వాళై**

**యుడైయ. (కోழியర్ కోన్) కోழியర్క్కు క్కోన్. కోழி - ఉఱైయూర్. శోழర్క్కు రాజావానవర్. (కుడై క్కులశేకరన్ శొఱ్చెయ్‌త) వెఙ్కొఱ్ఱక్కుడైయై యుడైయరాన శ్రీకులశేఖరప్పెరుమాళ్ అరుళిచ్చెయ్‌త. (నల్లియలిన్ తమిழ్‌మాలై పత్తుమ్ వల్లార్) అழకియ ఇయలైయుడైయ తమిழ్‌మాలై పత్తుమ్ వల్లార్. (నలన్దికழ్ నారణనడిక్కీழ్ నణ్ణువారే) పరమపదత్తిలే విళఙ్గానిన్టుళ్ళ సర్వేశ్వరన్టిరువడికళై క్కిట్టప్పెఱువర్‌కళ్.**

**పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.**

**పెరుమాళ్ తిరుమొழி వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు.**

*అరు :- నిగమత్తిల్. (పడై) - ఆయుధమ్. (తానై) - సేనై. వెఱ్ఱియైయు మழకైయు ముడైయ వాళై యుడైయరాన పెరుమాళ్ - ఎన్టపడి.*

**పెరుమాళ్ తిరుమొழி వ్యాఖ్యాన అరుమ్బదమ్ ముఱ్ఱిఱ్ఱు.**

**భావదీపిక :- అవ :-** ఈ దశకాన్ని అనుసంధించేవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కి, ప్రబంధనిగమనాన్ని ఆழ్వార్లు చేస్తున్నారు.

**వ్యాఖ్యానం :- (తిల్లైనకర్..... అమర్న్దాన్ తన్నై) - "స్నేహో మే పరమో రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తి శ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి"** (రామా. ఉత్తర-40-15) (స్వామీ! ప్రభూ! నీపట్ల నాకు గల గొప్పదైన ప్రేమ ఎల్లప్పుడూ స్థిరంగా ఉన్నది. ఓ వీరా! నీ విషయంలో భక్తికూడా నిత్యమై ఉన్నది. నా భావం శ్రీవైకుంఠం విషయంలో కూడా పోవడం లేదు) అని "పరమపదానికి కూడా పోను" అని హనుమంతుడు ఈ లీలావిభూతిలోనే నిలచి ఉండి పోయినట్లే, ఈ లీలావిభూతిలోనే తిల్లైత్తిరుచ్చిత్తిర కూడమ్‌లో నిత్యవాసం చేసేవానిని.

**(ఎల్లైయిల్ శీర్ త్తయరతన్ తన్... తన్నులకమ్ పుక్కతీఱా)** - పలు కల్యాణ గుణాలను కలవాడైన దశరథచక్రవర్తికి- **"తతః పద్మపలాశాక్షః కృత్వాఽఽత్మానం చతుర్విధమ్, పితరం రోచయామాస తదా దశరథం నృపమ్"** (రామా.బాల. 15-31) (ఆ తరువాత తామర పూలవంటివి, తామరరేకుల వంటివి, ఎఱ్ఱనివి అయిన కన్నులను కల భగవానుడు తనను నాల్గు విధాలుగా విభాగించుకొని, దశరథచక్రవర్తిని తనకు తండ్రిగా అపేక్షించాడు) అని చెప్పినట్లు తాను కోరి పుత్రునిగా అవతరించడం మొదలుకొని, పరమపదానికి చేరే వృత్తాంతంవరకుగల శ్రీరామాయణ చరిత్రను.

**(కొల్లియలుమ్ పడైత్తానై)** - శత్రువులను సంహరించడంలో (ప్రయత్నించే) అభినివేశాన్ని కల వేల్ అనబడే ఆయుధాన్ని కల, సేనను కలవారు. **"పడై"** అనే పదం

**'వేల్'** అనబడే ఆయుధాన్ని నిర్దేశిస్తుంది, **"తానై"** అనే పదం **"సేన"** అనే అర్థాన్ని ఇస్తుంది.

**(కొ*ற్ற*వేళ్ తానై)** – విజయాన్ని, అందాన్ని కల ఖడ్గాన్ని కల్గినవారు.

**(కో*ழ్*ియర్కోన్)** – "కో*ழ్*ి" అనబడే ఉఱైయూర్‌లో ఉండి రాజ్యపాలనను చేసే చోళప్రభువులకు నాయకులైనవారు.

**(కుడై క్కులశేకరన్ శొన్నెయ్త)** – చేర– చోళ– పాండ్యదేశాలను మూడింటికి అధిపతి అనే విషయం స్ఫురించేటట్లు అధికార చిహ్నం అయిన శ్వేతచ్ఛత్రాన్ని కలవారైన శ్రీకులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన.

**(నల్లియలిన్ తమి*ழ్*మాలై పత్తుమ్ వల్లార్)** – అందమైన, **"ఇయల్"** అనే ద్రావిడలక్షణాలకు పూర్ణంగా, పొందికగా కల్గిన పది పాశురాలను కల ఈ పాశుర మాలికను అనుసంధానం చేయగలవారు.

**(నలన్తికళ్*ழ్* నారణనడిక్కీ*ழ్* నణ్ణువారే)** – పరమపదంలో సకలకల్యాణగుణాలతో ప్రకాశించే శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను చేరగలరు.

**పెరుమాళ్ తిరుమొ*ழ్*ి**

**పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాంధ్రీకరణం భావదీపిక సంపూర్ణం**



**దాసేన శింగరార్యేణ కులశేఖరసత్కృతేః ।**
**ఇత్థ మాంధ్రీకృతా వ్యాఖ్యా ప్రణీతా కృష్ణసూరిణా ॥**

**జయతు కులశేఖరోక్తిః జయతు సదా కృష్ణసూరివివృతిశ్చ ।**
**తన్మాధుర్యాకృష్టాః సహృదయవిబుధా జయంతు తరామ్ ॥**

**భావప్రకాశికా సేయం వ్యాఖ్యా శ్రీవేంకటేశితుః ।**
**అర్పిత శింగరార్యేణ సవిధే పాదపద్మయోః ॥**

**పద్మావతీశ! కేశవ! వాచికసేవాం మదర్పితాం భక్త్యా ।**
**అంగీకురుష్వ రక్షణదీక్షాదక్షైః సమీక్షణైః వీక్ష్య ॥**



## పెరుమాళ్ తిరుమొழி పాశురాల అకారాది సూచిక

పా.ప్రా. : పాశురప్రారంభం  తి. : దశకసంఖ్య  పా. : పాశుర సంఖ్య

